మహాకవి దండ్యాచార్య విరచితః

# కావ్యాదర్శః



బాలానందిన్యాఖ్యయా
ఆంధ్రభాషావ్యాఖ్యయా సమేతః

వ్యాఖ్యారచయితా
డా. పుల్లెల శ్రీరామచంద్రః








ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

మహాకవి దండ్యాచార్య విరచితః

# కావ్యాదర్శః



బాలానందిన్యాఖ్యయా

ఆంధ్రభాషావ్యాఖ్యయా సమేతః

వ్యాఖ్యారచయితా

డా. పుల్లెల శ్రీరామచంద్రః






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

# KAVYADARSHAH -

A treatise on poetics in Sanskrit by Dandyacharya of 8th Century A.D., with the Telugu commentary by Dr. Pullela Sriramachandrudu, Reader in Sanskrit, Osmania Univerersity, Hyderabad.

---


ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

హైదరాబాదు-500 004

ప్రచురణ : 320

ప్రథమ ముద్రణ : 1981 జనవరి.

ప్రతులు : 2,000

వెల రూ॥ 8-50

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్,

హైదరాబాద్-500 004

ముద్రణ :

జయశ్రీ ప్రింటింగ్ అండ్ బుక్ బైండింగ్ వర్క్స్

విద్యానగర్, హైదరాబాదు-44.


---


Paper used partly for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# తొలిపలుకు

కేతన, విన్నకోట పెద్దన, అనంతామాత్యుడు, రామరాజభూషణుడు, అప్పకవి అహోబిల పండితుడు మున్నగు వారు తెలుగులో సాహిత్య శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలను వెలువరించిన సంగతి అందరికీ తెలిసిందే. కాని వాటిలో వాళ్ల తెలుగు వ్యాకరణాన్నీ, తెలుగు ఛందస్సులను కూడా తడవినారు. తెలుగు భాషకు సంబంధించిన లక్ష్యలక్షణాలకే ఆ పుస్తకాలు ప్రామాణికము కాగలిగినవే కాని రసం. అలంకారాలు, ధ్వని, శబ్దదోషాలు ఇత్యాది అంశాలకు అవి ప్రామాణికతను సంతరించుకోలేక పోయినవి. సంస్కృతంలోనే దండిభామహాదుల సాహిత్య శాస్త్రగ్రంథాలే తెలుగుదేశంలోనే కాక యావద్భారత దేశంలోని పండితులకు, సహృదయులకు పఠనీయములైనవి. భారతదేశంలోని సాహిత్యాలోచకులమధ్య సమైక్యభావాన్ని కాపాడగలుగుతున్నవి.

సంస్కృతంలో అంత ప్రవేశం లేకపోయినా, తెలుగులో చక్కని అనువాదాలైనా లభ్యమైతే ఆ మనీషుల దృక్పథంతో పరిచయం ఏర్పడుతుందనే ఆకాంక్షతో ఇంతవరకు అకాడెమీ 'కావ్యస్వరూపం', 'రసగంగాధరం' వంటి గ్రంథాలను ప్రచురించింది. పఠితృలోకం వాటిని సమాదరించింది.

ఎనిమిదవ శతాబ్దం వాడైన దండి కావ్యాదర్శాన్ని రచించినాడు. ఈ గ్రంథాన్ని తెలుగు అనువాదంతోసహా పాఠకులకు అందుజేస్తున్నది అకాడెమీ.

'ఈ కావ్యాదర్శాని'కి వ్యాఖ్యానప్రాయమైన తెలుగు అనువాదాన్ని అందించడమేకాక సాహిత్యశాస్త్రాన్ని అధ్యయనం చేయవలసిన అవసరాన్నీ, అగత్యాన్నీ, స్వరూపస్వభావాలనూ వివరిస్తూ డా. పుల్లెల శ్రీరామచంద్రుడుగారు చక్కని భూమికను సమకూర్చినారు. మహిత ప్రతిభాసముపేతులైన ఎందరో సాహిత్యశాస్త్రరచయితలనూ, వారి కృషినీ, వారు ప్రతిపాదించిన సిద్ధాంతాలనూ

దిఙ్మాత్రంగా వివరించినారు. శ్రీరామచంద్రుడుగారు ఇంతవరకే రాజశేఖరుని 'కావ్యమీమాంస' కూ, భామహుని 'కావ్యాలంకారా'నికీ తెలుగు వ్యాఖ్యానాలను ప్రచురించి ప్రసిద్ధిని పొందినవారు 'కావ్యాదర్శం' వ్యాఖ్యానం సరళంగాసాగింది.

పాఠకలోకానికి, ఇంతటి ప్రయోజనాత్మకమైన గ్రంథాన్ని అందించిన డా. పుల్లెల శ్రీరామచంద్రుడు గారికి అకాడెమీ కృతజ్ఞాభివందనాలను సమర్పించు కుంటున్నది.

హైదరాబాదు,
31-7-1981

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

శ్రీః

# భూమిక

భాష ఎంత ప్రాచీన మైనదో (అలంకారశాస్త్రం కాకపోయినా) అలంకార శాస్త్రానికి సంబంధించిన విషయాలు కూడా అంత ప్రాచీన మైనవి. భావావిష్కరణం చేయడంకోసం ఉపయోగించే ప్రధానసాధనం భాష. అందుచేత ఇందులో ఎన్ని క్రొత్త క్రొత్త అంశాలు చేరిస్తే భావావిష్కరణం బాగా జరుగుతుందో ఆ అంశాలను అనాదికాలంనుంచీ మానవుడు అన్వేషుస్తూనే ఉన్నాడు. ఉపమయైనా, రూపకమైనా, ఇతర అలంకారాదు లైనా కూడా ఈలాంటి నిరంతరప్రయత్నానికి ఫలితంగా లభించిన విషయాలే. ఐతే-ఇవి ప్రయత్నం చేసేవాళ్ళకు తెలియకుండానే లభించిన ఫలితాలు. ఆటవికుడై సంచరిస్తూన్న ఆదిమానవుడు కూడా ఏదైనా ఒక పెద్ద జంతువుని చూచి, తరవాత దానిని గూర్చి తోటివానికి చెప్పవలసి వచ్చినపుడు ఆ జంతువు ఏనుగంత ఎత్తుగానో, కొండంత పెద్దదిగానో ఉన్నది అని చెపుతాడు. ఈ విధంగా తెలియనిదానిని తెలిసినదానితో పోల్చి చెప్పడంలో, చెప్పవలసిన దేదో స్పష్టంగా చెప్పాననే సంతృప్తి చెప్పేవాడికీ, స్పష్టంగా అర్థంచేసుకున్నాననే సంతృప్తి వినేవాడికీ ఉంటాయి. అదే విధంగా ఒక పెద్దపులి తనపై ఎలా పడబోయిందో చెపుతూ అతడు-ఆ పులి బిగ్గరగా గర్జిస్తూ, తోక త్రిప్పుతూ, కోరలు పైకి చూపిస్తూ, పంజా చాచి ఒక్క దెబ్బ కొట్టబోయింది - అని వర్ణించవచ్చు. ఇలాంటిదానికే తరవాతవాళ్లు, భావ మనో, భావాభాస మనో పేరు పెట్టవచ్చును. ఇలాంటి వర్ణనలను ప్రయత్నపూర్వకంగా చేస్తే కావ్యం ఆవిర్భవిస్తుంది. అందుచేతనే అలంకారశాస్త్రం బీజాలు ఉత్తమకావ్యలక్షణాలు సంతరించుకున్న అతి ప్రాచీనకావ్యాలని చెప్పదగిన వేదాలలో ఉన్నాయని పండితులు చెపుతారు. ఈ బీజాలే క్రమక్రమంగా తరువాతి వాఙ్మయంలో వివిధ

రూపాలుధరించి విస్తరించడంతో వాటిస్వరూపాన్ని ఒక నిర్ణీతపద్ధతిలో కనుక్కో-వడంకోసం ప్రయత్నాలు జరిగినాయి. ఆ ప్రయత్నాల ఫలితమే అలంకారశాస్త్రం. అందుచేత అలంకారశాస్త్రబీజాలు వేదాలలోను, సామాన్యజనుల భాషలోనూ ఉన్నాయని చెప్పడంలో సందేహం లేదు.

ఈ సందర్భంలో "రిమార్క్స్ ఆన్ సిమిలీస్ ఇన్ సాన్స్క్రిట్ లిటెరేచర్" అన్న గ్రంథంలో జె. గోండా అన్న మాటలు స్మరింప దగినవి. "ఒక్క గ్రంథాలలో ఉపయోగించే భాషకే కాదు; ఉపమ మొదలైనవాటికి కూడా మూలాలకోసం అతిప్రాచీనభాషలోనే వెదకవలసి ఉంటుంది. మనం వ్రాసే భాష ఎంత కృత్రిమ మైనా, ఎంత ప్రత్యేకత కలదైనా, ఎంత సాంకేతిక మైనా, దీనిమూలం వెదకుకుంటూ పోతే చివరికి అది మామూలుగా అందరూ మాటలాడుకొనే భాషలోనే కనబడుతుంది. ఈ భాషకి ఆధారభూమి ( background ) సామాన్యజనుల భాషయే అని చెప్పక తప్పదు" (పుట. 9) "ప్రాచీనమానవులకి ఆకారశూన్యమైన (abstract) ఆలోచనలు చేసే శక్తి లేదు. అందుచేత వాళ్ళు కొత్త వస్తువులకి, వాళ్ళకి పరిచయం ఉన్న వస్తువులను పట్టి పేర్లు ఏర్పరచుకొనే వారు. తెలిసిన వస్తువులతో పోల్చి తెలియని వస్తువులను అర్థం చేసుకునేవారు. ఉపమాసహాయంతో అపరిచితవస్తువులను పరిచితవస్తువుల పరిధిలోనికి తీసుకువచ్చేవారు" (పు. 11) "ప్రాచీనమానవులూ, సామాన్య మానవులూ కూడా పోలికలను బట్టి రూపకల్పన చేసుకుంటూ తమ ఆలోచనలు సాగించేవారు." (పు. 12)

ఇతరమైన లక్షణశాస్త్రాలవలెనే అలంకారశాస్త్రం కూడా లక్ష్యాలని (కావ్యనాటకాదులను) ఆధారంగాచేసుకొని బయలుదేరి ఉండాలి. తన ఎదుట ఉన్న ఎన్నో కావ్యనాటకాదులలో కొన్ని చాలా బాగుండడమూ, కొన్ని బాగుండకపోవడమూ, కొన్ని అటూ ఇటూగా ఉండడం చూచిన ఎవరో ఒక మేధావి, ఇలాంటి విభేదానికి కారణా లేమిటా అని జాగ్రత్తగా పరిశీలించి తనకు తోచినంతవరకూ కొన్ని అంశాలను విడదీసి - ఇదిగో ఇవి ఉండడం చేత ఈ రచన బాగుంది; అలా లేకపోవడంచేత ఇది బాగులేదు అని నిర్ణయించి

ఉంటాడు. ప్రప్రథమంగా ఆ మేధావి చేసిన ప్రయత్నానికి, కావ్యవిశ్లేషణాది విశ్లేషణానికి, ఫలితంగా మొట్టమొదటి అలంకారశాస్త్రగ్రంథం ఆవిర్భవించి ఉండాలి. తరవాత వచ్చిన కవులందరూ చాలావరకు అతడు చూపిన మార్గం అనుసరించి ఉంటారు. కొంతకాలానికి ఇలాగే ఎందుకు వ్రాయాలి, ఇలా ఎందుకు వ్రాయకూడదు అని కొందరు ఎదురు తిరగవచ్చును. అలాంటివాళ్ళ సంఖ్య ఎక్కువ కావడంతో మరల ఒక బుద్ధిమంతుడు ఆవిర్భవించి, క్రొత్త రకం రచనలన్నీ పరిశీలించి, క్రొత్త విషయాలు చెపుతూ మరొక గ్రంథం వ్రాసి ఉంటాడు. ఈ విధంగా భాషా-వ్యాకరణాదుల విషయంలో వలెనే కావ్య-అలంకారశాస్త్రాలవిషయంలో కూడా ఈ లక్ష్య – లక్షణగ్రంథనిర్మాణధార అనవరతము సాగుతూనే ఉంటుంది. అందుచేతనే మన అలంకారశాస్త్రకారులలో ప్రామాణికు డైన ఏ ఒక్కడూ కూడా "అలంకారశాస్త్రంలో చెప్పవలసిన దంతా చెప్పివేశాను. ఇదే చివరిమాట. ఇంక ఈ విషయంలో చెప్పదగినది ఏదీ లేదు" అని ఎక్కడా చెప్పలేదు. "కావ్యశోభాకరా న్ధర్మానలంకారాన్ ప్ర చక్షతే. తే చాద్యాపి వికల్ప్యన్తే కస్తాన్ కా ర్త్స్న్యేన వక్ష్యతి" (కా-1)అని దండి అంటే-"సహస్రశో హి మహాత్మభిరన్యైరలంకారప్రకారాః ప్రదర్శితాః, ప్రకాశ్యన్తే చ" (ధ్వన్యా-1) అని ఆనందవర్ధనుడు అన్నాడు. జగన్నాథ పండితరాయలు ఒక సందర్భంలో "ఇవే గుణాలంకారాదులు, ఇన్నిమాత్రమే ఉన్నా యి;అని ఎవరు నిర్ణయించగలరు". అనిసూచిస్తూ "గుణత్వాలంకారత్వాదేరననుగమాత్" అని అంటాడు.

<u>వేదాలలో అలంకారశాస్త్రబీజాలు :-</u> దండి, భామహుడు మొదలైన ప్రాచీనాలంకారికులు, కావ్యాలలో అలంకారాలకి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి ఉన్నారు. వేదాలలోను, ఉపనిషత్తులలోను కూడా ఉపమారూపకాల ప్రయోగం అత్యధికంగా కనబడుతుంది. నాలుగు చక్కని ఉపమానాలను ఉపయోగిస్తూ ఉషస్సును వర్ణించిన ఋగ్వేదమంత్రం చాలా ప్రసిద్ధమైనది :-

"అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తా రుగివ సనయే ధనానామ్.
జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః"
(ఋ. వే. 1. 124.7)

"సోదరులు లేని స్త్రీ వస్త్రాలంకారాదులకొరకుగాని, సహోదరులు చేయవలసిన పిండదానాదికము చేయుటకు గాని తండ్రి మొదలగు వారి దగ్గరకు వెళ్లుచున్నట్లును, పతివ్రతాదులు లేని స్త్రీ తన రిక్థముకొరకై న్యాయాలయమునకు వెళ్లుచున్నట్లును, భర్తృసమాగమమునుకోరు స్త్రీ మంచి వస్త్రములుధరించి, పతిని చేరుచున్నట్లును ఉషస్సు సూర్యుని చేరుచున్నది. నవ్వుచున్న స్త్రీ పలువరుస చూపినట్లు చేయుచున్నది."

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరేకః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతి"
(ఋ వే. 1.164.20)

("ఎప్పుడూ కలిసి మెలిసి తిరిగే రెండు అందమైన పక్షులు ఒకే వృక్షం మీద నివసిస్తూ ఉంటాయి. వాటిలో ఒకటి మధురమైన ఫలాన్ని భక్షిస్తుంది. రెండవ పక్షి భక్షించకుండా ప్రకాశిస్తూ ఉంటుంది." ఇదేమంత్రం ఉపనిషత్తులలో కూడా ఉన్నది. జీవపరమాత్మలే ఆ పక్షులు. అవి నివసించే వృక్షం దేహము. ఫలం కర్మఫలము.) ఇందులో అతిశయోక్త్యలంకారం లేదా రూపకాతిశయోక్త్య లంకారం ఉపయోగింపబడింది.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ.
ఇంద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్" (కఠోపనిషత్తు)

"జీవాత్మయే రథికుడు. శరీరం రథము. బుద్ధి సారథి మనస్సు కళ్లెము. ఇంద్రియాలు గుఱ్ఱాలు. ఆ గుఱ్ఱాలు చేరవలసిన ప్రదేశాలు విషయాలు." ఇలాంటి ఉపనిషద్వాక్యాలలో రూపకాలంకారప్రయోగం కనబడుతుంది. వాస్తవానికి - "దేవతలకి ప్రత్యక్షంగా (స్పష్టంగా) చెపుతే నచ్చదు. పరోక్షంగానే చెప్పాలి. "పరోక్షప్రియా ఇవ హి దేవాః" అని అంటూ చాలావరకు వేదాలలో రూపక భూయిష్ఠమూ, రూపకాతిశయోక్తిభూయిష్ఠమూ అయిన భాషను వాడడమే చాలా చోట్ల కనిపిస్తుంది.

అర్థాలంకారాల ప్రయోగమే కాదు. శబ్దాలంకారాల ప్రయోగం కూడా వేదాలలో చాలా చోట్ల కనబడుతుంది : "రక్షాణో అగ్నే తవ రక్షణేభీ రారక్షణః". "ప్రతార్యగ్నే ప్రతరం న ఆయుః". "నృషద్వరసదృతసద్వ్యోమ సదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్". "దదదృచా సనియతే దదన్మే ధామృతాయతే". "దివాభిపత్వేవసా గమిష్ఠా ప్రత్యావర్తిం దాశుషే శంభవిష్ఠా" ఇత్యాది మంత్రాలను ఇందుకు ఉదాహరణగా చూపించవచ్చును. 'నమకం' 'చమకం' మొదలైనవేదభాగాలు కొన్ని ఈ శబ్దాలంకారాలతో నిండి కర్ణపేయంగా ఉంటాయి.

ఉపమాద్యలంకారాలను ప్రయోగించడమే కాకుండా 'ఉపమ' మొదలైన పారిభాషికపదాలను వాడడం కూడా ఋగ్వేదాదులలో గమనించతగిన విషయము. (ఋ. వే. 5.34.9; 1-31.15 మొ) ఈ ఉపమాశబ్దానికి సాయణాచార్యుడు ఉపమానము లేదా దృష్టాంతము అని అర్థం వ్రాశాడు.

మామూలుగా మాటలాడే మాటలకీ, కవి ప్రయత్నపూర్వకంగా రచించిన రచనలకీ చాలా భేదం ఉంటుంది అనే విషయాన్ని సూచిస్తూ-"ఓజో వర్ధకమైన నూతనయాగమును, రచనను అగ్నికి అందజేస్తాను" అని చెప్పబడింది ఒక మంత్రంలో. "ప్రతవ్యసీం నవ్యసీం ధీతిమగ్నయే వాచోమతిం సూనవే భరే" (ఋ. వే 1. 144.1).

మామూలుమాటలకీ, కవితకు చాలా భేదం ఉన్నదనే విషయాన్ని మరొక ఋక్కు స్పష్టంగా పేర్కొంటుంది.

"సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచ మక్రత.
అత్రాసఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి".

(ఋ. వే. X. 71.2)

("పేలాలపిండిని జల్లెడతో జల్లించినట్లుగా మేధావంతులు తమ బుద్ధిచేత పదాలను జల్లించి (మంచి మంచి పదాలు ఏరుకొని) వాక్కును (పద్యాలను) రచిస్తారు. అట్టి మేధాశక్తియే ఉన్న మరికొందరు దానిలోని అర్థం గ్రహించకలుగుతారు. వీరి వాక్కులో మంగళకరమైన లక్ష్మి నివాసం చేసుకొని ఉంటుంది").

రాజశేఖరుడు మొదలైన కొందరు అలంకారికులు కారయిత్రి, భావయిత్రి అని ప్రతిభ రెండు విధాలు అని చెప్పిన ప్రతిభాద్వైవిధ్యం ఈ ఋక్కులో సూచింపబడింది.

"ఒక్కొక్కడు వాక్కును వింటున్నా వినలేడు (విననట్లే). గ్రహించాలని అనుకున్నా గ్రహించలేడు అందమైన వస్త్రాలు ధరించిన భార్య తన (అంతర) శరీర సౌందర్యాన్ని తన భర్తకుమాత్రమే చూపించి నట్లు, ఆ వాక్కు తన సౌందర్యాన్ని ఏ ఒక్కరికో మాత్రమే చూపిస్తుంది'' అని అంటూ ఒక ఋక్కు కావ్య సౌందర్యాన్ని ఆస్వాదించడానికి కూడా ఒక విధమైన అర్హత ఉండాలని ప్రతిపాదిస్తూన్నది.

"ఉత త్వః పశ్యన్న దదర్శ వాచముత త్వః శృణ్వన్ నశృణోత్యే నామ్
ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః"
(ఋ. వే. X. 71.4)

అందమైన వస్త్రం క్రింద అంతకంటె అందమైన శరీరం దాగి ఉన్నట్లుగా పైకి కనబడే అర్థం వెనుక అంతకంటె అందమైన మరొక అర్థం దాగి ఉన్నట్లు చెప్పే ఈ ఋక్కులో ఆనందవర్ధనాదులు ప్రచారంలోనికి తీసికొని వచ్చిన ధ్వని (సంప్రదాయం) ధ్వనిస్తూన్నది.

ఋగ్వేదంలో ఉన్న నదీవిశ్వామిత్ర సంవాదము, యమయమీసంవాదము, సరమాపణిసంవాదము, ఇంద్రవరుణసంవాదము మొదలైన భావోత్తేజితాలూ, రసభరితాలూ అయిన సంవాదాలే భారతీయరూపకాలకి మూలం అని చాలా మంది పండితులు అంగీకరించారు. అందుచేతనే, నాట్యశాస్త్రానికి కావలసిన అంశాలన్నీ భరతుడు వేదాలలోనుంచే తీసుకున్నాడని నాట్యశాస్త్రంచెపుతున్నది:

"జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యో గీతిమేవ చ
యజుర్వేదాదభినయం రసమాథర్వణాదపి". (1.17)

నృత్త-నట-సంగీతాదులను గూర్చి వేదాలలోనే ఎన్నో పర్యాయాలు పేర్కొనడం జరిగిందని పి. వి. కాణే తన అలంకారశాస్త్ర చరిత్రలో సప్రమా

ణంగాను, విస్తృతంగాను నిరూపించి ఉన్నారు. అందుచేత, అలంకారశాస్త్ర బీజాలు వేదాలలో ఉన్నాయని చెప్పడానికి సందేహించవలసిన పని లేదు.

నిరుక్తంలో ఉపమను గూర్చిన ఒక చర్చ ఉన్నది. క్రీస్తుకు పూర్వం ఎనిమిదవ శతాబ్ది ప్రాంతానికి చెందినట్లుగా చాలామంది పాశ్చాత్యపండితులు కూడా అంగీకరించిన యాస్కుడు తనకంటె ప్రాచీనుడైన గార్గ్యుడు చెప్పిన– "అది కానిదానిని దానితో సమానమైన దానితో పోల్చడం ఉపమ" (ఇది మమ్మటుడు చెప్పిన "సాధర్మ్య ముపమా భేదే" అన్న ఉపమాలక్షణంవలె ఉన్నది) లక్షణాన్ని ఉదాహరిస్తూ, సాధారణంగా అల్పగుణాలు కలదానిని అధికగుణాలు ఉన్న దానితో పోల్చడం జరుగుతుంది. అధికగుణాలు ఉన్నదాన్ని అల్పగుణాలు ఉన్నదానితోకూడా పోల్చవచ్చును అని చెపుతూ ఋగ్వేదంలోనుంచి కొన్ని ఉదాహరణలు ఇచ్చాడు. "అథాత ఉపమాః యదతత్తత్సదృశమితి గార్గ్యః. తదాసాం కర్మ జ్యాయసా వా గుణేన ప్రఖ్యాతతమేన వా కనీయాంసం వా అప్రఖ్యాతం వోపమిమీతే, అథాపి కనీయసా జ్యాయాంసమ్" (నిరు. III.13)

మరొకచోట నిరుక్తకారుడు– "ఉపమావాచకాలైన 'ఇవ' యథా'' పదాలు లేనప్పుడు లుప్తోపమ, లేదా "అర్థోపమ" అని అంటారు" అని చెప్పి ఉన్నాడు. ఇవి తరువాతి ఆలంకారికుల 'లుప్తా, 'పూర్ణా' 'ఆర్థీ' "శ్రౌతీ" మొదలైన భేదాలకి మూలం అని చెప్పవచ్చును. "అథ లుప్తోపమావి అర్థోపమాని ఇత్యాచక్షతే సింహః వ్యాఘ్రః ఇతి పూజాయామ్ శ్వా కాకః ఇతి కుత్సాయామ్" "అయం పురుషః సింహః," అన్నట్లైతే పూజ గమ్యం అవుతుంది. "అయం పురుషః శ్వా" అన్నట్లైతే నింద గమ్యం అవుతుంది. రెండింటిలోనూ 'ఇవ మొదలైన పదాలేవీ లేకపోవడంచేత లుప్తోపమ" అని అర్థం ఇది తరువాత కాలంలో రూపకం అయింది. క్రీ. పూ. ఏడవ శతాబ్దికి చెందిన పాణిని అష్టాధ్యాయిలో ఏదో ఒక నాట్యశాస్త్రగ్రంథాన్నిగూర్చి సూచన చేయబడింది. ఉపమ, ఉపమావాచకము, సామాన్యధర్మమువంటి కొన్ని పారిభాషికపదాలు కూడా అష్టాధ్యాయిలో ఉన్నాయి. క్రీ. పూ. 150 సంవత్సరాల ప్రాంతానికి చెందిన పతంజలి రూపకాలను గూర్చి, నటులను గూర్చి ముచ్చటించాడు.

వేదం తరువాత చెప్పుకోవలసిన అతిప్రాచీనగ్రథాలు రామాయణ మహాభారతాలు. రామాయణం క్రీ. పూ. నాల్గవ శతాబ్దానికి చెందినదని కొందరూ, క్రీ. పూ. 600 ప్రాంతానికి చెందిన దని మరి కొందరూ చెపుతున్నారు. మహాభారతంలోని కొన్ని భాగాలు క్రీ. పూ, 500 ప్రాంతానికి సంబంధించి ఉండాలని కొందరి అభిప్రాయం. అతిప్రాచీన మైన ఈ ఇతిహాస గ్రంథాలలో అర్థాలంకారాలు, శబ్దాలంకారాలు, భావాలు, రసాలు, రీతులు, గుణాలు, ఈ విధంగా అలంకారశాస్త్రానికి సంబంధించిన అన్ని అంశాలూ కూడా లభిస్తాయి, మొట్టమొదటి అలంకారశాస్త్రి ఈ ఇతిహాసాలను చూచే తన శాస్త్రం ప్రారంభించి ఉంటాడు. వీటినే ఆదర్శంగా గ్రహించి వ్రాసిన, భాస-కాళిదాస-అశ్వఘోషాదుల రచనలలో ఇవన్నీ కోకొల్లలుగా ఉండడం సహజమే. ఈ విషయాల విశ్లేషణమే అలంకారశాస్త్రం చేసిన పని.

<u>అలంకారశాస్త్రం:-</u> కావ్యంలో ఉండే సౌందర్యాన్ని గూర్చి, దానికి హేతువులైన వివిధాంశాలను గూర్చి విమర్శించే శాస్త్రం ఆవడంచేతం ఈశాస్త్రానికి అలంకారశాస్త్రం అనే పేరు వచ్చింది. అలంకారం అంటే సౌందర్యం అని వామనుడు చెప్పి ఉన్నాడు. ఉపమాద్యలంకారాలని పట్టి ఈ పేరు వచ్చినదని చెప్పడం అంత సమంజసం కాదు. (చూ. బాలానందినీసహిత వామనాలంకార సూత్రవృత్తి ప్రస్తావన).

అలంకారశాస్త్రానికి క్రియాకల్పం అనే పేరు కూడా ఉండేదని డా.రాఘవన్ "సమ్ కన్సెప్ట్స్ ఆఫ్ అలంకారశాస్త్ర" అన్న గ్రంథంలో సప్రమాణంగా నిరూపించినారు. క్రియాకల్పాన్నే దండి 'క్రియావిధి' అన్నాడు. "వాచాం విచిత్ర మార్గాణాం నిబబన్ధుః క్రియావిధిమ్" (కావ్యాదర్శ. I. 9) దీనిపై వ్యాఖ్యానం చేస్తూ 10వ శతాబ్దానికి చెందిన "రత్నశ్రీజ్ఞాన" అనే ఒక బౌద్ధపండితుడు "క్రియావిధిం, క్రియాకల్పమ్...... [మల్ల] నాగేన విద్యాసముద్దేశే క్రియాకల్ప ఇతి కావ్యాలంకార ఉక్తః. తదనుసారేణానేన క్రియాకల్పః క్రియా......[విధీ] యతేఽనేనేతిక్రియావిధిః. క్రియాకల్పోప్యేవమితి నార్థతః కశ్చిత్ భేదః. కావ్య

లక్షణం శాస్త్రం కృతవన్తః" అని వ్రాశాడు, దీనిని బట్టి క్రియాకల్పము, క్రియావిధి అనేవి పర్యాయపదాలు అనే విషయం స్పష్టం అవుతుంది.

ఈ శాస్త్రానికి 'కావ్యలక్షణం', 'కావ్యలక్ష్మ' అనే పేర్లు కూడా ఉన్నాయి. "యథాసామర్థ్యమస్మాభిః క్రియతే కావ్యలక్షణమ్" (కావ్యాదర్శ. I. 3) అని వ్రాస్తూ దండి తన గ్రంథానికి 'కావ్యలక్షణం' అనే పేరు పెట్టి ఉన్నాడు. భామహుడు "అవగమ్య స్వధియా చ కావ్యలక్ష్మ" (VI-64) ఇత్యాదిశ్లోకంలో తన గ్రంథానికి "కావ్యలక్ష్మ" అనే పేరు కూడా ఉన్నట్లు చెప్పి ఉన్నాడు. బహుశా ఈ పేర్లు మొత్తం అలంకారశాస్త్రానికే పర్యాయపదాలుగా ఉండి ఉండవచ్చు. అందుచేతనే రత్నశ్రీజ్ఞానపండితుడు పైన ఉదాహరించిన వాక్యంలో "కావ్యలక్షణం శాస్త్రం కృతవన్తః" అని వ్రాసి ఉన్నాడు.

సాహిత్యశాస్త్రం అనే మరొక పేరు కూడా ప్రచారంలో ఉన్నది. ఈ పేరు భామహుడు చెప్పిన "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" అనే కావ్యలక్షణాన్ని బట్టి వచ్చి ఉంటుం దని కొందరి అభిప్రాయం. ఐతే పై వాక్యాన్ని భామహుడు కావ్యలక్షణంగా ఉద్దేశించి ఉండడని నా అభిప్రాయం. (చూ. కావ్యాలంకారవాఖ్య; బాలానందిని. పు. 8) కుంతకభోజాదులు ఈ వాక్యమే లక్షణం అన్నట్లుగా గ్రహించి, అది చాలదనే విషయం కూడా తెలుసుకుని ఎన్నో విశేషణాలు చేర్చవలసి వచ్చింది. అనేక శాస్త్రాలతోటీ, విషయాలతోటీ సంబంధం ఉండడంచేత కావ్యనాటకాదివాఙ్మయానికి 'సాహిత్యం' అనీ, దానికి సంబంధించిన శాస్త్రానికి సాహిత్యశాస్త్రం అనీ పేర్లు వచ్చి ఉంటాయి. రూపకాలకి సంబంధించని విషయం అంటూ ఏదీ ప్రపంచకంలో ఉండదని భరతుడంటే కావ్యానికి సంబంధించనిదంటూ ఏదీ ఉండదని భామహుడు అన్నాడు.

"న తద్ జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా.
నాసౌ యోగో న తత్ కర్మ నాట్యేస్మిన్ యన్న దృశ్యతే"

(నాట్యశా. I. 116)

"న స శబ్దో న తద్వాక్యం న స న్యాయో న సా కలా.
జాయతే యన్న కావ్యాంగమహో భారో మహాన్ కవేః"

(కావ్యాలంకారం. V. 4)

సాహిత్యవిద్య అన్ని విద్యల సారం అని రాజశేఖరుడు అన్నాడు :— "ఆన్వీక్షికీ, త్రయీ, వార్తా, దండనీతిశ్చేతి విద్యాః...పంచమీ సాహిత్యవిద్యా ఇతి యాయావరీయః. సా హి చతసృణామపి విద్యానాం నిష్యన్దః" (కావ్యమీమాంస). అందుచేత-"సహితయోః శబ్దార్థయోః భావః సాహిత్యమ్"అని కాకుండగా "సహితానాం సర్వవిద్యానాం భావః సాహిత్యమ్"అని వ్యుత్పత్తి చెప్పడం సమంజసంగా ఉంటుంది.

<u>అలంకారశాస్త్రప్రారంభము</u>:- మనం వెనక చూచినట్లుగా, అలంకారశాస్త్ర బీజాలు అతిప్రాచీనమైన వైదికవాఙ్మయాదులలో ఉన్నా ఈ శాస్త్రం ఒక శాస్త్రంగా ఎప్పుడు ఆవిర్భవించిందో చెప్పడానికి తగిన ఆధారాలు ఏవీ లేవు. ఐతే-రూపకాలకి సంబంధించిన శాస్త్రం వేరు, శ్రవ్యకావ్యాలకి సంబంధించిన శాస్త్రం వేరు అన్నట్లుగా కాకుండా ప్రారంభదశలో ఒకే శాస్త్రం ఉన్నట్లు, సంస్కృతదృశ్య శ్రవ్యకావ్యాలకు సంబంధించిన చర్చ మాత్రమే కాకుండా ప్రాకృతాదిదేశభాషాకావ్యాల చర్చ కూడా ఉన్నట్లు తెలుస్తున్నది వాస్తవానికి అలంకారశాస్త్రం కేవలం సంస్కృతకావ్యాలకు మాత్రమే సీమితమైన శాస్త్రంగా ఎన్నడూ కొనసాగలేదు. భారతదేశీయభాష లన్నింటిలోనూ ఉండే కావ్యాలను దృష్టిలో ఉంచుకొనే ఈ శాస్త్రచర్చ నడిచింది. అందుచేతనే అత్యర్వాచీనమైన అలంకారశాస్త్రగ్రంథాలలో కూడా సంస్కృతప్రబంధశ్లోకాదులతో పాటు ప్రాకృతప్రబంధశ్లోకాదులను కూడా ఉదాహరించడం జరుగుతూ వచ్చింది.

అలంకారశాస్త్రప్రాదుర్భావాన్ని గూర్చి రాజశేఖరుడు, (క్రీ.శ. 10వ శతాబ్దం) కావ్యమీమాంసలో, కొంత కథ వ్రాసి ఉన్నాడు. అతడు వ్రాసిన దాని ప్రకారం మొట్టమొదట ఈ శాస్త్రాన్ని శివుడు, బ్రహ్మ మొదలైన అరవై నలుగురికి బోధించాడు. బ్రహ్మనుంచి, గురుశిష్యపరంపరారీతిలో, ఇది పద్దెనిమిది

భాగాలుగా విభక్తమై మనదాకా వచ్చింది. పద్దెనిమిది భాగాలకీ వేరు వేరు రచయితలు ఉన్నారు. సహస్రాక్షుడు కవిరహస్యాన్నీ, ఉక్తిగర్భుడు ఔక్తికాన్నీ, సువర్ణనాభుడు రీతినీ, ప్రాచేతాయనుడు అనుప్రాసను, చిత్రాంగదుడు చిత్ర - యమకాలనూ, శేషుడు శ్లేషను. పులస్త్యుడు వస్తువును, ఔపకాయనుడు ఔపమ్యాన్నీ, పరాశరుడు అతిశయాన్ని, ఉతథ్యుడు అర్థశ్లేషనీ, కుబేరుడు ఉభయాలంకారాన్నీ, కామదేవుడు వినోదాన్నీ, భరతుడు రూపకాన్నీ, నందికేశ్వరుడు రసాన్నీ, ధిషణుడు దోషాన్నీ, ఉపమన్యువు గుణాన్నీ, కుచుమారుడు ఔపనిషదికాన్నీ, గూర్చి వ్రాశారు. ఇదంతా ఏదో ఊహాకల్పిత గాథ వలె కనిపించినా, సువర్ణనాభుడు, కుచుమారుడు మొదలైన కొందరికి ఆయా శాస్త్రాలతో సంబంధం ఉన్నట్లు కామశాస్త్రాదులనుంచి కూడా తెలుస్తున్నది. భరతుని నాట్యశాస్త్రకర్తృత్వం లోకప్రసిద్ధమే. ప్రప్రథమంగా నాట్యశాస్త్రం ప్రవర్తింపచేసినవాడు నందికేశ్వరుడని భావప్రకాశాది గ్రంథాలు కూడా చెపుతున్నాయి. అందుచేత రాజశేఖరుడు చెప్పినవారిలో కొందరికైనా ఆయా శాస్త్రీయ గ్రంథాలతో సంబంధం ఉన్నదని చెప్పడానికి అవకాశం లేక పోలేదు. భరతనాట్యశాస్త్రంతప్ప మరే గ్రథమూ ఇపుడు లభించకపోవడం మన దురదృష్టం. ఏమైనా, అలంకారశాస్త్రం అతిప్రాచీనమైనదని చెప్పడానికి రాజశేఖరుడు వర్ణించిన ఈ శాస్త్రోద్గమసంప్రదాయం కూడా ప్రమాణమే. వెనుక చెప్పినట్లు సాహిత్యవిద్య ఐదవ విద్య అని చెప్పడమే కాకుండా, రాజశేఖరుడు అలంకారశాస్త్రం ఏడవ వేదాగం; దీని సహాయం లేకపోతే "ద్వాసుపర్ణా" ఇత్యాది మంత్రాలలోని అందం స్పష్టంగా గోచరించదు అంటాడు, "ఉపకారకత్వాత్ అలఙ్కారః సప్తమం అఙ్గమితి యాయావరీయః. ఋతే చ తత్స్వరూప పరిజ్ఞానాత్ వేదార్థానవగతిః; యథా - "ద్వాసుపర్ణా..." (కావ్యమీమాంస)

<u>కొందరు ప్రధానులైన ఆలంకారికులు :-</u> ధ్వనిసిద్ధాంతం ప్రచారంలోనికి వచ్చిన సమయాన్ని కేంద్రంగా తీసుకొని, అలంకార శాస్త్రేతిహాసాన్ని మూడు కాలాలలో విభజింపవచ్చును- ప్రాగ్ధ్వని యుగము, ధ్వనియుగము. ధ్వనిపశ్చాద్యుగము. అదే విధంగా మొత్తం కాలాన్ని రెండు విధాలుగా విభజించి (1) అజ్ఞాతకాలంనుంచి భామహుడు లేదా దండివరకు ఉన్న కాలము (2) తదనంతర

కాలము అని చెప్పవచ్చు. మొదటి కాలంలో రూపకాలకి సంబంధించిన శాస్త్రమూ, అలంకారశాస్త్రమూ కూడా ఒకే శాస్త్రంగా పరిగణింపబడ్డాయి. రెండవకాలంలో ఈ రెండూ వేరు వేరు శాస్త్రాలుగా వృద్ధి చెందినాయి. ఈ రెండింటినీ కలిపి చర్చించిన ప్రతాపరుద్రీయం, సాహిత్యదర్పణం వంటి గ్రంథాలు ఈ కాలంలో కూడా లేకపోలేదు.

ఈ శాస్త్రానికి సంబంధించినంతవరకు భరతుని నాట్యశాస్త్రమే మనకీనాడు లభ్యమౌతున్న ప్రాచీన గ్రంథం. అంతకు పూర్వం ఉన్న గ్రంథాలేవీ లభించడం లేదు. అగ్ని పురాణంలో అలంకారశాస్త్రానికి సంబంధించిన విషయాలను చర్చించే పది అధ్యాయా లున్నాయి. ఐతే ఇది నాట్యశాస్త్రంకంటె అర్వాచీనమైనదనీ బహుశా క్రీ. శ. 900—1050 ప్రాంతానికి చెంది ఉంటుందనీ పండితుల అభిప్రాయం. అందుచేత దానిని ప్రప్రథమ గ్రంథంగా పరిగణించవలసిన పని లేదు.

<u>నాట్యశాస్త్రము</u>: ఇది 36 అధ్యాయాలలో విభక్తమైన 5000 శ్లోకాల వివిధవిషయసంకలిత మైన బృహద్గ్రంథం. ఇది అంతా ఒక కాలానికి సంబంధించిన రచన కాదనీ, క్రీ పూ. రెండవ శతాబ్దినుంచి క్రీ. శ. మూడవ శతాబ్ది వరకూ దీని రచన సాగి ఉంటుందనీ ఆధునిక విమర్శకుల అభిప్రాయం. ఇందులో (1) సూత్రాలూ భాష్యమూ, (2) కారికలూ (3) అనువంశ్య శ్లోకాలూ ఉన్నాయి. సూత్రాలు అతి ప్రాచీన మైనవి. కారికలు సూత్రార్థాన్నీ భాష్యాన్నీ విశదీకరిస్తూ ఉంటాయి. అనువంశ్య శ్లోకాలు మాత్రం ఆయా విషయాలను వివరిస్తూ గురుశిష్య సంప్రదాయక్రమంలో అతి ప్రాచీనకాలంనుంచీ వచ్చిన శ్లోకాలు.

ప్రప్రథమంగా రససిద్ధాంతాన్ని ప్రచారంలోనికి తీసుకు వచ్చినవాడు భరతుడు. ఐతే ఈ సిద్ధాంతాన్ని రూపకాలకు సంబంధించే విధంగా నిరూపించడం జరిగింది. కాలాంతరంలో దానినే శ్రవ్యకావ్యాలకి కూడా సంబంధింపజేశారు. నాలుగు అలంకారాలనూ గుణాలనూ గూర్చి 6, 7, 16 అధ్యాయాలలో

భరతుడు ప్రస్తావించి "లక్షణాలు" అనే పేరుతో 36 విషయాలను ప్రతిపాదించాడు. ఈ లక్షణాలలో చాలా భాగం అర్వాచీనకాలంలో అలంకారాలుగా స్వీకరింపబడినాయి అని వి. రాఘవన్ సప్రమాణంగా "సమ్ కన్సెప్ట్స్ ఆఫ్ అలంకారశాస్త్ర" అనే గ్రంథంలో నిరూపించారు. ఈ విధంగా అలంకారాలు, గుణాలు, రసాలు, భావాలు మొదలైన అలంకారశాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలు నాట్యశాస్త్రంలో ప్రతిపాదింపబడి ఉన్నాయి

భామహుడు :— ఈతడు కాశ్మీర దేశీయుడు. రక్రిలుని కుమారుడు. ఈతడు బౌద్ధపండితుడై ఉంటాడని చెప్పడానికి కొంత అవకాశం లేకపోలేదు. భామహుడు 400 శ్లోకాలలో, ఆరు పరిచ్ఛేదాలుగా విభక్తమైన 'కావ్యాలంకారం' రచించాడు. రూపకశాస్త్రంనుంచి విడదీసి వ్రాసిన స్వతంత్రాలంకార శాస్త్ర గ్రంథాలలో, మనకు లభ్యమైన వాటిలో ఇది మొదటిది. ఐతే దండి భామహుల పౌర్వాపర్యం విషయంలో చాలా విప్రతిప్రత్తి ఉన్నది. S. K. డే అభిప్రాయం ప్రకారం భామహుడు ఏడవ శతాబ్దికి చివర ఎనిమిదవ శతాబ్ది ప్రారంభంలోను, దండి ఎనిమిదవ శతాబ్దం పూర్వార్ధంలోను ఉండేవారు. పి. వి కాణేగారి మతం ప్రకారం దండి క్రీ. శ. 660-680 ప్రాంతంవాడైతే భామహుడు 725-750 సంవత్సరాల ప్రాంతంవాడు. వీరి పౌర్వాపర్యాన్ని గూర్చి ముందు చర్చించబడుతుంది.

భామహుడు అలంకారప్రాధాన్యవాది. ప్రథమ పరిచ్ఛేదంలో కావ్యలక్షణమూ, కావ్యవిభాగాలూ చెప్పబడ్డాయి. ద్వితీయ తృతీయ పరిచ్ఛేదాలలో అలంకారాలు, చతుర్థ పరిచ్ఛేదంలో కావ్యదోషాలూ, పంచమపరిచ్ఛేదంలో న్యాయశాస్త్రానికి సంబంధించిన కొన్ని దోషాలూ, షష్ఠపరిచ్ఛేదంలో కొన్ని శబ్దాల సాధుత్వాసాధుత్వాదులూ చెప్పబడ్డాయి. ఇతడు పది గుణాలను కాక మూడు గుణాలను (ప్రసాద-ఓజస్-మాధుర్యాలు) అంగీకరించాడు ఈతని అభిప్రాయం ప్రకారం వక్రోక్తియే సర్వాలంకారాలకీ మూలం :—

"సైషా సర్వత్ర వక్రోక్తి రనయార్థో విభావ్యతే
యత్నో ఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా ( II .85.)

కుంతకుడు ఈ వాక్యాన్నే మూలసూత్రంగా తీసికొని, దానికి భాష్యంగా వక్రోక్తిజీవితాన్ని రచించినాడు.

<u>వామనుడు</u> :- ఇతడు కాశ్మీరదేశీయుడు; జయాదిత్యుని ఆస్థానంలో పండితుడు. ఎనిమిదవ శతాబ్దం చివరిభాగానికి చెందినవాడు "కావ్యాలంకార సూత్రమ్" అనే పేరుతో 319 సూత్రాల గ్రంథం వ్రాసి దానిపై తానే వృత్తి కూడా వ్రాశాడు. మొదటి అధికరణంలో కావ్యలక్షణ ప్రయోజనాలు, రీతులు నిరూపింపబడినవి. రెండవ అధికరణంలో పదవాక్యదోషాలు, మూడవ అధికరణంలో గుణాలు, నాల్గవ అధికరణంలో అలంకారాలు, చివరిదైన ఐదవ అధికరణంలో వ్యాకరణవిషయాలు ప్రతిపాదింపబడినవి రీతిని కావ్యాత్మగా అంగీకరించడము, దండి చెప్పిన గౌడీవైదర్భీ మార్గాలతోపాటు పాంచాలీరీతి అనే మూడవరీతిని స్వీకరించడము, (దండి 'మార్గం' అంటే ఇతడు దానిని 'రీతి' అన్నాడు) అన్ని అలంకారాలకి మూలాధారం ఉపమాలంకారమే అని ప్రతిపాదించడము - ఇలాంటి వన్నీ వామనుడు క్రొత్తగా ప్రవేశపెట్టిన విషయాలు,

<u>ఉద్భటుడు</u> :- ఇతడు వామనుని సమకాలికుడు. జయాదిత్యుని ఆస్థానంలోనే సభాధ్యక్షుడుగా ఉండేవాడు. ఇతడు వామనుడు వలె రీతి ప్రాధాన్యవాది కాకుండా అలంకార ప్రాధాన్యవాది. భామహుని కావ్యాలంకారానికి 'భామహ వివరణం' అనే ఒక వ్యాఖ్య వ్రాసినట్లు ఇతరగ్రంథాల ద్వారా మాత్రమే తెలుస్తూన్నది. దీని అతిశిథిలమైన ప్రతి లభించగా దానిలో నుంచి రెండు మూడు పత్రాలు మాత్రం ఈ మధ్య ఒక పండితుడు ప్రకటించాడు. ఇపుడు లభ్యం అవుతున్న ఇతని ఏకైక గ్రంథం "కావ్యాలంకారసారసంగ్రహము". ఇందులో 79 కారికలు, ఆరు వర్గలు ఉన్నాయి. దీనికి, ముకులభట్టు శిష్యుడైన ప్రతీహారేందురాజు మంచి వ్యాఖ్యానం వ్రాసి ఉన్నాడు. ఉద్భటుడు తన శ్లోకాలే ఉదాహరణగా ఇచ్చినాడు. ఐతే ఈ శ్లోకాలలో కుమారసంభవకథ అనుస్యూతంగా కూర్చబడింది.

రుద్రటుడు :- క్రీ.శ. 900 ప్రాంతానికి చెందిన, కాశ్మీర దేశీయుడైన ఈ పండితుడు 734 శ్లోకాల విస్తృతగ్రంథమైన "కావ్యాలంకారం"లో అలంకార శాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలు చర్చించాడు. అలంకారాలన్నీ వాస్తవము, ఔపమ్యము, అతిశయము, శ్లేష అనే ఈ నాలుగు అంశాలలో ఏదో ఒక అంశంమీద ఆధారపడి ఉంటాయని ఈతడు ప్రప్రథమంగా అలంకారాల వైజ్ఞానిక విభాగం చేసి ఉన్నాడు.

"అర్థస్యాలంకారా వాస్తవమౌపమ్య మతిశయః శ్లేషః
ఏషామేవ విశేషా అన్యే తు భవన్తి నిఃశేషాః" (VII_9)

అలంకారప్రాధాన్యవాదియే అయినా రుద్రటుడు ( XII _ XIV అధ్యాయాలలో) రసాలను గూర్చి అతివిస్తృతంగా చర్చించాడు. ఈ గ్రంథానికి నమిసాధు అనే జైనపండితుడు (1125-1156) మంచి ప్రామాణికమైన వ్యాఖ్య వ్రాసి ఉన్నాడు.

ధ్వనియుగం ఆనందవర్ధనుడు :- అలంకారశాస్త్రేతిహాసంలో ఆనందవర్ధనుని స్థానం అత్యున్నత మైనది. పండితరాయలంతటివాడు ఈతనిని "ఆలంకారికసరణి వ్యవస్థాపకుడు" అని ప్రశంసించాడు. ఈతడు కాశ్మీర రాజైన అవంతివర్మ (855-883 క్రీ శ.) ఆస్థానాన్ని అలంకరించాడు.

ఆనందవర్ధనుడు రచించిన ఉద్గ్రంథం ధ్వన్యాలోకము. ఇది కారికా-వృత్తుల రూపంలో ఉన్నది. కారికలు వ్రాసినవారు వేరు. ఆనందవర్ధనుడు వాటికి, ధ్వన్యాలోకం అనే పేరుతో వృత్తి మాత్రమే వ్రాశాడు అని కొందరు పండితుల అభిప్రాయం. కారికావృత్తులు రెండూ ఆనందవర్ధన విరచితాలే అని ఇపుడు చాలామంది అంగీకరిస్తున్నారు. ధ్వన్యాలోకంలో నాలుగు ఉద్ద్యోతాలు ఉన్నాయి. (1) ధ్వని అనేది లేదు (2) ఉన్నా దాన్ని నిర్వచించడం కష్టం, (3) లేదా దాన్ని లక్షణావృత్తిలో కలిపివేయవచ్చు అని మూడు విధాలుగా వాదించే ధ్వనివిరోధుల మతాన్ని ఖండించి ప్రథమోద్ద్యోతంలో ధ్వని స్థాపింప

బడింది. ద్వితీయ తృతీయోద్యోతాలలో వివిధధ్వనిభేదాలు నిరూపించబడినవి. ధ్వనిస్పర్శవల్ల కావ్యంలో కలిగే సౌందర్యం సోదాహరణంగా చతుర్థోద్యోతంలో స్పష్టీకరింపబడింది. ఈ ధ్వనిసిద్ధాంతం అలంకారశాస్త్రప్రక్రియలోనే గొప్ప మార్పు తీసుకువచ్చింది. మహిమభట్టు, ధనంజయుడు వంటి ఎవరో ఒకరిద్దరు తప్ప, ఆనందవర్ధనుని తరవాతవచ్చిన ఆలంకారికులందరూ ఈ ధ్వనిసిద్ధాంతం చేత పూర్తిగా ప్రభావితు లయినారు.

అభినవగుప్తుడు :— ఈతడు పదవశతాబ్దం ఉత్తరార్ధానికి చెందినవాడు. కాశ్మీరశైవమతానికి ఆచార్యస్థానం అధిష్ఠించినవాడు. ఈతడు రచించిన తంత్రాలోకం అనే గ్రంథం తంత్రశాస్త్రీయవిజ్ఞానసర్వస్వం వంటిది. అభినవగుప్తుడు అలంకారశాస్త్రంలో రెండు అత్యుత్తమ మైన వ్యాఖ్యానగ్రంథాలు వ్రాశాడు. ఈ రెండూ కూడా మూలగ్రంథాలకు మించిన ప్రామాణ్యాన్నీ, ప్రశంసనూ సంపాదించుకున్నాయి. వాటిలో మొదటిది భరతుని నాట్యశాస్త్రానికి వ్యాఖ్యాన మైన "అభినవభారతి"; రెండవది ధ్వన్యాలోక వ్యాఖ్యాన మైన "లోచనము". ధ్వన్యాలోకానికీ లోచనానికీ దాదాపు 100 సంవత్సరాల వ్యవధానం ఉన్నా ధ్వని సంస్థాపనం విషయంలో ఈ రెండు గ్రంథాలనీ ఒకే గ్రంథంగా పరిగణించాలి.

ధ్వన్యనంతరయుగము :— ఈ యుగంలో రెండు విధాల ఆలంకారికులు కనబడతారు (1) కొందరు ధ్వనికారమతాన్ని అంగీకరించేవారు, (2) కొందరు అంగీకరించనివారు. రెండవ తరగతికి చెందినవారిలో ప్రధానంగా చెప్పగగిన వారు ముగ్గురు మాత్రమే.

కుంతకుడు :— కాశ్మీరదేశీయుడైన కుంతకుడు 11 వ శతాబ్దం ప్రారంభానికి చెందినవాడు. ఈతని "వక్రోక్తిజీవితం" అనే ఒక్క గ్రంథం మాత్రమే మనకు లభిస్తూన్నది. నాలుగు ఉన్మేషాల ఈ గ్రంథంలో చివరి రెండు ఉన్మేషాలు చాలాచోట్ల తృటితంగా ఉన్నాయి. ఈతని సిద్ధాంతం ప్రకారం వక్రోక్తిలోనే, అనగా మామూలు పద్ధతికంటె భిన్నంగా ఉండే లోకోత్తర మైన అర్థావిష్కరణ పద్ధతిలోనే, కావ్యసౌందర్యం అంతా ఇమిడి ఉన్నది. ఈ వక్రోక్తిలో

ఎన్నో అవాంతర భేదాలు ఉన్నాయి. ధ్వనికారుడు చెప్పిన సకలధ్వనిభేదాలూ, ఇతరులు చెప్పిన ఇతరవిషయాలూ కూడా ఈ వక్రోక్తిలోనే అంతర్గతములై పోతాయి. అందుచేత వక్రోక్తి పరిధి అతివిస్తృత మైనది. ధ్వన్యాదుల పరిధి సంకుచిత మైనది అని ఇతని అభిప్రాయము. మిగిలిన ఆలంకారికులందరూ సహృదయుణ్ణి దృష్టిలో ఉంచుకొని కావ్యపరిశీలనం చేస్తే కుంతకుడు కవిని దృష్టిలో ఉంచుకొని కావ్యపరిశీలనం చేశాడు; ఇదే ఈతని వైశిష్ట్యం అని S. K. డే మొదలైనవారి ఆశయము.

మహిమభట్టు :- కాశ్మీరదేశీయుడైన ఇతడు కుంతకుని సమకాలికుడు. ధ్వనిసిద్ధాంతాన్ని ఖండించి 'వ్యక్తివివేకం' అనే గ్రంథం రచించినాడు. ఇందులో వివేకాలనే పేరుతో మూడు ప్రకరణాలు ఉన్నాయి. మొదటి వివేకంలో ధ్వని కారుడు చూపిన ధ్వని లక్షణాన్ని ఖండించి, ధ్వని అనేదాన్ని అనుమానంలో అంతర్గతం చేయవచ్చునని ప్రతిపాదించబడినది. రెండవ వివేకంలో అర్థదోషాల వివరణం చేయబడింది. మూడవ వివేకంలో వివిధ ధ్వనులకు ఉదాహరణలుగా ధ్వనికారుడు చూపిన వాటిలో అన్నింటిలోనూ అనుమానాన్ని అంగీకరిస్తేనే పని జరిగిపోతుంది అన్న విషయం నిరూపింపబడింది.

ధనంజయుడు :- పదవశతాబ్దం చివరి పాదానికి చెందిన ధనంజయుడు ధారాధినాథుడైన ముంజుని ఆస్థానంలో ఉండేవాడు. ఈతడు రచించిన దశరూపకానికి ఈతని సోదరుడైన ధనికుడు వ్యాఖ్యానం వ్రాసినాడు. రసోత్పత్తి విషయంలో ధనంజయుడు భట్టనాయకప్రతిపాదిత మైన భావకత్వ వ్యాపారాన్ని అంగీకరించి వ్యంజనావ్యాపారాన్ని నిరాకరిస్తాడు. అందుచేతనే ఈ సోదరులను ఇద్దరినీ ధ్వన్యభావవాదులుగా పరిగణించడం జరిగింది.

మమ్మటుడు :- ఇతడు కూడా కాశ్మీరదేశీయుడే. పదకొండవ శతాబ్దం ఉత్తరార్ధానికి చెందినవాడు, మహాభాష్యానికి వ్యాఖ్యానం రచించిన కైయటుడు, వేదభాష్యం రచించిన ఉవ్వటుడు, ఈ మమ్మటుడూ అన్నదమ్ము లని ప్రసిద్ధి.

క్రైయట మమ్మటులు అన్నదమ్ములైతే కావచ్చు గాని, ఉవ్వటుడు కాడు అని కాణే అభిప్రాయం, 'కావ్యప్రకాశ' అనే ఉద్గ్రంథంలో మమ్మటుడు ధ్వన్యభావ వాదులైన మహిమభట్టాదుల మతాలన్నీ ఖండించి ధ్వనిప్రస్థానాన్ని దృఢమైన స్తంభాలమీద నిలబెట్టినాడు. "ధ్వనిప్రస్థానపరమాచార్యుడు" అనే ప్రసిద్ధి సంపాదించుకున్నాడు. కావ్యప్రకాశంలో పది ప్రకరణాలు ఉన్నాయి: (1) కావ్యలక్షణ ప్రయోజన-కావ్యవిభాగాలు. (2) వృత్తులు (3) ధ్వని (4) ధ్వనిభేదాలు (5) గుణీభూతవ్యంగ్యం (6) చిత్రకావ్యాలు (7) దోషాలు (8) గుణాలు (9) శబ్దాలంకారాలు (10) అర్థాలంకారాలు. పదవ ఉల్లాసంలో పరికరాలంకారం తరవాత ఉన్న భాగాన్ని అల్లటుడు లేదా అలకుడు అనే ఒక కాశ్మీరు పండితుడు పూర్తి చేసినాడని ప్రసిద్ధి. కావ్యప్రకాశకి వ్యాఖ్యానం వ్రాయడం పాండిత్యానికి నికషోపలం అని భావించడంచేత ఎందరో పండితులు దీనికి వ్యాఖ్యానాలు వ్రాశారు. దాదాపు 46 వ్యాఖ్యానాల పేర్లు వినవస్తున్నాయి.

క్షేమేంద్రుడు :- మమ్మటుని సమానకాలీనుడైన క్షేమేంద్రుడు కూడా కాశ్మీరదేశీయుడే. క్రీ.శ. 990 సంవత్సరంలో జన్మించి 1066 లో మరణించినట్లుగా అతని గ్రంథాలవల్ల తెలుస్తూన్నది. ఇతడు ఉత్తమ కవి. ఇతని రచనలలో "ఔచిత్యవిచారచర్చ" అనేది అలంకారశాస్త్రానికి సంబంధించినది. భామహుడు వ్రాసిన "సైషా సర్వైవ వక్రోక్తిః" ఇత్యాది శ్లోకాన్ని ఆధారంగా తీసుకొని కుంతకుడు 'వక్రోక్తిజీవితం' వ్రాసినట్లుగా, క్షేమేంద్రుడు-

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్యబన్ధస్తు రసస్యోపనిషత్పరా"

అన్న ధ్వనికారశ్లోకాన్ని ఆధారంగా తీసుకొని ఈ గ్రంథం రచించినాడు. ఔచిత్యమే కావ్యానికి జీవితం అని ఇందులో ప్రతిపాదించిన సిద్ధాంతము.

రుయ్యకుడు :- ఇతడు కూడా కాశ్మీరదేశీయుడే. పన్నెండవ శతాబ్దం మధ్యభాగానికి చెందిన జయసింహుడనే కాశ్మీరరాజుకు సాంధివిగ్రహికుడుగా

(ఒకమంత్రిపదవి) ఉన్న మంఖకునికి గురువు. ధ్వనిసిద్ధాంతానుయాయి అయిన రుయ్యకుడు ఏడు శబ్దాలంకారాలనూ, 73 అర్థాలంకారాలనూ ప్రతిపాదిస్తూ "అలంకారసర్వస్వం" అనే మంచి ప్రామాణికగ్రంథాన్ని రచించాడు. ఇది విశ్వనాథుడు, అప్పయదీక్షితులు, జగన్నాథపండితరాయలు మొదలైన తరువాతి ఆలంకారికులికి మార్గదర్శకం అయినది

విశ్వనాథుడు :- ఈతడు ఉత్కళదేశంలోని మంచి పండితకుటుంబంలో జన్మించినవాడు. ఈతని తండ్రీ, ఈతడూ కూడా ఉత్కళ రాజ్యంలో సాంధివిగ్రహికమహాపాత్రులుగా ఉండేవారు. క్రీ. శ. 1300-1380 సంవత్సరాల కాలంవాడైన ఇతడు సాహిత్యదర్పణం అనే గ్రంథంలో అలంకారశాస్త్రానికి సంబంధించిన విషయాలన్నీ చక్కగా ప్రతిపాదించాడు. రూపకాలను గూర్చి కూడా ఈ గ్రంథంలో ప్రతిపాదింపబడినది. ఇది బహుజనాదరాన్ని పొందిన గ్రంథము. చాలాకాలం క్రితమే రూపకశాస్త్రంనుంచి విడివడి స్వతంత్రంగా నడచిన అలంకారశాస్త్రాన్ని విశ్వనాథ - విద్యానాథాదులు మరల కలపడం జరిగింది.

అప్పయ్యదీక్షితులు :- ఈతడు పూర్వోత్తరమీమాంసాశాస్త్రాలలో జగద్విఖ్యాతి గాంచిన ఉద్దండపండితుడు. పదహారవ శతాబ్దం చివరి భాగానికి 17వ శతాబ్దం పూర్వ భాగానికి చెందినవాడు. నేటి తమిళనాడులోని అడయప్పాళెం అనే గ్రామం ఈతని జన్మస్థానం. అలంకారశాస్త్రంలో ఈతడు వృత్తివార్తికం, చిత్రమీమాంస, కువలయానందం అనే మూడు గ్రంథాలు రచించినాడు. అత్యల్ప ప్రమాణమైన వృత్తివార్తికంలో అభిధాలక్షణావృత్తుల స్వరూపం చర్చింపబడింది. కొన్ని ప్రధానమైన అలంకారాల స్వరూపాన్ని నిర్ణయించడంకోసం వ్రాసిన గ్రంథం చిత్రమీమాంస; అసంపూర్ణంగానే ఆగిపోయింది. జయదేవుని చంద్రాలోకానికి వ్యాఖ్యారూపంలో వ్రాయబడిన కువలయానందం చక్కని ఉదాహరణలతో దాదాపు 125 అలంకారాలని విశదీకరిస్తూన్నది.

జగన్నాథపండితరాయలు :- ఈతడు 17 వ శతాబ్దికి చెందినవాడు. షాజహాన్ ఆస్థానంలో ఉండేవాడు. ఈతని 'రసగంగాధరము' అత్యద్భుత పాండితీప్రకర్షకు నికషోపలమైన ప్రౌఢాలంకారగ్రంథము. ఇది అసంపూర్ణంగానే లభిస్తూన్నది. ఐతే అలంకారశాస్త్రానికి సంబంధించిన విషయాలు చాలావరకు ఇందులో చర్చించబడి ఉన్నాయి ద్వితీయాననంలో దాదాపు 70 అలంకారాల స్వరూపం స్పష్టంగా నిరూపింపబడింది. అంచుచేత లభ్యం కాని భాగం చాలా స్వల్పమైనదే అని చెప్పవచ్చును. ఈతని మరొక అలంకారశాస్త్ర గ్రంథం "చిత్రమీమాంసాఖండనము". ఇదొక స్వతంత్రగ్రంథం కాదు. అప్పయదీక్షితులు చిత్రమీమాంసలో చూపిన కొన్ని సిద్ధాంతాలను రసగంగాధరంలో, ఆయా అలంకారాలక్రింద, ఖండించడం జరిగింది. ఆ విషయాలే కూర్చి చిత్రమీమాంసా ఖండనం రచింపబడిం దని పండితరాయలే చెప్పి ఉన్నాడు.

ఇంతవరకూ మనం చూచిన అలంకారికులలో కొందరు స్వతంత్రంగా నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించినవారూ, ఆ సిద్ధాంతాలను మరికొన్ని స్వీయ యుక్తులతో సమర్థిస్తూ ప్రామాణిక గ్రంథాలు రచించినవారూ ఉన్నారు. ఇంకా ఎందరో నామమాత్రావశిష్టులూ (వారి గ్రంథాలు దొరకకపోయినా ఇతరుల గ్రంథాల ద్వారా వారిని గూర్చి మనకు తెలుస్తూన్నది) మమ్మటాదుల గ్రంథాల లోని విషయాలే మరల ప్రతిపాదిస్తూ గ్రంథాలు వ్రాసిన వారూ దాదాపు వంద మందికి మించి ఉన్నారు. ఎందరో వ్యాఖ్యాతలు కూడా ఉన్నారు. అట్టివారిలో కొందరి పేర్లు కూడా తెలుసుకోవడం అవసరమే.

ఐతే ఇంతవరకూ మనం చూచినదానిని పట్టి అలంకారశాస్త్రంలో ప్రధానంగా నాలుగు సంప్రదాయాలు ఆవిర్భవించినట్టుగా స్పష్టం అవుతుంది.

1. రససంప్రదాయం—భరతాదులు

2. అలంకార సంప్రదాయం—భామహోద్భటాదులు

3. రీతి సంప్రదాయం—వామనాదులు

4. ధ్వని సంప్రదాయం—ఆనందవర్ధనాదులు

5. వక్రోక్తి సంప్రదాయం—కుంతకుడు

ఔచిత్యసంప్రదాయం అనేది కూడా ఒక సంప్రదాయం అని అంగీకరించవలసిన పని లేదు. ఎందుచేతనంటే ఔచిత్యం అనేది అందరికీ అంగీకారయోగ్యమే కదా ?

కొందరు ఇతర ఆలంకారికులు :- (1) ధర్మకీర్తి :- ప్రసిద్ధ బౌద్ధనైయాయికుడైన దర్మకీర్తి "అలంకారము" అనే ఒక అలంకారశాస్త్ర గ్రంథాన్ని రచించినట్లుగా ఇతర గ్రంథాలవల్ల తెలుస్తూన్నది.

(2) లోల్లటుడు :- ఇతడు నాట్యశాస్త్రానికి ఒక వ్యాఖ్యానం వ్రాసినట్లు అభినవగుప్తుడు ఇచ్చిన ఉద్ధరణల ద్వారా తెలుస్తూన్నది కాని ఆ గ్రంథం ఇపుడు లభ్యం కాదు.

(3) శంకుకుడు :- ఇతడు కాశ్మీర రాజైన అజితాపీడుని కాలంలో (814-851) ఉండేవాడు. రసానికి సంబంధించిన ఈతని అభిప్రాయాలను అభినవగుప్తుడు ఉట్టంకించడంచేత ఇతడు కూడా నాట్యశాస్త్రానికి వ్యాఖ్య వ్రాసి ఉంటాడని తెలుస్తూన్నది. ఇతడు భువనాభ్యుదయకావ్యం కూడా వ్రాసి ఉన్నాడు.

(4) ఘంటకుడు :- ఇతడు నాటకాలకి సంబంధించిన గ్రంథం ఏదో రచించినట్లు అభినవగుప్తుని ధ్వన్యాలోకలోచనం ద్వారా తెలుస్తూన్నది.

(5) భట్టనాయకుడు :- ఇతడు క్రీ. శ. 855 - 884 సంవత్సరాలకి చెందిన, కాశ్మీర రాజైన అవంతివర్మ ఆస్థానంలో ఉండేవాడు. ఈతడు సహృదయదర్పణం అనే గ్రంథం వ్రాసినట్లు ఇతరుల గ్రంథాలద్వారా తెలుస్తూన్నది.

ఇది నాట్యశాస్త్రానికి వ్యాఖ్యానం కావచ్చును. అభినవగుప్తుడు చూపిన ఉద్ధరణ లను బట్టి ఇతడు అభినవగుప్తునికి సమానస్కంధు డన్నట్లు కన బడుతుంది

(5) <u>ముకులుడు</u> :- ఇతడు కూడా 855-884 ప్రాంతంవాడై ఉండాలి. ఇతని అభిధావృత్తి మాతృకలో అభిధావృత్తిని గూర్చిన చర్చ ఉన్నది.

(6) <u>రాజశేఖరుడు</u> :- క్రీ.శ. 884-925 సంవత్సరాలకు చెందిన రాజ శేఖరుడు గొప్ప కవి. గొప్ప భావకుడు. ఈతని 'కావ్యమీమాంస' విశ్వవిఖ్యాత మైన కవిశిక్షాగ్రంథము.

(7) <u>భట్టతౌతుడు</u> :- దశమశతాబ్ది ప్రారంభానికి చెందిన ఇతడు 'కావ్యకౌతుకం' అనే అలంకారశాస్త్రగ్రంథాన్ని రచించినట్లు మాణిక్యచంద్ర-అభి నవగుప్తాదుల ఉద్ధరణల ద్వారా తెలుస్తూన్నది.

(8) భట్టేందురాజు :- ఇతడు ఏదో గ్రంథాన్ని రచించినట్లు క్షేమేంద్రుని ఔచిత్యవిచారచర్చ ద్వారా తెలుస్తూ న్నది.

(9) భోజుడు:- పదకొండవ శతాబ్ద ప్రారంభానికి చెందిన ధారాధీశు డైన భోజరాజు కవిపండితపోషకుడు. అనేక గ్రంథాలను రచించినవాడు. ఈతడు రచించిన "సరస్వతీ కంఠాభరణము" "శృంగార ప్రకాశము" అనే అలంకారశాస్త్రగ్రంథాలు ప్రసిద్ధమైనవి. సరస్వతీకంఠాభరణ మనే పేరుతో ఇతడు వ్యాకరణగ్రంథం కూడా వ్రాసి ఉన్నాడు.

(10) <u>మాణిక్యచంద్రుడు</u> :- ఇతడు కావ్యప్రకాశానికి "సంకేతం" అనే వ్యాఖ్యానం క్రీ. శ. 1160 లో వ్రాశాడు. ఇది మమ్మటుని కావ్యప్రకాశకు వ్రాసిన వ్యాఖ్యానాలలో అతిప్రాచీన మైనది.

(11) హేమచంద్రుడు :- ఈతడు సుప్రసిద్ధ జైనసంప్రదాయాచార్యుడు; బహుగ్రంథకర్త. ఇతడు వ్రాసిన స్వవ్యాఖ్యాసమేత మైన కావ్యానుశాసనం

మంచి అలంకారగ్రంథం ఇది 1088 - 1174 సంవత్సరాల నడుమ వ్రాయబడింది.

(12) జయమంగళుడు :- హేమచంద్రుని సమకాలికుడు. కవిశిక్ష అనే గ్రంథం రచించినాడు.

(13) నాగవర్మ :- ఇదే కాలానికి చెందిన నాగవర్మ 'కావ్యాలోచనం' అనే గ్రంథం రచించాడు.

(14) వాగ్భటుడు (ప్రథముడు) - జైన పండితుడైన ఇతడు 1094-1143 సంవత్సరాల నడుమ "వాగ్భటాలంకారం" అనే గ్రంథం వ్రాశాడు.

(15) దేవేశ్వరుడు :- 1300 ప్రాంతానికి చెందిన ఇతడు "కవికల్పలతా" అనే గ్రంథం నిర్మించాడు.

(16) వాగ్భటుడు (ద్వితీయుడు) :- పదమూడవ శతాబ్ది చివరి భాగానికి చెందిన ఇతడు "కావ్యానుశాసనం" రచించినాడు.

(17) మలయజపండితుడు :- క్రీ. శ. 1168 ప్రాంతంలో ఇతడు "సాహిత్యసారం" రచించినాడు.

(18) రాజరాజు :- ఇతడు 12వ శతాబ్దంలో "రాజరాజీయం" అనే గ్రంథం రచించాడు.

(19) ధర్మదాసు :- ఈ బౌద్ధపండితుడు, 1293-1309 ప్రాంతంలో "విదగ్ధముఖమండనం" వ్రాసినాడు.

(20) శారదాతనయుడు :- పన్నెండు-పదమూడు శతాబ్దాల ప్రాంతం వాడైన ఈతడు రచించిన "భావప్రకాశనం" నాట్యశాస్త్రం తరువాత అంత ప్రశస్తిగాంచినది.

(21) <u>శోభాకరుడు</u> :- పదమూడవ శతాబ్దానికి చెందిన శోభాకరమిత్రుడు "అలంకారరత్నాకరం" రచించినాడు. ఇది పాండిత్యపూర్ణమైన గ్రంథం. అనేక స్థలాలలో ఇతడు రుయ్యకుణ్ణి కూడా ఖండించినాడు.

(22) <u>సింగభూపాలుడు</u> :- 14వశతాబ్దికి చెందిన ఈ సింగభూపాలుని "రసార్ణవసుధాకరం" ప్రసిద్ధమైన గ్రంథం. ఈతడు ఆంధ్రదేశంలో కొంత ప్రాంతాన్ని పరిపాలించిన వెలమరాజు. ఈతని రెండవ గ్రంథం "నాటకపరిభాష".

(23) <u>విశ్వనాథుడు</u> :- ఇతడు సాహిత్యదర్పణకారునికంటె భిన్నుడు. "సాహిత్యసుధాసింధు" అనే గ్రంథం రచించాడు.

(24) <u>భానుదత్తుడు</u> :- మిథిలాదేశీయుడైన భానుదత్తుడు 'రసమంజరి' రచించినాడు.

(25) <u>జయదేవుడు</u> :- ఇతడు 12 లేదా 13వ శతాబ్దికి చెందినవాడై ఉంటాడు. 'చంద్రాలోకం'అనే గ్రంథంలో అలంకారశాస్త్రానికి సంబంధించిన విషయాలు అతిసులభశైలిలో ప్రతిపాదించినాడు.

(26) <u>సుఖలాల్</u> :- పద్దెనిమిదవ శతాబ్ది మధ్యభాగానికి చెందిన ఇతడు చంద్రాలోకకారికలను ఆధారంగా తీసుకొని 'అలంకారమంజరి' అనే గ్రంథం రచించినాడు.

(27) <u>వేమభూపాలుడు</u> :- 15వ శతాబ్ది ప్రారంభానికి చెందిన వేమభూపాలుడు (తెలుగుదేశాన్ని పరిపాలించిన రెడ్డిరాజు) "సాహిత్యచింతామణి" అనే గ్రంథం నిర్మించినాడు.

(28) <u>అనురథమంతనుడు</u> :- పద్దెనిమిదవ శతాబ్దికి చెందిన ఈ జైన పండితుడు "జల్పకల్పలత" "ముగ్ధమేధాకరం" అనే రెండు గ్రంథాలు రచించినాడు.

(29) పుంజరాజు :- 15వ శతాబ్ది చివరి భాగంలో మాలవదేశాన్ని పాలించిన పుంజరాజు "ధ్వనిప్రదీపము" "శిశుప్రబోధాలంకారము" అనే రెండు గ్రంథాలు రచించినాడు.

(30) కృష్ణసుధి :- పద్దెనిమిదవ శతాబ్దివాడైన కృష్ణసుధి వ్రాసిన గ్రంథం "కావ్యకలానిధి".

(31) కృష్ణశర్మ :- పదిహేడవ శతాబ్దికి చెందిన కృష్ణశర్మ రచించిన "మందారమకరందచంపు" అనే అలంకారశాస్త్ర గ్రంథంలో అలంకారాలకీ, రసాలకీ సంబంధించిన అనేకవిషయాలు చెప్పబడినవి.

(32) ప్రభాకరుడు :- ఇతడు 1583లో "రసప్రదీప" మనే గ్రంథం రచించాడు.

(33) బలదేవుడు :- ఇతడు 18వ శతాబ్దికి చెందినవాడు. 'సాహిత్య కౌముది' "కావ్యకౌస్తుభము" అనే రెండు గ్రంథాలు రచించినాడు.

(34) విశ్వేశ్వరుడు :- ఈతడు అల్మోడాప్రాంతనివాసి. 34 సంవత్స రాల అల్పవయస్సులోనే స్వర్గస్థుడైనాడు. "అలంకారకౌస్తుభము", "అలంకారాభరణము", "అలంకారప్రదీపము", "అలంకారముక్తావళి" మొదలైన గ్రంథాలు ప్రసిద్ధమైనవి, పాండితీపూర్ణమైనవి. కౌస్తుభంలో అక్కడక్కడ జగన్నాథుని రసగంగాధరాన్ని కూడా ఖండించినాడు.

(35) రాజశేఖరుడు :- ఈతడు 19వ శతాబ్దానికి చెందిన దాక్షిణాత్య పండితుడు. "సాహిత్యకల్పద్రుమం" అనే 81 స్తబకాల గ్రంథం రచించినాడు.

(36) రత్నభూషణుడు :- ఈ వంగదేశపండితుడు 1859లో "కావ్య కౌముది" అనే గ్రంథం రచించినాడు.

(37) <u>శ్రీశైలనరసింహాచార్యుడు</u> :- పదిహేడవ శతాబ్దిప్రాంతంవాడైన ఈతడు రచించిన "అలంకారేందుశేఖరం" "లక్షణమాలిక" అనే గ్రంథానికి వ్యాఖ్యారూపమైనది.

(38) <u>రామసుబ్రమణ్యం</u> - ఇరవైయవ శతాబ్ది ప్రారంభంలో ఈతడు "అలంకారశాస్త్రవిలాసం" అనే గ్రంథం రచించినాడు

(39) <u>ముడుంబై నరసింహాచార్యులు</u> :- విజయనగరసంస్థానానికి చెందిన ఇతడు "కావ్యసూత్రవృత్తి" "కావ్యోపోద్ఘాతము" "కావ్యప్రయోగవిధి" "అలంకారమాల" అనే గ్రంథాలు రచించినాడు

(40) <u>విద్యానాథుడు</u> :- ప్రతాపరుద్రుని ఆస్థానాన్ని అలంకరించిన ఇతడు రచించిన "ప్రతాపరుద్రయశోభూషణం" దక్షిణదేశంలో, ముఖ్యంగా ఆంధ్రదేశంలో బహుళప్రచారం గల ఉత్తమగ్రంథము. రూపకాలను గూర్చి కూడా చర్చించడం ఈ గ్రంథంలోని వైశిష్ట్యము. ఇతడు 1268 - 1328 సంవత్సరాలకు చెందినవాడు. మల్లినాథుని కుమారుడు కుమారసోమపీఠి దీనికి రత్నాపణం అనే వ్యాఖ్యానం వ్రాసినాడు.

(41) <u>విద్యాధరుడు</u> :- ఉత్కలదేశీయుడైన ఈతడు 'ఏకావళి' అనే గ్రంథం రచించినాడు. 13వ శతాబ్దం ప్రారంభానికి చెందినవాడు. దీనికి మల్లినాథుడు 'తరళ' అనే చక్కని వ్యాఖ్యానం వ్రాసినాడు.

(42) <u>ధర్మసూరి</u> :- 18వ శతాబ్ది ప్రారంభానికి చెందిన ఈతడు (తెలుగువాడు) 'సాహిత్యరత్నాకరం' అనే గ్రంథం రచించినాడు. చర్ల వెంకట సూరి రచించిన 'నౌక' అనే వ్యాఖ్యానంతోటి, మల్లాది లక్ష్మణసూరి రచించిన 'మందర' అనే వ్యాఖ్యానంతోటి ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని సంస్కృతపరిషత్తుచే ప్రచురింపబడింది.

(43) సుధీంద్రయోగి :- 17వ శతాబ్దికి చెందిన ఇతడు 'అలంకార నికాశం' అనే గ్రంథాన్ని రచించినాడు.

(44) వీరనారాయణ :- 15వ శతాబ్దికి చెందిన ఇతడు రచించిన గ్రంథం "సాహిత్యచూడామణి".

(45) శ్రీకృష్ణుడు :- శ్రీకృష్ణ డనే నామాంతరంగల, 17వ శతాబ్దానికి చెందిన, పరకాలస్వామి, "అలంకారమణిహారం" రచించినాడు

(46) కర్ణపూరగోస్వామి :- 16వ శతాబ్దం ఉత్తరభాగానికి చెందిన ఇతడు "అలంకారకౌస్తుభం" అనే గ్రంథం రచించినాడు.

(47) రూపగోస్వామి :- 16వ శతాబ్దికి చెందిన రూపగోస్వామి రచించిన గ్రంథం "ఉజ్జ్వలనీలమణి". ఇందులో మధురభక్తి ప్రతిపాదింపబడినది.

(48) కేశవుడు :- 12వ శతాబ్దికి చెందిన శౌద్ధోదని అనే బౌద్ధాచార్యుడు రచించిన అలంకారసూత్రాలకి కేశవమిశ్రుడు (16వ శతాబ్దం)"అలంకార శేఖరం" అనే వృత్తి వ్రాసినాడు.

(49) మురారిదాసుడు; సుబ్రహ్మణ్యము :- ఈ పండితులు 19వ శతాబ్దం ఉత్తరార్థంలో, మేవాడ్ రాజైన యశవంతసింహుని కీర్తిని కొనియాడుతూ "యశవంతసింహయశోభూషణం" అనే అలంకారగ్రంథం రచించినారు.

ఇవే కాకుండా అజ్ఞాతకాలాలైన మరికొందరి రచనలు కూడా తెలియ వస్తున్నాయి.

| గ్రంథము | రచయిత |
|---|---|
| 1. కావ్యాలంకారసూత్రము : | యాస్కుడు. అఖిలానందాశ్రమయతి వ్యాఖ్యతో. |

| | గ్రంథము | రచయిత |
|---|---|---|
| ౨. | అలంకార విచారము | జీవనాథుడు |
| ౩. | అలంకారప్రకాశిక | |
| 4. | అలంకార శేఖరము | |
| 5. | ఆలంకార శిరోభూషణము | కుండలాచార్యుడు |
| 6. | అలంకారకరమాల | దామోదరభట్టు |
| 7. | అలంకారకౌముది | వల్లభభట్టు |
| 8. | అలంకారసారము | నృసింహుడు |
| 9. | అలంకారకౌస్తుభము | వేంకటాచార్యుడు |
| 10. | ఆలంకారసూత్రము | చంద్రకాంతతర్కాలంకార |
| 11. | అలంకారచంద్రిక | |
| 12. | అలంకారకారిక | |
| 13. | అలంకారకౌముది | బాలకృష్ణుడు |
| 14. | ఆలంకారమయూఖము | |
| 15. | అలంకారానుక్రమణిక | |
| 16. | అలంకారప్రకరణము | |
| 17. | అలంకారప్రకాశిక | |
| 18. | అలంకారానుక్రమణిక | |
| 19. | అలంకారసారసంగ్రహము | |

| | గ్రంథము | రచయిత |
|---|---|---|
| 20. | అలంకారగ్రంథము | |
| 21. | అలంకారవాదార్థము | బాలకృష్ణుడు |
| 22. | అలంకారసారము | |
| 23. | అలంకారమంజరి | త్రిమల్లభట్టు |
| 24. | అలంకార మంజూష | దేవశంకరుడు |
| 25. | అలంకార సముద్గకము | శివరాముడు |
| 26. | కావ్యోల్లాసము | నీలకంఠుడు |
| 28. | కావ్యసారసంగ్రహత్రియము | శ్రీనివాసుడు |
| 28, | కావ్యచంద్రిక | రామచంద్రన్యాయవాగీశ |
| 29. | కావ్యవృత్తరత్నావళి | నారాయణుడు |
| 30. | కావ్యకంటకోద్ధారము | నరసింహశాస్త్రి |

ఇంకా తాళపత్రగ్రంథాది రూపాలలో ఆయా పుస్తకాలయాలలో వందల కొలది అలంకారశాస్త్రగ్రంథాలు ఉన్నాయి. స్వతంత్రరచనలు ఎన్ని ఉన్నాయో వాటికి నాలుగైదు రెట్లు వ్యాఖ్యానగ్రంథాలు ఉన్నాయి. కొన్ని వ్యాఖ్యాన గ్రంథాలు స్వతంత్రరచనలకంటె కూడా సారవత్తరమైనవి. ఉదాహరణగా అలంకారసర్వస్వానికి జయరథుడు వ్రాసిన 'విమర్శిని' వంటి అతి ప్రామాణికాలూ, పరమగహనాలూ అయిన వ్యాఖ్యానాలు చూపవచ్చును.

దండి, ఆతని కాలము, రచనలు :- "అవంతిసుందరీ" అనే గద్య కావ్యాన్ని దండి రచించినట్లు ఒక ప్రసిద్ధి ఉన్నది. ఈ కథకీ దశకుమార చరిత్రలో ఉన్న అవంతిసుందరీ కథకీ చాలా పోలికలు ఉండడంచేత, దశ

కుమారచరిత్రలోని కథనే తీసుకుని ఎవరో దండి సమకాలికులో అర్వాచీనులో ఈ కావ్యాన్ని వ్రాసి ఉండవచ్చునని చెప్పడానికి అవకాశం లేకపోలేదు. ఒకే కథతీసుకొని ఒక కవి రెండు కావ్యాలు వ్రాయడు కదా ? ఏమైనా ఈ కావ్య ప్రారంభంలో దండి స్వీయచరిత్ర చెప్పుకొన్నట్లు ఉన్నది. దండియే చెప్పుకున్నా, మరెవరో వ్రాసినా ఈ కథకు కొంత ప్రామాణ్యం ఇవ్వడానికి, ప్రబల విరుద్ధ ప్రమాణం మరొకటి ఏదైనా కనబడే దాకా, అభ్యంతరం ఉండకూడదు.

సంగ్రహంగా ఈ కథ ఇలా ఉన్నది:- పల్లవవంశానికి చెందిన సింహ విష్ణువు కాంచీపురప్రాంతాన్ని పరిపాలిస్తూన్నప్పుడు ఒక గంధర్వుడు వచ్చి ఒక చక్కని శ్లోకంతో ఆతనిని ప్రశంసించినాడు. ఆ శ్లోకానికి చాలా సంతోషించి ఇది ఎవరు వ్రాశారు అని ఆ రాజు ప్రశ్నించగా ఆ గంధర్వుడు ఇలా సమాధానం చెప్పినాడు:- "ఉత్తర పశ్చిమప్రాంతంలో ఆనందపురం అనే ఒక బ్రాహ్మణా గ్రహారం ఉండేది. కౌశికగోత్రానికి చెందిన ఒక బ్రాహ్మణ కుటుంబం ఆ గ్రామం విడిచి నాసికప్రాంతంలో ఉన్న అచలపురానికి వలసవెళ్ళినది. ఈ కుటుంబంలో నారాయణస్వామి అనే మహాపండితుడికి దామోదరుడనే కుమారుడు కలిగినాడు. మహాకవి యైన భారవి ద్వారా ఈ దామోదరుడు విష్ణువర్ధన మహారాజుతో మైత్రి సంపాదించుకున్నాడు. ఒకనాడు విష్ణువర్ధనుడు వేటకు వెడుతూన్నప్పుడు దామోదరుడు కూడా వెళ్ళినాడు. అక్కడ రాజు బలవంతంమీద ఇతడు మాంసభక్షణం చేసినాడు. ఆ పాపం చేసినందుకు తండ్రికి ముఖం చూపించడానికి ఇష్టం లేక తీర్థయాత్రల కోసం బయలుదేరాడు. ఇతని బుద్ధి వైభవాన్ని మెచ్చుకొని గంగవంశానికి చెందిన దుర్వినీతుడు ఈతనికి ఆశ్రయం ఇచ్చినాడు. అప్పటికి దామోదరుని వయస్సు ఇరవై సంవత్సరాలు. ఈ శ్లోకం అతడు వ్రాసినదే". ఈ విషయం తెలిసిన తరువాత సింహవిష్ణువు చాలా ప్రయత్నం చేసి దామోదరుణ్ణి తన ఆస్థానానికి పిలిపించి సత్కరించినాడు. అప్పటి నుంచీ దామోదరుడు కాంచీపురంలో స్థిరపడిపోయినాడు ఈ దామోదరుని కుమారుడైన మనోరథుని పౌత్రుడు దండి. ఈతని తండ్రి పేరు వీరదత్తుడు, తల్లి గౌరి. ఇతని చిన్నతనంలోనే తండ్రి మరణించాడు. కాంచీపురాన్ని శత్రు

రాజులు ముట్టడించగా ఆ అల్లకల్లోల పరిస్థితులలో దండి లభించిన గురువుల దగ్గరల్లా వివిధశాస్త్రాలు చదువుతూ కొంత కాలంపాటు దేశాటనం చేసి శాంతి నెలకొన్న తరవాత కాంచీపురం చేరుకున్నాడు.

ఒకనాడు దండి తన మిత్రులతో కలిసి సముద్రతీరం మీద ఉన్న మహా మల్లపురంలోని విష్ణువిగ్రహం దగ్గర ఉండగా దివ్యసౌరభంతో కూడిన ఒక కమలం సముద్రపు టలల మీదుగా కొట్టుకుంటూ వచ్చి, విష్ణువు పాదాలను చేరి ఒక విద్యాధరుడుగా మారిపోయింది. ఆ విద్యాధరుడు విష్ణువుకు నమస్కరించి అంతర్ధాన మైనాడు. ఆ విద్యాధరుడు ఎవరో, ఎందుకు కమలంగా అయినాడో ఆ కథ అంతా తెలుసుకోవాలనే అభిలాషతో దండి, కాంచి చేరిన పిమ్మట. ఒక ద్వాదశీపర్వదివసాన విష్ణుపూజ చేసి రాత్రి దర్భాసనంమీద నిద్రించినాడు. సరస్వతి స్వప్నంలో కనబడి ఆ విద్యాధరుని వృత్తాంతం అంతా దండికి కరత లామలకం అయే ట్లు చేసింది. దానితో మరునాడు దండి ఆ కథ తన మిత్రు లకి చెప్పినాడు. అదే అవంతి సుందరి కథ.

దండి వ్రాసిన ఈ స్వీయకథను బట్టి ఈతని కాలాన్ని కొంతవరకూ నిర్ణయించవచ్చును. దండికి ముత్తాత అయిన దామోదరుడు 20 సంవత్సరాల వాడుగా ఉన్నప్పుడు భారవి సహాయంతో రాజకుమారుడైన విష్ణువర్ధనునితో స్నేహం సంపాదించుకున్నాడు. ఐహోలు శిలాశాసనం ప్రకారం 634 సం. నాటికే భారవికి కాళిదాసుతో సమానమైన కీర్తి ఉండేది. అందుచేత ఈ విష్ణు వర్ధనుడు రెండవ పులకేశికి సోదరుడూ, తూర్పు చాళుక్యవంశస్థాపకుడూ అయిన విష్ణువర్ధనుడే అయి ఉండాలి. ఇతడు 615-633 సంవత్సరాలలో రాజ్యం చేసినాడు. దామోదరునికి ఇతనితో స్నేహం 615 కి పూర్వమే, ఇతని చిన్న వయస్సులోనే. ఏర్పడి ఉండాలి. ఇతనికి వాడిన "రాజసూనో" అనే విశేషణం ఇందుకు సూచకము. గంగవంశీయుడైన దుర్వినీతుడు 605 నుండి 650 వరకు పాలించినట్లు చారిత్రికులు చెపుతున్నారు. ఈతనితో కూడా దామో దరునికి సంబంధం 600 ప్రాంతంలో ఏర్పడి ఉండాలి. పల్లవరాజైన సింహ విష్ణువు 575 నుండి 600 దాకా రాజ్యం చేసినట్లు చెపుతున్నారు. అందుచేత

దామోదరుడు ఆరవ శతాబ్ది చివరా ఏడవ శతాబ్ది పూర్వార్ధంలోనూ ఉండి ఉండాలి. దీనిని బట్టి అతని మునిమనుమడైన దండి ఏడవ శతాబ్ది చివర, ఎనిమిదవ శతాబ్ది పూర్వార్ధంలో ఉండి ఉండవచ్చును అని 'అవంతిసుందరి' ప్రస్తావనలో K. S. మహాదేవశాస్త్రి వ్రాసి ఉన్నారు. ఇది P. V. కాణేగారు అంగీకరించిన దండి కాలానికి చాలావరకు అనుగుణంగా ఉన్నది.

'దండి' కి ఆ పేరు "బ్రహ్మాండచ్ఛత్రదండః..." అనే దశకుమార చరిత్ర ప్రార్థనాశ్లోకంలో అనేకపర్యాయాలు 'దండ' శబ్దాన్ని ప్రయోగిస్తూ త్రివిక్రముని పాదదండాన్ని వివిధదండాలతో పోల్చడంవల్ల వచ్చి ఉంటుందనీ, అసలు పేరు మరొకటేదో అయి ఉంటుందనీ కొందరి అభిప్రాయం. దండి పేరే కాదు; మన సంస్కృత కవులలో చాలామంది పేర్లు పౌరుషనామాలే అన్నట్లు కనబడుతుంది! భాసుడు, కాళిదాసు, అశ్వఘోషుడు, బాణుడు, భవభూతి, భారవి, మాఘుడు-ఇవే కాక 'శాకటాయనుడు' మొదలైన కొందరు శాస్త్రకారుల నామాలుకూడా పౌరుషనామాలేమో అన్నట్లు కనబడుతుంది.

దండి రచనలు :

"త్రయోఽగ్నయస్త్రయో వేదాస్త్రయో దేవాస్త్రయో గుణాః
త్రయో దండిప్రబంధాశ్చ త్రిషు లోకేషు విశ్రుతాః"

అని రాజశేఖరుడు చెప్పినట్లుగా ఒక శ్లోకం ప్రచారంలో ఉన్నది. దండి వ్రాసినట్లుగా చెప్పే ఈ మూడు గ్రంథాలలో కావ్యాదర్శ - దశకుమారచరిత్రలు కాక మూడవ గ్రంథం విషయంలో పండితులలో చాలా అభిప్రాయభేదాలు ఉన్నవి.

"లింపతీవ తమోఽంగాని వర్షతీవాంజనం నభః
అసత్పురుషసేవేవ దృష్టిర్విఫలతాం గతా"

అనే కావ్యాదర్శంలోని శ్లోకం మృచ్ఛకటికంలో కూడా ఉండడంచేత మృచ్ఛకటికం కూడా దండి వ్రాసినదే అని కొందరి అభిప్రాయము. ఇది అంతసరియైన అభిప్రాయం కాదు. ఎందుచేతనంటే ఈ శ్లోకం భాసుని "బాలచరితం"లో

కూడా ఉన్నది. కావ్యాదర్శంలో ఈ శ్లోకాన్ని ఉదాహరించిన ఘట్టం పరిశీలిస్తే దండి ఏదో ప్రాచీనశ్లోకాన్ని ఉదాహరించినట్లుగా స్పష్టం అవుతుంది. "కొందరు ఈ శ్లోకంలో ఉపమను అంగీకరించారు; అది సరి కాదు" అని అంటూ దండి ఆ విషయాన్ని విస్తృతంగా చర్చిస్తాడు. దీన్ని గూర్చి కొందరు ఒక విధంగా అభిప్రాయపడడం అనేది ఇది ప్రాచీన శ్లోకమైతేనే సంభావ్యం అవుతుంది.

కావ్యాదర్శంలో ఒక చోట—

"పద్యం చతుష్పదీ తచ్చ వృత్తం జాతిరితి ద్విధా
ఛందోవిచిత్యాం సకలస్తత్ప్రపంచో నిరూపితః"

అని వ్రాయడంచేత దండి "ఛందోవిచితి" అనే ఛందః శాస్త్రగ్రంథం వ్రాసి ఉంటాడని కొందరి అభిప్రాయము. ఐతే అర్థశాస్త్రము, ఆపస్తంబధర్మసూత్రమూ మొదలైన కొన్ని ప్రాచీనగ్రంథాలలో కూడా "ఛందోవిచితి" ప్రస్తావం ఉండడంచేత ఇది దండి రచన కావలసిన పని లేదు. "మయా నిరూపితః" అని అనలేదు కదా? అందుచేత ఇది పింగళుని ఛందఃశాస్త్రమేనా కావాలి, మరొక ప్రాచీచ గ్రంథమేనా కావాలి.

ఇలాగే కావ్యాదర్శంలో మరొక చోట—

"ఇత్థం కలాచతుష్షష్టివిరోధః సాధు నీయతామ్
తస్యాః కలాపరిచ్ఛేదే రూపమావిర్భవిష్యతి"

అని వ్రాయడంచేత దండి "కలాపరిచ్ఛేదము" అనే గ్రంథం కూడా వ్రాసి ఉంటాడని కొందరి ఊహ. ఐతే ఇది "పరిచ్ఛేదము" అనే పేరును పట్టి చూడగా కావ్యాదర్శంలోని ఒక పరిచ్ఛేదం కావచ్చుననీ, ప్రస్తుతం మనకు లభించే కావ్యాదర్శంలో, అర్వాచీనులు కొందరు (మాలతీమాధవవ్యాఖ్యా "జగద్ధర"; కామసూత్రవ్యాఖ్య "జయమంగల" కావ్యాదర్శగతాలుగా చెప్పిన కొన్ని శ్లోకాలు కనబడకపోవడంచేత కావ్యాదర్శంలోని కొన్ని భాగాలు మనకు ఇప్పుడు లభ్యం కావడంలేదనీ చెప్పవచ్చు.

రామాయణమహాభారతకథలు రెండూ కూర్చిన ఒక ద్విసంధానకావ్యం దండి రచించినట్లుగా భోజుడు శృంగారప్రకాశలో, రెండు చోట్ల చెప్పి ఉన్నాడు. "దండినో ధనంజయస్య వా ద్విసంధానే" (7వ ప్రకాశ) "రామాయణమహాభారతయోర్దండి ద్విసంధానమివ" (9వ ప్రకాశ). దీనిని పట్టి దండి ద్విసంధాన కావ్య మొకటి రచించినట్లు తెలుస్తూన్నది.

ఇపుడు మనకు లభించే దశకుమారచరిత్ర కర్తృత్వం విషయంలో కూడా పండితులలో విప్రతిపత్తి ఉన్నది. దీనికి ప్రాచీనులు వ్రాసిన వ్యాఖ్యానం ఉత్తర భాగానికే దొరకుతూన్నది కాని పూర్వభాగానికి దొరకడం లేదు. అందుచేత ఉత్తరభాగం మాత్రమే దండి రచన అయి ఉండాలని కొందరి అభిప్రాయము. దండి రచించిన పూర్వ భాగం అలభ్యం కాగా కేతన తెలుగులోనికి చేసిన అనువాదాన్ని పట్టి ఎవరో మళ్లీ పూర్వభాగం సంస్కృతంలో వ్రాసి ఉంటారనీ, అందుచేతనే ఈ భాగంలో తెలుగునుడికారాలు ఎక్కువగా కలబడుతున్నాయనీ మానవల్లి రామకృష్ణకవిగారి అభిప్రాయం.

ఏమైనా అవంతిసుందరిలోని కథాభాగాలు దశకుమారచరిత్రలోను, దశకుమారచరిత్రలోని కథాభాగాలు అవంతిసుందరిలోనూ కలిసిపోయి ఉండడాన్ని బట్టి ఈ రెండింటిలో ఏదో ఒకటి, కావ్యాదర్శము, ద్విసంధానకావ్యము, ఈ మూడూ దండిరచించినా డని చెప్పడం యుక్తమని మా అభిప్రాయము.

<u>కావ్యాదర్శము</u> :- అర్వాచీనలిఖిత పుస్తకాలలోనూ, ముద్రితపుస్తకాలలోనూ 'కావ్యాదర్శం' అనే పేరు అధిక ప్రచారంలో ఉన్నా ఒక ప్రాచీనలిఖిత గ్రంథంలో దీనికి 'కావ్యలక్షణం' అనే పేరు ఉన్నది. అందుచేతనే సింహళదేశీయుడైన, రత్నశ్రీజ్ఞాన అనే ప్రాచీన బౌద్ధపండితుడు, 908 సం॥లో, దీనికి "కావ్యలక్షణరత్నశ్రీ" అనే పేరుతో వ్యాఖ్యానం వ్రాశాడు. ఈతని వ్యాఖ్య టిబెట్టుతో లభించిన కావ్యాదర్శం మూలాన్ని అనుసరించి ఉన్నది. "యథాసామర్థ్య మస్మాభిః క్రియతే కావ్యలక్షణం" అన్న వాక్యాన్ని బట్టి దండికి కూడా ఆ పేరే అభిమత మని తెలుస్తూన్నది. ఇప్పుడు ప్రసిద్ధిలో ఉన్న పేరు ఎప్పుడు, ఎలా

వచ్చినదో తెలియదు. "ఆదిరాజయశో బింబమాదర్శం ప్రాప్య వాఙ్మయమ్. తేషామసన్నిధానేపి న స్వయం పశ్య నశ్యతి" (కా. ఆ. I. 5) అనే శ్లోకంలో దండి - వాక్కు, అనగా కావ్యం, ఆదిరాజుల యశస్సుకు ఆదర్శంఅని వర్ణిస్తే, ఈ గ్రంథం కావ్యానికి ఆదర్శం అనే ఉద్దేశంతో ఎవరో తరువాతివారు దీనికి "కావ్యాదర్శం" అనే పేరు పెట్టినారేమో. ఇది కేవలం ఊహ.

కావ్యాదర్శంలో మొత్తం 660 శ్లోకాలు (చాలావరకు అనుష్టుప్పులు) ఉన్నాయి. మూడు పరిచ్ఛేదాలు. ప్రథమపరిచ్ఛేదంలో - గద్యము పద్యము, మిశ్రమూ అనే కావ్యభేదాలు, సర్గబంధలక్షణం చూపినతరవాత గద్యకావ్యంలో ఆఖ్యాయిక, కథ అనే ఇతరు లంగీకరించిన భేదాలు అంతగా ప్రధానమైనవి కావంటాడు దండి. వాఙ్మయము సంస్కృతం, ప్రాకృతం, అపభ్రంశం, మిశ్రం అని నాలుగు రకాలని విభజించి వైదర్భ - గౌడమార్గాలనూ, వాటికి సంబంధించిన పది గుణాలను పేర్కొని, వైదర్భమార్గం అత్యుత్తమ మైనదని ప్రతిపాదించాడు. అనుప్రాసను లక్షణోదాహరణలతో విశదీకరించి కావ్యరచనకి ప్రతిభ, శ్రుతి, అభియోగము (పట్టుదలతో అభ్యాసం చేయడము), అనే మూడూ చాలా అవసర మని ఈ పరిచ్ఛేదం పూర్తి చేశాడు.

వాఙ్మయాన్ని నాలుగు విధాలుగా విభజించిన ఆనాటి దండ్యాది ఆలంకారికుల దృష్టివైశాల్యాన్ని చూస్తే, వారే ఈ నాడు ఉంటే పాశ్చాత్య వాఙ్మయాదులతో కూడా పరిచయం ఏర్పరచుకొని వాటిని కూడా తమ శాస్త్రపరిధి లోనికి చేర్చుకొని ఉండేవా రని అనిపిస్తుంది. మా సాహిత్యం గొప్పదంటే మా సాహిత్యం గొప్పది అని నేడు కనబడే కీచులాటలు ఉండేవి కావు.

ద్వితీయపరిచ్ఛేదంలో 37 అలంకారాలను, అవాంతరభేదాలతో, సోదాహరణంగా విశదీకరించినాడు. (దండి - భామహ - వామనులు అంగీకరించిన అలంకారాల పేర్లు మా బాలానందినీసహిత వామన సూత్రాలంకారవృత్తిప్రస్తావనలో చూపబడినవి).

తృతీయపరిచ్ఛేదంలో యమకాల అతివిస్తృతవర్ణనము, కొన్ని చిత్ర బంధాల నిరూపణము చేసినతరువాత, 16 విధాల ప్రహేళికల లక్షణోదాహరణాలు, దోషాల లక్షణోదాహరణాలు చూపబడినాయి. ఈ విధంగా కావ్యాదర్శం అతిసరళమైన శైలిలో చక్కని ఉదాహరణలతో రచింపబడింది.

దండి అటు అలంకారాలకీ, ఇటు గౌడీవైదర్భీమార్గాలకీ, వాటికి సంబంధించిన గుణాలకీ కూడా తన గ్రంథంలో సమప్రాధాన్యం ఇచ్చినాడు. తరువాత వామనుడు మార్గానికి 'రీతి' అనే క్రొత్త పేరు పెట్టి పాంచాలీరీతిని కూడా చేర్చి, రీతియే కావ్యాత్మ అనే క్రొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు.

క్రీ. శ. 815-875 సంవత్సరాలలో రాజ్యం చేసిన రాష్ట్రకూట వంశీయుడైన నృపతుంగుడు (అమోఘవర్షుడు) కావ్యాదర్శాన్ని పూర్తిగా ఆధారంగా చేసికొని, కన్నడభాషలో "కవిరాజమార్గం" అనే అలంకారశాస్త్రగ్రంథం రచించినాడు. ఇది చాలావరకు కావ్యాదర్శానువాదం అని చెప్పవచ్చు. సింహళదేశరాజు సిరిసిలమేఘసేనుడు (క్రీ. శ. 8౩౩-8౫1) సియభాసలకార (స్వీయభాషాలంకార) అనే పేరుతో కావ్యాదర్శాన్ని అనువదించాడు. దీనిని వాస్తవంలో రచించినవాడు క్రీ. శ. 741 సంవత్సరంలో సింహాసనానికి వచ్చిన 'అక్బో' అనే రాజు అని ఒక అభిప్రాయం ఉన్నది. దీన్ని బట్టికూడా కావ్యాదర్శం అతిప్రాచీనమైనదనడానికి చాలా అవకాశాలు ఉన్నాయి. కావ్యాదర్శానికి వ్రాసిన అనేక వ్యాఖ్యానాలలో చెప్పుకోదగినవి- తరుణవాచస్పతి వ్రాసిన వ్యాఖ్య, అజ్ఞాతకర్తృకమైన "హృదయంగమ" అనే వ్యాఖ్య, రత్నశ్రీ రచించిన "కావ్యలక్షణరత్నశ్రీ" అనే వ్యాఖ్య, హరినాథుడు రచించిన 'మార్జన' వ్యాఖ్య, కృష్ణకింకరతర్కవాగీశుడు రచించిన "కావ్యతత్త్వవివేచకకౌముది", వాదిఘంఘలుడు వ్రాసిన 'శ్రుతానుపాలిని', జగన్నాథుని కుమారుడైన మల్లినాథుడు రచించిన "వైమల్యవిధాయిని" విజయానంద-యామునులు వ్రాసిన రెండు వ్యాఖ్యలు. ఇవి కాకుండా ఇంకా కొన్ని అర్వాచీనుల వ్యాఖ్యల పేర్లు కూడా వినవస్తున్నాయి.

దండిభామహుల పౌర్వాపర్యము :- దండి ముందువాడా భామహుడు ముందువాడా అనేది సులభంగా తేలని ప్రశ్న. కొన్ని భామహవాక్యాలను చూచి నప్పుడు అతడు దండి అభిప్రాయాలను నిర్దేశిస్తున్నట్లూ, కొన్ని దండి వాక్యాలను చూచినప్పుడు ఆతడు భామహుని అభిప్రాయాలను నిర్దేశిస్తున్నట్లూ కనబడుతుంది: దండి భామహుల గ్రంథాలలో సమానపదవిన్యాసమూ, సమార్థము గల ఎన్నో వాక్యాలు కనబడతాయి. వాటి పరిశీలనం రోచకంగా ఉంటుంది :-

| కావ్యాదర్శము | కావ్యాలంకారము |
|---|---|
| 1. నైసర్గికీ చ ప్రతిభా శ్రుతం చ బహునిర్మలమ్. అమన్దశ్చాభియోగోస్యాః కారణం కావ్యసంపదః (I. 103) | కావ్యం తు జాయతే జాతు కస్యచిత్ ప్రతిభావతః (I. 5) శబ్దాభిధేయే విజ్ఞాయ కృత్వా తద్విదుపాసనామ్. విలోక్యాన్యనిబంధాంశ్చ కార్యః కావ్యక్రియాదరః (I. 10) |
| 2. తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన. స్యాద్వపుః సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్. (I. 7) | 2. సర్వథా పదమప్యేకం న నిగాద్యమవద్యవత్. విలక్ష్మణా హి కావ్యేన దుఃసుతేనేవ నింద్యతే. (I. 11) |
| 3. సర్గబంధో మహాకావ్యమ్. (I. 14) | 3. సర్గబంధో మహాకావ్యమ్ (I. 19) |
| 4 చతుర్వర్గఫలాయత్తం (I. 15) | 4. చతుర్వర్గాభిధానేపి భూయసార్థోపదేశకృత్. (I. 21) |
| 5. మంత్రదూతప్రయాణాజినాయకాభ్యుదయైరపి. (I. 17) | 5. మంత్ర దూతప్రయాణాజి నాయకాభ్యుదయైశ్చ యత్ (I. 20) |
| 6. గుణతః ప్రాగుపన్యస్య నాయకం తేన విద్విషామ్. నిరాకరణమిత్యేష మార్గః ప్రకృతిసుందరః.వంశవీర్య | 6. నాయకం ప్రాగుపన్యస్య వంశవీర్య శ్రుతాదిభిః. న తస్యైవ వధం బ్రూయాదన్యోత్కర్షాభిధిత్సయా. యది |

| కావ్యాదర్శము | కావ్యాలంకారము |
| --- | --- |
| శ్రుతాదీని వర్ణయిత్వా రిపోరపి. తజ్జయాన్నాయకోత్కర్షకథనం చ ధినోతి నః (I. 21, 22) | కావ్యశరీరస్య న స వ్యాపయితేష్యతే న చాభ్యుదయభాక్తస్య ముధాదౌ గ్రహణం స్తవే." (I. 22-23) |
| 7. "మిశ్రాణి నాటకాదీని తేషామన్యత్ర విస్తరః" (I. 31) | 7. "నాటకం... తదభినేయార్థ ముక్తోన్యైస్తస్య విస్తరః" (I. 24) |
| 8. "తదేతద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా. అపభ్రంశశ్చ మిశ్రం చేత్యాహురార్యాశ్చతుర్విధమ్." (I. 32) | 8. "సంస్కృతం ప్రాకృతం చాన్యదపభ్రంశ ఇతి త్రిధా". (I. 16) |
| 9. "లాస్యచ్ఛలితశమ్యాది ప్రేక్షార్థమ్" (I. 39) | 9. "నాటకం ద్విపదీ శమ్యా రాసకస్కన్ధకాది యత్. ఉక్తం తదభినేయార్థమ్" (I. 24) |
| 10. "శిథిలం మాలతీమాలా లోలాలికలిలా యథా" (I. 43) | 10. "గ్రామ్యానుప్రాసం... సలోలమాలావిలాలి కులాకులగలో బలః" (II. 6) |
| 11. "ఉక్తిః సంక్షేపరూపత్వాత్ సా సమాసోక్తి రిష్యతే" (II. 205) | 11. "సాసమాసోక్తిరుద్దిష్టా సంక్షిప్తార్థతయా యథా" (II. 79) |
| 12. వివక్షా యా విశేషస్య లోకసీమాతివర్తినీ. అసావతిశయోక్తిః స్యాదలంకారోత్తమా మతా" (II. 214) | 12. "నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాంత గోచరమ్. మన్యన్తేతిశయోక్తిం తాం... (II. 81) "సైషా (అతిశయోక్తిః) సర్వైవ |

| కావ్యాదర్శము | కావ్యాలంకారము |
|---|---|
| | వక్రోక్తిః అనయార్థో విభావ్యతే, ...కోలంకారోనయా వినా" (II. 85) |
| 13. "హేతుశ్చ సూక్ష్మలేశౌ చ వాచా ముత్తమభూషణమ్" (II. 235) | 13. హేతుశ్చ సూక్ష్మో లేశోథ నాలంకారతయామతః. సముదా యాభిధానస్య వక్రోక్త్య నభిధానతః" (II. 86) |
| 14. గతోస్తమర్కో భాతీన్దు ర్యాన్తి వాసాయ పక్షిణః. ఇతీదమపిసా ధ్వేవ కాలావస్థా నివేదనే. (II. 244) | 14. "గతో స్తమర్కో భాతీన్దుర్యాన్తి వాసాయ పక్షిణః. ఇత్యేవమాది కిం కావ్యం వార్తామేనాం ప్రచక్షతే" (II. 87) |
| 15. అద్య యా మమ గోవిన్ద జాతా త్వయి గృహాగతే. కాలేనైషా భవేత్ప్రీతి స్తవైవాగమనాత్పునః. ఇత్యాహ యుక్తం విదురః... (II. 276-77) | 15. కృష్ణ పవాదీ ద్విదురో యథా. అద్య యా మమ గోవిన్ద జాతా త్వయి గృహాగతే. కాలేనైషా భవేత్ప్రీతిస్త వైవాగమనాత్ పునః (III. 4-5) |
| 16. "ఆశయస్య విభూతేర్వా యన్మహత్త్వమ నుత్తమమ్. ఉదాత్తమ్..." గురోః శాసనమత్యేతుం న శశాక స రాఘవః. యో రావణ శిరచ్ఛేద కార్యభారేఽప్య విక్లవః" "రత్నభిత్తిషు సంక్రాన్తైః ప్రతిబింబశతైర్వృతః. జ్ఞాతో | 16. "ఉదాత్తం శక్తిమాన్ రామో గురు వాక్యానురోధకః. విహాయో పపనం రాజ్యం యథా వనముపాగమత్". "ఏతదేవాపరేన్యేన వ్యాఖ్యానే నాన్యథా విదుః. నానారత్నాది యుక్తం యత్తత్కిలోదాత్తముచ్యతే." "చాణక్యం నక |

| కావ్యాదర్శము | కావ్యాలంకారము |
| --- | --- |
| లజ్జేశ్వరః క్వచిత్ప్రాంజనే యేన తత్త్వతః" (II. 300-303) | ముపయాన్నచ్ఛ్రీడాగృహం యథా. శశికాన్తోపలచ్ఛన్నం వివేద పయసాం గణైః (II. 11-13) |
| 17 "న కఠోరం న వా తీక్ష్ణమాయుధం పుష్పధన్వనః. తథాపి జితమేవాసీదమునా భువనత్రయమ్." (II. 321) | 17. స ఏకస్త్రీణి జయతి జగన్తి కుసుమాయుధః. హరతాపి తనుం యస్య శంభునా న హృతం బలమ్. (II. 24) |
| 18. అప్రస్తుత ప్రశంసా స్యాదప్రక్రాన్తేషు యా స్తుతిః (II. 340) | 18. అధికారాదపేతస్య వస్తునోన్యస్య యా స్తుతిః. అప్రస్తుతప్రశంసా" (III. 29) |
| 19. అపార్థం వ్యర్థమేకార్థం ససంశయమపక్రమమ్. శబ్దహీనం యతిభ్రష్టం భిన్నవృత్తం విసన్ధికమ్. దేశకాలకలాలోక న్యాయాగమ విరోధి చ. ఇతి దోషాః దశైవేతే వర్జ్యాః కావ్యేషు సూరిభిః. ప్రతిజ్ఞాహేతుదృష్టాన్తహానిర్దోషో న వేత్యసౌ. విచారః కర్కశః ప్రాయస్తేనాలీఢేన కిం ఫలమ్ (III. 125-127) | 19. అపార్థం వ్యర్థమేకార్థం ససంశయమపక్రమమ్. శబ్దహీనం యతిభ్రష్టం భిన్నవృత్తం విసన్ధి చ. దేశకాలకలలోక న్యాయాగమ విరోధి చ. ప్రతిజ్ఞాహేతు దృష్టాన్తహీనం దుష్టంచ నేష్యతే (IV.-1-2) |
| 20. సముదాయార్థశూన్యం యత్తదపార్థకమిష్యతే (III. 128) | 20 "సముదాయార్థశూన్యం యత్తదపార్థకమిష్యతే" (IV. 8) |

| కావ్యాదర్శము | కావ్యాలంకారము |
|---|---|
| 21. "ఏకవాక్యే ప్రబన్ధే వా పూర్వాపరపరాహతమ్. విరుద్ధార్థతయా వ్యర్థమ్" (III. 131) | 21. విరుద్ధార్థం మతం వ్యర్థం విరుద్ధం తూపదిశ్యతే. పూర్వాపరార్థవ్యాఘాతా ద్విపర్యయకరం యథా (IV. 9) |
| 22 "ఉత్కామున్మనయన్త్యేతే" (III. 136) | 22. "తాముత్కమనసం కరోతి" (IV. 16) |
| 23. నిర్ణయార్థం ప్రయుక్తాని సంశయం జనయన్తి చేత్. వచాంసి దోష ఏవాసౌ (III. 139) | 23. "ఇష్టం నిశ్చితయే వాక్యం న దోలాయేత" (IV. 18) |
| 24. కన్యాహరణసంగ్రామవిప్రలంభోదయాదయః (I. 29) | 24. కన్యాహరణసంగ్రామ విప్రలంభోదయాన్వితాః (I. 27) |
| 25. తద్భావికమితి ప్రాహుః ప్రబన్ధవిషయే గుణమ్ (II. 364) | 25. భావికత్వమితి ప్రాహుః ప్రబన్ధవిషయం గుణమ్ (III. 53) |
| 26. ఆక్షేపోర్థాన్తరన్యాసో వ్యతిరేకో విభావనా (II. 4) | 26. "ఆక్షేపోర్థాన్తరన్యాసో వ్యతిరేకో విభావనా" (II. 6) |
| 27. ప్రేయోరసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితమ్ (II. 5) | 27. ప్రేయో రసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితమ్. (III. 1) |

పైన చూపిన ఉద్ధరణలలో చాలా చోట్ల శబ్దార్థసామ్యమూ, కొన్ని చోట్ల అర్థసామ్యమూ గోచరిస్తున్నాయి. దీనిని బట్టి దండి భామహులలో ఎవరు ముందు అనే ప్రశ్న బయలుదేరింది. ఒకరి మతాన్ని మరొకరు ఖండిస్తున్నట్లు కొన్ని ప్రదేశాలలో కనబడుతున్నది. అందుచేత "దండి భామహు లిద్దరికీ కూడా ఒకరి గ్రంథాన్ని గూర్చి మరొకరికి తెలియదు. తమకంటె పూర్వం ఉన్న వాది

మతాలనే వీరు తమ గ్రంథాలలో ఉట్టంకించారు" అని చెప్పడం అంతగా శ్రమ పడకుండా చెప్పే సమాధానము పి. వి. కాణే గారు ఎన్నో యుక్తులు చూపి భామహుని కంటే దండియే ప్రాచీను డని చెప్పడానికి ఎక్కువ అవకాశా లున్నాయనీ, దండి ఎక్కడనైనా భామహుని అభిప్రాయాలను ఖండిస్తున్నట్లుగా కనిపించేవి వాస్తవానికి ప్రాచీనుల వెవరివో అయి ఉంటా యనీ సప్రమాణంగా నిరూపించారు. ఈ విషయాన్ని గూర్చి చర్చించేముందు, భామహుడు బౌద్ధుడా లేక వైదికమతావలంబియా అనే వి ష యా న్ని గూర్చి తెలుసుకోవడం అప్రస్తుతం కాదు.

భామహుని తండ్రి రక్రిలగోమి. ఈ పేరుకి 'రాహుల' 'పోతల' 'సోమిల' మొదలైన బౌద్ధనామధేయాలతో సామ్యం ఉండడంచేత భామహుడు బౌద్ధుడై ఉంటాడని కొందరి అభిప్రాయము అది యుక్తంగానే కనబడుతుంది. అన్నింటికంటే ప్రబలమైన ప్రమాణం కావ్యాలంకారంలోని మంగళ శ్లోకము:-

"ప్రణమ్య సార్వం సర్వజ్ఞం మనోవాక్కాయకర్మభిః
కావ్యాలంకార ఇత్యేష యథాబుద్ధి విధాస్యతే".

అనే శ్లోకంలో భామహుడు నమస్కరించినది బుద్ధునికే. 'సర్వజ్ఞ' శబ్దానికి శివుడనే అర్థం కూడా ఉన్నది కాబట్టి శివు డని అర్థం చెప్పాలి అనే వాదం సమంజసంగా లేదు. ఈ శబ్దాన్ని నిరుపపదంగా శివుడనే అర్థంలో ప్రయోగించడం అలవాటులో లేదు. శివుణ్ణి ఉద్దేశించినట్లైతే "జగదుత్పత్తిస్థితిలయకారణభూతుడు" వంటి విశేషణాలతో పాటు 'సర్వజ్ఞ' శబ్దాన్ని కూడా ప్రయోగిస్తే ప్రయోగించవచ్చును కాని ఈ విధంగా, విశేష్యంగా ప్రయోగించడము, "సర్వస్యహితః సార్వః" అనే అర్థంలో "సర్వపురుషాభ్యాం ణఢఞౌ" (పా. సూ. V. 1-10) అనే సూత్రంచేత ణప్రత్యయం చేయగా నిష్పన్న మైన 'సార్వ' శబ్దాన్ని విశేషణంగా ప్రయోగించడం ఇదంతా బుద్ధుడనే అర్థం చెప్పినప్పుడే సమంజసంగా ఉంటుంది. 'సార్వ' శబ్దానికి బుద్ధుడు జినుడు అనే అర్థాలు ఉన్నట్లు హేమచంద్రుడు అభిధాన చింతామణిలో చెప్పినట్లు నిఘంటువులవల్ల తెలుస్తూన్నది.

"సర్వ శబ్దానికి పైన చెప్పిన అర్థంలో 'ఞ' ప్రత్యయమే కాకుండా భాష్యేష్టిని పట్టి 'ఛ' ప్రత్యయం కూడా వచ్చి 'సర్వీయ' అనే రూపం కూడా అవుతుందని భామహుడే చెప్పినాడు (VI. 53). అంతకు పూర్వమే చాంద్రవ్యాకరణంలో ఈ భాష్యేష్టిని దృష్టిలో ఉంచుకొని "సర్వాణ్ణోవా" అనే సూత్రంచేత ఛప్రత్యయం కూడా విధించి, "సర్వస్మై హితం సార్వమ్; సర్వీయం" అని రెండు రూపాలు సాధింపబడినవి.

"సిద్ధం ప్రణమ్య సర్వజ్ఞం సర్వీయం జగతో గురుమ్" అని చాంద్రవ్యాకరణ మంగళాచరణ శ్లోకానికీ ఈ శ్లోకానికీ సన్నిహితత్వం కనిపిస్తుంది అందుచేత ఇతర ప్రమాణాల అపేక్ష ఏమీ లేకుండానే ఈ మంగళ శ్లోకాన్ని బట్టి భామహుడు బౌద్ధు డని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఇతడు వైదికమతావలంబి అని చెప్పేవారు ప్రధానంగా రెండు విషయాలను ప్రమాణంగా చూపుతారు. ఈతడు రామాయణ మహాభారతాదులలోని కథలను, కథానాయకులనూ చాలాచోట్ల సాదరంగా ఉదాహరించినాడనేది ఒకటి, బౌద్ధుల అపోహవాదాన్ని ఖండించినా డనేది మరొకటి. నేను బుద్ధుడికి నమస్కరిస్తున్నాను అని అతడే స్పష్టంగా చెప్పుకున్న తరవాత ఈ వాదాలన్నీ సారవంతంగా కనబడవు. అందరికీ తెలియడం కొరకై కావ్యలక్షణగ్రంథం వ్రాస్తున్నవాడు ఉదాహరణలు కూడా అందరికీ తెలిసేవి, ప్రచారంలో ఉండేవి ఇవ్వడం సహజమే. బౌద్ధుడైనంతమాత్రాన మాట వచ్చినప్పుడల్లా వైదిక ఇతిహాసపురాణాదులను దూషిస్తాడనుకోవడం పొరబాటు. వ్యాకరణాది శాస్త్రాలలో ఉద్గ్రంథాలు వ్రాసిన కాశికా న్యాసకారాదులైన బౌద్ధుల గ్రంథాలు చూస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది. అశ్వఘోషుని కావ్యాలలో అడుగడుగునా ఇతిహాసపురాణగాథలు కోకొల్లలుగా కనబడతాయి. నిజానికి, కొన్నిచోట్ల భామహుని మాటలలో కొంచెం అవహేళన లేకపోలేదు ధర్మ-అర్థ-కామాలకి బాధ కలిగించే ప్రతిజ్ఞ మంచిది కాదన్నట్లుగా చెపుతూ-ప్రాయోప్రవేశం చేసి ప్రాణాలు వదులుతాను అని ప్రతిజ్ఞచేసి రాజ్యం కొరకై దానిని విడిలిపెట్టిన దుర్యోధనుని ప్రతిజ్ఞ ధర్మబాధిని అనీ, జూదానికి ఎవరు పిలిచినా వెళ్ళితీరుతాను అని ధర్మరాజు చేసిన ప్రతిజ్ఞ అర్థబాధిని అనీ,

వివాహమాడ నని భీష్ముడు చేసిన ప్రతిజ్ఞ కామబాధిని అనీ, అందుచే ఇవి ప్రతిజ్ఞాభాసము లనీ అంటాడు (V. 41-44).

భామహుడు అపోహవాదాన్ని ఖండించినాడనేది కూడా అతడు బౌద్ధుడు కాదనడానికి బలమైన కారణం కాదు. భామహుడు చాలావరకు నిష్పాక్షికదృష్టి గల విమర్శకుడు. అతని దృష్టికి అపోహవాదం అర్థరహితంగా కనిపించింది. ఆ విషయం నిస్సందేహంగా చెప్పినాడు. ఇంతకీ ఈ అపోహవాదం బౌద్ధమత ప్రధానసిద్ధాంతానికి ప్రత్యక్షంగా సంబంధించినది కాదు. బౌద్ధుడై ఉండి కూడా ఖండించినాడనే కోపం కాబోలు శాంతరక్షితుడు భామహుణ్ణి "దురాత్మా" ఇత్యాది విశేషణాలతో తీవ్రంగా దూషించినాడు. భామహుడు అపోహవాదాన్ని ఎంతగా ఖండించాడో అంత తీవ్రంగానూ స్ఫోటవాదాన్ని కూడా ఖండించినాడు. ఒట్టు పెట్టి చెప్పినా కూడా స్ఫోటవాదాన్ని నమ్మవద్దంటాడు-"

"శపథైరపి చాదేయం వచో న స్ఫోటవాదినామ్.
నభఃకుసుమమస్తీతి శ్రద్ధధ్యాత్కః సచేతనః" (VI. - 12)

ప్రత్యక్షాది లక్షణాలూ, హేత్వాదిస్వరూపాలూ నిరూపించేటప్పుడు ఇతడు బౌద్ధ న్యాయగ్రంథాలైన దిఙ్నాగుని ప్రమాణ సముచ్చయము, ధర్మకీర్తి న్యాయబిందువు మొదలైన వాటినుంచి విషయం గ్రహించి ఉన్నాడు. ఇదీ ఇతని బౌద్ధత్వానికి ఉపోద్బలకము.

భామహునికి పాణినీయవ్యాకరణం విషయంలో అపారమైన గౌరవం ఉన్నది. (చూ. VI. 2-5, 62, 63). మన చాంద్ర వ్యాకరణాదులు ఉండగా ఎందుకు ఇలా పాణినీయాన్ని పట్టుకొని పాకులాడుతున్నావు అని తోటి వాళ్లెవరో అన్నారు కాబోలు- "ఇది మిగిలిన శాస్త్రాలవంటిది కాదు. అన్నింటికీ ఉపయోగించేదీ, మాధ్యస్థ్యం వహించగలిగినదీ అయిన శాస్త్రం" అని పాణినీయాన్ని ప్రశంసిస్తాడు:-

"విద్యానాం సతతమపాశ్రయోఽపరాసాం
తాసూక్తాన్న చ విరుణద్ధి కాంశ్చిదర్థాన్.
శ్రద్ధేయం జగతి మతం హి పాణినీయం
మూర్ధ్యస్థ్యాద్భవతి న కస్యచిత్ ప్రమాణమ్" (VI. 63)

కాళిదాసు అచేతనమైన మేఘాన్ని దూతగా పంపడంలోనూ, భాసుడు ప్రతిజ్ఞాయౌగంధరాయణంలో ఒక్క ఉదయనుడు ఏనుగును పట్టుకొనడానికి వెళ్లినాడనీ, ఒంటరిగా ఎంతో మందిని హతమార్చినాడనీ వర్ణించడంలోనూ ఉచితజ్ఞత్వం లేదని బాహాటంగా విమర్శిస్తాడు ఏదో అపశబ్దాన్ని చూపించి ఇది వ్యాకరణ విరుద్ధంగా ఉన్నదని ఏ కవినైనా విమర్శించడం వేరు, అసలు కథా సంవిధానం మీదనే దెబ్బతీయడం కోసం ప్రయత్నించడం వేరు. ఇతడు బౌద్ధుడు అవడంచేతనే భాస కాళిదాసులంతటివారిని ఆ విధంగా ఆక్షేపించ కలిగినాడు.

పాణిని వ్యాకరణంలోని కొన్ని మంచి (మారుమూల) ప్రయోగాలకీ, తన కాలంనాటికి ప్రచారంలోనికి వచ్చిన కొన్ని అలంకారాలకీ ఉదాహరణలు చూపాలనే ప్రధానోద్దేశ్యంతో 'రావణవధ' అనే కావ్యం వ్రాసిన భట్టి (క్రీ.శ. 590-650) - "ఈ కావ్యంలో ఉన్న స్వారస్యం గ్రహించాలంటే పఠిత మంచి శాస్త్రప్రవేశం ఉన్నవాడు కావాలి. లేదా వ్యాఖ్యాసాహాయ్యం తీసుకోవాలి" అని యథార్థ కథన దృష్టితోటే అన్నాడు.

"వ్యాఖ్యాగమ్యమిదం కావ్యముత్సవః సుధియామలమ్.
హతా దుర్మేధసశ్చాస్మిన్ విద్వత్ప్రియతయా మయా"

(భట్టి కావ్యం 22.34)

దీనికి కొంచెం విపరీతార్థం కల్పించి భామహుడు-

"కావ్యాన్యపి యదీమాని వ్యాఖ్యాగమ్యాని శాస్త్రవత్.
ఉత్సవః సుధియామేవ హన్త దుర్మేధసో హతాః" (II. 20)

అని అంటూ దుర్బోధాలైన యమకప్రహేళికాదిరూపకావ్యాలను గూర్చి చెప్పే టప్పుడు ఆక్షేపించాడు. ఇలాంటి వన్నీ చూడగాను, ప్రధానంగా మంగళ శ్లోకాన్ని పట్టికూడా భామహుడు బౌద్ధుడే అని నిశ్చితంగా చెప్పవచ్చును.

శ్రీ కాణే గారు, దండి- భామహుల పౌర్వాపర్యాన్ని నిర్ణయించడానికి వారి రచనలలోని సామ్యవైషమ్యాలనూ, తదితరవిషయాలనూ, చక్కగా, అతి విస్తృతంగా ప్రతిపాదించి ఉన్నారు.

క) చాలామంది ఆలంకారికులు పూర్వాచార్యులనుగూర్చి వ్రాసేటప్పుడు భామహుణ్ణి ముందుగా పేర్కొన్నా, ఇలాంటివారి అందరికంటే ప్రాచీనుడైన నమిసాధువు (క్రీ.శ. 1069) రుద్రటుని కావ్యాలంకారానికి వ్రాసిన వ్యాఖ్యలో (1-2) "నను దండి మేధావి రుద్రభామహాది కృతాని సన్త్యేవాలంకార శాస్త్రాణి" అని వ్రాస్తూ దండిని భామహునికంటె, భామహునిచేతనే పేర్కొనబడిన మేధావి రుద్రునికంటె కూడా ముందు పేర్కొన్నాడు. భామహునికంటె దండిని ముందు పేర్కొన్నవారు కూడా కొందరు ఉన్నారు అని చెప్పడానికే కాని ఇది పౌర్వాపర్యనిర్ణయంలో ప్రబల ప్రమాణం అనే అభిప్రాయంతో కాదు.

ఖ) భామహుడు ఐదు యమకభేదాలను మాత్రమే చెప్పగా దండి ప్రత్యేకంగా ఒక పరిచ్ఛేదం వినియోగించి అనేక యమకభేదాలనూ, శబ్దాలంకారాలనూ, శబ్ద చిత్రాదులనూ కూడా ప్రతిపాదించి ఉన్నాడు. ఎక్కువ భేదాలను చెప్పడం అర్వాచీనత్వానికి సూచకం అనడానికి వీలు లేదు. భరతుడు పది యమకభేదాలు చెప్పగా భామహుడు ఐదు మాత్రమే చెప్పినంత మాత్రాన భరతునికంటె భామహుడు ప్రాచీనుడని అనగలమా? ఇంక నేమనగా పూర్వం ఈ శబ్దాలంకారాదుల విషయంలో ఎక్కువ మక్కువ ఉండేదని చెప్పాలి. రుద్రదామ శిలాలేఖాదులలోని భాషనూ, రఘువంశ నవమసర్గాదులను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది. దండి చేసిన వివిధ ఉపమాభేద నిరూపణం భరతుని పద్ధతికి చాలా దగ్గరగా ఉన్నది (చూ.నా.శా. 17-44-55) భామహుడు వ్యాకరణ విశేషాలను పట్టి ప్రప్రథమంగా ఉపమాభేదాలు కల్పించగా, ఉద్భట మమ్మటాదులు దానిని అనుసరించినారు.

గ) తరుణవాచస్పతివంటి కొందరు కావ్యాదర్శ వ్యాఖ్యాతలు దండి భామహమతాన్ని ఖండిస్తున్నట్లు అక్కడక్కడ వ్రాసినా పౌర్వాపర్యనిర్ణయంలో వారిని ప్రమాణంగా తీసికొనవలసిన పని లేదు. ఇతర ప్రమాణాలద్వారా పౌర్వాపర్యం స్పష్టంగా తెలిసిన కొందరి విషయంలో వ్యాఖ్యాతలు పూర్వుణ్ణి పరుడనడం, పరుణ్ణి పూర్వుడనడం ఉన్నది.

ఘ) కథకు ఆఖ్యాయికకు భేదం ఉన్నదని భామహుడు ప్రతిపాదించగా దండి అలాంటి భేదం అనావశ్యకం అంటాడు. ఐతే ఇలాంటి భేదం బాణభట్టాదులకూ, అంతకు పూర్వం పతంజలి మొదలైనవారికీ కూడా తెలిసినట్లు సూచనలు ఉన్నాయి. అందుచేత దండి భామహుణ్ణి కాక అంతకంటె ప్రాచీనుడైన మరెవరినో దృష్టిలో ఉంచుకొని ఈ భేదాన్ని నిరాకరించాడు అని చెప్పాలి

జ) దండి నాలుగు ఉపమాదోషాలు మాత్రమే చెప్పగా, భామహుడు మేధావి అనే ఒక ప్రాచీనాలంకారికుని అభిప్రాయం ఉట్టంకిస్తూ ఏడు దోషాలను అంగీకరించినాడు.

చ) "గతో஽స్తమర్కో భాతీన్దుర్యాన్తి వాసాయ పక్షిణః" ఇత్యాది వాక్యాలుకూడా కాలాన్ని అవస్థావిశేషాదులను బోధించడానికి ఉపయోగించినపుడు యుక్తమైనవే" అని దండి అంటే (II. 244) "ఇదికూడా కావ్యమేనా? దీనిని 'వార్త' అంటారు" అని భామహుడు అన్నాడు II. 87). "ఇతీదమపి" ఇత్యాది పదాలను చూడగా దండి ఈ వాక్యాన్ని ప్రాచీనవాక్యంగా ఉదాహరిస్తున్నట్లు తెలుస్తూన్నది. భట్టి 'వార్త' అనే ఒక అలంకారానికి ఉదాహరణం ఇచ్చినట్లు (X. 45) జయమంగలావ్యాఖ్య ద్వారా తెలుస్తూన్నది. కాంతి గుణాన్ని గూర్చి వ్రాసే సందర్భంలో దండి "తచ్చ వార్తాభిధానేషు వర్ణనాస్వపి దృశ్యతే" (I. 85) అన్న ఈవాక్యంలో ఈ 'వార్త'ను గూర్చియే ఉట్టంకించి ఉంటాడు. ఐతే దండి వార్తకు లక్షణోదాహరణాలు ఇవ్వలేదు. ఇదిస్వభావోక్తిలో చేరుతుందని అతని అభిప్రాయం కావచ్చును.

ఛ) ప్రేయోలంకారానికి లక్ష్యంగా దండి ఇచ్చిన "అద్య యా మను గోవిన్ద" ఇత్యాది శ్లోకాన్నే (II. 276) భామహుడు కూడా గ్రహిస్తాడు. భామహుడు ఈ అలంకారానికీ (మరికొన్ని అలంకారాలకీ) లక్షణం చెప్పకుండా లక్ష్యం ఇవ్వడం చూడగా దండ్యాచు లిచ్చిన లక్షణాలే తనకు సమ్మత మవడం చేత ఇవ్వలేదని కాని, 'కావ్యాలంకారం' మనకు పూర్తిగా లభించ లేదని కాని చెప్పవలసి ఉంటుంది.

జ) భామహుడు ఉపమారూపక—ససందేహ-అనన్వయ-ఉత్ప్రేక్షావయవ అలంకారాలను స్వతంత్రాలంకారాలుగా పరిగణించగా, (III. 35,43,45,47) ఉపమారూపకం రూపకాలంకారంలోను, ససందేహ అనన్వయాలు ఉపమాలంకారంలోను, ఉత్ప్రేక్షావయవం ఉత్ప్రేక్షలోను అంతర్గతమైనట్లు దండి చెప్పినాడు. (II. -358-59). భామహునికి పూర్వమే భట్టి మొదలైనవాళ్లు ఈ అలంకారాలు చెప్పి ఉండడంచేత వారిని దృష్టిలో ఉంచుకొని ఇవన్నీ పై అలంకారాలలోనే అంతర్గతం అవుతాయి కాబట్టి నేను వేరుగా చెప్పలేదు అని దండి అన్నాడు కాని భామహుని గ్రంథం చూచి కాదు. భామహుని గ్రంథమే చూచి ఉంటే ఆతడు చెప్పినట్లు అన్యోన్యోపమకు బదులు ఉపమేయోపమనే చెప్పి ఉండేవాడు. దండి చెప్పిన అన్యోన్యోపమకు భామహుడు ఉపమేయోపమ అని పేరు పెడితే తరవాతివారు ఆ పేరే అంగీకరించినారు.

ఝ) దండి చెప్పిన పది దోషాలనే భామహుడు కూడా చెప్పి "ప్రతిజ్ఞా హేతుదృష్టాన్త హీనం దుష్టం చ నేష్యతే" అని ఒక పదకొండవ దోషం చెప్పినాడు. "ప్రతిజ్ఞాహేతుదృష్టాంతాది హీనత్వాదులు చాలా నీరసమైన విషయాలు. వీటిని కావ్యంలో చెప్పి ఏమి ప్రయోజనము" అని దండి అంటాడు (III. 127) ఇది "న్యాయాదపేతం విజ్ఞేయం ప్రమాణపరివర్జితమ్" ఇత్యాది వాక్యాలలో నాట్యశాస్త్రంలోనూ. తదితర గ్రంథాలలోనూ చెప్పినదాన్ని గూర్చి దండి అని ఉండవచ్చు. భామహుని గ్రంథాన్నే చూచి చెప్పేడనడానికి దృఢప్రమాణం ఏమీ లేదు.

ఞ) దండి పరిహారికా ప్రహేళికకి ఉదాహరణగా ఇచ్చిన "విజితాత్మభవ ద్వేషి గురుపాదహతో జనః. హిమాపహామిత్రధరైర్వ్యాప్తం వ్యోమాభినన్దతి" అనే శ్లోకంలోని (III. 120) భాగాన్ని భామహుడు అవాచకత్వదోషానికి ఉదాహరణగా చూపించినాడు:- "హిమాపహామిత్రధరైర్వ్యాప్తం వ్యోమేత్యవాచకమ్"

(I. 41)

ట) దండికి పూర్వం కూడా అనేక మార్గాలు ఉండి ఉండాలి. వాటిలో గౌడ-వైదర్భమార్గాలను రెండింటిని పేర్కొని వైదర్భమార్గం చాలా ఉత్తమమైనదని దండి ప్రతిపాదించగా, ఆ రెండింటిలో ఒకటి మంచిదనీ, మరొకటి కాదనీ చెప్పడం సమంజసం కాదని భామహుడు కొంచెం అవహేళనగా అంటాడు.

ఠ) భరతుడు చెప్పిన పది గుణాలనూ (నా.శా. 17.96) దండి అంగీకరించగా (I. 41-42) భామహుడు మూడు గుణాలు మాత్రమే అంగీకరించినాడు (II. 1-3). భామహుని తరవాత వచ్చిన వామనుడు రీతిప్రాధాన్యవాది అవడం చేత, దండి చెప్పిన గుణాల నన్నింటినీ అంగీకరించగా, ఆనందవర్ధనాదులు మూడింటినే అంగీకరిస్తూ భామహుణ్ణి అనుసరించినారు.

డ) దండి నిందోపమ, ప్రశంసోపమ, ఆచిఖ్యాసోపమ అనే మూడు ఉపమా భేదాలనూ, (II. 30-32) మాలోపమ అనే మరొక భేదాన్ని అంగీకరించినాడు (II. -42). ఇలాంటి విస్తరం అంతా అనావశ్యక మని భామహుడు అంటాడు (II. -37,38). నాట్య శాస్త్రంలో నిందోపమాప్రశంసోపమలను చెప్పడం (17-51,52) గమనార్హము.

ఢ) "హేతుశ్చ సూక్ష్మలేశౌ చ వాచాముత్తమభూషణమ్" (II. 235) అని దండి అంటే భామహుడు— "హేతుశ్చసూక్ష్మో లేశోథ నాలఙ్కారతయా మతః" (II. 86) అని అంటాడు.

ణ) దండి అలంకారాలలో స్వభావోక్తిని మొట్టమొదట ప్రతిపాదించి నాడు (II, 8). భామహుడు "ఈ అలంకారాన్ని కొందరు అంగీకరిస్తున్నారు" అని అంటూ కేచిన్మతంగా ప్రతిపాదించినాడు (II. 93)

త) ఉదాత్తాలంకారం ఆయశగౌరవము, విభూతిగౌరవము అను రెండు అంశా లను వర్ణించడాన్ని పట్టి రెండు విధాలనీ చెప్పి, దండి విభూతిగౌరవానికి ఉదా హరణగా— "రత్నభిత్తిషు సంక్రాన్తైః ప్రతిబింబశతైర్వృతః. జ్ఞాతో లంకేశ్వరః కృచ్ఛ్రాదాంజనేయేన తత్త్వతః" అన్న శ్లోకం ఉదాహరణంగా ఇచ్చినాడు. (II. 300, 302, 303). భామహుడు— "నానా రత్నాది సంయుక్తమైనదానిని వర్ణిస్తే కూడా ఉదాత్తాలంకారమే అవుతుం దని కొందరు అంటున్నారు" అని చెప్పి దానికి తగిన ఉదాహరణం కూడా చూపించినాడు. ఇక్కడ దండి భామ హులు చూపిన ఉదాహరణలలో చాలా పోలికలు ఉన్నాయి. ఐతే ఈలాంటి వర్ణనలవల్ల వస్తువుల కేమైనా అందం ఉండవచ్చునేమో కాని, వాక్కునకు (కావ్యాలకు) అందం రావాలంటే వక్రార్థశబ్దోక్తి కావాలి అని ప్రసంగాతరంలో భామహుడు ఈ రెండవ ఉదాత్తంపట్ల తన వైముఖ్యాన్ని సూచించినాడు. (V. 24-26) వీరిద్దరికంటె ప్రాచీనుడైన భట్టి కూడా ఈ రెండు ఉదాత్త భేదా లను అంగీకరించినాడు.

థ) దండి ఆశీరలంకారాన్ని ప్రతిపాదించగా (II. 357) భామహుడు దానిని కేచిన్మతం క్రింద చెప్పినాడు— "ఆశీరపి చ కేషాంచిదలంకారతయా మతః" (III. 5). భట్టి కూడా ఈ అలంకారాన్ని చెప్పి ఉన్నాడు. నాట్య శాస్త్రంలో చెప్పిన "ఆశీః" అనే లక్షణమే తరవాత ఆశీరలంకారం అయినది.

ద) "మొదట చెప్పినదానినే మరల చెప్పినట్లైతే అది ఏకార్థదోష మనీ, దీనిలో అర్థపౌనరుక్త్యం కాని శబ్దపౌనరుక్త్యంగాని ఉండవచ్చుననీ చెప్పి దండి— "ఉత్కాముమ్మనయన్త్యేతే బాలాం తదలకత్విషః అంభోధరాస్తడిత్వన్తో గంభీ రాః స్తనయిత్నవః" అని ఉదాహరణం ఇచ్చాడు. భామహుడు—"కొందరు శబ్దార్థ భేదంచేత పునరుక్తం రెండు విధాలని చెప్పినారు; ఐతే తెలివిలో ఉన్నవాడెవ్వడూ

చెప్పిన శబ్దమే మరల చెప్పడు కనక ఒక్క పౌనరుక్త్యానికి మాత్రమే ఉదాహరణ చూపుతున్నాను" అని అంటూ "తాముత్కమనసం నూనం కరోతి ధ్వనిరంభసామ్. సౌధేషు ఘనముక్తానాం ప్రణాలీముఖపాతినామ్" అనే దండి శ్లోక సంవాది యైన ఉదాహరణం ఇచ్చాడు. (IV -12-16). శబ్దపునరుక్తిరూపైకార్థత్వదోషానికి దండి కూడా ఉదాహరణ ఇవ్వలేదు.

పైన చూపిన వివిధోదాహరణాలను బట్టి దండి భామహు లిద్దరూ కూడా ఒకరి గ్రంథం ఒకరికి తెలియకపోయినా తమకు లభించిన కొన్ని ప్రాచీన గ్రంథాలనుంచి, ఉదాహరించడమో, కొన్ని విషయాలు ఖండించడమో చేసి ఉంటారని చెప్పడానికి కూడా అవకాశం లేకపోలేదనీ, అలా కాకుండా ఒకరు ఇంకొకరి గ్రంథం చూచి ఉంటారని చెప్పవలసి వస్తే భామహుడే దండి రచించిన కావ్యాదర్శం చూచి అందులోని విషయాలు పేర్కొన్నాడని చెప్పడమే ఎక్కువ సముచిత మనీ శ్రీ కాణేగారు సిద్ధాంతీకరించి ఉన్నారు. కావ్యప్రకాశకు వ్యాఖ్య వ్రాసిన వామనాలంకారఝుల్‌కికర్ కూడా దండిని వామనుని కంటె ప్రాచీనుడుగా పేర్కొన్నారు.

భామహుడు షష్ఠపరిచ్ఛేదంలో న్యాసకారుణ్ణి పేర్కొన్నాడు:-

"శిష్టప్రయోగమాత్రేణ న్యాసకారమతేన వా
తృచా సమస్తషష్ఠీకం న కథంచిదుదాహరేత్.
సూత్రజ్ఞాపకమాత్రేణ వృత్రహన్తా యథోదితః
అకేన చ న కుర్వీత సన్ధిం తద్గమకో యథా" (VI -36-37)

ఈ కారికల అర్థాన్ని సరిగా తెలుసుకోవాలి. "ఏవో కొన్ని శిష్టప్రయోగాలు ఉన్నాయన్నంతమాత్రంచేతగాని, న్యాసకారుని మతాన్ని అనుసరించిగాని 'తృచ్' ప్రత్యయాంతపదముతో షష్ఠ్యంతపదానికి సమాసం ఏవిధంగానూ సమర్థించకూడదు; ప్రయోగించకూడదు" అని మొదటి కారికకు అర్థము. దీనికీ రెండవకారికకూ సంబంధం లేదు. "సూత్రజ్ఞాపకం ఉన్నది కదా అని వతాన్మా

త్రంచేత 'వృత్రహన్తా' అని కొందరు ప్రయోగించినట్లు అక ప్రత్యయాంతంతో కూడా షష్ఠ్యంతానికి సమాసం చేసి 'తద్గమకః' ఇత్యాది ప్రయోగాలు చేయరాదు." అనగా 'వృత్రహన్తా' అనే ప్రయోగమూ, "తద్గమకః" ఇత్యాది ప్రయోగాలూ కూడా అవాంఛనీయములే అని రెండవ కారికకు అర్థము.

ఇక్కడ దీనికి సంబంధించిన వ్యాకరణ విషయం సంక్షిప్తంగా చెప్పవలసి ఉన్నది. ధాతువునకు కర్త్రర్థమున "ణ్వుల్‌తృచౌ" (3.3.13) అను సూత్రంచేత "ణ్వుల్" (అక) 'తృచ్' అనే ప్రత్యయాలు విధింపబడినవి. ఉదా:- "కారకః"; "కర్తా" మొ. "తృజకాభ్యాం కర్తరి" అనే మరొక సూత్రం (2.2.15) కర్త్రర్థక మైన 'తృచ్' 'అక' ప్రత్యయాలు అంతమునందున్న పదాలతో షష్ఠ్యంతపదానికి సమాసం చేయకూడదు అని చెప్పుతూన్నది. ఈ సూత్రం ప్రకారం "వజ్రస్య ధర్తా" "ఓదనస్య పాచకః" మొ. వ్యస్తపదాలనే ప్రయోగించాలి కాని, "వజ్రధర్తా" "ఓదనపాచకః" మొ. సమాసాలు చేయకూడదు. ఐతే-పాణిని "జనికర్తుః ప్రకృతిః" అనే సూత్రంలో షష్ఠ్యంతమైన "జనేః" అనే దానికి 'కర్తృ' అనే తృజంతంతో సమాసం చేసి "జనికర్తుః" అని ప్రయోగించినాడు. అట్లే "తత్ప్రయోజకో హేతుశ్చ" అనే మరొక సూత్రంలో 'తస్య' అనే షష్ఠ్యంతపదానికి 'ప్రయోజక' అనే అకప్రత్యయాంతంతో సమాసం చేసి "తత్ప్రయోజకః" అని ప్రయోగించినాడు. తాను చెప్పిన నియమానికి విరుద్ధంగా పాణినియే ఈ విధంగా ప్రయోగించడాన్ని బట్టి ఆ నియమము అనిత్య మని జ్ఞాపిత (సూచిత) మైనది. జ్ఞాపక మనగా ఇదే. ఈ జ్ఞాపకాన్ని బట్టి ఎవరో 'వృత్రహన్తా' అని ప్రయోగించి ఉంటారు. దాన్ని దృష్టిలో పెట్టుకొని భామహుడు (పై శ్లోకాలలోని రెండవ శ్లోకంలో) ఎవరో 'వృత్రహన్తా' అని ప్రయోగించినారు కదా అని జ్ఞాపకాన్ని పట్టి అలా ప్రయోగించరాదు అని చెప్పినాడు.

మొదటి శ్లోకానికి అర్థం వేరు; దీనికి సూత్రజ్ఞాపకంతో సంబంధంలేదు. "కొందరు శిష్టులు ప్రయోగించారు; న్యాసకారుడు కూడా అంగీకరించాడు,

అందుచేత తృజంతంతో షష్ఠ్యంతానికి సమాసం చేస్తాము అనకూడదు" అని దీని అర్థము. దీనిని బట్టి భామహుడు న్యాసకారునికి తరువాతివాడు అనే విషయం స్పష్టం అవుతున్నది.

ఐతే కొందరు పై శ్లోకాలకు అర్థం చెప్పడంలో "న్యాసకారుడు 'వృత్రహన్తా' అన్న ఉదాహరణం చెప్పినట్లు భామహుడు అంటున్నాడు. కాని ఇపుడు మనకు లభ్యమయే జినేంద్రబుద్ధి విరచితన్యాసంలో ఎక్కడా ఈ ఉదాహరణం లేదు కాబట్టి భామహుడు చెప్పిన న్యాసం ఏదో ఇంకా ప్రాచీనమైన గ్రంథం అయి ఉండాలి" అని చెప్పినారు. ఈ శ్లోకాల అర్థాన్ని పైన మేము వివరించిన విధంగా గ్రహించినట్లైతే ఈ భ్రాంతికి అవకాశం ఉండదు. అందుచేత భామహుడు చెప్పిన న్యాసం జినేంద్రబుద్ధి విరచితన్యాసమే. ఐతే శ్రీష్చంద్రచక్రవర్తి భామహుడు పేర్కొన్నది ఈ న్యాసాన్నిగూర్చియే అని అంగీకరిస్తూ (1913లో, రాజషాహిలోని వరేంద్రరిసర్చిసొసైటీ ద్వారా ప్రచురింపబడిన న్యాసానికి వ్రాసిన ప్రస్తావనలో) పై శ్లోకాలకి విచిత్రంగా వ్యాఖ్యానం వ్రాసినారు- "తృంజంతంతో ఎన్నడూ సమాసం చేయని శిష్టుల ప్రయోగము, తృజంతంతో సమాసం చేయకూడదు అని గట్టిగా చెప్పిన న్యాసకారుని వాక్యమూ ఈ రెండు ప్రమాణాలూ ఉన్నాయి కాబట్టి, దీనికి విరుద్ధంగా సమాసం చేయకూడదు". ఇది చాలా అసంగత మైన అర్థం; పరిగ్రాహ్యం కాదు.

ఐతే న్యాసకారుడు తృజంతంతో సమాసం ఎక్కడ అంగీకరించినాడు అనేది ప్రశ్న. కాణేగారు కూడా ఈ విషయాన్ని స్పష్టీకరించలేదు. "కర్తరి చ" (2.2.16) అనే సూత్రానికి వ్యాఖ్యానంలో న్యాసకారుడు తృజంతంతో సమాసం రాదని చెప్పి, ఐతే ఈ నిషేధం తృచ్ ప్రత్యయాంతానికే కాని 'తృన్' ప్రత్యయాంతానికి వర్తించదు. ఐతే తృన్నంతాన్ని, ప్రయోగించినప్పుడు షష్ఠి

రాదు కదా అని సందేహించవలసిన పనిలేదు. ఎందుచేతనంటే "తృజకాభ్యాం కర్తరి" (2.2.15) అనేసూత్రంలో 'తృ' అనడానికి బదులు 'తృచ్' అని ప్రయోగించడాన్ని బట్టి "న లోకావ్యయనిష్ఠాఖలర్థతృనామ్" (2.3.69) ("తృన్నంతమును ప్రయోగించినపుడు షష్ఠి రాదు") అనే నిషేధాన్ని అనిత్యమని అంగీకరించడంచేత తృన్నంతముతో కూడ షష్ఠీప్రయోగము కొన్ని చోట్ల యుక్తమే; అందుచేత "భీష్మః కురూణాం భయశోకహర్తా" ఇత్యాది ప్రయోగాలు కూడా సాధువులే అని చెప్పినాడు. దీనిని పట్టి న్యాసకారుడు ఇక్కడ తృజంతంతో సమాసం అంగీకరించలేదని స్పష్టం అవుతుంది. ఒతే మరొక సూత్రం (4.1.33)లో ఇతడు- "ఫలగ్రహీతృత్వాత్" అన్నప్పుడు షష్ఠీసమాసం ఎలా వచ్చింది అని ఆశంకించుకొని, ఇది తృజంతంతో సమాసంకాదు, తృన్నంతంతో సమాసము అని మొదట సమాధానం చెప్పి, లేదా 'గ్రహీతృ' శబ్దం తృజంతమే అయినా దీన్ని యాజకాదిగణంలో చేర్చుకొని కాని, లేదా 'చ' శబ్దంచేత దీన్నికూడా గ్రహించి గాని, "యాజకాదిభిశ్చ" అనే సూత్రంచేత షష్ఠీసమాసాన్ని చెప్పవచ్చు అని మరొక సమాధానం చెప్పి ఉన్నాడు. ఈ విధంగా తృజంతసమాసాన్ని ఇతడు సమర్థించినట్లే అయింది. ఆ గణంలో లేని దానిని ఆగణంలో చేర్చి లేదా చ శబ్దాదులను బట్టి రూపాలు సాధించుకుంటూ పోతే అసలు నిషేధసూత్రం అర్థరహితమై పోతుంది. అందుచేత ఈ విధమైన సమర్థనం కూడా అయుక్తమే. ఏ విధంగానూ కూడా ("న కథంచిత్") తృజంతంతో షష్ఠీసమాసం ప్రయోగించకూడదు అని భామహుని అభిప్రాయం.

న్యాసకారుడైన జినేంద్రబుద్ధి 725-750 ప్రాంతానికి చెందినవాడని ప్రమాణాంతరాలచేత తెలుస్తూన్నది. అందుచేత భామహుడు 775 ప్రాంతంవాడు కావచ్చునని శ్రీష్చంద్రచక్రవర్తి కూడా అభిప్రాయపడి ఉన్నారు (న్యాసానికి ప్రస్తావన. పి. 26) న్యాసకారుడు 700 ప్రాంతంవాడై ఉంటాడని కాణేగారి

అభిప్రాయము. దీసిని బట్టి కూడా భామహుడు దండికంటె అర్వాచీను దని చెప్పవచ్చును.

కావ్యాదర్శంలోని "చతుర్ముఖముఖాంభోజ" అనే మంగళ శ్లోకాన్ని దృష్టిలో ఉంచుకొని విజ్జిక అనే ఒక కవి (కవయిత్రి) —

"నీలోత్పలదలశ్యామాం విజ్జికాం మామజానతా.
వృథైవ దండినా ప్రోక్తం సర్వశుక్లా సరస్వతీ''

అనే శ్లోకం వ్రాసిన దని జల్హణుని సూక్తిముక్తావళి ద్వారా తెలుస్తూన్నది. ఈ విజ్జిక కర్ణాటక రాజ్య సామ్రాజ్ఞియైన విజయమహాదేవి అని ప్రసిద్ధి ఉన్నది. అదే సత్యమైన పక్షంలో కూడా కొన్ని శిలా లేఖాదులను బట్టి 650 ప్రాంతంలో ఉన్న ఈమె దండికి సమకాలికురాలై ఉండాలి. ఈ విధంగా భామహునికంటె దండి కొంచెం ప్రాక్తనుడై ఉండాలనడమే యుక్తం అన్నట్లు కనబడుతున్నది.

భామహుడు వివరించని కొన్ని విషయాలు దండి అతి విస్తృతంగా వర్ణించినాడు. అలంకారాలలో అనేకమైన అవాంతరభేదాలు అలా ఉండగా పైన మనం చూచినట్లు యమకాదులను గూర్చి అతి విస్తృతంగా వివరించినాడు. భామహుడు యమకాదులు ఐదు మాత్రమే చెప్పి సన్దష్ట సముద్గాదులు కూడా వీటిలోనే అంతర్గతం అవుతాయని చెప్పినాడు కాని అధిక సంఖ్యలో యమకాదులు చెప్పడం, అలంకారాలకి ఎన్నో అవాంతరభేదాలు అంగీకరించడం ఇదంతా అనావశ్యక మని ఆతని అభిప్రాయము. అందుచేతనే "ధీభేదాయైప విస్తరః'' (II. 95) అంటాడు.

ఐతే దండి చెప్పనివి కొన్ని భామహుడు చెప్పి ఉన్నాడు ప్రతిజ్ఞాహేత్వాదిహీనాలను వివరించే సందర్భంలో ప్రవేశపెట్టిన న్యాయశాస్త్రవిషయాలూ,

స్ఫోటవాద ఉఅపోహవాదాల ఖండనమూ, శబ్దసాధుత్వాసాధుత్వ-కావ్యోచిత శబ్దాదుల నిర్ణయము (పంచమ షష్ఠపరిచ్ఛేదాలలోని విషయమంతా కొత్తదే), ఇదేవీ దండికో లేదు. వ్యాకరణ విషయాలను భామహుని కంటె అర్వాచీనుడైన వామనుడు కూడా వివరించడం గమనార్హమైన విషయము. అనగా భామహుడు ప్రవేశపెట్టిన సంప్రదాయాన్ని కొంతకాలం తరువాతివారు కొనసాగించినారు.

దండి భామహుల గ్రంథాలలోని సామ్యవైషమ్యాదులను గూర్చిన ఈ చర్చ ముగించడానికి పూర్వం ఒక్క విషయం చెప్పవలసి ఉన్నది.

భరతుడు పది గుణాలు అంగీకరించినాడు. దండి కూడా అవే అంగీకరించినాడు. భామహుడు మాత్రం మాధుర్యం, ప్రసాదం అనే గుణాలనూ, కేచిన్మతంగా ఓజస్సునూ, ఏమైనా మూడు గుణాలు మాత్రమే, అంగీకరించినాడు. మమ్మటాదులు– "మూడు గుణాలు మాత్రమే అంగీకరించాలి, మిగిలిన గుణాలు దోషాభావరూపాలో, ఈ గుణాలలోనే అంతర్గతాలో, అవుతాయని చెప్పవచ్చు" అని నిరూపించినారు. భామహుడు మాత్రం అలాంటిదేమీ చెప్పలేదు. ఐతే భామహుడు, దండి చెప్పిన 'అపార్థం' మొదలు 'విరోధి' వరకు ఉన్న పది దోషాలను యథాతథంగా అంగీకరిస్తూ ఇవికాక- నేయార్థము, క్లిష్టము, అన్యార్థము, అవాచకము, అయుక్తిమత్, గూఢ శబ్దాభిధానము, శ్రుతిదుష్టము, అర్థదుష్టము, కల్పనాదుష్టము, శ్రుతికష్టము అనే పది దోషాలను కూడా అధికంగా అంగీకరించినాడు.

దండి శ్లేషాదిగుణాల పదింటి స్వరూపాన్ని వివరిస్తూ ఆయా దోషాలు లేకుండా చూచుకోవడం ద్వారా ఈ గుణాలను సంపాదించాలని అన్నట్లు లక్షణాలు చెప్పి ఉన్నాడు. అనగా దండి ఇచ్చిన లక్షణాలను పరిశీలిస్తే 'అర్థవ్యక్తి'

అనే గుణం ఉన్నట్లైతే "నేయార్థత్వ" దోషము ఉండదనీ, అట్లే 'మాధుర్య' గుణం ఉన్నప్పుడు శ్రుతికష్ట- అర్థదుష్ట- కల్పనాదుష్టత్వరూపాలైన దోషాలు, 'ప్రసాదం' అనే గుణం ఉన్నప్పుడు క్లిష్ట- అన్యార్థ- అవాచక- గూఢశబ్దాభిధాన దోషాలూ, సౌకుమార్యగుణం ఉన్నప్పుడు శ్రుతి కష్టత్వదోషమూ, 'కాంతి' అనే గుణం ఉన్నప్పుడు 'అయుక్తిమత్' అనే దోషమూ ఉండ వని చెప్పినట్లు స్పష్టం అవుతుంది.

ఈ విధంగా దండి (ఆ పేర్లు అదేవిధంగా చెప్పకపోయినా) సూచించిన దోషాలను భామహుడు వేరు వేరు పేర్లు పెట్టి పది దోషాలనుగా పేర్కొన్నాడు. వీటినే తరువాతి ఆలంకారికులు గ్రహించడంతో దోషాలు గుణాభావరూపాలని కొందరూ (వామనాదులు) గుణాలే దోషాభావరూపాలని కొందరూ (మమ్మటా దులు) అన్నారు. ఈ విధంగా దండి భామహుల కావ్యాదర్శ కావ్యాలంకారాలు లేదా కావ్యలక్షణ- కావ్యలక్ష్మలు- (చూ. కావ్యాలంకార VI. 64) అలంకార శాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలు ప్రతిపాదిస్తూ తరువాతి అలంకార గ్రంథాలకి పథి ప్రదర్శకాలుగా ఉన్నాయి.

కావ్యాదర్శానికి వ్యాఖ్యానమైన ఈ బాలానందినిలో సంస్కృతవ్యాఖ్యాన పద్ధతిని అనుసరించి ప్రతిపదార్థమూ, అవసరమైనచోట విశేషములూ వ్రాయ డం జరిగింది. "నామూలం లిఖ్యతే కించిన్నానపేక్షితముచ్యతే" అన్న మల్లినాథ సూరి వాక్యము దృష్టిలో ఉంచుకొనబడినది.

ఏ సంస్కృత గ్రంథానికైనా తెలుగులో వ్యాఖ్యానం వ్రాసినప్పుడు సంస్కృత మూలం కూడా తప్పకుండగా ఇవ్వడం యుక్తమని నా అభి ప్రాయం. మూలం ఇవ్వకుండా కేవల అనువాదం మాత్రం ముద్రించితట్లైతే అది వివిధ సంశయాలకూ ఆస్పదమై సంతృప్తికరంగా ఉండదు. సంస్కృత భాషాపరిచయం లేనివారికి అట్టి అనువాదాలు అర్థం కావు; సంస్కృత విద్వాంసు లకు వాటితో పని లేదు.

బాలానందినీసహిత కావ్యాదర్శ ముద్రణ కార్యక్రమాన్ని చేపట్టడానికై సాహితీప్రేమచే ప్రేరితులైన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యులకు, అధ్యక్షులైన డా. బెజవాడ గోపాలరెడ్డిగారికి, ఉపాధ్యక్షులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, కార్యదర్శి డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతను తెలుపుచున్నాను. మన ప్రాచీనాలంకారికులు అలంకారాది విశ్లేషణం చేయడంలో ఎంతటి సూక్ష్మాంశాలదాకా కూడా వెళ్లేవారో ఈ వ్యాఖ్యాసం ద్వారా ఏ కొద్దిమందైనా తెలిసికొన కలుగుతే నా ప్రయత్నం సఫలం అని సంతోషించగలను.

శ్రీ గౌతమీనదీతట్యామ్ జనవిల్ల్యధివాసినే
వినాయకాయ శ్రీసిద్ధిదాయకాయార్ప్యతే కృతిః.

హైదరాబాదు.
15-7-1981

పుల్లెల శ్రీరామచంద్రుడు

# విషయసూచిక

## ప్రథమ పరిచ్ఛేదము

# ద్వితీయ పరిచ్ఛేదము

# తృతీయ పరిచ్ఛేదము

శ్రీః

శ్రీమహా గణాధిపతయే నమః

# కావ్యాదర్శః - ప్రథమ పరిచ్ఛేదః

బాలానన్దిన్యాఖ్యయా ఆంధ్రభాషావ్యాఖ్యయా అలంకృతః.

మూ. చతుర్ముఖముఖామ్భోజకలహంసవధూర్మమ.
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ. 1

## బాలానన్దినీవ్యాఖ్యా

నత్వా శ్రీతాతపాదాదీన్ మంత్ర విద్యాదిసద్గురూన్
కావ్యాదర్శకృతేర్వ్యాఖ్యామాంధ్ర్యాం కుర్వే యథామతి.

మహాపండితు డగు దండి కావ్యాదర్శ మను అలంకారశాస్త్ర గ్రంథము ను చేయుటకు ఉపక్రమించి - "మఙ్గలాదీని హి, శాస్త్రాణి ప్రథన్తే వీరపురుషాణి చ భవన్త్యాయుష్మత్పురుషాణి చాధ్యేతారశ్చ సిద్ధార్థా యథా స్యుః" అను మహాభాష్యకారోక్తిని అనుసరించి గ్రంథావిఘ్నపరిసమాప్తికై సరస్వతీ నమస్కారరూప మగు మంగలాచరణము చేయుచున్నాడు.

చతుర్ము...వధూః = (నాలుగు ముఖములుగల) బ్రహ్మ ముఖము లనెడు పద్మముల సముదాయమునందు(విహరించు) ఆడహంసయైనదియు, సర్వశుక్లా = పూర్తిగా శుక్లవర్ణయగు, సరస్వతీ = సరస్వతి, నిత్యం = ఎల్లప్పుడును, మమ = నా, మానసే = మనస్సు అనెడు మానససరోవరమునందు, రమతాం = విహరించుగాక.

మహావైదుష్యము కల విజ్జిక అను ఒక రాణి దండిప్రయోగించిన 'సర్వశుక్లా సరస్వతీ' అను దానిని చూచి -

"నీలోత్పలదలశ్యామాం విజ్జికాం మామజానతా.
వృథైవ దండినా ప్రోక్తా సర్వశుక్లా సరస్వతీ" అని అన్నదట.

మూ. పూర్వశాస్త్రాణి సంహృత్య ప్రయోగానుపలక్ష్య చ,
యథాసామర్థ్యమస్మాభిః క్రియతే కావ్యలక్షణమ్. 2

వ్యా. పూర్వశాస్త్రాణి = ప్రాచీనాలంకారశాస్త్రములను, సంహృత్య = సంగ్రహించి, (సంక్షిప్తముచేసి), ప్రయోగాన్‌చ = ప్రాచీనకవిప్రయోగములనుకూడ, ఉపలక్ష్య = పరిశీలించి, అస్మాభిః = మాచేత, యథాసామర్థ్యం = సామర్థ్యానుసారముగా, కావ్యలక్షణం = కావ్యలక్షణ మనెడు గ్రంథము, క్రియతే = రచింపబడుచున్నది.

వి. 'కావ్యలక్షణమ్' అనునది కావ్యాదర్శముయొక్క రెండవ నామధేయము. కావ్యలక్షణ మనెడు గ్రంథమును రచించుచున్నాను, అని అర్థము కాని, చాలమంది అనుకొనునట్లు "కావ్యమునకు లక్షణము చెప్పుచున్నాను" అని అర్థము కాదు. అందుచేతనే' క్రియతే'అని ప్రయోగిచింనాడు కాని 'అభిధీయతే' అని అనలేదు. ఈ గ్రంథమునకు కావ్యాదర్శ మనియే ప్రసిద్ధముగ నామధేయమున్నను కావ్యలక్షణమను పేరుతోకూడ 'రత్నశ్రీ' అను వాఖ్యానముతో కొన్ని సంవత్సరముల క్రిందట ఇది ప్రచురించ బడినది. (చూ. "కావ్యలక్షణమ్" పు 17).

మూ. ఇహ శిష్టానుశిష్టానాం శిష్టానామపి సర్వథా
వాచామేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే, 3

వ్యా. ఇహ = ఈప్రపంచమునందు, శిష్టానుశిష్టానాం = శిష్టులైన పాణిని వరరుచ్యాదులచే ప్రకృతి ప్రత్యయాది విభాగముతో నియమింపబడిన, వాచాం = వాక్కులయొక్కయు (సంకృతప్రాకృతాది భాషలయొక్కయు), శిష్టానామపి = (అట్లు వ్యాకరణ నియమబద్ధముగాని) మిగిలిన దేశ్యభాషల

యొక్కయు, ప్రసాదేనైవ = అనుగ్రహముచేతనే (సహాయముచేతనే), లోక యాత్రా = లోకవ్యవహారము, సర్వథా = అన్నివిధములు, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

మూ. ఇదమన్ధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతిరాసంసారం న దీప్యతే. 4

వ్యా. శబ్దాహ్వయం = శబ్దమను పేరుగల, జ్యోతిః = ఈ తేజస్సు, ఆ సంసారం = సృష్టి ప్రారంభమునుండియు, న దీప్యతేయది = ప్రకాశించక పోయినచో, ఇదం = ఈ, కృత్స్నం = సమస్తమైన, భువనత్రయం = లోకత్రయము, అన్ధం తమః = అంధతమసముగా, జాయేత = అయి ఉండెడిది.

మూ. ఆదిరాజయశో బిమ్బమాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషామసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి. 5

వ్యా. ఆదిరాజయశః = పూర్వరాజుల కీర్తియనెడు, బిమ్బం = బింబము, వాఙ్మయం = వాఙ్మయ మనెడు, ఆదర్శం = అద్దమును, ప్రాప్య = పొంది, తేషాం = ఆరాజుల, అసన్నిధానేఽపి = సాంనిధ్యము లేకపోయినను, స్వయం = తాను, న నశ్యతి = నశించదు. పశ్య = చూడుము.

వి. తనకు ఆధారభూతులగు రాజులు నశించినను, కీర్తి నూతనాశ్రయ మగు కావ్యములలో స్థిరముగ నిలచి పోవునని అర్థము. ఉత్తమ రాజాదుల చరిత్ర చిత్రణము, తద్ద్వారా సన్మార్గోపదేశము కావ్యప్రయోజనములలో ఒకటి అని ఇచట సూచితమైనది.

మూ. గౌర్గౌః కామదుఘా సమ్యక్ ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుః సైవ శంసతి. 6

వ్యా. గౌః = వాక్కు, సమ్యక్ ప్రయుక్తా = బాగుగ, అనగా నిర్దుష్టముగ ప్రయోగింపబడినదై, కామదుఘా = సమస్త కామములను వర్షించు, గౌః = గోవుగా, కామధేనువుగా, బుధైః = పండితులచే, స్మర్యతే = చెప్పబడుచున్నది. సైవ = ఆవాక్కే, దుష్ప్రయుక్తా పునః = చెడ్డగా ప్రయోగింప బడినచో, ప్రయోక్తుః = ప్రయోగించినవాని యొక్క, గోత్వం = వృషభత్వమును (ఎద్దు వంటి మొద్దు అని), శంసతి = ప్రకటీకరించును.

"ఏకః శబ్దః సమ్యగ్జ్ఞాతః శాస్త్రాన్వితః సుప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి" అని మహాభాష్య కారుడు కూడ (6-1-84) సుశబ్దప్రయోగము కామధేనువు వంటిదని చెప్పియున్నాడు. "వాగ్యోగ విద్దుష్యతి చాపశబ్దైః" అను వాక్యమున (పస్పశాహ్నికము) అపశబ్ద ప్రయోగము దోషహేతువని కూడ చెప్పియున్నాడు.

**మూ. తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన**
**స్యాద్వపుః సున్దరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్. 7**

వ్యా. తత్ = ఆకారణము వలన, కావ్యే = కావ్యమునందు, అల్పమపి = అత్యల్పమైనను, దుష్టం = దోషము, కథఞ్చన = ఏ విధముగను కూడ, నోపేక్ష్యం = ఉపేక్షింప తగినది కాదు. వపుః = శరీరము, సున్దరమపి = ఎంతసుందరమైనదైనను, ఏకేన = ఒక, శ్విత్రేణ = బొల్లిచేతనే, దుర్భగం = సౌభాగ్యరహితమై, స్యాత్ = అగును.

వి. 'దుష్టమ్' అనునది భావే క్తప్రత్యయాంతము.

**మూ. గుణదోషానశాస్త్రజ్ఞః కథం విభజతే జనః**
**కిమన్ధస్యాధికారోఽస్తి రూపభేదోపలబ్ధిషు. 8**

వ్యా. అశాస్త్రజ్ఞః = సాహిత్య శాస్త్రజ్ఞానములేని, జనః = జనుడు, గుణదోషాన్ = (కావ్యములకు సంబంధించిన) గుణదోషములను, కథం =

ఎట్లు, విభజతే = వేరువేరుగా తెలిసికొనగలడు? రూపభేదోపలబ్ధిషు = రూపము యొక్క భేదములను తెలికొనుటయందు, అన్ధస్య = గ్రుడ్డివానికి, అధికారః = అధికారము, అస్తికిమ్ = ఉన్నదా ?

మూ. అతః ప్రజానాం వ్యుత్పత్తి మభిసన్ధాయ సూరయః
వాచాం విచిత్రమార్గాణాం నిబబన్ధుః క్రియావిధిమ్. 9

వ్యా. అతః = ఆ కారణమువలన, సూరయః = పండితులు, ప్రజానాం = ప్రజలకు. ('పదానామ్' అని పాఠాంతరము, పదములకు సంబంధించిన అని అర్థము), వ్యుత్పత్తిం = వ్యుత్పత్తిని, జ్ఞానమును, అభిసన్ధాయ = ఉద్దేశించి, విచిత్ర మార్గాణాం = విచిత్రములైన మార్గములు గల, వాచాం = వాక్యములయొక్క, క్రియావిధిం = నిర్మాణమునకు సంబంధించిన విధానమును, నిబబన్ధుః = కూర్చిరి.

వి. దండి ఇచట 'క్రియావిధి' శబ్దమును ప్రయోగించియున్నాడు. కొన్ని ఇతరప్రాచీన గ్రంథములందు 'క్రియాకల్ప' మొదలగు పదములు ప్రయుక్తము లైనవి. ఇట్టి ప్రయోగములను ఆధారముగ చేసికొని కొందరు పండితులు, అలంకారశాస్త్రమునకు, ప్రాచీన కాలమున 'క్రియావిధి', 'క్రియాకల్ప' మొదలగు నామాంతరము లుండెడివని అభిప్రాయ పడుచున్నారు.

'కావ్యలక్షణ' (కావ్యాదర్శ) ప్రాచీన వ్యాఖ్యాతయగు రత్నశ్రీ జ్ఞానపండితుడు ఈ విధముగ వ్రాసియున్నాడు. "క్రియావిధిం = క్రియాకల్పమ్... (మల్లనాగేన విద్యాసముద్దేశే క్రియాకల్ప ఇతి కావ్యాలఙ్కార ఉక్తః; తదనుసారేణానేన క్రియాకల్పః క్రియా......(విధీ) యతేఽనేనేతి క్రియావిధిః. క్రియాకల్పోఽ ప్యేవమితి నార్థతః కశ్చిద్ భేదః. కావ్యలక్షణం శాస్త్రం కృతవన్తః". (I-9)

మూ. తైః శరీరం చ కావ్యానామలఙ్కారాశ్చ దర్శితాః
శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ. 10

వ్యా. తైః = వారిచే, కావ్యానాం = కావ్యములయొక్క, శరీరం = శరీరము, అలంకారాశ్చ = అలంకారములును, దర్శితాః = చూపబడినవి. ఇష్టార్థవ్యవచ్ఛిన్నా = ఇష్టమైన, అనగా మనోహరమైన, అర్థముతో కూడిన, పదావలీ = పదముల పంక్తి, శరీరం = కావ్యశరీరము.

వి "శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలిః" అనుదానిని దండి కావ్యలక్షణముగా చెప్పినాడని చాలమంది అభిప్రాయము. కాని కావ్య శరీరమును మాత్రమే కంఠోక్తితో చెప్పుచున్నపుడు ఇది కావ్యలక్షణ మెట్లగును. పూర్తి లక్షణమును చెప్పవలెనన్నచో ఒక్క శరీరమునే కాక ఇతరవిషయము లను కూడ చెప్పవలెను కదా ? కావున దండి కావ్యలక్షణమును స్పష్టముగ నిర్దేశించలేదు. అక్కడక్కడ ఆతడు వ్రాసిన దానిని పట్టి ఆతనికభీష్టమగు కావ్యలక్షణమును మనము ఊహించుకొనవలసి యుండును. అందుచే బహుశా "సాలఙ్కారా, ఇష్టార్థవ్యవచ్ఛిన్నా, విచిత్రమార్గా, పదావలిః కావ్యమ్" అని దండికి అభిమతమైన కావ్యలక్షణమై యుండును.

మూ. గద్యం పద్యం చ మిశ్రం చ తత్త్రిధైవ వ్యవస్థితమ్
పద్యం చతుష్పదీ తచ్చ వృత్తం జాతిరితి ద్విధా. 11

వా. తత్ = అది (కావ్యశరీరము) గద్యం = గద్యమనియు, పద్యం = పద్యమనియు, మిశ్రం చ = గద్యపద్య మిశ్రమనియు, త్రిధైవ = మూడు విధములుగనే, వ్యవస్థితం = విభిన్నరూపములలో నున్నది. చతుష్పదీ = నాలుగు పాదముల సంఘాతము, పద్యం = పద్యము. పద్యము నాలుగు పాద ములతో ఉండును. తచ్చ = ఆ పద్యము, వృత్తం = వృత్తమనియు (వంశస్థ వసంతతిలకాదివృత్తములు) జాతిః = జాతి అనియు (ఆర్య మొదలగునది) ద్విధా = రెండు విధములు,

వి. అక్షరముల సంఖ్యపై (గణరూపమున) ఆధారపడినది వృత్తము. మాత్రాసంఖ్యపై ఆధారపడి యున్నది జాతి.

"పద్యం చతుష్పదీ తచ్చ వృత్తం జాతిరితి ద్విధా
వృత్తమక్షరసంఖ్యాతం జాతిర్మాత్రాకృతా భవేత్".
(ఛందోమంజరి)

మూ. ఛన్దోవిచిత్యాం సకలస్తత్ప్రపఞ్చో నిదర్శితః
సా విద్యా నౌస్తితీర్షూణాం గభీరం కావ్యసాగరమ్. 12

వా. సకలః = సమస్తమైన, తత్ప్రపంచః = ఆవృత్తములకును జాతులకును సంబంధించిన విస్తారము, ఛందోవిచిత్యాం = "ఛందోవిచితి" యను గ్రంథమునందు, నిదర్శితః = చూపబడినది. గభీరం, చాలాలోతైన, కావ్యసాగరం = కావ్యసముద్రమును, తితీర్షూణాం = దాటదలచినవారికి, సా = ఆ, విద్యా = ఛందోవిద్య, నౌః = ఓడ.

వి. దండి 'ఛందోవిచితి' అను ఒక చందఃశాస్త్రగ్రంథమును కూడ రచించినట్లు చెప్పుదురు.

"త్రయోఽగ్నయస్త్రయో వేదాస్త్రయో దేవాస్త్రయో గుణాః
త్రయో దణ్డిప్రబన్ధాశ్చ త్రిషు లోకేషు విశ్రుతాః".

మూ. ముక్తకం కులకం కోషః సఙ్ఘాత ఇతి తాదృశః
సర్గబన్ధాంశరూపత్వాదనుక్తః పద్యవిస్తరః. 13

వా. ముక్తకం = ముక్తకము, కులకం = కులకము, కోషః = కోషము, సఙ్ఘాతః = సంఘాతము, ఇతి = అని, తాదృశః = అట్టి, పద్యవిస్తరః = పద్యవిస్తరము, సర్గబన్ధాంశరూపత్వాత్ = సర్గబంధముయొక్క అంశమే అగుటవలన, అనుక్తః = చెప్పబడలేదు.

వి. ముక్తకాదిభేదము లన్నియు సర్గబంధావాంతరభేదములే గాన వాటిని గూర్చి విశేషముగ ఇచట చెప్పలేదు.

ముక్తకము :—"ముక్తకం శ్లోక ఏవైకః చమత్కారక్షమః సతామ్". ఒక్కశ్లోకమైనను చమత్కారజనక మైనచో, అది ముక్తకము. ఉదా. అమరు శతకాదికము.

కులకము :—ఐదు లేక అంతకంటె అధికసంఖ్యాకములగు, ఏకాన్వయ ముగల శ్లోకములు. "ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం త్రిభిః శ్లోకైర్విశేషకమ్
కలాపకం చతుర్భిః స్యాత్ తదూర్ధ్వం కులకం స్మృతమ్"

కోషము :—నాయికా పద్ధతి, నాయక పద్ధతి ఇత్యాదిరూపమున రచిత మగు పరస్పరనిరపేక్షశ్లోకసమూహము కోషము. భర్తృహరిశతకత్రయ-ఆర్యాసప్తశత్యాదికము ఉదాహరణము. "కోషః శ్లోకసమూహస్తు స్యాదన్యోన్యానపేక్షకః, వ్రజ్యాక్రమేణ రచితః స ఏవాతిమనోరమః".

సంఘాతము :—ఒక విషయమును ఒకే వృత్తములో వర్ణించు కావ్యము సంఘాతము. మేఘసందేశాదులు ఉదాహరణము. "యత్ర కవిరేకమర్థం వృత్తేనైకేన వర్ణయతికావ్యే. సంఘాతః స నిగదితః వృన్దావనమేఘదూతాదిః"

**మూ. సర్గబన్ధో మహాకావ్యముచ్యతే తస్య లక్షణమ్**
**ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్. 14**

వా. సర్గబంధః = సర్గబంధము, సర్గలలో విభజింపబడిన శ్రవ్యకావ్యము. మహాకావ్యం = మహాకావ్యము, తస్య = దానియొక్క, లక్షణం = లక్షణము, ఉచ్యతే = చెప్పబడుచున్నది. ఈశ్లోకము మొదలు 19వ శ్లోకము వరకును మహాకావ్యలక్షణము చెప్పబడుచున్నది. ఆశీః = ఆశీర్వాదము, అనగా ఇట్టి లాభము కలుగుగాక అనుకోరికను ఆవిష్కరించుట కాని, నమస్క్రియా = ఇష్టదేవతాది నమస్కారము కాని, వస్తునిర్దేశః వా అపి = ఉదాత్తమైన వస్తువు యొక్క నిర్దేశము కాని, తన్ముఖమ్ = దానియొక్క ప్రారంభము. అనగా మహాకావ్యమును ఆశీరాదులలో దేనితోనైనను ప్రారంభింపవచ్చును.

మూ. ఇతిహాసకథోద్భూతమితరద్వా సదాశ్రయమ్
చతుర్వర్గ ఫలాయత్తం చతురోదాత్తనాయకమ్. 15

వ్యా ఇతిహాసకథోద్భూతం = రామాయణ మహాభారతాదులలోని లేదా ఇతరమైన చారిత్రక గ్రంథములలోని కథను ఆశ్రయించి ఉండునదియు, వా = లేక, ఇతరత్ = మరియొక విధముగా, సదాశ్రయం = మహాపురుషులగు బుద్ధాదుల చరిత్రను ఆశ్రయించి ఉన్నదియు, రఘువంశ భారత మంజరీ-రాజతరంగిణీ-బుద్ధచరితాదులు ఉదాహరణము. చతుర్వర్గ ఫలాయత్తం = ధర్మ-అర్థ-కామ-మోక్షము లనెడు నాలుగు పురుషార్థము లనెడు ఫలమునకు సంబంధించినదై, అనగా వాటిలో ఏదియో ఒక దానిని గాని, అన్నింటిని గాని, కొన్నింటిని గాని సంపాదించుటకు ఉపకరించునదై ఉన్నదియు, చతురోదాత్త నాయకమ్ = సమర్థుడు, ఉదాత్తస్వభావము కలవాడు అగు నాయకుడు కలదై ఉన్నదియు:- ఈ శ్లోకములోను రాబోవు శ్లోకములలోను ఉన్న 'ఇతిహాస కథోద్భూతం' ఇత్యాది ప్రథమాన్త విశేషణములు 19వ శ్లోకములోని 'కావ్యమ్' అనుదానితో అన్వయించును.

మూ. నగరార్ణవశైలర్తుచన్ద్రార్కోదయవర్ణనైః
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవైః. 16
విప్రలమ్భైర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మన్త్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయైరపి. 17

వ్యా. నగరా ...... వర్ణనైః = నగరములు, సముద్రము, పర్వతములు, ఋతువులు, చంద్రోదయ-సూర్యోదయములు—వీటివర్ణనములతోడను, ఉద్యాన ... రతోత్సవైః = ఉద్యానక్రీడలు, జలక్రీడలు, మధుపానము, సురతోత్సవము—వీటి వర్ణనములతోడను, విప్రలమ్భైః = వియోగవర్ణనములతోడను, వివాహైశ్చ = వివాహవర్ణనలతోడను, కుమారోదయవర్ణనైః = పుత్రోత్పత్తివర్ణనలతోడను, మన్త్ర ... అభ్యుదయైఃఅపి = మంత్రము, అనగా రాజకార్య

విచారము, ద్యూతము, యుద్ధయాత్ర, యుద్ధము, నాయకునకు అభివృద్ధి — నీటి వర్ణనలతోడను,—18వ శ్లోకములోని 'అలంకృతం' అనుదానితో అన్వయము.

మూ. అలఙ్కృతమసంక్షిప్తం రసభావనిరన్తరమ్
సర్గైరనతివిస్తీర్ణైః శ్రవ్యవృత్తైః సుసన్ధిభిః. 18
సర్వత్ర భిన్నవృత్తాన్తైరుపేతం లోకరంజకమ్
కావ్యం కల్పాన్తరస్థాయి జాయతే సదలంకృతి. 19

వ్యా. అలంకృతం = పూర్వోక్తవర్ణనలతో అలంకరింపబడినదియు, అసంక్షిప్తం = అతిసంక్షిప్తము కానిదియు, అనగా — "వసుదేవాత్స ముత్పద్య పూతనాం వినిపాత్య చ. కంసం హత్వా ద్వారకాయాముషిత్వా స్వర్గతో హరిః" అను విధమున అతిసంక్షిప్తముగ చెప్పినచో అది రమణీయముగ ఉండదు. రసభావనిరంతరం = శృంగారాదిరసములతోడను, భావములతోడను నిండియున్నదియు, అనతివిస్తీర్ణైః = ఎక్కువ పెద్దవికానివియు, శ్రవ్యవృత్తైః = చెవులకు ఇంపుగా నుండు వృత్తములు కలవియు, సుసన్ధిభిః = బాగుగా కూర్చ బడిన, ముఖ—ప్రతిముఖ—గర్భ—అవమర్శ—నిర్వహణము లనెడు సంధులు కల వియు, సర్వత్ర = అంతటను (అన్నిసర్గలయందును) భిన్నవృత్తాంతైః = వేరైన వృత్తములు గల అంతములు కలవియుఅగు, సర్గాతమున వృత్తమును మారవ్చలె నని యర్థము, సర్గైః = సర్గలతో, ఉపేతం = కూడినదియు, లోక రఞ్జకం = లోకమునకు ఆనందకరముగ నుండునదియు, సదలంకృతి = మంచి అలంకారములు గల, కావ్యం = కావ్యము, కల్పాన్తరస్థాయి = కల్పము మారు వరకును, అనగా కల్పాంతము వరకును స్థిరమై, జాయతే = అగును. మహా కావ్యములోని సర్గలను గూర్చి సాహిత్యదర్పణమున ఇట్లు చెప్పబడినది :—

"ఏకవృత్తమయైః పద్యైరవసానేఽన్యవృత్తకైః
నాతిస్వల్పా నాతిదీర్ఘాః సర్గా అష్టాధికా మతాః.
నానావృత్తమయః క్వాపి సర్గః కశ్చన దృశ్యతే
సర్గాన్తే భావిసర్గస్య కథాయాః సూచనం భవేత్".

మహాకావ్యములో సర్గలు ఎనిమిదికంటె ఎక్కువ ఉండవలెను. ఒక సర్గలో అనేకవృత్తములను ప్రయోగింపవచ్చును. సర్గాంతమున రాబోవు సర్గలోని కథను సూచించవలెను అనునది అధికముగ చెప్పబడినది.

మూ. న్యూనమప్యత్ర యైః కైశ్చిదఙ్గైః కావ్యం న దుష్యతి
యద్యుపాత్తేషు సమ్పత్తిరారాధయతి తద్విదః. 20

వ్యా. అత్ర = ఇచట చెప్పిన వర్ణనలలో, యైఃకైశ్చిత్ అఙ్గైః = ఏవో కొన్ని అంగములతో అనగా వర్ణనలతో, న్యూనమపి = తక్కువైనను, కావ్యం = కావ్యము, ఉపాత్తేషు = కవిచేస్వీకరింపబడిన వర్ణనలలోని, సమ్పత్తిః = సమృద్ధి, తద్విదః = కావ్యవేత్త లగు సహృదయులను, ఆరాధయతి యది = ఆనందింపచేసినట్లైతే, నదుష్యతి = దుష్టముకాదు.

పైన చెప్పిన వర్ణనలలో ఏవో కొన్ని వర్ణనలే చేసినను, ఆ చేసినంత వరకు సహృదయహృదయాహ్లాదకములైనచో కావ్యము మంచిదే అని యర్థము.

"నావర్ణనం నగర్యాదేర్దోషాయ విదుషాం మతమ్.
యది శైలర్తురాత్ర్యాదేర్వర్ణనేనైవ తుష్యతి".
అని భోజరాజు చెప్పినాడు.

మూ. గుణతః ప్రాగుపన్యస్య నాయకం తేన విద్విషామ్
నిరాకరణమిత్యేష మార్గః ప్రకృతిసున్దరః. 21

వ్యా. గుణతః = గుణములచేత, నాయకం = నాయకుని, ప్రాక్ = ముందుగా, ఉపన్యస్య = వర్ణించి, తేన = ఆనాయకునిచే, విద్విషాం = శత్రువులయొక్క, నిరాకరణం = పరాజయమును వర్ణించుట అను, ఏషః = ఈ, మార్గః = మార్గము, ప్రకృతిసున్దరః = స్వభావముచేతనే (సహజముగ) సుందరమైనది.

వి. రామాయణాదులలో వలె ముందుగ నాయకుని గుణగణాదులను బాగుగ వర్ణించి ఆతడు ప్రతినాయకుని జయించి నట్లు వర్ణించుట సహజసుందర మగు మార్గము.

మూ. వంశవీర్యశ్రుతాదీని వర్ణయిత్వా రిపోరపి
తజ్జయాన్నాయకోత్కర్షకథనం చ ధినోతి నః. 22

వ్యా. రిపోః = శత్రువుయొక్క, అనగా ప్రతినాయకునియొక్క, వంశవీర్యశ్రుతాదీన్యపి = వంశము, వీర్యము, శాస్త్రపాండిత్యము మొదలగు విషయములను గూడ, వర్ణయిత్వా = వర్ణించి, తజ్జయాత్ = ఆతనిని జయించుట ద్వారా, నాయకోత్కర్షకథనం చ = నాయకుని గొప్పగా వర్ణించుట అనునది కూడ, నః = మమ్ములను, ధినోతి = ఆనందింప చేయుచున్నది.

వి. మహాభారతాదులందు వలె ముందుగా ప్రతినాయకుని పరాక్రమాదులను వర్ణించి ఆతనిని జయించుట ద్వారా నాయకుని ఉత్కర్షను వర్ణించినను మాకు అంగీకార్యమే. ఈ పద్ధతి భామహునకు అంగీకార్యము కాదు. (చూ. కావ్యాలంకారము I-22; 23).

మూ. అపాదః పదసన్తానో గద్యమాఖ్యాయికా కథా
ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ తయోరాఖ్యాయికా కిల. 23

వ్యా. అపాదః = పద్యమునందు వలె పాదవిభజన లేని, పదసన్తానః = పదముల సముదాయము, గద్యమ్ = గద్యము. ఆఖ్యాయికా = ఆఖ్యాయిక అనియు, కథా = కథ అనియు, తస్య = దానియొక్క, ద్వౌ = రెండు, ప్రభేదౌకిల = భేదములట. 'కిల' అనుటచే ఈ విభాగము తనకు అనిష్ట మని సూచింపబడినది. భామహుడు ఈ విభాగమును అంగీకరించి నాడు. తయోః = ఆ రెండింటిలో, ఆఖ్యాయికా = ఆఖ్యాయిక - ఉత్తర శ్లోకముతో అన్వయము.

మూ. నాయకేనైవ వాచ్యాన్యా నాయకేనేతరేణ వా
స్వగుణావిష్క్రియా దోషో నాత్ర భూతార్థశంసినః. 24

వ్యా. (ఆఖ్యాయిక) నాయకేనైవ = నాయకుని చేతనే, వాచ్యా = చెప్పదగినది. అన్యా = రెండవది. కథ, నాయకేన = నాయకుని చేత గాని, ఇతరేణవా = ఇతరునిచేగాని, చెప్పదగినది అత్ర = ఈ కథయందు, భూతార్థ శంసినః = జరిగిన యథార్థ విషయమును చెప్పు నాయకునకు, స్వగుణావిష్క్రియాదోషః = తన గుణములను తానే చెప్పుగొనుట అనెడు దోషము, న = లేదు.

వి. ఆఖ్యాయికలో నాయకుడే స్వవృత్తాంతమును చెప్పును; కథలో నాయకుడుగాని, అన్యుడు కాని చెప్పును అని ఇచట చెప్పబడినది. కాని భామహుడు "కథలో అన్యుడే నాయక వృత్తాంతమును చెప్పును; ఉదాత్త స్వభావము కలవాడు తన ప్రశంస తానే చేసికొనడు కదా!" అని చెప్పియున్నాడు. ఇట్టి భేదములను బట్టి దండి భామహమతమును కాక ఎవరో మరియొక ప్రాచీనరచయిత మతమును ఇచటచూపుచున్నాడని తెలియవలెను.

అవ. ఆఖ్యాయికకును కథకును ప్రాచీనులు చెప్పిన భేదము అసంగతమని చెప్పుచున్నాడు.

మూ. అపి త్వనియమో దృష్ట స్తత్రా ప్యన్యై రుదీరణాత్
అన్యో వక్తా స్వయం వేతి కీదృగ్వా భేదకారణమ్. 25

వ్యా. అపితు = కాని, తత్రాపి = ఆఖ్యాయిక విషయమునగూడ, అన్యైః = నాయకేతరులచేత గూడ, ఉదీరణాత్ = వృత్తాంతము చెప్పబడుటచే, అనియమః = ఆఖ్యాయికలో నాయకుడు చెప్పును, కథలో నాయకుడు కాని అన్యుడు కాని చెప్పును అని నియమముయొక్క అభావము, దృష్టః = చూడబడినది. అనగా నాయకేతరుడు వక్తగాగల ఆఖ్యాయికలు కూడ ఉన్నవి.

వక్తా = వక్త, అన్యః = అన్యుడా, స్వయంవా = తానేనా, ఇతి = అనునది, కీదృక్వా = ఎంతటిది, భేదకారణమ్ = భేదకారణము? ఇదియొక భేద హేతువా అని యర్థము.

మూ. వక్త్రం చాపరవక్త్రం చ సోచ్ఛ్వాసత్వం చ భేదకమ్
చిహ్నమాఖ్యాయికాయాశ్చేత్ప్రసఙ్గేన కథాస్వపి. 26

ఆర్యాదివత్ ప్రయోగః కిం న వక్త్రాపరవక్త్రయోః
భేదశ్చ దృష్టో లమ్బాదిరుచ్ఛ్వాసో వాస్తు కిం తతః. 27

వ్యా. వక్త్రమ్ = వక్త్రచ్ఛందస్సు, అపరవక్త్రంచ = అపర వక్త్రచ్ఛందస్సు, సోచ్ఛ్వాసత్వంచ = ఉచ్ఛ్వాసము లనెడు ప్రకరణ నామ ధేయములు కలిగి యుండుటయు, ఆఖ్యాయికాయాః = ఆఖ్యాయికయొక్క, చిహ్నం చేత్ = చిహ్నమైనచో, ప్రసంగేన = ప్రసంగ వశముచేత, కథాస్వపి = కథలయందు కూడ, వక్త్రాపరవక్త్రయోః = వక్త్రాపర వక్త్రచ్ఛందస్సుల, ప్రయోగః = ప్రయోగము, కింన = ఏలఉండకూడదు? లమ్బాదిః = లంబకము మొదలగునది గాని, ఉచ్ఛ్వాసఃవా = ఉచ్ఛ్వాసమను పేరుగలదిగాని, భేదః = ప్రకరణ (విభాగ) నామభేదము, దృష్టః = ఉపలభ్యమానమగు విధముగ, అస్తు = ఉండుగాక. తతః = నామమాత్ర భేదము వలన, కిమ్ = ఏమి?

వి. వక్త్రాపరవక్త్రములను ఆఖ్యాయికలోనే ప్రయోగింపవలెనని నియమమేమి ఉన్నది. ఆర్యాఛందస్సును ప్రయోగించినట్లే పై ఛంద స్సులను కూడ కథలో ప్రయోగించినంత మాత్రమున దోషమేమి ? అట్లే ఆఖ్యాయికలోని ప్రకరణములకు ఉచ్ఛ్వాసమని పేరు పెట్టవలెననియు, కథ లోని ప్రకరణములకు లంబమని పేరుపెట్టవలెననియు కథాఖ్యాయికలకు భేదము నంగీకరించువారు చెప్పుదురు. నామమాత్రభేదముచే ప్రయోజన మేమి అని అర్థము.

మూ. తత్ కథాఖ్యాయికేత్యేకా జాతిః సంజ్ఞాద్వయాఙ్కితా
అత్రైవాన్తర్భవిష్యన్తి శేషాశ్చాఖ్యానజాతయః. 28

వ్యా. తత్ = ఆకారణము వలన, కథా ఆఖ్యాయికేతి = కథయు, ఆఖ్యాయికయు అని, సంజ్ఞాద్వయా ఙ్కితా = రెండు సంజ్ఞలతో చిహ్నిత. మైన (అనగా రెండు పేర్లు పెట్టిన), ఏకా = ఒక్క, జాతిః = జాతియే. శేషాః = మిగిలిన, ఆఖ్యానజాతయః = అగ్ని పురాణాదులలో— "ఆఖ్యాయికా కథా ఖణ్డకథా పరికథా తథా. కథాలికేతి మన్యన్తే గద్యకావ్యఞ్చ పఞ్చధా" అని చెప్పిన ఖండకథ, పరికథ, కథాలిక మొదలగు ఇతర ఆఖ్యానజాతులు కూడ, అత్రైవ = దీనియందే (కథయందే) అన్తర్భవిష్యన్తి = అంతర్గతము లగును.

మూ. కన్యాహరణసఙ్గ్రామవిప్రలమ్భోదయాదయః
సర్గబన్ధసమా ఏవ నైతే వైశేషికా గుణాః. 29

వ్యా. కన్యా... ... ఉదయాదయః = కన్యాహరణము, యుద్ధము, విప్రలంభము, నాయకాభ్యుదయము మొదలగునవి, సర్గబంధ సమాః ఏవ = సర్గబంధముతో, అనగా మహాకావ్యముతో, సమానమైనవే. ఏతే = ఇవి, వైశేషికాః గుణాః = ఆఖ్యాయికకు మాత్రమే సంబంధించిన గుణవిశేషములు, న = కాదు.

వి. భామహుడు ఆఖ్యాయికాలక్షణము చెప్పుచు "కన్యాహరణ సంగ్రామ విప్రలమ్భోదయాన్వితా" అని చెప్పినాడు. దండి మనస్సులో భామహుడున్నాడా మరియెవరైన ఉన్నారా అనునది స్పష్టముకాదు. కన్యాహరణాదులు మహాకావ్యములో ఉండవచ్చును గాన ఆఖ్యాయికలో మాత్రమే ఉండవలెనను నియమమేమి అని యర్థము. కథాఖ్యాయికలకు భేదము చెప్పువారు ఇవి సర్గబంధములో ఉండవచ్చును కాని కథలో ఉండకూడదు అని సమాధానము చెప్పవచ్చును కదా ?

మూ. కవిభావకృతం చిహ్నమన్యత్రాపి న దుష్యతి
ముఖమిష్టార్థసంసిద్ధౌ కిం హి న స్యాత్ కృతాత్మనామ్. 30

వ్యా. 'కవేరభిప్రాయకృతైః కథనైః కైశ్చిదఙ్కితా' అని భామహుడు చెప్పినాడు. కవి తన అభిప్రాయమునకు అనుగుణముగా కొన్ని పదములను ఆఖ్యాయికలో అక్కడక్కడ చిహ్నముగా కూర్చుచుండవలెను అని యర్థము. ఈ వాక్యమునో లేదా ఏతదర్థకమగు ప్రాచీనుల వాక్యమునో మనస్సులో నుంచుకొని చెప్పుచున్నాడు :- కవిభావకృతం = కవియొక్క భావముచే కూర్చబడిన, చిహ్నం = చిహ్నము, అన్యత్రాపి = కథాదులందు కూడ, న దుష్యతి = దోషము కాజాలదు. కృతాత్మనాం = బుద్ధిమంతులకు, ఇష్టార్థసంసిద్ధౌ = వారికి అభీష్టమగు విషయము సిద్ధించుటకై, కిం = ఏది, ముఖం = ద్వారము, న స్యాత్ = కాజాలదు ?

వి. స్వతంత్రుడును, బుద్ధిమంతుడును అగు కవి ఇష్టార్థమును సాధించుటకై, అనగా మంగళరూపమగు ఫలమును కాని, మరియొక ఏదైన ఫలమునుగాని సాధించుటకై, ఎట్టి కావ్యమునందైనను చిహ్నాదులను చేర్చవచ్చును. భారవి కిరాతార్జునీయమున సర్గాంతపద్యమునందు 'లక్ష్మి' శబ్దమును, మాఘుడు 'శ్రీ' శబ్దమును అట్లే ఇతరులును ప్రయోగించినారు. అందుచే ఆఖ్యాయికలోనే అట్టి చిహ్నముంచవలె నని నియమము లేదు.

మూ. మిశ్రాణి నాటకాదీని తేషా మన్యత్ర విస్తరః
గద్యపద్యమయీ కాచిచ్చంపూరిత్యభిధీయతే. 31

వ్యా మిశ్రాణి = గద్యపద్య మిశ్రములైనవి. నాటకాదీని = నాటకాది రూపకములు. తేషాం = వాటికి సంబంధించిన, విస్తరః = విస్తృత వర్ణనము, అన్యత్ర = నాట్యశాస్త్రాదులలో చేయబడినది. కాచిత్ = ఒకవిధమైన, గద్యపద్యమయీ = గద్యపద్యరూప మగు రచన, చమ్పూరితి = చంపువు అని, అభిధీయతే = చెప్పబడును.

మూ. తదేతద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా
అపభ్రంశశ్చ మిశ్రం చేత్యాహురార్యాశ్చతుర్విధమ్. 32

వ్యా. తత్ = ఆ, అనగా ఇంతవరకును చెప్పబడిన, ఏతత్ = ఈ, వాఙ్మయం = వాఙ్మయము, సంస్కృతం = సంస్కృత మనియు, ప్రాకృతం = ప్రాకృత మనియు, తథా = మరియు, అపభ్రంశశ్చ = అపభ్రంశమనియు, మిశ్రంచ = సంస్కృతాది వివిధ భాషామిశ్ర మనియు, భూయః = మరల, చతుర్విధం = నాలుగు విధములైనది, ఇతి = అని, ఆర్యాః = కావ్యస్వరూపజ్ఞులు, ఆహుః చెప్పుదురు.

మూ. సంస్కృతం నామ దైవీ వాగన్వాఖ్యాతా మహర్షిభిః
తద్భవ స్తత్సమో దేశీత్యనేకః ప్రాకృతక్రమః. 33

వ్యా. సంస్కృతం నామ = సంస్కృత మనగా, మహర్షిభిః = మహర్షులచేత, యాస్కపాణి న్యాదులచేత, అన్వాఖ్యాతా = ప్రకృతి ప్రత్యయాది విభాగముతో నిర్వచింపబడిన, దైవీవాక్ = దేవలచే వ్యవహరింపబడు వాక్కు. లేదా సంస్కృతమనగా దేవతల భాషయని మునులు చెప్పుదురు అని అర్థము కూడ చెప్పవచ్చును. మొదటి అర్థము యుక్తతరము, తద్భవః = సంస్కృత భాషాజన్య మనియు, తత్సమః = సంస్కృత సమమనియు, దేశీతి = దేశసంబద్ధ మనియు, ప్రాకృతక్రమః = ప్రాకృతభాషల క్రమము, అనగా విభాగము, అనేకః = అనేక విధములైనది. 'హస్త' 'కర్ణ' మొదలగు శబ్దములనుండి జనించిన 'హత్థ' 'కణ్ణ' మొదలగు ప్రాకృత శబ్దములు సంస్కృత భవములు. అనగా సంస్కృతమునుండి జనించి కొంచెము మార్పు చెందునవి. కొన్ని సంస్కృత పదములనే యథాతథముగ ప్రాకృత భాషలలో ప్రయోగింతురు. అవి సంస్కృత సమములు. సంస్కృతముతో పూర్వోక్త విధమగు సంబంధమేమియు లేనివియు, కొన్ని ప్రాంతములలో ప్రచారములో నున్నవియు ఐన శబ్దములు దేశ్యములు. ప్రాకృతు లనగా గ్రామ్యజనులు వారిచే వ్యవహరిం

బడునది గాన ప్రాకృతమని కొందరు చెప్పుదురు సంస్కృతము ప్రకృతి; అనగా మూలకారణము. దానినుండి పుట్టినది గాన ప్రాకృతమని కొందరు చెప్పుదురు. ప్రాకృతభాషనే సంస్కరింపగా సంస్కృత మైనదనియు, అందుచే సంస్కృతమునకు ప్రాకృతమే ప్రకృతి యనియు కొందరు చెప్పుదురు.

మూ. మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగరః సూక్తిరత్నానాం సేతుబన్ధాది యన్మయమ్. 34

వ్యా. యన్మయమ్ = ఏ మహారాష్ట్రభాషలో రచించిన, సేతుబన్ధాది = 'సేతుబంధము' అను ప్రవరసేన రచితమగు కావ్యము మొదలగునవి, సూక్తి రత్నానాం = సూక్తి రత్నములకు సాగరః = సముద్రమో అట్టి, మహారాష్ట్రా శ్రయాం = మహారాష్ట్ర దేశమునకు సంబంధించిన, భాషాం = భాషను, ప్రకృష్టం = ఉత్తమమైన, ప్రాకృతం = ప్రాకృతమునుగా, విదుః = చెప్పు చున్నారు. 'సేతుబన్ధాది' అనునపుడు 'ఆది' పదముచె 'గాథా సప్తశతి' మొదలగు కావ్యములు గ్రాహ్యములు

మూ. శౌరసేనీ చ గౌడీ చ లాటీ చాన్యా చ తాదృశీ
యాతి ప్రాకృతమిత్యేవ వ్యవహారేషు సన్నిధిమ్. 35

వ్యా. శౌరసేనీ = శౌరసేనియు, గౌడీ = గౌడభాషయు, లాటీ = లాటియు, తాదృశీ = అట్టిదేయైన, అన్యాచ = ఇతరమైన భాషయు, ప్రాకృత మిత్యేవ = ప్రాకృతమనియే, వవ్యహారేషు = లోకవ్యవహారములందు, సన్ని ధిం = సంబంధమును, యాతి = పొందుచున్నది. ఈ భాషలన్నియు ప్రాకృత మని వ్యవహరింపబడుచున్నది.

మాగధ్యవన్తిజా ప్రాచ్యా శూరసేనార్ధమాగధీ
బాహ్లికా దాక్షిణాత్యా చ సప్త భాషాః ప్రకీర్తితాః"

అని నాట్యశాస్త్రమున ఏడు ప్రాకృతభాషలు చెప్పబడినవి. ఈ విధముగ ప్రాకృతభాష లన్నియు దేశనామములతో ముడివడి ఉన్నవి.

మూ. ఆభీరాదిగిరః కావ్యేష్వపభ్రంశ ఇతి స్మృతాః
శాస్త్రేషు సంస్కృతాదన్యదపభ్రంశతయోదితమ్. 36

వ్యా. ఆభీరాదిగిరః = ఆభీరులు, అనగా గోపాలులు మొదలగువారి భాషలు, 'ఆది' శబ్దముచే, శబర శక చండాలాదులకు గ్రహణము, అపభ్రంశః ఇతి = అపభ్రంశభాష అని, కావ్యేషు = కావ్యములందు, స్మృతాః = చెప్పబడినవి, సంస్కృతాత్ = సంస్కృతము కంటె, అన్యత్ = భిన్నమైన ప్రతియొక్క భాషయు, శాస్త్రేషు = శాస్త్రములందు, అపభ్రంశతయా = అపభ్రంశ భాషగా, ఉదితమ్ = చెప్పబడినది. ఆభీరాది జాతుల వారు మాటలాడు భాషలకు అపభ్రంశ మని కావ్యములలో వ్యవహారము. కాని శాస్త్రములలో, సంస్కృత భిన్నములగు భాషలన్నింటికి (ప్రాకృతములతో సహా) అపభ్రంశ భాషలే అని వ్యవహారము

మూ. సంస్కృతం సర్గబన్ధాది ప్రాకృతం స్కన్ధకాది యత్
ఓసరాదిరపభ్రంశో నాటకాది తు మిశ్రకమ్. 37

వ్యా. సర్గబంధాది = మహాకావ్యాదికము, సంస్కృతం = సంస్కృత భాషయందే ఉండును. "సర్గబంధో మహాకావ్య మారబ్ధం సంస్కృతేన యత్. తద్భవం న విశేత్తత్ర తత్సమం నాపి కించన" అని ఆగ్నేయపురాణము. మహాకావ్యములో సంస్కృతమునకే కాని, తద్భవ-తత్సమములకు ప్రవేశము లేదు అని అర్థము. యత్ = ఏ, స్కన్ధ కాది = స్కంధకమను ఛందస్సులో రచింపబడునో అది, ప్రాకృతం = ప్రాకృతభాషలో ఉండును. "ఛన్దసా స్కన్ధకేనైతత్ క్వచిద్గలితకైరపి" అని చెప్పబడినది. 'సేతుబంధము' మొదలగునవి ఉదాహరణము. ఓసరాదిః = ఓసరచ్ఛందస్సు మొదలగు వాటిలో కూర్చినది, అపభ్రంశః = అపభ్రంశ భాషలో ఉండును. అపభ్రంశ కావ్యములోని సర్గలకు 'కుడవకములు' అని పేరు.

"అపభ్రంశాభిధానేఽస్మిన్ సర్గాః కుడవకాభిధాః
తథాపభ్రంశయోగ్యాని చ్ఛన్దాంసి వివిధాని చ". కర్ణపరాక్రమాదికములు

అపభ్రంశకావ్యములకు ఉదాహరణము. నాటకాది = నాటకము మొదలగు రూప
కములు, మిశ్రకం = వివిధభాషల కలయికతో రచింపబడును. పాత్రభేదమును
పట్టి నాటకాదులలో భాషాభేద ముండును అని సాహిత్య దర్పణము చెప్పుచున్నది.

"పురుషాణా మనీచానాం సంస్కృతం స్యాత్ కృతాత్మనామ్
శౌరసేనీ ప్రయోక్తవ్యా తాదృశీనాం చ యోషితామ్
ఆసామేవ తు గాథాసు మహారాష్ట్రీం ప్రయోజయేత్
అత్రోక్తా మాగధీభాషా రాజాన్తః పురచారిణామ్
చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాం చార్ధమాగధీ
ప్రాచ్యా విదూషకాదీనాం ధూర్తానాం స్యాదవన్తికా
యోధనాగరికాదీనాం దాక్షిణాత్యా హి దీవ్యతామ్
శబరాణాం శకాదీనాం శాబరీం సమ్ప్రయోజయేత్."

మూ. కథా హి సర్వభాషాభిః సంస్కృతేన చ బధ్యతే
భూతభాషామయీం ప్రాహురద్భుతార్థాం బృహత్కథామ్.

వ్యా. కథా = కథ, సర్వభాషాభిః = అన్నిభాషలచేతను(భాషలందును)
సంస్కృతేన చ = సంస్కృతము చేతను, బధ్యతే = కూర్పబడును, 'హి'
అనునది ప్రసిద్ధిద్యోతకము. భూతభాషామయీమ్ = పైశాచభాషలో వ్రాయబ
డిన, అద్భుతార్థామ్ = అద్భుతమైన విషయముగల కథను, బృహత్కథామ్ =
బృహత్కథనుగా లేదా బృహత్కథను భూతభాషామయమైన దానినిగా,
ప్రాహుః = చెప్పుదురు. ఈ బృహత్కథ ఇపుడు లభ్యము కాదు.

మూ. లాస్యచ్ఛలితశమ్పాది ప్రేక్షార్థమితరత్ పునః
శ్రవ్యమేవేతి సైషాపి ద్వయీ గతిరుదాహృతా, 39

వ్యా. లాస్య-చ్ఛలిత-శమ్పాది = లాస్యము, ఛలితమూ, శంప మొద
లగునది, ప్రేక్షార్థం = చూచుట కొరకు ఉద్దిష్టమైనది. అనగా దృశ్యము.

ఇతరత్ పునః = లాస్యాదులకంటె భిన్న మైన సద్గబంధాదిక మైతే, శ్రవ్య మేవ = వినుటకు మాత్రమే ఉపయోగించునది. ఇతి ఈ విధముగ, ఏషా = ఈ, ద్వయీ = ద్వివిధమగు, గతిఃఅపి = పద్ధతికూడ, అనగా దృశ్యకావ్యము, శ్రవ్య కావ్యము అను విభాగము కూడ, ఉదాహృతా = చెప్పబడినది.

శృంగారరసప్రధాన మగు స్త్రీజననృత్యము లాస్యము "లాసః స్త్రీపుంస యోర్భావః తదర్హం తత్ర సాధు వా. లాస్యం మనసిజోల్లాసకరం మృద్వఙ్గ హాసవత్. దేవ్యై దేవోపదిష్టత్వాత్ ప్రాయః స్త్రీభిః ప్రయుజ్యతే." అనియు, "కోమలం మధురం లాస్యం శృఙ్గారరససంయుతమ్. గౌరీతోషకరం చాపి స్త్రీనృత్యం తు తదుచ్యతే" అనియు లాస్యస్వరూపము చెప్పబడినది. "పుంనృత్యం ఛలితం ప్రాహుః" అని చెప్పిన ప్రకారముగ పురుషనృత్యము నకు ఛలిత మని పేరు. కొందరు 'ఛలికం' అను పాఠమును గ్రహించి "ఛలికం ఛద్మనా నృత్తంసూరయ స్తద్విదో విదుః" అని చెప్పిన విధమున ఏదియో ఒక మిషచే గూఢ భావమును తెలుపుటకై చేయు నాట్యవిశేష మని చెప్పుదురు. 'శమ్యా' అనగా పూర్వరంగాతర్గత మగు వాద్య ప్రయోగ విశేషము. "శమ్యా తు ద్వికలా కార్యాతాలో ద్వికల ఏవ చ పునశ్చైకకలా శమ్యా సన్నిపాతః కలాత్రయమ్". 'ఆది' అనుటచే తాండవ-హల్లీసక-రాసకములను గ్రహించ వలెను. "వీరరౌద్రరసాధారమద్భుతం శఙ్కర ప్రియమ్'. పురుషేణ సమారబ్ధం నృత్యం తాణ్డవముచ్యతే"; "మణ్డలేన తు యత్ స్త్రీణాం నృత్యం హల్లీసకం తు తత్ తత్ర నేతా భవేదేకో గోపస్త్రీణాం యథా హరిః"; అని చెప్పిన విధమున తాండవ మనగా వీరరౌద్రరసప్రధాన మగు పురుషనాట్యము; హల్లీసక మనగా ఒక పురుషుడు మధ్య నిలిచి నాయకత్వము చేయుచుండ స్త్రీలు మండలా కారముగ ఏర్పడి చేయు నాట్యము. తాలబంధ విశేషముతో కూడిన హల్లీసకమే రాసకము.

మూ. అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్.
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాన్తరౌ. 40

వ్యా. పరస్పరం = పరస్పరము, సూక్ష్మభేదః = సూక్ష్మమైన భేదము గల, అనేకః = అనేకవిధమైన, గిరాంమార్గః = వాక్కుల యొక్క మార్గము; కావ్యరీతి, అస్తి = ఉన్నది. తత్ర = అందు, ప్రస్ఫుటాన్తరౌ = స్పష్టముగ కనబడుభేదము గల, వైదర్భగౌడీయౌ = వైదర్భగౌడ మార్గములు, వర్ణ్యేతే = చెప్పబడుచున్నవి

మూ. శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తిరుదారత్వమోజఃకాన్తి సమాధయః. 41
ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశ గుణాః స్మృతాః
ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని 42

వ్యా. శ్లేషము, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత్వము, ఓజస్సు, కాంతి, సమాధి,-ఇతి = ఈవిధముగా, దశ గుణాః = పది గుణములు, వైదర్భమార్గస్య = వైదర్భ మార్గమునకు, ప్రాణాః = ప్రాణములుగా, స్మృతాః = చెప్పబడినవి. ప్రాయః = సాధారణముగా, గౌడవర్త్మని = గౌడ మార్గమునందు, ఏషాం = ఈగుణములకు, విపర్యయః = వ్యత్యాసము, దృశ్యతే = కనబడుచున్నది. ఈ దశగుణములను భరతుడు కూడ నాట్యశాస్త్రమున చెప్పి ఉన్నాడు:- "శ్లేషః ప్రసాదః సమతా సమాధిర్మాధుర్యమోజః పదసౌకుమార్యమ్, అర్థస్య చ వ్యక్తిరుదారతా చ కాన్తిశ్చ కావ్యార్థగుణా దశైతే." ఈ పది గుణములలో శ్లేష-ప్రసాద-సుకుమారతా-ఓజస్సులు శబ్దగుణములు. ప్రసాద-అర్థవ్యక్తి-ఉదారతా-కాంతి-సమాధులు అర్థగుణములు. మాధుర్యము ఉభయగుణము అని దండి మతము. వామనాదులు పది శబ్దగుణములను, పది అర్థగుణములను అంగీకరింతురు.

మూ. శ్లిష్టమస్పృష్టశైథిల్య మల్పప్రాణాక్షరోత్తరమ్
శిథిలం "మాలతీమాలా లోలాలి కలిలా" యథా. 43

వ్యా. అస్పృష్టశైథిల్యం = స్పృశింపబడని శైథిల్యము కలది, శ్లిష్టం = శ్లేష గుణము కలది. ఇపుడు శైథిల్యమనగా ఏదియో చెప్పుచున్నాడు-అల్పప్రాణాక్ష

రోత్తరం = అధికముగ అల్ప ప్రాణాక్షరములు గలది. శిథిలం = శిథిలము. కవర్గాది వర్గపంచకములోని ప్రథమ-తృతీయ-పంచమవర్ణములకు, యరలవల కును అల్పప్రాణము అనిపేరు. ఆ వర్ణములను అధికముగ కూర్చి చేసిన రచన శిథిలముగ నుండును ఎట్లనగా-లోలాలికలిలా = చంచలములైన తుమ్మెదలచే వ్యాప్తమైన, మాలతీమాలా = కుసుమమాల; "మాలతీమాలా లోలాలికలిలా" అను నపుడు అల్పప్రాణాక్షరములే ఉన్నవి గాన ఇది శిథిలము. అందుచే ఇందులో శ్లేషము అను గుణము లేదు.

మూ. అనుప్రాసధియా గౌడైస్తదిష్టం బన్ధగౌరవాత్
వైదర్భైర్మాలతీ దామ లఙ్ఘితం భ్రమరైరితి. 44

వ్యా. అనుప్రాసధియా = అనుప్రాస మున్నదికదా అను అభిప్రాయ ముచే, తత్ = 'మాలతీమాలా' ఇత్యాది విధమగు శిథిలరచన, గౌడైః = గౌడులచే, ఇష్టం = అంగీకరింపబడినది. కాని, వైదర్భైః = వైదర్భులచేత, "మాలతీదామ లఙ్ఘితం భ్రమరైః", ఇతి = భ్రమరములచే మాలతీమాల లంఘింపబడెను" అనునది, అనగా మహాప్రాణవర్ణములైన ఘకారభకారముల కలయికచే బంధములో ఒకవిధమగుబిగువు ఏర్పడి శ్లేషగుణ సహితముగనున్న రచన, బన్ధగౌరవాత్ = బంధమునందలి గౌరవముచే, వైదర్భులకు అనుప్రా సము కంటె బంధము ప్రియమగుటచే, (ఇష్టం = అంగీకరింపబడినది).

మూ. ప్రసాదవత్ ప్రసిద్ధార్థ మిన్దోరిన్దీవరద్యుతి
లక్ష్మ లక్ష్మీం తనోతీతి ప్రతీతిసుభగం వచః 45

వ్యా. ప్రసిద్ధార్థం = ప్రసిద్ధమైన అర్థము కలది, అనగా అనేకార్థ పదములను ప్రయోగింపక పోవుటచేతను, అధికపదత్వ-కష్టత్వాది దోషములు లేకపోవుటచేతను చదివిన వెంటనే అర్థస్ఫూర్తి కలిగించునది, ప్రసాదవత్ = ప్రసాద మనుగుణము కలది. ఇన్దీవరద్యుతి = నల్లకలువ వంటి కాంతిగల, ఇన్దోః = చంద్రునియొక్క, లక్ష్మ = చిహ్నము, లక్ష్మీం = శోభను, తనోతి =

చేయుచున్నది; ఇతి = ఈ విధమగు, వచః = వాక్కు, ప్రతీతి సుభగం = అర్థము వెంటనే స్ఫురించుటచే సుందరమైనది.

మూ. వ్యుత్పన్నమితి గౌడీయైర్నాతిరూఢ మపీష్యతే
యథానత్యర్జునాబ్జన్మ సదృక్షాఙ్కో వలక్షగుః. 46

వ్యా. నాతిరూఢమపి = ఎక్కువ ప్రసిద్ధార్థము కానిదికూడా, వ్యుత్పన్నమితి = అవయవార్థము కలదికదా అను కారణముచే, గౌడైః = గౌడులచే, ఇష్యతే = అంగీకరింపబడును. యథా = ఎట్లనగా, వలక్షగుః = తెల్లని కిరణములుగల చంద్రుడు, "వలక్షాః గావః యస్య సః"; అనత్యర్జునాబ్జన్మ సదృక్షాఙ్కః = ఎక్కువ తెల్లగా లేని పద్మముతో సమానమైన అంకము కలవాడు.

'అర్జున' శబ్దమునకు కార్తవీర్యుడు, లేక భీమానుజుడు అను అర్థము ప్రసిద్ధము. 'తెల్లని' అను అర్థము అప్రసిద్ధము కావున నిహతార్థత్వదోషము. అబ్జన్మ శబ్దము ("అప్సు జన్మయస్యతత్") కమలరూపార్థమునకు అవాచకము. 'అబ్జన్మాఙ్కః' (అబ్జన్మేవ అఙ్కః యస్య సః) అను బహువ్రీహిచేతనే సదృశత్వరూపార్థము లభించుచుండగా, మరల 'సదృక్ష' శబ్ద ప్రయోగము అనావశ్యకము. అందుచే అధికపదతాదోషము. వలక్షశబ్దము శ్రుతికటువు కూడ. 'వలక్షగు' శబ్దమునందుకూడ అప్రయుక్తతాదోష మున్నది. ఈ విధముగ అనేక దోషములున్నను, అవయవార్థాదులచే అర్థబోధను కలిగించుచున్నది గాన ఇట్టి రచన గ్రాహ్యమేయని గౌడుల అభిప్రాయము. వాస్తవమున-'గౌడీ'రీతిని అంగీకరించువారు ప్రసాదగుణమునకు ప్రాధాన్య మీయకపోయినను, ఇట్టి దోషములు పరిహార్యములని వారు కూడ అంగీకరింతురు. అందుచే ఇట్టి రచనను సత్కావ్యమని వారుకూడ అంగీకరింపరు. ఇది దండి కేవలము తనకుగల వైదర్భీ పక్షపాతముచే, గౌడీ పరిహాసార్థమై, చెప్పిన ఉదాహరణము.

మూ. సమం బన్ధేష్వవిషమం తే మృదుస్ఫుటమధ్యమాః
బన్ధా మృదుస్ఫుటోన్మిశ్రవర్ణవిన్యాసయోనయః. 47

వ్యా. బన్ధేషు = బంధములందు, అవిషమమ్ = వైషమ్యములేనిది, సమమ్ = సమము. మొదట ఎట్టి బంధముతో ప్రారంభము చేయబడునో ఆ బంధమునే చివరివరకును నడిపినచో అది సమము. మృదుస్ఫుటోన్మిశ్ర వర్ణ విన్యాస యోనయః = మృదువులు, వికటములు, మిశ్రములు అయిన వర్ణముల విన్యాసమువలన ఏర్పడు, తే = అవి, మృదుస్ఫుట మధ్యమాః = మృదువు, స్ఫుటము మధ్యమము అను, బన్ధాః = బంధములు. హ్రస్వస్వరములు, వర్గ పంచమాక్షరములు, దంత్య వ్యంజనములు (తవర్గము) మృదువర్ణములు, దీర్ఘ స్వరములు, ఓష్ఠ్య వ్యంజనములు (పవర్గము) ఠ-ఢ-శ-ష-స-హ లు వికట వర్ణములు. ఇవి కలిసినచో మిశ్రవర్ణములు. ఇచట వర్ణశబ్దము సమాస రాహిత్య-దీర్ఘసమాస మధ్యమ సమాసములకు ఉపలక్షణము. కావున మృదు వర్ణములతో కూర్చిన సమాసరహితమగు రచన మృదుబంధము. వికటవర్ణము లతో కూర్చిన దీర్ఘసమాస యుతమగు రచన స్ఫుటబంధము. మిశ్రమవర్ణము లతోకూర్చిన మధ్యమ సమాస యుతమగు రచన మధ్యమ బంధము. కావున ప్రారంభించిన బంధమునే చివరి వరకును నడిపినచో అది సమతాగుణము.

మూ. కోకిలాలాపవాచాలో మామైతి మలయానిలః
ఉచ్ఛలచ్ఛీకరాచ్ఛాచ్ఛ నిర్ఝరామ్భః కణోక్షితః. 48
చన్దనప్రణయోద్గన్ధిర్మన్దో మలయమారుతః.

వ్యా కోకిలాలాప వాచాలః = కోకిలల ధ్వనులచే వాచాలముగ (మాటలు ఎక్కువగ చెప్పునదిగ) ఉన్న, మలయానిలః = మలయవాయువు, మాం = నన్ను, ఏతి = పొందుచున్నది. ఈ శ్లోకార్థమును మృదుబంధముతో ప్రారం భించి దానితోడనే ముగించుటచే ఇది మృదుబంధ రూపమగు సమత. ఉచ్ఛల......ఉక్షితః = ఎగురుచున్న తుంపరలుగల తెల్లని, నిర్మలమైన, సెలయేళ్ల జలకణములచే తడిసిన, ( మలయానిలః మాం ఐతి అను

దానితో అన్వయము) ఈ శ్లోకార్ధమును స్ఫుటాక్షరములతో ప్రారంభించి, అట్లే ముగించుటచే స్ఫుటబంధరూపసమత. చన్దనప్రణయోద్గన్ధిః = చందన వృక్షముల ప్రణయముచే సుగంధముతో నిండిన, మన్దః = మందమైన, మలయ మారుతః = మలయవాయువు, ('మామైతి' అనుదానితో అన్వయము). ఈ శ్లోకార్ధమున, ప్రారంభమునందు బంధము స్ఫుటము, అంతమున మృదువు; అందుచే మిశ్రము.

మూ. స్పర్ధతే రుద్ధమద్ధైర్యో వరరామాముఖానిలైః 49
ఇత్యనాలోచ్య వైషమ్యమర్థాలఙ్కారడమ్బరౌ,
అపేక్షమాణా వవృధే పౌరస్త్యా కావ్యపద్ధతిః. 50

వ్యా. రుద్ధమద్ధైర్యః = అరికట్టబడిన నా ధైర్యము కలదై, (మలయ మారుతము) వరరామాముఖానిలైః = ఉత్తమ స్త్రీల ముఖవాయువులతో, స్పర్ధతే = పోటీ చేయుచున్నది. ఇచట 'స్పర్ధతే రుద్ధమద్ధైర్యః' వికట బంధము; "వరరామా ముఖానిలైః" అనునపుడు మృదుబంధము ఉండుటచే బంధవైషమ్య మున్నది. ఇతి = ఈ విధముగనున్న, వైషమ్యం = బంధ వైషమ్యమును, అనాలోచ్య = లెక్కచేయక, అర్థాలఙ్కారడమ్బరౌ = అర్థా కారమును శబ్దాడంబరమును, అపేక్షమాణా = కోరుచున్నదై, పౌరస్త్యా కావ్యపద్ధతిః = గౌడీయకావ్యరీతి, వవృధే = వృద్ధిపొందినది. పై ఉదాహర ణములో అతిశయోక్తి, శబ్దాండంబరము ఉన్నవి. గౌడులు ఇట్టి రచనకే ప్రాధ్యాన మిత్తురు. కాని వైదర్భీరీతిలో అర్థమునకు ఎక్కువ ప్రాధాన్యము ఇచ్చుటచే, శబ్దాడంబరరూపమగు అనుప్రాసాదులకు అవకాశము లేదని భావము.

అవ. మాధుర్యమును నిరూపించుచున్నాడు:-

మూ. మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః
యేన మాద్యన్తి ధీమన్తో మధునేవ మధువ్రతాః. 51

వ్యా. రసవత్ = రసముగల వాక్యము, మధురం = మధురము. అనగా రసము కలిగియుండుట మాధుర్యము. వాచి = శబ్దమునందును, వస్తున్యపి = అర్థమునందునుగూడ, రసస్థితిః = రసముయొక్క స్థితికి అవకాశ మున్నది. యేన = ఏ రసముచే, ధీమన్తః = సహృదయులు, మధువ్రతాః = తుమ్మెదలు, మధునేవ = మకరందముతవలె, మాద్యన్తి = మత్తులగుదురో. "వాచి వస్తున్యపి రసస్థితిః" అని చెప్పుటచే రసానుగుణమైన శబ్దార్థముల కూర్పు మాధుర్యమని చెప్పినట్లైనది.

మూ. యయా కయాచిచ్ఛ్రుత్యా యత్సమానమనుభూయతే
తద్రూపా హి పదాసత్తిః సానుప్రాసా రసావహా. 52

వ్యా. యయా కయాచిత్ = ఏదియో ఒక, శ్రుత్యా = కంఠ్యతాల వ్యాదిరూపమైన వర్ణముల ఉచ్చారణముతో, యత్ = ఏది, సమానం = సమాన మైనదిగా, అనుభూయతే = అనుభవింపబడునో, తద్రూపా = అట్టిరూపముగల, పదాసత్తిః = పదముల సామీప్యము (అట్టి పదములు దగ్గర దగ్గరగా ఉండుట) సానుప్రాసా = అనుప్రాసతో కూడినది. రసావహా హి రసమును పోషించు నది. కంఠతాల్వాది స్థానములలో ఉచ్చరింపబడు వర్ణముల (వ్యంజ నముల)ను, సమానరూపము కలవాటిని, దగ్గరదగ్గరగ కూర్చుటకు శ్రుత్యను ప్రాసమని పేరు. వైదర్భ గౌడరీతుల భేదమును స్పష్టీకరించుటకై ఇచట ఈ అలంకారము చెప్పబడినది. కావుననే—"కాశ్చిన్మార్గ విభాగార్థముక్తాః ప్రాగప్యలఙ్క్రియాః" (II-3) అని చెప్పుచున్నాడు.

మూ. ఏష రాజా యదా లక్ష్మీం ప్రాప్తవాన్ బ్రాహ్మణప్రియః
తదా ప్రభృతి ధర్మస్య లోకేస్మిన్నుత్సవోఽభవత్. 53

వ్యా. బ్రాహ్మణప్రియః = బ్రాహ్మణప్రియుడైన, ఏషః = ఈ, రాజా = రాజు: యదా = ఎప్పుడు, లక్ష్మీం = లక్ష్మిని, ప్రాప్తవాన్ = పొందినాడో, తదా ప్రభృతి = అది మొదలు, అస్మిన్ లోకే = ఈ లోకమునందు, ఉత్స

వః = ఉత్సవము, అభవత్ = ఆయెను. 'ఏష రాజా' అనుదానిలో షకార రేఫలు మూర్ధన్యములు, "రాజా యదా" అనుదానిలో జకారయకారములు తాలవ్యములు. 'యదా లక్ష్మీం' అనుదానిలో దకారలకారములు దంత్యములు. 'లక్ష్మీంప్రాప్త' అనునపుడు మకారపకారములు ఓష్ఠ్యములు. ఈ విధముగ తుల్యస్థానములగు వర్ణముల విన్యాసముంచుటచే ఇచ్చట శ్రుత్యనుప్రాస మున్నది.

మూ. ఇతీదం నాదృతం గౌడైరనుప్రాసస్తు తత్ప్రియః
అనుప్రాసాదపి ప్రాయో వైదర్భైరిదమిష్యతే.                 54

వ్యా. ఇతి = ఈ విధముగ, ఇదం = ఈ శ్రుత్యనుప్రాసము, గౌడైః = గౌడులచే, నాదృతం = ఆదరింపబడలేదు. తు = కాని, అనుప్రాసః = సమానవర్ణావృత్తిరూపమగు అనుప్రాసము, తత్ప్రియః = వారికి ఇష్టమైనది. ప్రాయః = సాధారణముగా, వైదర్భైః = వైదర్భులచే, ఇదం = శ్రుత్యనుప్రాసరూప మగు వస్తువు, అనుప్రాసాదపి = అనుప్రాసకంటె కూడ అధికముగ, ఇష్యతే = అంగీకరింపబడును.

మూ. వర్ణావృత్తిరనుప్రాసః పాదేషు చ పదేషు చ
పూర్వానుభవసంస్కారబోధినీ యద్యదూరతా.                 55

వ్యా. పూర్వానుభవ సంస్కారబోధినీ = పూర్వము ఉచ్చరింపబడిన వర్ణముయొక్క అనుభవమువలన (జ్ఞానము వలన) కలిగిన సంస్కారమును ఉద్బుద్ధ మగునట్లు చేయు, అదూరతా = సామీప్యము, (అస్తి) యది = ఉన్నచో, పాదేషుచ = శ్లోకపాదములయందును, పదేషు చ = పదములందును, వర్ణావృత్తిః = వర్ణముల ఆవృత్తి; ఈ ఆవృత్తి చేసిన వర్ణము ఒకటి కాని, రెండు కాని, అంతకంటె అధికము కాని కావచ్చును. అనుప్రాసః = అనుప్రాసము. ఒకటి లేక రెండు లేక అంతకంటె అధికసంఖ్యాకములగు వర్ణములను దగ్గరదగ్గరగా ఆవృత్తి చేసినచో అది అనుప్రాసము. అచ్చ

లను ఆవృత్తి చేసినను అందము లేదుగాన వర్ణములనగా నిచట వ్యంజనము లని యర్థము. ఒక వర్ణమును విన్నపిమ్మట దాని సంస్కారము ఇంకను మనస్సులో ఉండగనే ఆ వర్ణమును మరల ప్రయోగించినచో అందముండును కాని చాల దూర దూరముగ ఆవృత్తి చేసినచో మొదటి వర్ణమును విన్న సంస్కారము మనస్సులోనుండి తొలగిపోవును గాన ఆ వర్ణమే మరల ఆవృత్తి చేయబడినది అను ప్రతీతి ఉండదు. అందుచే దగ్గర దగ్గరగ ఆవృత్తి చేసిననే అనుప్రాసము.

మూ. చన్ద్రే శరన్నిశోత్తంసే కున్దస్తబకవిభ్రమే
ఇన్ద్రనీలనిభం లక్ష్మ సన్దధాత్యలినః శ్రియమ్. 56

వా. కున్దస్తబకవిభ్రమే = కుందపుష్పముల గుత్తి వంటి సౌంద ర్యముగల, శరన్నిశోత్తంసే = శారదరాత్రియొక్క శిరోభూషణమైన, చన్ద్రే = చంద్రునియందు, ఇన్ద్రనీలనిభం = ఇంద్రనీలమాణిక్యముతో సమానమైన, లక్ష్మ = కలంకము, అలినః = తుమ్మెదయొక్క, శ్రియం = శోభను, సన్దధాతి = కూర్చుచున్నది. ఇచట నాలుగు పాదములందును ఉన్న 'చన్ద్ర' 'కున్ద' 'ఇన్ద్ర' 'సన్ద' అను పదములలో నకారదకారముల ఆవృత్తి యున్నది గాన ఇది పాదగతానుప్రాసమునకు ఉదాహరణము. ఇది రసానుగుణము గాన గ్రాహ్యము.

అవ. పదగతానుప్రాసమునకుఉదాహరణము చూపుచున్నాడు:—

మూ. చారు చాన్ద్రమసం భీరు బిమ్బం పశ్యైతదమ్బరే
మన్మనో మన్మథాక్రాన్తం నిర్దయం హన్తుముద్యతమ్. 57

వ్యా. హే భీరు = ఓ భయస్వభావము కలదానా! మన్మథా క్రాన్తం = మన్మథునిచే ఆక్రమింపబడిన, మన్మనః = నా మనస్సును, నిర్ద యం = నిర్దయముగా, హన్తుం = కొట్టుటకు, ఉద్యతం = ఉద్యమించిన, చారు = సుందరమైన, ఏతత్ = ఈ, చాన్ద్రమసం బిమ్బం = చంద్రబింబమును,

అమ్బరే = ఆకాశమునందు, పశ్య = చూడుము! ఇచట ప్రథమపాదములో 'చారు చాన్ద్రీ' అనునపుడు 'చా' కును, 'చారు' 'భీరు' అను పదములలో 'రు'కును, రెండవ పాదములో 'మ్బ'కును, తృతీయ పాదమున 'మన్మ' లకును ఆవృత్తి యుండుటచే పదగతమగు అనుప్రాసము. ఇదికూడ రసానుగుణము గాన గ్రాహ్యము.

అవ. వర్ణావృత్తి దూరముగా ఉండకూడదు అని చెప్పియున్నాడు. దానికి ప్రత్యుదాహరణమును చూపుచున్నాడు.

మూ. ఇత్యనుప్రాసమిచ్ఛన్తి నాతిదూరాన్తరశ్రుతిమ్
న తు రామాముఖామ్భోజ సదృశశ్చన్ద్రమా ఇతి. 58

వ్యా. ఇతి = పై రెండు శ్లోకములలో చూపిన విధముగ, నాతి దూరాన్తరశ్రుతిమ్ = ఎక్కువ దూరము కాని వ్యవధానముతో కూడిన శ్రవణము కల, అనుప్రాసం = అనుప్రాసమును, ఇచ్ఛన్తి = అంగీకరింతురు తు = కాని, చన్ద్రమాః = చంద్రుడు, రామాముఖామ్భోజ సదృశః = లలనా ముఖ పద్మముతో సమానమైనవాడు, ఇతి = ఈ విధమైనదానిని, న = అంగీకరింపరు. ఇచట ఉత్తరార్ధమున "రామాముఖామ్భోజసదృశశ్చన్ద్రమా" అనునపుడు 'మా' అను దానిని రెండు పర్యాయములు ఆవృత్తి చేసినను ఆ రెండింటికిని చాల వ్యవధానముండుటచే ఇది అనుప్రాసము కాదని అభిప్రాయము. పై రెండు శ్లోకములలోనున్న అనుప్రాసము సుకుమారముగ ఉన్నదిగాన ఇట్టిది వైదర్భులకుకూడ అంగీకార్యమే అని దండి అభిప్రాయము. గౌడులకు మాత్రము సుకుమారమైనను, పరుషమైనను, అనుప్రాస మనునది ఉన్న చాలును. ఈ విషయము ఈ క్రింది రెండు శ్లోకములలో స్పష్టము కాగలదు.

మూ. స్మరః ఖరః ఖలః కాన్తః కాయః కోపశ్చ నః కృశః
చ్యుతో మానోఽధికో రాగో మోహో జాతోఽసవో గతాః
ఇత్యాది బన్ధపారుష్యం శైథిల్యం చ నియచ్ఛతి
అతో నైనమనుప్రాసం దాక్షిణాత్యాః ప్రయుఞ్జతే. 60

వ్యా. స్మరః = మన్మథుడు, ఖరః = తీవ్రముగా నున్నాడు. కాన్తః = ప్రియుడు. ఖలః = నిష్ఠురస్వభావుడు. నః = మాయొక్క, కాయః = శరీరము, కోపశ్చ = కోపముకూడ. కృశః = కృశించినది. మానః = మానము, చ్యుతః = జారిపోయినది. రాగః = అనురాగము, అధికః = అధికమైనది. మోహః = మోహము జాతః = కలిగినది. అసవః = ప్రాణములు, గతాః = వెడలిపోయినవి. (వెడలి పోవుచున్నవి). ఇత్యాది = ఈవిధముగనుండు అనుప్రాసము, బన్ధపారుష్యం = బంధమునందు పారుష్యమును, శైథిల్యంచ (బంధమునందు) శైథిల్యమును, నియచ్ఛతి = ఇచ్చును. అతః = ఈ కారణమువలన, దాక్షిణాత్యాః = దాక్షిణాత్యులు అనగా వైదర్భమార్గమును అనుసరించువారు, ఏవం = ఈవిధముగ, అనుప్రాసం = అనుప్రాసమును, నప్రయుఞ్జతే = ప్రయోగింపరు. ఇచట పూర్వార్థమున దగ్గరదగ్గరగ విసర్గలను ప్రయోగించుటచే "అనుస్వార విసర్గౌ తు పారుష్యాయ నిరన్తరౌ" అని చెప్పినరీతిగ పారుష్యమున్నది. ఉత్తరార్ధమున సంయుక్తాక్షరములు లేకపోవుటచేతను, ఓకారముగ మారిన విసర్గల ప్రయోగముచేతను బంధము శిథిలముగ నున్నది. పూర్వార్ధమున 'ర' 'ఖ' 'క' ల ఆవృత్తి యున్నది. ఈ విధముగ ఇచటనున్న అనుప్రాస పారుష్యశైథిల్యాదిదోషదుష్ట మగుటచే ఇట్టి దానిని వైదర్భులు గ్రహింపరు కాని గౌడులు ఇట్టి పారుష్యశైథిల్యము లున్నను, అనుప్రాస మున్నది కదా అను హేతువుచే దీనిని గ్రహింతురు.

మూ. ఆవృత్తిం వర్ణసఙ్ఘాతగోచరాం కవయో విదుః
తత్తు నైకాన్త మధురమతః పశ్చాద్విధాస్యతే. 61

వ్యా. కవయః = కవులు, వర్ణసంఘాతగోచరాం = వర్ణముల సముదాయమునకు సంబంధించిన, ఆవృత్తిం = (యమక మను పేరు గల) ఆవృత్తిని, విదుః = తెలిసికొందురు(చెప్పుదురు)కొన్నివర్ణములనుమాత్రము ఆవృత్తి చేసినచో అనుప్రాసము. అట్లుకాక ఒక పదమును లేదా స్వరవ్యంజనసము

దాయమును, యథాతథముగ ఆవృత్తి చేసినచో అది యమకమని చెప్పుదురు. తు = కాని, తత్ = ఆయమకము, ఏకాన్తమధురం = తప్పని సరిగ మాధుర్య గుణముతో కూడినది, న = కాదు. అతః = అందువలన, పశ్చాత్ = శబ్దా లంకార ప్రస్తావమున, విధాస్యతే = నిరూపింపబడును. అనుప్రాస మాధుర్య గుణమునకు సంబంధించినది గాన, మాధుర్యగుణమును నిరూపించు ప్రసంగ మున నిరూపింపబడినది. కాని యమకము సర్వదా మాధుర్యగుణముతో సంబంధించి యుండునని చెప్పుటకు వీలులేదు. అందుచే దానిసిగూర్చి ఈ ప్రకరణమునందుకాక శబ్దాలంకార ప్రస్తావమున చెప్పబడును.

అవ. "మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః" అనుకారికలో (51) రసము శబ్దమునందును, అర్థమునందును కూడ ఉండునని చెప్పియున్నాడు. రసస్థితికి అనుకూలమగు శబ్దరచనను విశదీకరించి ఇపుడు అట్టి అర్థమును విశదీకరించుచున్నాడు.

మూ. కామం సర్వోఽప్యలఙ్కారో రసమర్థే నిషిఞ్చతు
తథాప్యగ్రామ్యతైవైనం భారంవహతి భూయసా. 52

వా. సర్వః అపి = సమస్తమైన, అలఙ్కారః = అలంకారము, అర్థే = అర్థమునందు, రసం = రసమును, నిషిఞ్చతుకామం = చల్లినచో చల్లుగాక, (అర్థము రసవంతమగునట్లు చేసిన చేయుగాక) తథాపి = అట్లై నను, అగ్రామ్యతైవ = అగ్రామ్యత్వమే, భూయసా = చాలవరకు, ఏనం = ఈ, భారం = రసపుష్టిని కలిగించెడు భారమును, వహతి = మోయుచున్నది. అలంకారము ఉన్నంతమాత్రమున రసపుష్టి కలగదు. వర్ణనము గ్రామ్యతా దోషదుష్టము కారాదు; అపుడే అలంకారములచే రసమునకు పుష్టికలుగును అని అర్థము.

అవ. గ్రామ్యతకు ఉదాహరణము చూపుచున్నాడు :-

మూ. కన్యే కామయమానం మాం న త్వం కామయసే కథమ్
ఇతి గ్రామ్యోఽయమర్థాత్మా వైరస్యాయ ప్రకల్పతే. 63

వ్యా. కన్యే = ఓపిల్లా ! కామయమానం = నిన్ను కామించుచున్న, మాం = నన్ను, త్వం = నీవు, కథం = (ఎట్లు) ఎందుచేత, నకామయసే = కామించుట లేదు ? ఇతి = ఈ విధముగా, గ్రామ్యః = గ్రామ్యమైన, అయం = ఈ, అర్థాత్మా = అర్థస్వరూపము, వైరస్యాయ = విరసత్వమునకు, కల్పతే = సమర్థమగును, అనగా విరసత్వమును కలిగించును.

అవ. అగ్రామ్యతకు ఉదాహరణము చూపుచున్నాడు:—

మూ. కామం కన్దర్పచణ్డాలో మయి వామాక్షి నిర్దయః
త్వయి నిర్మత్సరో దిష్ట్యేత్యగ్రామ్యోఽర్థో రసావహః. 64

వ్యా హేవామాక్షి ! ఓ సుందరనయనా ! మయి = నావిషయమున, నిర్దయః = దయావిహీనుడైన, కన్దర్పచాణ్డాలః = ఈ క్రూరుడైన మన్మథుడు, కామం = యథార్థముగా, దిష్ట్యా = దైవ వశముచేత, త్వయి = నీ విషయమున, నిర్మత్సరః = కోపరహితుడుగా ఉన్నాడు. ఇతి = ఈ విధముగా, అగ్రామ్యః = గ్రామ్యముకాని, అర్థః = అర్థము, రసావహః = రసానుభూతిని కలిగించును. పూర్వశ్లోకములో శృంగారరసానుగుణమైన కకారమకారాద్యావృత్తి ఉన్నను అర్థము చాల మోటుగా ఉండుటచే రసభంగము కలుగుచున్నది గాన అందు మాధుర్యము లేదు. ఈ శ్లోకమున అగ్రామ్యమగు అర్థముయొక్క కూర్పు విప్రలంభ పోషకముగ నున్నది గాన ఇది మాధుర్యయుక్తము.

అవ. గ్రామ్యత్వము అర్థమునందు వలె శబ్దమునందు కూడ ఉన్నదని చెప్పుచున్నాడు:—

మూ. శబ్దేఽపి గ్రామ్యతాऽస్త్యేవ సా సభ్యేతరకీర్తనాత్
యథా యకారాదిపదం రత్యుత్సవనిరూపణే. 65

పదసన్ధానవృత్త్యా వా వాక్యార్థత్వేన వా పునః
దుష్ప్రతీతికరం గ్రామ్యం యథా యాభవతః ప్రియా. 66

వ్యా. సభ్యేతరకీర్తనాత్ = అసభ్యమగు పదమును ఉచ్చరించుట వలన, శబ్దేఽపి = శబ్దమునందు కూడ, సా గ్రామ్యతా = ఆ గ్రామ్యతాదోషము, అస్త్యేవ = ఉన్నది. యథా = ఎట్లనగా-రత్యుత్సవనిరూపణే = రత్యుత్సవమును చెప్పునపుడు, యకారాదిపదం = యకారముతో ప్రారంభమగు 'యాభ' అనుపదము; సురతనిధువనాది పదములు రత్యర్థకములే యైనను అవి గ్రామ్యములు కాదు. అదే అర్థమున 'యభమైథునే' అను ధాతువునుండి నిష్పన్నమగు 'యాభ' పదమును ప్రయోగించినచో ఆ శబ్దము అశ్లీలతా దోషదుష్టము ఈ అశ్లీలత్వము అర్థమునందు కాక శబ్దమునందే ఉన్నది గాన శబ్దగతదోషము- పదసన్ధానవృత్త్యావా = పదముల సంధిని బట్టిగాని, వాక్యార్థత్వేన వా పునః = వాక్యార్థముగ కాని, దుష్ప్రతీతికరం = దుష్టార్థ ప్రతీతిని కలిగించునదై, గ్రామ్యం = గ్రామ్యతాదోషదుష్టము. యభధాతునిష్పన్నమగు 'యాభ' పదమును ఆ అర్థమును బోధించుటకై ప్రయోగించినచో గ్రామ్యతా దోషము. అట్లుకాక ఒక పదము చివర 'యా' ఉండి, దాని తరువాత వచ్చు రెండవ పదము ప్రారంభమున 'భ' ఉండి ఆ రెండు పదములను కలిపి చదివినపుడు 'యాభ' శ్రుతి ఏర్పడినను అది కూడ గ్రామ్యతాదోషమే. యథా = ఎట్లనగా-'యా భవతః ప్రియా'. ఇచట "భవతః నీ యొక్క, యా = ఏ, ప్రియా = ప్రియురాలు ఉన్నదో" అను అర్థమున 'యా భవతః ప్రియా' అని ప్రయోగించి నపుడు కలిపి చదువుటలో 'యాభవతః' అనుపదము శ్రూయమాణమై అసభ్యార్థస్మృతిని కలిగించుచున్నది. అందుచే ఇదికూడ శబ్దగత గ్రామ్యతాదోషము.

మూ. ఖరం ప్రహృత్య విశ్రాన్తః పురుషో వీర్యవానితి
ఏవమాది న శంసన్తి మార్గయోరుభయోరపి. 67

వ్యా. వీర్యవాన్ = పరాక్రమవంతుడైన (గాఢమైన శుక్రముగల) పురుషః = శ్రీరాముడు (పురుషుడు) ఖరం = ఖరుడనెడు రాక్షసుని (తీవ్రముగా) ప్రహృత్య = సంహరించి (యో...ప్రహరణముచేసి) విశ్రాన్తః = విశ్రమించినాడు (బాగుగ అలసి విశ్రాంతి తీసుకొనుచున్నాడు). ఇతి = ఇట్లు, ఏవ

మాది = ఈ మొదలగు దానిని, ఉభయోరపి మార్గయోః = రెండు మార్గము లందును, న శంసన్తి = మెచ్చరు. ఇచట ప్రకరణానుసారముగ రాముడు ఖరుని సంహరించుట అను అర్థమున్నను, అప్రాకరణిక మగు అసభ్యార్థము కూడ గమ్యమగుటచే ఇట్టి గ్రామ్యమగు మాధుర్యరహితరచనను రెండు రీతుల వారును అంగీకరింపరు.

మూ. భగినీభగవత్యాది సర్వత్రైవానుమన్యతే
విభక్తమితి మాధుర్యముచ్యతే సుకుమారతా. 68

వ్యా. భగినీభగవత్యాది = 'భగినీ' 'భగవతీ' మొదలగు పదములు, సర్వత్రైవ = వైదర్భీగౌడీ మార్గములు రెండింటియందును, అనుమన్యతే = అంగీకరింపబడును. 'భగినీ' 'భగవతీ' అనుశబ్దములకు యౌగికార్థమును పరిశీలించినచో 'భగము కలది' అని అర్థము. కాని ఇట్టి పదములు శిష్టగ్రాహ్యములే. ఇతి = ఈ విధముగ, మాధుర్యం = మాధుర్యము, విభక్తం = విభజించి నిరూపింపబడినది. సుకుమారతా = సుకుమారత యను గుణము, ఉచ్యతే = చెప్పబడును.

మూ. అనిష్ఠురాక్షరప్రాయం సుకుమారమిహేష్యతే
బన్ధశైథిల్యదోషోఽపి దర్శితః సర్వకోమలే. 69

వ్యా. ఇహ = ఈకావ్య మార్గమునందు, అనిష్ఠురాక్షరప్రాయం = శ్రుతికటుత్వరూపదోషము లేని అక్షరములు అధికముగా కలది. సుకుమారం = సుకుమారమని, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది. అనిష్ఠురాక్షరములు అధికముగ ఉండవలెను అని చెప్పుటచే మధ్య మధ్య నిష్ఠురాక్షరములు కూడ ఉండవలెనని చెప్పినట్లైనది. అట్లు కానిచో శైథిల్యదోషము వచ్చునని చెప్పుచున్నాడు. సర్వకోమలే = పూర్తిగా కోమలవర్ణములతో కూర్చిన వాక్యమునందు, బన్ధశైథిల్యదోషోఽపి = బంధ శైథిల్యదోషము, దర్శితః = "శిథిలం మాలతీమాలా లోలాలికలితా యథా" (43) అను శ్లోకమున చూపబడినది.

అవ. సుకుమారతా గుణమునకు ఉదాహరణము చూపుచున్నాడు:

మూ. మణ్డలీకృత్య బర్హాణి కణ్ఠైర్మధురగీతిభిః
కలాపినః ప్రనృత్యన్తి కాలే జీమూతమాలిని. 70

వ్యా. జీమూతమాలిని = మేఘపంక్తులలో కూడిన, కాలే = వర్షకాలము నందు, కలాపినః = నెమళ్లు, బర్హాణి = పింఛములను, మణ్డలీకృత్య = మండలముగా చేసి, మధురగీతిభిః = మధురమైన గానముతో కూడిన, కణ్ఠైః = కంఠములతో, ప్రనృత్యన్తి = అధికముగా నాట్యము చేయుచున్నవి.

అవ. ఈ సుకుమారతాగుణముయొక్క వైశిష్ట్యమును వివరించుచున్నాడు:—

మూ. ఇత్యనూర్జిత ఏవార్థో నాలఙ్కారోఽపి తాదృశః
సుకుమారతయైవైతదారోహతి సతాం మనః. 71

వ్యా. ఇతి = ఈ విధముగా, ఈ పద్యములో, అర్థః = అర్థము, అనూర్జిత ఏవ = అంత ఉదాత్తమైనదికాదు. తాదృశః = అట్టి, అనగా ఊర్జితమైన, అలఙ్కారోఽపి = అలంకారముకూడ, న = లేదు. అట్లైనను, ఏతత్ = ఈ వాక్యము, సుకుమారతయైవ = సౌకుమార్య మను గుణము ఉండుట చేతనే, సతాం = సత్పురుషుల, మనః = మనస్సును, ఆరోహతి = అధిష్ఠించును.

మూ. దీప్తమిత్యపరైర్భూమ్నా కృచ్ఛ్రోద్యమపి బధ్యతే
న్యక్షేణ క్షపితః పక్షః క్షత్రియాణాం క్షణాదితి. 72

వ్యా. అపరైః = గౌడమార్గానుసారులచే, దీప్తమితి = దీప్తి అనెడు నామాన్తరముగల ఔజ్జ్వల్యముతో కూడినదను కారణముచే, కృచ్ఛ్రోద్యమపి =

పరుషవర్ణప్రచురమగుటచే ఉచ్చరించుటకు కష్టమైన పదముకూడ, భూ-మ్నా = అధికముగా, బధ్యతే = కూర్చబడును. న్యక్షేణ = అంధుడైన ధృతరాష్ట్రునిచే, క్షణాత్ = క్షణకాలములో, క్షత్రియాణాం పక్షః = క్షత్రియుల పక్షము, క్షపితః = నశింపచేయబడినది. ధృతరాష్ట్రుడు తన తెలివి తక్కువ తనముచే క్షత్రియవంశము నంతను నశింపచేసినాడని చెప్పుటచే ఇచట కరుణరసము. కాని ఇచట ప్రయోగించిన పరుషవర్ణ పదములు శ్రుతి కటువులే కాక రసప్రతికూలముగా కూడ ఉన్నవి.

మూ. అర్థవ్యక్తిరనేయత్వమర్థస్య హరిణోద్ధృతా
భూః ఖురక్షణ్ణనాగాసృగ్లోహితాదుదధేరితి. 73

వ్యా. అర్థస్య = అర్థముయొక్క, అనేయత్వం = అధ్యాహారాదులచే ఊహించవలసిన ఆవశ్యకత లేకుండుట, అనేయత్వం = అనేయత్వము. ఖురక్షణ్ణ నాగాసృగ్లోహితాత్ = డెక్కలచే నలగకొట్టబడిన నాగముల రక్తముచే ఏఱ్ఱనైన, ఉదధేః = సముద్రమునుండి, భూః = భూమి, హరిణా = విష్ణువుచేత, ఉద్ధృతా = విత్తబడినది, ఇతి = ఇట్లు అనేయత్వమునకు ఉదాహరణము. ఇచట చెప్పదలచిన అర్థమునంతను చెప్పుటకు సరిపడునన్ని పదములు ప్రయోగింపబడినవి అందుచే ఇది అర్థవ్యక్తికి ఉదాహరణము. కాని 'ఖురక్షుణ్ణనాగాసృగ్ లోహితాత్' అని కాక 'లోహితాత్' అనిమాత్రమే చెప్పియున్నచో, సముద్రము ఎఱ్ఱగానుండుటకు కారణమేదియో ఊహించుకొనవలసి యుండును. అపుడది నేయార్థమగుటచే, అచట అర్థవ్యక్తి ఉండదు. ఈ విషయమును 74వ శ్లోకమున చెప్పనున్నాడు.

మూ. మహీ మహావరాహేణ లోహితాదుద్ధృతోదధేః
ఇతీయత్యేవ నిర్దిష్టే నేయత్వమురగాసృజః. 74

వ్యా. మహీ = భూమి, మహావరాహేణ = మహావరాహముచే, లోహితాత్ = ఎఱ్ఱనైన, ఉదధేః = సముద్రమునుండి, ఉద్ధృతా = ఎత్తబడినది.

ఇతి=ఇట్లు, ఇయత్యేవ=ఇంతమాత్రమే, నిర్దిష్టే=చెప్పబడిన దగుచుండగా, ఉరగాసృజః=ఉరగరక్తమునకు, నేయత్వం=నేయత్వము. అనగా ఉరగరక్తముచే ఎఱ్ఱగానున్నది అను విషయము చెప్పకున్నను దానిని ఊహించుకొనవలసి యుండును.

మూ. నేదృశం బహుమన్యన్తే మార్గయోరుభయోరపి
న హి ప్రతీతిః సుభగా శబ్దన్యాయ విలఙ్ఘినీ. 75

వ్యా. ఈదృశం=ఇట్టి నేయార్థత్వమును, ఉభయోః మార్గయోరపి=గౌడ-వైదర్భ రీతులు రెండింటియందును, న బహుమన్యన్తే=అంగీకరింపరు. శబ్దన్యాయవిలఙ్ఘినీ="శబ్దశక్తిచే బోధింపబడిన అర్థములకు మాత్రమే అన్వయముండును" అనెడు శాబ్ద న్యాయమునకు విరుద్ధమైన, ప్రతీతిః=పదములచే బోధింపబడని అర్థముల జ్ఞానము, న సుభగా హి=మంచిది కాదు కదా?

అవ. ఉదారత్వమును చెప్పుచున్నాడు :—

మూ. ఉత్కర్షవాన్ గుణః కశ్చిద్యస్మిన్నుక్తే ప్రతీయతే
తదుదారాహ్వయం తేన సనాథా కావ్యపద్ధతిః. 76

వ్యా. యస్మిన్=ఏ వాక్యము, ఉక్తేసతి=చెప్పబడినదగుచుండగా, ఉత్కర్షవాన్=ఉత్కర్షతో గూడిన, కశ్చిత్=ఒకానొక, గుణః=గుణము (ధర్మము), ప్రతీయతే=గమ్యమగునో, తత్=ఆకావ్యము, ఉదారాహ్వయం=ఉదారత్వమను గుణము కలది. కావ్యపద్ధతిః=కావ్యపద్ధతి, తేన=ఈ ఔదార్య మనెడు గుణముచే, సనాథా=ప్రయోజనవంతమగును. అనగా ఔదార్యగుణముచే కావ్యములందు చమత్కారము లభించునని యర్థము.

మూ. అర్థినాం కృపణా దృష్టిస్త్వన్ముఖే పతితా సకృత్
తదవస్థా పునర్దేవ నాన్యస్య ముఖమీక్షతే. 77

ఇతి త్యాగస్య వాక్యేఽస్మిన్నుత్కర్షః సాధు లక్ష్యతే
అనేనైవ పథాన్యచ్చ సమానన్యాయమూహ్యతామ్. 78

వ్యా. హేదేవ = ఓరాజా! అర్థినాం = యాచకులయొక్క, కృపణా = దీనమైన, దృష్టిః = దృష్టి, సకృత్ = ఒక్కమారు, త్వన్ముఖే = నీ ముఖము నందు, పతితా = పడినచో, పునః = మరల, తదవస్థా = అట్టి దీనావస్థకలదై, అన్యస్య = ఇతరునియొక్క, ముఖం = ముఖమును, నేక్షతే = చూడదు, ఇతి = ఈ విధముగా, అస్మిన్ వాక్యే = ఈ వాక్యమునందు, త్యాగస్య = త్యాగము యొక్క, ఉత్కర్షః = ఉత్కర్ష, సాధు = బాగుగా, లక్ష్యతే = చూడబడు చున్నది. అనేన పథైవ = ఈ మార్గముచేతనే, సమానన్యాయం = దీనితో సమానమైన న్యాయముగల, అన్యచ్చ = ఇతరవిషయముకూడ, ఊహ్యతామ్ = ఊహింపబడుగాక.

మూ. శ్లాఘ్యైర్విశేషణైర్యుక్త ముదారం కైశ్చిదిష్యతే
యథా లీలామ్బుజక్రీడా సరోహేమాఙ్గదాదయః. 79

వ్యా. శ్లాఘ్యైః = శ్లాఘింపదగిన, విశేషణైః = విశేషణములతో, యుక్తం = కూడిన వాక్యము, ఉదారం = ఔదార్యగుణము కలది అని, కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = అంగీకరింపబడును. యథా = ఎట్లనగా— లీలా... దాదయః = లీలాంబుజము, క్రీడాసరస్సు, హేమాఙ్గదము మొదలగు నవి. 'లీలామ్బుజ' పదములోని 'లీలా' అను విశేషణముచే ఆ పద్మమునకుగల వర్ణ ఆకార సౌరభాదుల అతిశయము తెలియుచున్నది. "క్రీడా సరస్సు" పదము నందలి "క్రీడా" విశేషణముచే ఆ సరస్సులో కమలములు, సారసాది పక్షులు విహార సౌకాదులు ఉన్నట్లు తెలియుచున్నది. 'హేమాంగద' పదమునందలి 'హేమ' విశేషణముచే ఆ అంగదమును రత్నాదులతో కూర్చినట్లు గమ్యమగు చున్నది. కావున ఇది ఔదార్యగుణమునకు ఉదాహరణమని వీరి ఆశయము.

అవ. ఓజోగుణమును నిరూపించుచున్నాడు :—

మూ. ఓజః సమాసభూయస్త్వ మేతద్గద్యస్య జీవితమ్
పద్యేఽప్యదాక్షిణాత్యానామిదమేకం పరాయణమ్. 80

వ్యా. సమాసభూయ స్త్వం = అధికముగ సమాసముల ప్రయోగము, ఓజః = ఓజస్సు. ఏతత్ = ఇది, గద్యస్య = గద్యకావ్యమునకు, జీవితమ్ = ప్రాణమువంటిది. అదాక్షిణాత్యానాం = గౌడులకు, పద్యేఽపి = పద్యమునందు కూడ, ఇదం = ఇది, ఏకం = ప్రధానమైన, పరాయణం = ఆలంబనము.

మూ. తద్గురూణాం లఘూనాం చ బాహుల్యాల్పత్వమిశ్రణైః
ఉచ్చావచప్రకారం తద్దృశ్యమాఖ్యాయికాదిషు. 81

వ్యా తత్ = ఆ ఓజస్సు, గురూణాం = గురువుల యొక్కయు, లఘూనాం చ = లఘువుల యొక్కయు, బాహుల్యాల్పత్వ మిశ్రణైః = బాహుల్యము చేతను, అల్పత్వము చేతను, మిశ్రణము చేతను, ఉచ్చావచ ప్రకారం = అనేక విధములైన రీతులు గలది. అనగా కొన్నిచోట్ల దీర్ఘాక్షరములు అధికముగ ఉండును, లఘువులు అల్పముగ నుండును. కొన్నిచోట్ల లఘువులు అధికముగ నుండి దీర్ఘాక్షరములు తక్కువగ ఉండును. కొన్నిచోట్ల ఆ రెండు విధముల వర్ణములును తుల్యముగా నుండును. తత్ = ఆ ఓజస్సు, ఆఖ్యాయికాదిషు = ఆఖ్యాయికలు మొదలగు వాటిలో, దృశ్యం = చూడదగినది.

మూ. అస్తమస్తకపర్యస్తసమస్తార్కాంశుసంస్తరా
పీనస్తనస్థితాతామ్రకమ్రవస్త్రేవ వారుణీ. 82
ఇతి పద్యేఽపి పౌరస్త్యా బధ్నన్త్యోజస్వినీర్గిరః
అన్యే త్వనాకులం హృద్యమిచ్ఛన్త్యోజో గిరాం యథా. 83
పయోధరతటోత్సఙ్గలగ్నసన్ధ్యాతపాంశుకా
కస్య కామాతురం చేతో వారుణీ న కరిష్యతి. 84

వ్యా "అస్త...సంస్తరా" — అస్త = అస్త్రాద్రియొక్క, మస్తక = శిఖరమునందు, పర్యస్త = ప్రసరింపచేయబడిన, సమస్తార్కాంశు సంస్తరా = సమస్తమైన సూర్యకిరణసముదాయముగల, వారుణీ = పశ్చిమదిక్కు, "పీన ఇవ" — పీన = బలిసియున్న, స్తన = స్తనముమీద, స్థిత = ఉన్న, ఆతామ్ర =

ఎర్రనైన, వస్త్రేవ = వస్త్రము కలది (వస్త్రముగల స్త్రీవలె) ఉన్నది; ఇతి పద్యేఒపి = ఈ విధమగు పద్యమునందు గూడ, పౌరస్త్యాః = పూర్వదేశీయులు (గౌడులు) ఓజస్వినీః = ఓజోగుణముతో గూడిన, గిరః = వాక్కులను బధ్నన్తి = కూర్చుదురు. = అనగా గౌడరీతిని అంగీకరించువారు అనుప్రాస ప్రియులగుటచే ఇట్టి రచనను ఓజోగుణవంతమని అంగీకరింతురు. అన్యేతు = వైదర్భరీతిని అంగీకరిచువారైతే, అనాకులం = ఆకులము కానిది; అనగా సుఖముగ ఉచ్చరింప దగినది, హృద్యం = మనోహరమైనది అగు రచనా విధానమును, గిరాం = వాక్కులయొక్క, ఓజః = ఓజస్సునుగా, ఇచ్ఛన్తి = అంగీకరింతురు, యథా = ఎట్లనగా–"పయోధర...అంశుకా"— పయోధరతటోత్సఙ్గ = పయోధరముయొక్క పై భాగమునందు (స్తనము, మేఘము అని రెండర్థములు), లగ్న = లగ్నమైన, సన్ధ్యాతపాంశుకా = సంధ్యాకాలమునందలి ఎండయే వస్త్రముగా గల, వారుణీ = పశ్చిమదిశానాయిక, కస్య = ఎవని, చేతః = చిత్తమును, కామాతురం = కామముచే వ్యాకులమైన దానినిగా, న కరిష్యతి = చేయదు ? దీర్ఘసమాసప్రయోగరూప మగు ఓజోగుణము వైదర్భగౌడరీతుల నంగీకరించు ఉభయులకును అంగీకార్యమే. కాని గౌడులకు అనుప్రాసబహుళ మగు ఓజస్సు అనిన ఇష్టము. వైదర్భులకు ఉచ్చారణసులభము. అక్లిష్టపదము అగు రచన అనిన ఇష్టము.

అవ. కాంతి గుణమును నిరూపించుచున్నాడు:-

మూ. కాన్తం సర్వజగత్కాన్తం లౌకికార్థానతిక్రమాత్.
తచ్చ వార్తాభిధానేషు వర్ణనాస్వపి దృశ్యతే. 85

వ్యా. లౌకికార్థానతిక్రమాత్ = ఆబాలగోపాలము అందరికిని తెలిసిన విషయమును అతిక్రమింపకుండుటవలన, అనగా అట్టివిషయమును కూర్చుటవలన, సర్వజగత్కాన్తం = అందరికిని మనోహరముగ నుండునది, కాన్తం = కాంతిగుణము కలది. తచ్చ = అకాంతత్వము, వార్తాభిధానేషు =

విషయములను చెప్పుటయందును, వర్ణనాస్వపి = వర్ణనలయందును, దృశ్యతే = కనబడుచున్నది.

మూ. గృహాణి నామ తాన్యేవ తపోరాశిర్భవాదృశః
సమ్భావయతి యాన్యేవం పావనైః పాదపాంసుభిః. 86

వ్యా. గృహాణి నామ = గృహములనగా, తపోరాశిః = తపోరాశియైన, భవాదృశః = నీవంటివాడు, యాని = వేటిని, పావనైః = పవిత్రములైన, పాదపాంశుభిః = పాదపరాగములచే, ఏవం = ఈవిధముగా, సంభావయతి = ఆదరపాత్రమైనవాటినిగా చేయునో, తాన్యేవ = అవిమాత్రమే. (అవి మాత్రమే నిజమైన గృహములు).

మూ. అనయోరనవద్యాఙ్గి స్తనయోర్జృమ్భమాణయోః
అవకాశో న పర్యాప్తస్తవ బాహులతాన్తరే. 87

వ్యా. హే అనవద్యాఙ్గి = ఓనిర్దుష్టమైన శరీరముకల దానా !, జృమ్భమాణయోః = విజృంభించుచున్న, అనయోః = ఈ, స్తనయోః = స్తనములకు, తవ = నీయొక్క, బాహులతాన్తరే = లతాసదృశములగు బాహువుల మధ్య, అవకాశః = అవకాశము, న పర్యాప్తః = చాలదు.

మూ. ఇతి సమ్భావ్యమేవైతద్విశేషాఖ్యాన సంస్కృతమ్
కాన్తం భవతి సర్వస్య లోకయాత్రానువర్తినః. 88

వ్యా ఇతి = పైరెండు శ్లోకములలో చెప్పిన రీతిగ, సమ్భావ్యమేవ = లోకప్రసిద్ధమగుటచే సంభావ్యమే అగు, విశేషాఖ్యాన సంస్కృతం = విశిష్ట వర్ణనముచే సంస్కృతమైన, ఏతత్ = ఈ వాక్యము, లోకయాత్రానువర్తినః = లోకయాత్రను అనుసరించు, సర్వస్య = ప్రతి ఒక్కనికిని, కాన్తం = మనోహరమైనదై, భవతి = అగును. ఈ విధముగా వర్ణన లోకప్రసిద్ధమేగాన కవిప్రతిభామాత్ర కల్పితము కాదు. అందుచే దీనిని అందరును ఆస్వాదించ గలరు.

మూ. లోకాతీత ఇవాత్యర్థమధ్యారోప్య వివక్షితః
యోఽర్థస్తేనాతితుష్యన్తి విదగ్ధా నేతరే జనాః. 89

వ్యా అత్యర్థం = లోకాతీత మగు అర్థమును, అధ్యారోప్య = అరోపించి, వివక్షితః = చెప్పనుద్దిష్టమైనదియు, లోకాతీత ఇవ = లోకమునకు సంబంధించనిది వలె ఉండు, యః అర్థః = ఏ అర్థముకలదో, తేన = దానిచే, విదగ్ధాః = ఇట్టిరీతియందు నేర్పుగల గౌడపండితులు మాత్రమే, (లేదా పండితులు మాత్రమే) అతితుష్యన్తి = చాలా ఆనందింతురు. ఇతరే జనాః = వైదర్భులు (లేదా సామాన్య జనులు), న = ఆనందింపజాలరు.

అవ. ఇట్టి లోకాతీతవర్ణనకు ఉదాహరణము చూపుచున్నాడు:—

మూ. దేవధిష్ణ్యమివారాధ్యమద్య ప్రభృతి నో గృహమ్
యుష్మత్పాదరజఃపాతధౌతనిఃశేష కిల్బిషమ్. 90

అల్పం నిర్మితమాకాశమనాలోచ్యైవ వేధసా
ఇదమేవంవిధం భావి భవత్యాః స్తనజృమ్భణమ్. 91

వ్యా. యుష్మత్...కిల్బిషం = మీ పాదరజస్సు పడుటచే కడిగివేయబడిన సమస్తపాపపుంజము కల, నః = మాయొక్క, గృహం = గృహము, అద్యప్రభృతి = నేడు మొదలు, దేవధిష్ణ్యమివ = దేవతాగృహము వలె, ఆరాధ్యం = పూజింపదగినది.

భవత్యాః = నీ యొక్క, ఇదం = ఈ, స్తనజృమ్భణం = స్తనముల విజృంభణము, ఏవంవిధం = ఈవిధముగా, భావి = కానున్నది అని, అనాలోచ్యైవ = ఆలోచించకుండగనే, వేధసా = బ్రహ్మచే, అల్పం = స్వల్పమైన, ఆకాశం = అవకాశము, నిర్మితం = నిర్మింపబడినది.

మూ. ఇదమత్యుక్తిరిత్యుక్తమేతద్గౌడోపలాలితమ్
ప్రస్థానం ప్రాక్ప్రణీతం తు సారమన్యస్య వర్త్మనః. 92

వ్యా. ఇదం=ఇది, అత్యుక్తిః ఇతి=అత్యుక్తి అని, ఉక్తం=చెప్ప బడినది. ఏతత్=ఇది, గౌడోపలాలితం=గౌడులచే అంగీకరింపబడిన, ప్రస్థానం=మార్గము. ప్రాక్ప్రణీతం తు=వెనుక (86, 87 శ్లోకములలో) కూర్చబడినదైతే, అన్యస్యవర్త్మనః=రెండవమార్గము (వైదర్భమార్గము) యొక్క, సారం=సారము. 86, 87 శ్లోకములలో చెప్పిన విషయమునే 90, 91 శ్లోకములలో చెప్పినను ఇది అతిశయోక్తిభరిత మగుటచేతను, దీర్ఘ సమాసగ్రథిత మగుటచేతను సర్వజనప్రియము కాజాలదు; గౌడులు మాత్రమే దీనిని మెచ్చుదురు.

అవ. సమాధిగుణమును నిరూపించుచున్నాడు;—

మూ. అన్యధర్మస్తతోఽన్యత్ర లోకసీమానురోధినా
సమ్యగాధీయతే యత్ర స సమాధిః స్మృతో యథా. 93

వ్యా. లోకసీమానురోధినా=లోకమర్యాదను అనుసరించు కవిచే, అన్యధర్మః=ఒకదాని ధర్మము, తతః అన్యత్ర=దానికంటె భిన్న మగు మరి యొక వస్తువునందు, యత్ర=ఎచట, సమ్యక్=బాగుగా, ఆధీయతే—ఆరో పింపబడునో, సః=అది, సమాధిః=సమాధి యని, స్మృతః=చెప్పబడినది. యథా=ఎట్లనగా-

మూ. కుముదాని నిమీలన్తి కమలాన్యున్మిషన్తి చ
ఇతి నేత్రక్రియాధ్యాసాల్లబ్ధా తద్వాచినీ శ్రుతిః. 94

వ్యా. కుముదాని = కలువలు, నిమీలన్తి = మూసుకొనుచున్నవి; కమలాని చ=పద్మములు, ఉన్మిషన్తి=వికసించుచున్నవి; ఇతి=ఈ విధ ముగా, నేత్రక్రియా ధ్యాసాత్ = నేత్రముల క్రియయొక్క ఆరోపణమువలన, తద్వాచినీ = నేత్రములకు సంబంధించిన నిమేషోన్మేషక్రియలను బోధించు, శ్రుతిః=శబ్దము, లబ్ధా=పొందబడినది (ప్రయోగింపబడినది). నిమేష మనగా కండ్లు మూయుట; ఉన్మేష మనగా కండ్లు తెరచుట. కలువలు

ముకుళీభవించుట, పద్మములు వికసించుట అను క్రియలయందు నిమేషత్వ-ఉన్మేషత్వములను ఆరోపించి ఆ అర్థములను బోధించుటకై ఈ పదములను ప్రయోగించుట జరిగినది. ఇట్టి ఆరోపము సర్వప్రసిద్ధము. అందుచే ఇందు సమాధిగుణ మున్నదని అభిప్రాయము.

అవ. సాధ్యవసానలక్షణచే ఒక వస్తువుయొక్క ధర్మములను మరియొక వస్తువుపై ఆరోపించినచో సమాధి గుణమని చెప్పి ఉదాహరణమును చూపియున్నాడు. ఇవుడు కొన్ని శబ్దములను గౌణార్థమున, అనగా లాక్షణికార్థమున ప్రయోగించిననే అవి సుందరములుగ ఉండునని చెప్పుచున్నాడు:-

మూ. నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసున్దరమన్యత్ర గ్రామ్యకక్షాం విగాహతే. 95
పద్మాన్యర్కాంశునిష్ఠ్యూతాః పీత్వా పావకవిప్రుషః
భూయో వమన్తీవ ముఖై రుద్గీర్ణారుణ రేణుభిః. 96
ఇతి హృద్యమవద్యం తు నిష్ఠీవతి వధూరితి.

వ్యా. నిష్ఠ్యూతో...వాన్తాది 'నిష్ఠ్యూత'=(ఉమ్మివేయబడిన) 'ఉద్గీర్ణ' = [త్రేన్చి ఉమ్మివేయబడిన] 'వాన్త'=(కక్కబడిన) మొదలగు పదజాలము, గౌణవృత్తివ్యపాశ్రయం=గౌణవృత్తిని ఆశ్రయించినదై ప్రయుక్తమైనచో, అతిసున్దరం=చాలా సుందరముగా ఉండును. అన్యత్ర=అట్లు కానిచో, అనగా ముఖ్యార్థబోధకముగ ప్రయోగింప బడినచో, గ్రామ్యకక్షాం=గ్రామ్య పదముల తరగతిని, విగాహతే=ప్రవేశించును,(ఆ తరగతికి చెందును) ఉదా:-పద్మాని=పద్మములు, అర్కాంశు నిష్ఠ్యూతాః=సూర్యుని కిరణములచే చిమ్మబడిన, పావకవిప్రుషః = అగ్నియొక్క బిందువులను (రేణువులను), పీత్వా= గ్రహించి, ఉద్గీర్ణరేణుభిః=పైకి చిమ్మబడిన పరాగములు గల, ముఖైః= ముఖములతో, భూయః = మరల, వమన్తీవ = (ఆ అగ్నికణములను) పైకి విడచుచున్నవి వలె ఉన్నవి. ఇతి=ఈ విధమగు ప్రయోగము, హృద్యం=

మనోహర మైనది. తు = కాని, "వధూః — స్త్రీ, నిష్ఠీవతి = కాంక్రించి ఉమ్మివేయుచున్నది", ఇతి = ఈ విధమగు ప్రయోగము, అహృద్యం = హృద్యమైనదికాదు.

ఏదైన ఒక ఉభయ సాధారణమగు గుణమును పురస్కరించుకొని ఒక వస్తువునందు అన్యవస్తుత్వమును ఆరోపించినచో దానికి గౌణప్రయోగమని పేరు. ఉదా:- "సింహో మాణవకః". = 'ఈ పిల్లవాడు సింహము' అని యర్థము. ఇచట పిల్లవానియందున్న శౌర్యధైర్యాది గుణములను పట్టి ఈతని యందు సింహత్వమును ఆరోపించి 'ఈతడే సింహము' అనుచున్నాము. ఇది గౌణప్రయోగము. దీనిని లాక్షణిక ప్రయోగమని కూడ అందురు. 96వ శ్లోకములో 'నిష్ఠ్యూత' శబ్దము 'ప్రసరింపచేయబడిన' అనునర్థమునను, 'వమన్తి' అనునది 'విరజిమ్ముచున్నవి' అనునర్థమునను, 'పీత్వా' అనునది 'గ్రహించి' అను నర్థమునను, 'ఉద్గీర్ణ' అనునది 'పైకి విడువబడిన' అను అర్థమునను ప్రయోగింపబడినవి గాన ఇవి అగ్రామ్యములు. ఇట్టి గౌణప్రయోగములను సమాధి యుక్తములుగ గ్రహింపవచ్చును. 'నిష్ఠీవతి వధూః' ఇత్యాదులందు వలె ముఖ్యార్థమున ప్రయోగించినచో అది గ్రామ్యము.

అవ. "అన్యధర్మమును అన్యమునందు ఆరోపించుట సమాధి" అని చెప్పబడినది. ఒకదానియందు ఒక ధర్మమునే ఆరోపింపవలెనను నియమము లేదు, అనేకధర్మములను గూడ ఆరోపింపవచ్చును అని చెప్పుచున్నాడు:—

మూ. యుగపన్నైకధర్మాణామధ్యాసశ్చ స్మృతో యథా. 97
గురుగర్భభరక్లాన్తాః స్తనన్త్యో మేఘపఙ్క్తయః
అచలాధిత్యకోత్సఙ్గమిమాః సమధిశేరతే. 98
ఉత్సఙ్గశయనం సఖ్యాః స్తననం గౌరవం క్లమః
ఇతీమే గర్భిణీధర్మా బహవోఽప్యత్ర దర్శితాః. 99

వ్యా. యుగపత్ = ఒక్కుమ్మడిగా, నైకధర్మాణాం = అనేక ధర్మములయొక్క, అధ్యాసశ్చ = ఆరోపముకూడ, స్మృతః = సమాధియని చెప్ప

బడినది. యథా = ఎట్లనగా, గురుగర్భ భరక్లాన్తాః-గురు = మేఘపక్షమున జలముచేతను, స్త్రీ పక్షమున గర్భముచేతను స్థూలమైనవియు, గర్భభర క్లాన్తాః = గర్భభారముచే (జలభారము, గర్భస్థశిశుభారము) మాంద్యముతో కూడినవియు, స్తనన్త్యః = మూలుగుచున్న, ఇమాః = ఈ, మేఘసంక్త యః = మేఘపంక్తులు, అచలాధిత్యకోత్సఙ్గం = పర్వతముల ఉపరితలము యొక్క (సఖురాలియొక్క) ఒడిని, సమధిశేరతే = ఆశ్రయించి శయినించు చున్నవి. స్థూలోదరములు గల గర్భిణీ స్త్రీలు, అలసటతో మూలుగుచు సఖురాంద్ర ఒడిలో శయనించినట్లు జలభరితములైన మేఘపంక్తులు, మంద ముగ నున్నవై, ధ్వని చేయుచు పర్వతోపరితలములపై ఉన్నవి అని భావము.

అత్ర = ఇచట (మేఘ పంక్తియందు), సఖ్యాః ఉత్సఙ్గశయనం = సఖురాలి ఒడిలో శయనించుట, స్తననం = ధ్వనిచేయుట, గౌరవం = భారము, క్లమః = అలసట, ఇతి = అను, ఇమే = ఈ, బహవః = అనేకములైన, గర్భిణీ ధర్మా అపి = గర్భిణీస్త్రీకి సంబంధించిన ధర్మములు కూడ, దర్శితాః = చూపబడినవి; ఆరోపింపబడినవి అని యర్థము.

మూ. తదేతత్కావ్యసర్వస్వం సమాధిర్నామ యో గుణః
కవిసార్థః సమగ్రోఽపి తమేనమనుగచ్ఛతి. 100

వ్యా. తత్ = ఈ విధముగ చమత్కారహేతు వగుటవలన, సమాధిః నామ = సమాధి యనెడు, యఃగుణః = ఏ గుణము కలదో, ఏతత్ = ఇది, కావ్యసర్వస్వం = కావ్యముయొక్క సర్వస్వము. సమగ్రోఽపి = సమస్త మైన, కవిసార్థః = కవిసముదాయము, తం = ప్రసిద్ధమైన, ఏనం = ఈ, సమాధిగుణమును, అనుగచ్ఛతి = అనుసరించును.

మూ. ఇతి మార్గద్వయం భిన్నం తత్స్వరూపనిరూపణాత్
తద్భేదాస్తు న శక్యన్తే వక్తుం ప్రతికవి స్థితాః. 101

వ్యా. ఇతి = ఈ విధముగా, తత్స్వరూపనిరూపణాత్ = వాటియొక్క స్వరూపమును నిరూపించుటవలన, (నిరూపించిన విధమున) మార్గద్వయం = వైదర్భము, గౌడము అను మార్గద్వయము, భిన్నం = వేరైనది. ప్రతి కవి = వేరు వేరు కవులలో (వేరువేరుగ), స్థితాః = ఉన్న, తద్భేదాస్తు = అవైదర్భ గౌడరీతుల అవాంతరభేదము లైతే, వక్తుం = చెప్పుటకు, నశక్యన్తే = శక్యమైనవి కావు.

అవ. కొన్ని విషయములు అనుభవైకవేద్యములే కాని, వాటిని మాటలతో చెప్పుట అసాధ్యమని చెప్పుచున్నాడు:-

మూ. ఇక్షుక్షీరగుడాదీనాం మాధుర్యస్యాన్తరం మహత్
తథాపి న తదాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే. 102

వ్యా. ఇక్షుక్షీర గుడాదీనాం = చెరకు, పాలు, బెల్లము మొదలగు వాటియొక్క, మాధుర్యస్య = మాధుర్యముయొక్క, అంతరం = భేదము, మహత్ = అత్యధికమైనది. తథాపి = అట్లైనను, తత్ = ఆ మాధుర్య భేదమును, ఆఖ్యాతుం = మాటలలో చెప్పుటకు, సరస్వత్యాపి = సరస్వతిచేతకూడ, న శక్యతే = శక్యముకాదు.

మూ. నైసర్గికీ చ ప్రతిభా శ్రుతం చ బహు నిర్మలమ్
అమన్దశ్చాభియోగోఽస్యాః కారణం కావ్య సమ్పదః. 103

వ్యా. నైసర్గికీ = స్వభావసిద్ధమైన, అనగా జన్మతః లభించిన, ప్రతిభా = ప్రతిభయు, బహు = అధికమైనదియు, నిర్మలం = నిర్దుష్టమును అగు, శ్రుతం చ = వ్యాకరణ-మీమాంసా-న్యాయ-సాహిత్య-ఛందస్-అలంకార-శ్రుతి-స్మృతి-పురాణ-ఇతిహాస-ఆగమ-నాట్య - అభిధానకోశ = కామశాస్త్ర-అర్థశాస్త్ర-యోగశాస్త్రాది విద్యాభ్యాసము, అమన్దః = అత్యధికమైన, అభియోగః =

కావ్యజ్ఞులవద్ద జేర్చుకొని అభ్యాసము చేయుట అనునవి, అస్యాః = ఈ, కావ్య సమ్పదః = కావ్యసంపదకు, కారణం = కారణము.

అవ. సహజమగు ప్రతిభ లేకపోయినను నిరంతరాభ్యాసాదులచే కావ్యరచనాశక్తి లభించునని చెప్పుచున్నాడు.

మూ. న విద్యతే యద్యపి పూర్వవాసనా
గుణానుబన్ధిప్రతిభాన మద్భుతమ్.
శ్రుతేన యత్నేన చ వాగుపాసితా
ధ్రువం కరోత్యేవ కమప్యనుగ్రహమ్. 104

వ్యా. పూర్వవాసనాగుణానుబన్ధి = పూర్వజన్మ సంస్కారముతో సంబంధించినదియు, అనగా అట్టి సంస్కారమును పట్టి ఏర్పడునదియు. అద్భుతం = ఆశ్చర్యకరమైన, ప్రతిభానం = ప్రతిభ, న విద్యతే యద్యపి = లేకపోయినను. శ్రుతేన = శాస్త్రాదిద్వ్యభ్యాసముచేతను, యత్నేన చ = ప్రయత్నముచేతను, ఉపాసితా = ఉపాసంపబడిన, వాక్ = వాక్కు, ధ్రువం = నిశ్చయముగ, కమపి = ఒకానొక, అనుగ్రహం = అనుగ్రహమును, కరోత్యేవ = తప్పకచేయును.

మూ. తదస్తతన్ద్రైరనిశం సరస్వతీ
శ్రమాదుపాస్యా ఖలు కీర్తి మీప్సుభిః.
కృశే కవిత్వేఽపి జనాః కృతశ్రమా
విదగ్ధగోష్ఠీషు విహర్తు మీశతే. 105.

ఇత్యాచార్యదణ్డినః కృతౌ కావ్యాదర్శే మార్గవిభాగో నామ
ప్రథమః పరిచ్ఛేదః.

వ్యా. తత్ = ఆకారణమువలన, అస్తతన్ద్రైః = ఆలస్యము(మాంద్యము) లేని వారును, కీర్తిం = కీర్తిని, ఈప్సుభిః = పొందదలచినవారును అగు

జనులచే, సరస్వతీ = సరస్వతి, శ్రమాత్ శ్రమవలన, (అనగా ప్రయత్న పూర్వకముగా), ఉపాస్యా ఖలు = తప్పక ఉపాసింపదగినది. కవిత్వే = కవిత్వము, కృశేఽపి = స్వల్పమే అయినను, కృతశ్రమాః = చేయబడిన పరిశ్రమగల, జనాః = జనులు, విదగ్ధగోష్ఠీషు = సహృదయ సమాజముల యందు, విహర్తుం = విహరించుటకు, ఈశతే = సమర్థులగుదురు. ప్రయత్న పూర్వకముగ చేసిన సారస్వతసేవ ఎన్నటికిని వ్యర్థముగ పోదు. ప్రతిభా దారిద్ర్యముచే ఉత్తమకావ్యనిర్మాణమును చేయజాలకున్నను, సారస్వతసేవ చేసినవారు ఉత్తమకావ్యరసము నాస్వాదించు శక్తిని సంపాదించుకొని సరస కవిగోష్ఠులలో రాణించగల రని తాత్పర్యము.

పుల్లెలోపాహ్వ శ్రీరామచంద్ర విరచితాయాం
బాలానన్దిన్యాం ప్రథమః పరిచ్ఛేదః సమాప్తః



# ద్వితీయః పరిచ్ఛేదః

మూ. కావ్యశోభాకరాన్ ధర్మానలఙ్కారాన్ప్రచక్షతే
తే చాద్యాపి వికల్ప్యన్తే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి. 1

వ్యా. కావ్యశోభాకరాన్ = కావ్యమునకు శోభను కలగించు, ధర్మాన్ = ధర్మములను, అలఙ్కారాన్ = అలంకారములనుగా, ప్రచక్షతే = చెప్పుదురు. తేచ = ఆ అలంకారములు, అద్యాపి = నేటికికూడ, వికల్ప్యన్తే = వివిధరూపములతో కల్పింపబడుచున్నవి. తాన్ = అట్టి ఆ అలంకారములను, కః = ఎవడు, కార్త్స్న్యేన = పూర్తిగా, వక్ష్యతి = చెప్పగలడు?

ఇచట దండి "కావ్యశోభకు హేతువులైనవి అలంకారములు" అని అలంకారలక్షణమును చెప్పుచున్నాడు. కాని వామనుడు గుణములకును అలంకారములకును గల భేదమును చూపుటకై కావ్యశోభాకరములు గుణములనియు, ఆ శోభను అతిశయింపచేయునవి అలంకారము లనియు చెప్పియున్నాడు— "కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః; తదతిశయహేతవస్త్వలఙ్కారాః". ఎందరో బుద్ధిమంతులు అనేకములైన క్రొత్తక్రొత్త అలంకారములను నేటికిని కనుగొనుచునే ఉన్నారు. కావున అలంకారముల నన్నిటిని గూర్చి ఎవ్వరును పూర్తిగ చెప్పజాలరని ఉత్తరార్ధము తాత్పర్యము.

మూ. కిన్తు బీజం వికల్పానాం పూర్వాచార్యైః ప్రదర్శితమ్
తదేవ ప్రతిసంస్కర్తుమయమస్మత్పరిశ్రమః. 2

వ్యా. కిన్తు = కాని, వికల్పానాం = ఈ వివిధాలంకార భేదములకు, బీజం = బీజము; పూర్వాచార్యైః = ప్రాచీనులగు భరతముని మొదలైన ఆచార్యులచే, ప్రదర్శితం = చూపబడినది. తదేవ = ఆ బీజమునే, ప్రతిసంస్కర్తుం = స్పష్టీకరించుటకు, అయం = ఈ, అస్మత్పరిశ్రమః = మా ప్రయత్నము (ఉద్దిష్ట

మైనది). తరువాత ఎన్ని అలంకారభేదములు వచ్చినను వాటి బీజములు లన్నియు పూర్వాచార్యుల గ్రంథములలో ఉండనే ఉన్నవి. ఉదాహరణకు- ఉపమాభేదము లెన్నియో ఉన్నవి కాని వాటి కన్నింటికిని బీజముగ ఉపమా లక్షణమును భరతుడు "ఉపమానామ సా జ్ఞేయా గుణాకృతిసమాశ్రయా" అని చెప్పియున్నాడు బీజరూపముగ ఉన్న ఈ లక్షణమును స్పష్టముగ తెలిసికొనినచో ఇతరభేదజ్ఞానము అంత కష్టము కాదు.

మూ. కాశ్చిన్మార్గవిభాగార్థముక్తాః ప్రాగప్యలఙ్క్రియాః
సాధారణమలఙ్కారజాతమన్యత్ ప్రకాశ్యతే. 3

వ్యా. కాశ్చిత్ = కొన్ని, అలఙ్క్రియాః = అలంకారములు, ప్రాగపి = పూర్వము (ప్రథమ పరిచ్ఛేదమునందు) కూడ, మార్గవిభాగార్థం = గౌడ-వైదర్భమార్గముల విభాగము కొరకు, ఉక్తాః = చెప్పబడినవి. సాధారణం = ఈరెండుమార్గములందును తుల్యముగ నుండు, అన్యత్ = మరియొక, అలంకారజాతం = అలంకారసముదాయము, ప్రకాశ్యతే = నిరూపింపబడు చున్నది.

మూ. స్వభావాఖ్యానముపమా రూపకం దీపకావృతీ
ఆక్షేపోఽర్థాన్తరన్యాసో వ్యతిరేకో విభావనా. 4
సమాసాతిశయోత్ప్రేక్షా హేతుః సూక్ష్మో లవః క్రమః
ప్రేయో రసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితమ్. 5
ఉదాత్తాపహ్నుతిశ్లేషవిశేషాస్తుల్యయోగితా
విరోధాప్రస్తుతస్తోత్రే వ్యాజస్తుతినిదర్శనే. 6
హోక్తిః పరివృత్త్యాశీః సఙ్కీర్ణమథ భావికమ్
ఇతి వాచామలఙ్కారా దర్శితాః పూర్వసూరిభిః. 7

వ్యా. స్వభావోక్తి, ఉపమ, రూపకము, దీపకము, ఆవృత్తిదీపకము, ఆక్షేపము, అర్థాన్తరన్యాసము, వ్యతిరేకము, విభావన, సమాసోక్తి, అతిశయోక్తి,

ఉత్ప్రేక్ష, హేతువు, సూక్ష్మము, లవము, క్రమము, ప్రేయస్సు, రసవత్తు, ఊర్జస్వి, పర్యాయోక్తము, సమాహితము, ఉదాత్తము, అపహ్నుతి, శ్లేషము, విశేషము, తుల్యయోగిత, విరోధము, అప్రస్తుతప్రశంస, వ్యాజస్తుతి, నిదర్శన, సహోక్తి, పరివృత్తి, ఆశీస్సు, సంసృష్టి, భావికము అని, పూర్వసూరిభిః = ప్రాచీన పండితులచేత, వాచాం అలఙ్కారాః = వాక్కులయొక్క అనగా కావ్యములయొక్క (35) అలంకారములు, దర్శితాః = చూపబడినవి.

మూ. నానావస్థం పదార్థానాం రూపం సాక్షాద్వివృణ్వతీ
స్వభావోక్తిశ్చ జాతిశ్చేత్యాద్యా సాలఙ్కృతిర్యథా. 8

వ్యా. నానావస్థం = అనేకవిధములైన అవస్థలు గల, పదార్థానాం రూపం = పదార్థములస్వరూపమును, సాక్షాత్ = ప్రత్యక్షముగ కనబడు చున్నదా అన్నవిధమున, వివృణ్వతీ = వివరించుచున్నదియు, స్వభావోక్తిశ్చ = 'స్వభావోక్తి'యనియు, జాతిశ్చేతి = 'జాతి' యనియు పేర్లు గల, అద్యా = మొదటిదైన, సా = ఆ, అలఙ్కృతిః = అలంకారము, యథా = ఎట్లనగా, అనగా వస్తువుయొక్క యథార్థస్వరూపమును మన కండ్లకు కట్టినట్లు చూప గలిగినట్లు ఆ వస్తువునకు సంబంధించిన అసాధారణధర్మవర్ణనము స్వభావోక్తి. దీనికే 'జాతి' అని నామాంతరము. ఏ అలంకారమునందైనను చమత్కార ముండవలెను. చమత్కారము లేనిచో అది దానికి చెప్పిన లక్షణము లన్నియు పట్టినను, అలంకారము కాజాలదు. స్వభావోక్తి విషయమున కూడ ఈ నియమము ప్రవర్తించును. అందుచే-

"దీర్ఘపుచ్ఛశ్చతుష్పాదః కకుద్మాన్లమ్బకమ్బలః
గోరపత్యం బలీవర్దస్తృణమత్తి ముఖేన సః"
ఇత్యాదులు స్వభావోక్త్యుదాహరణములుకాజాలవు.

అవ. జాతివర్ణనము, గుణవర్ణనము, క్రియావర్ణనము, ద్రవ్యవర్ణనము అని స్వభావోక్తి నాలుగు విధములు. అందు జాతి రూపస్వభావోక్తికి ఉదా హరణము చూపుచున్నాడు :-

మూ. తుణ్డైరాతామ్రకుటిలైః పక్షైర్హరితకోమలైః
త్రివర్ణరాజిభిః కణ్ఠైరేతే మఞ్జుగిరః శుకాః. 9

వ్యా. ఆ తామ్రకుటిలైః = ఎఱ్ఱనైనవియు వంకరగ నున్నవియు అగు, తుణ్డైః = ముట్టెల తోడను, హరిత కోమలైః = ఆకుపచ్చని రంగు గలవియు మృదువైనవియు అగు, పక్షైః = రెక్కల తోడను, త్రివర్ణరాజిభిః = (నీలము, ఎరుపు, ధూసరము) మూడురంగుల రేఖలతో ప్రకాశించుచున్న, కణ్ఠైః = కంఠముల తోడను, ఏతే = ఈ, మఞ్జుగిరః = మధురమైన వాక్కులుగల, శుకాః = చిలుకలు (రాజన్తి = ప్రకాశించుచున్నవి.) ఇచట శుకజాతికి చెందిన రక్తతుండత్వాది ధర్మములను వర్ణించుటచే ఇది జాతివర్ణనరూపమగు స్వభావోక్తి.

అవ. క్రియా స్వభావోక్తికి ఉదాహరణము :-

మూ. కలక్వణితగర్భేణ కణ్ఠేనాఘూర్ణితేక్షణః
పారావతః పరిభ్రమ్య రిరంసుశ్చుమ్బతి ప్రియామ్. 10

వ్యా. కలక్వణితగర్భేణ = అవ్యక్తమధురమగు ధ్వని గర్భమునందు గల, కణ్ఠేన = కంఠముతో కూడినదై, ఆఘూర్ణితేక్షణః = త్రిప్పబడిన నేత్రములు కలదై, పారావతః = పావురము, రిరంసుః = రమింప అభిలాషకలదై, పరిభ్రమ్య = (తనలోతాను) తిరుగుచు, ప్రియాం = ప్రియురాలిని, చుమ్బతి = చుంబించుచున్నది ఇచట పావురముల అసాధారణ ధర్మమగు పరిభ్రమణచుంబనాదీ రూపక్రియ వర్ణింపబడినది.

అవ. గుణరూపస్వభావోక్తికి ఉదాహరణము :-

మూ. బధ్నన్నఙ్గేషు రోమాఞ్చం కుర్వన్ మనసి నిర్వృతిమ్
నేత్రే చామీలయన్నేష ప్రియాస్పర్శః ప్రవర్తతే. 11

వ్యా. ఏషః = ఈ, ప్రియాస్పర్శః = ప్రియురాలి స్పర్శ, అఙ్గేషు = అవయవములయందు, రోమాఞ్చం = రోమాంచమును, బధ్నన్ = కట్టుచు, అనగా పుట్టించుచు, మనసి = మనస్సునందు, నిర్వృతిం = ఆనందమును, కుర్వన్ = చేయుచు, నేత్రే చ = నేత్రములను కూడ, ఆమీలయన్ = అరమోడ్పు కలవానినిగ చేయుచు, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది. ప్రియాస్పర్శము గుణము గాన ఇది గుణరూప స్వభావోక్తి.

అవ. ద్రవ్యస్వభావోక్తికి ఉదాహరణము :-

మూ. కణ్ఠేకాలః కరస్థేన కపాలేనేన్దుశేఖరః
జటాభిః స్నిగ్ధతామ్రాభిరావిరాసీద్వృషధ్వజః. 12

వ్యా. కణ్ఠేకాలః = కంఠమునందు నలుపు కలవాడును, ఇన్దుశేఖరః = చంద్రుడే శిరోభూషణముగా కలవాడును అగు మహేశ్వరుడు, కరస్థేన = చేతిలోనున్న, కపాలేన = కపాలముతోడను, స్నిగ్ధతామ్రాభిః = కోమలమైనవియు, ఎఱ్ఱనైనవియు అగు, జటాభిః = జటలతోడను, ఆవిరాసీత్ = ప్రత్యక్షమాయెను. కంఠేకాలత్వాది ధర్మములన్నియు శివుడను ఒక ద్రవ్యమునకు సంబంధించినవి గాన వీటి వర్ణనము ద్రవ్యరూపస్వభావోక్తి.

మూ. జాతిక్రియాగుణద్రవ్యస్వభావాఖ్యానమీదృశమ్
శాస్త్రేష్వస్యైవ సామ్రాజ్యం కావ్యేష్వప్యేతదీప్సితమ్. 13

వ్యా. ఈదృశం = ఈ విధమగు, జాతి...ఆఖ్యానం = జాతికిని, క్రియకును, గుణమునకును, ద్రవ్యమునకును సంబంధించిన స్వభావముయొక్క వర్ణనము, (స్వభావోక్తి). శాస్త్రేషు = శాస్త్రములయందు, అస్యైవ = ఈ జాత్యాది స్వభావాఖ్యానము యొక్కయే, సామ్రాజ్యం = సామ్రాజ్యము, (ప్రాధాన్యము). ఏతత్ = ఇది, కావ్యేష్వపి = కావ్యములందు కూడా, ఈప్సితం = చెప్పబడినది, అనగా గ్రాహ్యమైనది. వస్తుతత్త్వమును నిరూపించుట శాస్త్రముల ప్రధానోద్దేశ్యము. అందుచే శాస్త్రములలో జాత్యాది స్వభావవర్ణన ముండుట

సహజము. కావ్యములందు కూడ ఇది శోభాకరముగ నుండును గాన దీనిని పండితులు అంగీకరించినారని భావము.

అవ. ఉపమాలంకార సామాన్య లక్షణమును చెప్పుచున్నాడు:-

మూ. యథాకథఞ్చిత్సాదృశ్యం యత్రోద్భూతం ప్రతీయతే
ఉపమా నామ సా తస్యాః ప్రపఞ్చోఽయం ప్రదర్శ్యతే. 14

వ్యా. యత్ర = ఎచట, యథాకథంచిత్ = (గుణక్రియాదులద్వారా) ఏదియో విధముగ, ఉద్భూతం = స్ఫుటమైన, సాదృశ్యం = రెండు వస్తువుల సామ్యము, ప్రతీయతే = తెలియబడునో, సా = అది, ఉపమానామ = ఉపమ అనెడు అలంకారము. తస్యాః = ఆ ఉపమయొక్క, అయం = ఈ, ప్రపఞ్చః = విస్తారము, ప్రదర్శ్యతే = చూపబడుచున్నది. రెండు వస్తువుల మధ్య నున్న సాదృశ్యము స్పష్టముగ తెలియవలెను; అది చమత్కారజనకముగ కూడ ఉండవలెను. అది ఉపమ. చమత్కార రహితములగు "గౌరివ గవయః" ఇత్యాదులు ఉపమోదాహరణములు కావు.

మూ. అమ్భోరుహమివాతామ్రం ముగ్ధే కరతలం తవ
ఇతి ధర్మోపమా సాక్షాత్తుల్యధర్మప్రదర్శనాత్. 15

వ్యా. హేముగ్ధే = ఓముగుదా!, తవ = నీయొక్క, కరతలం = అరచేయి, అమ్భోరుహమివ = పద్మము వలె, ఆతామ్రం = బాగుగా ఎఱ్ఱనైనది. ఇతి = ఈ విధముగా, సాక్షాత్ = సాక్షాత్తుగా, అనగా స్పష్టముగా, తుల్యధర్మప్రదర్శనాత్ = తుల్యధర్మమును చూపుటవలన, ధర్మోపమా = ధర్మోపమాలంకారము.

ఇచట 'ఇవ' శబ్దమును ప్రయోగించుటచే శ్రౌత్యుపమ. తామ్రత్వము పద్మమునందును, హస్తమునందును తుల్యముగ నున్నది గాన ఇది సమాన ధర్మము. ఈ విధముగ ఉపమేయమగు కరతలము, ఉపమానమగు పద్మము, సమాన ధర్మమగు ఆతామ్రత్వము, ఉపమావాచకమగు 'ఇవ' శబ్దము ఈ

నాలిగింటిని చెప్పుటచే దీనిని పూర్ణోపమ యందురు. ఈ నాలిగింటిలో ఏ ఒక్క-దానిని గ్రహింపకున్నను అది లుప్తోపమ. ఆ భేదములు మున్ముందు స్పష్టమగును.

మూ. రాజీవమివ తే వక్త్రం నేత్రే నీలోత్పలే ఇవ
ఇతి ప్రతీయమానైకధర్మా వస్తూపమైవ సా. 16

వ్యా. "తే = నీయొక్క-, వక్త్రం = ముఖము. రాజీవమివ = కమలమువలె నున్నది", "నేత్రే = నీ నేత్రములు, నీలోత్పలే ఇవ = నల్లకలువలవలె ఉన్నవి", ఇతి = ఈ విధముగా, ప్రతీయమానైకధర్మా = గమ్యమగుచున్న ఏకధర్మము, అనగా సమానధర్మముగల, సా = అది, వస్తూపమైవ = వస్తూపమ. ఇచట ముఖపద్మముల సమానధర్మమును, నేత్రోత్పలముల సమానధర్మమును స్పష్టముగ చెప్పలేదు. ఉపమాన-ఉపమేయ-ఉపమావాచకములు మాత్రము చెప్పబడినవి. కావున ఇది వస్తూపమ యని అర్థము. అర్వాచీనులు దీనిని ధర్మలుప్తోపమ అందురు.

మూ. త్వదాననమివోన్నిద్రమరవిన్దమభూదితి
సా ప్రసిద్ధివిపర్యాసాద్విపర్యాసోపమేష్యతే. 17

వ్యా. "ఉన్నిద్రం = వికసించిన, అరవిన్దం = పద్మము, త్వదాననమివ = నీముఖము వలె, అభూత్ = ఆయెను"— ఇతి = ఇట్లు, సా = అది, ప్రసిద్ధివిపర్యాసాత్ = లోక ప్రసిద్ధిని తారుమారుచేసి చెప్పుటచే, విపర్యాసోపమా = విపర్యాసోపమగా, ఇష్యతే = అంగీకరింప బడును. ప్రకృత మగు ముఖాదికమును ఉపమేయముగ చేసి, పద్మాదులను ఉపమానముగ చేసి వర్ణించుట కవిలోకప్రసిద్ధము. సాధారణముగ ఉపమేయముకంటె ఉపమానము ఉత్తమమై యుండును. కాని ప్రకృత మగు ఉపమేయమే అప్రకృత మగు ఉపమానము కంటె ఉత్తమ మైనది అని చెప్పవలె నను అభిప్రాయముతో ప్రసిద్ధమగు ఈ ఉపమానోపమేయభావమును తారుమారు చేసి చెప్పినచో విపర్యాసోపమ.

ఇచట పద్మము ముఖముతో పోల్చబడినది. అర్వాచీనులు దీనిని 'ప్రతీపోపమ' అనిరి.

మూ. తవానన మివామ్భోజమమ్భోజమివ తే ముఖమ్
ఇత్యన్యోన్యోపమా సేయ మన్యోన్యోత్కర్షశంసినీ. 18

వ్యా. అమ్భోజం = పద్మము, తవ ఆననమ్ ఇవ = నీ ముఖము వలె ఉన్నది. తే ముఖం = నీ ముఖము, అమ్భోజమివ = పద్మము వలె ఉన్నది. ఇతి = ఇట్లు, సా ఇయం = ఇది, అన్యోన్యోత్కర్షశంసినీ = పరస్పరము యొక్క ఉత్కర్షను సూచించు, అన్యోన్యోపమా = అన్యోన్యోపమాలంకారము. 'పద్మము ముఖమువలె నున్నది: అనునపుడు పద్మము ఉపమేయము, ముఖము ఉపమానము. "ముఖము పద్మము వలె నున్నది' అను నపుడు ముఖము ఉపమేయము, పద్మము ఉపమానము. ఇట్లు మొదటి వాక్యములో నున్న ఉపమానోపమేయ భావమును తారుమారు చేసి రెండవ వాక్యమును చెప్పుటలోని అభిప్రాయ మేమనగా "పద్మమునకు ముఖమే సాటి; ముఖమునకు పద్మమే సాటి, మూడవ వస్తువు లేదు" అని తెలుపుట. అర్వాచీనుల ప్రకారము దీనికి 'ఉపమేయోపమ' అని పేరు.

మూ. త్వన్ముఖం కమలేనైవ తుల్యం నాన్యేన కేన చిత్
ఇత్యన్యసామ్యవ్యావృత్తేరియం సా నియమోపమా. 19

వ్యా. త్వన్ముఖమ్ = నీముఖము, కమలేనైవ = పద్మముతోడనే, తుల్యమ్ = సమానమైనది. అన్యేన = మరియొక దానితో, కేనచిత్ = దేనితోను, న = కాదు. ఇతి = ఈ విధముగా, అన్యసామ్యవ్యావృత్తేః = ఇతర వస్తువులతో సామ్యమును నిరాకరించుటవలన, ఇయం = ఇది, సా = ఆ, నియతోపమా = నియతోపమాలంకారము.

ఒక వస్తువునకు ఉపమానముగా చెప్పదగిన వస్తువులు అనేకము లున్నట్లు చెప్పినచో ఆ వస్తువునకు ఉన్న ఉత్కర్ష కొంత తగ్గినట్లు అనిపించును. అట్లు

కాక ఈ వస్తువుకు ఉపమానముగా చెప్పదగినది ఇది ఒక్కటియే ఉన్నది, అని చెప్పినచో ఆ వస్తువు అత్యుత్తమ మను భావము కలుగును. ఇచట ముఖమునకు ఉపమానముగ చూపదగినది ఒక్క పద్మమే ఉన్నది; చంద్రాదులు అందులకు అర్హములు కావు అని చెప్పుటచే నియమోపమ.

మూ. పద్మం తావత్తవాన్వేతి ముఖమన్యచ్చ తాదృశమ్.
అస్తి చేదస్తు తత్కారీత్యసావనియమోపమా. 20

వ్యా. పద్మమ్ = పద్మము, తవముఖమ్ = నీముఖమును, అన్వేతి తావత్ = అనుకరించుచున్నది. 'తావత్' అను నది వాక్యాలంకారముగ ప్రయోగింపబడినది; అనగా దాని కిచట ప్రత్యేకముగ అర్థము లేదు. తాదృశం = అట్టి, అన్యచ్చ = మరి యొక వస్తువు కూడా, తత్కారి = త్వదీయముఖానుకరణము చేయునది, అస్తి చేత్ = ఉన్నచో, అస్తు = ఉండు గాక, ఇతి = ఈ విధముగా, అసౌ = ఇది, అనియమోపమా = అనియమోపమాలంకారము.

వెనుకటి నియమోపమలో "దీనికి ఇది యొక్కటియే ఉపమానము" అని చెప్పబడును. "ఈ వస్తువునకు ఇదియే కాక మరి యొక ఉపమానము కూడ ఉండిన ఉండవచ్చును" అని చెప్పుటచే ఇది నియమోపమకు విరుద్ధ మగు అనియమోపమ.

మూ. సముచ్చయోపమాప్యస్తి న కాన్త్యైవ ముఖం తవ
హ్లాదనాఖ్యేన చాన్వేతి కర్మణేన్దుమితీదృశీ. 21

వ్యా. తవ ముఖమ్ = నీ ముఖము, కాన్త్యైవ = కాంతిమాత్రముచేతనే, న = కాదు హ్లాదనాఖ్యేన = ఆనందింపచేయుట యనెడు, కర్మణా చ = క్రియచేత కూడ, ఇన్దుమ్ = చంద్రుని, అన్వేతి = అనుకరించుచున్నది. ఇతి = ఈ విధముగా, ఈదృశీ = ఈ విధమైన, సముచ్చయోపమాపి = సముచ్చయోపమ కూడ, అస్తి ఉన్నది.

ఇచట ముఖమునందు కాంతి యనెడు గుణము, హ్లాదకత్వ మనెడు క్రియ రెండును ఉన్నట్లు చెప్పుటచే ఇది గుణ-క్రియల సముచ్చయము. రెండు కలిసి

ఉన్నట్లు చెప్పుటకు సముచ్చయ మని పేరు. ఇట్లు గుణక్రియాసముచ్చయ మే కాక సాధారణధర్మముల సముచ్చయము కూడ ఉండవచ్చును అని సూచించుటకై 'ఈదృశీ' (ఈ విధమైన) అని చెప్పబడినది.

మూ. త్వయ్యేవ త్వన్ముఖం దృష్టం దృశ్యతే దివి చన్ద్రమాః
ఇయత్యేవ భిదా నాన్యేత్యసావతిశయోపమా. 22

వ్యా. త్వన్ముఖమ్ = నీముఖము, త్వయ్యేవ = నీయందే, దృష్టమ్ = చూడబడినది. చన్ద్రమాః = చంద్రుడు, దివి = ఆకాశమునందు, దృశ్యతే = చూడబడుచున్నాడు. భిదా = (నీ ముఖమునకును చంద్రునకును గల) భేదము, ఇయత్యేవ = ఇంతమాత్రమే. అన్యా = మరియొకటి, న = లేదు, ఇతి = ఈ విధముగా, అసౌ = ఇది, అతిశయోపమా = అతిశయోపమాలంకారము.

ఉపమానోపమేయములకు వాస్తవమున చాల భేదమున్నను, ఏదియో ఒక చిన్న భేదమును మాత్రమే చూపి, ఇంతకు మించిన భేదము లేదని చెప్పుటచే ఉపమానోపమేయములకు అభేదాధ్యవసానము చేయబడినది. తద్ద్వారా ఉపమేయమునకు ఉన్న గుణక్రియాతిశయము సూచింపబడినది. అందుచే ఇది అతిశయోపమ. కాని ఇచట ఉపమావాచకము లగు 'ఇవ' మొదలగు పదము లేవియు లేవు గాన ఇచట సామ్యమువ్యంజనా గమ్యము. ముఖచంద్రులకు ఆశ్రయ భేదమును బట్టి భేదము స్పష్టముగ తెలియుచున్నది గాన ఇచట రూపకధ్వని యని చెప్పుటకు వీలులేదు. అట్లే ఉపమానముకంటె ఉపమేయము ఉత్కృష్ట మైనది అను విషయము కూడ గమ్య మగుట లేదు గాన ఇది వ్యతిరేకాలంకార మునకు ఉదాహరణ మని కూడ చెప్పరాదు.

మూ. మయ్యేవాస్యా ముఖశ్రీరిత్యలమిన్దో వికత్థనైః.
పద్మేఽపి సా యదస్త్యేవేత్యసావుత్ప్రేక్షితోపమా. 23

వ్యా. హేఇన్దో = ఓచంద్రుడా ! అస్యాః = ఈమెయొక్క, ముఖశ్రీః = ముఖశోభ, మయ్యేవ = నాయందుమాత్రమే ఉన్నది. ఇతి = అని,

వికత్థనైః = గర్వించుటచే (బడాయి చెప్పుకొనుటచే) అలం = చాలును. (గర్వింపవద్దు). యత్ = ఎందువలన అనగా, సా = ఆ ముఖశోభ, పద్మేపి= పద్మమునందు కూడ, అస్త్యేవ = ఉండనే ఉన్నది కదా? ఇతి = ఇట్లు, అసౌ = ఇది, ఉత్ప్రేక్షితోపమా = ఉత్ప్రేక్షితోపమాలంకారము.

చంద్రుడు వాస్తవమున ఆ విధముగ గర్వింప కున్నను గర్వించు చున్నట్లు ఊహింపబడినది గాన ఉత్ప్రేక్షామిశ్ర మగు ఉపమ యగుటచే ఉత్ప్రేక్షితోపమ.

మూ. యది కించిద్భవేత్పద్మం సుభ్రు ! విభ్రాన్తలోచనమ్
తత్తే ముఖశ్రియం ధత్తామిత్యసావద్భుతోపమా. **24**

వ్యా. హేసుభ్రు ! = మంచి కనుబొమ్మలు గల ఓ సుందరీ !, కిఞ్చిత్ = ఏదైన, పద్మమ్ = పద్మము, విభ్రాన్తలోచనమ్ = కదలుచున్న నేత్రములు కలదై, భవేద్యది = అయినచో, తత్ = అట్టిపద్మము, తే = నీ యొక్క, ముఖశ్రియం = ముఖశోభను, ధత్తామ్ = ధరింపవచ్చును. ఇతి = ఈవిధముగ, అసౌ = ఇది, అద్భుతోపమా = అద్భుతోపమాలంకారము.

చంచలనేత్రత్వాదులు కేవలము ముఖమునందే యుండును. వాటిని ఊహచే పద్మమునందు కల్పించి సాదృశ్యమును వర్ణించుటచే ఇది అద్భుతోపమ. మమ్మటాదులు దీనిని అతిశయోక్త్యలంకారభేదముగ అంగీకరించి యున్నారు. "రాకాయామకలఙ్కం చేతమృతాంశోర్భవేద్వపుః, తస్యా ముఖం తదా సామ్యపరాభవమవాప్నుయాత్" (పౌర్ణమినాటి పూర్ణచంద్రబింబము కలంక రహితముగ ఉన్నచో అపుడామె ముఖమునకు సామ్యము చూపదగు మరియొక వస్తువు ఉండుట అనెడు పరాభవము కలిగి యుండెడిది) ఇత్యాదు లుదాహరణముగ చూపబడినవి.

మూ. శశీత్యుత్ప్రేక్ష్య తన్వఙ్గి త్వన్ముఖం త్వన్ముఖాశయా
ఇన్దుమప్యనుధావామీత్యేషా మోహోపమా స్మృతా. 25

వ్యా. ప్రేతస్వాంగీ = ఓ సన్నని శరీరము గలదానా, శశీ = చంద్రుడు, త్వన్ముఖమ్ ఇతి = నీముఖము అని, ఉత్ప్రేక్ష్య = (నీ విరహముతో బాధపడు రోజులలో) ఊహించి (భావించి), త్వన్ముఖాశయా = నీముఖమును చూడవలె ననెడు ఆశతో, ఇన్దుమపి = చంద్రుని కూడా, అనుధావామి = అనుసరించి పరువెత్తుచున్నాను. ఇతి = ఇట్లు, ఏషా = ఇది, మోహోపమా = మోహో పమ యని, స్మృతా = చెప్పబడినది.

అర్వాచీనాలంకారికులు దీనిని భ్రాంతిమదలంకార మని అంగీకరించి యున్నారు.

మూ. కిం పద్మమ న్తర్భ్రాన్తాలి కి న్తే లోలేక్షణం ముఖమ్
మమ దోలాయతే చిత్తమితీయం సంశయోపమా. 26

వ్యా. (ఇది) అన్తర్భ్రాన్తాలి = లోపల కదలుచున్న తుమ్మెదలుగల, పద్మం కిమ్ = పద్మమా, లేక లోలేక్షణమ్ = చంచలమైన నేత్రములుగల, తే ముఖం కిమ్ = నీ ముఖమా? ఇట్లు, మమచిత్తమ్ = నా మనస్సు, దోలాయతే = ఊగులాడుచున్నది. ఇతి = ఈ విధముగ, ఇయమ్ = ఇది, సంశయోపమా = సంశయోపమాలంకారము. అర్వాచీనాలంకారికులు దీనిని సంశయాలంకార ముగా అంగీకరించినారు.

మూ. న పద్మస్యేన్దునిగ్రాహ్యస్యేన్దులజ్జాకరీ ద్యుతిః
అత స్త్వన్ముఖమేవేదమిత్యసౌ నిర్ణయోపమా. 27

వ్యా. ఇన్దునిగ్రాహ్యస్య = చంద్రునిచే నిగ్రహింపదగిన, పద్మస్య = పద్మమునకు, ఇన్దులజ్జాకరీ = చంద్రునకు కూడ లజ్జను కలిగించెడు, ద్యుతిః = కాంతి, న = ఉండదు. అతః = ఈ కారణము వలన, ఇదమ్ = ఇది, త్వన్ముఖమేవ = నీముఖమే, ఇతి = ఈ విధముగ, అసౌ = ఇది, నిర్ణయోపమా = నిర్ణయోపమాలంకారము.

ఈ నిర్ణయోపములో మొదట సంశయ మఁండవలెను. ముఖమును చూచి మొదట ఇది ముఖమా, పద్మమా అను సంశయము కలుగును. పిమ్మట దీనికి చంద్రకాంతిని కూడ జయింపగలిగిన కాంతి ఉన్నది. చంద్రునిచే జయింపబడిన పద్మమునకు అట్టి కాంతి అసంభావ్యము కదా? అందుచే ఇది ముఖమే అని నిర్ణయము కలుగును. కావున ఇది నిర్ణయోపమ. అర్వాచీనులు దీనిని నిశ్చయాంత సందేహాలంకారముగా గ్రహించినారు.

మూ. శిశిరాంశుప్రతిస్పర్ధి శ్రీమత్సురభిగన్ధి చ
అమ్భోజమివ తే వక్త్రమితి శ్లేషోపమా స్మృతా. 28

వ్యా. శిశిరాంశు ప్రతిస్పర్ధి = చంద్రునితో పోటీ పడుచున్నదియు, (పద్మపక్షమున చంద్రునితో శత్రుత్వము కలది అని అర్థము), శ్రీమత్ = శోభాయుక్తమును (లక్ష్మితో కూడినదియు), సురభిగన్ధి చ = ఘ్రాణేంద్రియమునకు తృప్తిని కలిగించు సుగంధము కలదియు అగు, తే వక్త్రమ్ = నీ ముఖము, అమ్భోజమివ = పద్మమువలె ఉన్నది. ఇతి = ఇట్లు, శ్లేషోపమా = శ్లేషోపమాలంకారము, స్మృతా = చెప్పబడినది.

ఇచట మూడు విశేషణములును ముఖపద్మములు రెండింటికిని సమముగ అన్వయించుచున్నవి పద్మము లక్ష్మీస్థానము గాన 'శ్రీమత్' అనునపుడు శబ్దశ్లేష; మిగిలిన రెండు విశేషణములందును అర్థశ్లేష. పద్మపక్షమునందు కూడ 'శ్రీమత్' అనుదానికి 'శోభకలది' అను నర్థము చెప్పినచో అంతటను అర్థశ్లేషయే. ఇచట శ్లేష ఉపమకు అంగముగా ఉన్నది గాన దీనిని శ్లేషాలంకారముగ గ్రహింపక శ్లేషానుప్రాణితోపమాలంకారముగనే గ్రహింపవలెను.

మూ. సరూపశబ్దవాచ్యత్వాత్సా సమానోపమా యథా
బాలేవోద్యానమాలేయం సాలకాననశోభినీ. 29

వ్యా. సరూపశబ్దవాచ్యత్వాత్ = (అర్థములు వేరైనను) సమానమైన ఆకారముగల శబ్దములచే బోధింపబడుటవలన, సా = ఆ ఉపమ, సమానో

పమా = సమానోపమాలంకారము. యథా = ఎట్లనగా—సాల + కానన + శోభి నీ = వృక్షముల వనముతో ప్రకాశించుచున్న, ఇయం = ఈ, ఉద్యానమాలా = ఉద్యానపంక్తి, సాలక + ఆనన + శోభినీ = ముంగురులతో ప్రకాశించుచున్న, బాలేవ = బాల వలె ఉన్నది.

ఇచట 'సాలకాననశోభినీ' అను విశేషణము బాలకును, ఉద్యానమునకును అన్వయించును. రెండు పక్షములందును అర్థము వేరు. 'సాలనకాననశోభినీ' అను ఒకే విశేషణముండుట యను సామ్యము తప్ప ఉద్యానమునకును, బాలకును మరియొక సామ్యమేమియు లేదు. ఇట్టి సామ్యమును శబ్దమాత్రసాధర్మ్య మందురు. 'సాలకాననశోభినీ' అనుటకు బదులు "వృక్షకాననశోభినీ" అని అన్నచో ఈ సాదృశ్యములేదు. గాన ఇచట సాదృశ్యము శ్లేషమూలకము.

మూ. పద్మం బహురజశ్చన్ద్రః క్షయీ తాభ్యాం తవాననమ్
సమానమపి సోత్సేకమితి నిన్దోపమా స్మృతా. 30

వ్యా. పద్మమ్ = పద్మము, బహురజః = అధికమైన పుప్పొడి కలది. (ధూళిమలిన మని మరియొక అర్థము). చన్ద్రః = చంద్రుడు, క్షయీ = క్షీణించు స్వభావము కలవాడు (క్షయరోగము కలవాడు అని అర్థాంతరము). తవ = నీయొక్క, ఆననమ్ = ముఖము, తాభ్యామ్ = ఆపద్మ చంద్రులతో, సమానమపి = సమానమైనదైనను, సోత్సేకమ్ = గర్వముతో కూడినది. ఇతి = ఈ విధముగ, నిన్దోపమా = నిందోపమ యని, స్మృతా = చెప్పబడినది.

ముఖము పద్మచంద్రులతో సమానముగ నున్న దని చెప్పుటయందే కవికి తాత్పర్యము గాని నిందించుటయందు కాదు.

మూ. బ్రహ్మణోప్యుద్భవః పద్మశ్చన్ద్రః శమ్భుశిరోధృతః
తౌ తుల్యౌ త్వన్ముఖేనేతి సా ప్రశంసోపమోచ్యతే. 31

వ్యా పద్మః = పద్మము, బ్రహ్మణోపి = బ్రహ్మకు కూడా, ఉద్భవః = ఉత్పత్తి స్థానము. చన్ద్రః = చంద్రుడు, శమ్భుశిరోధృతః = ఈశ్వరుని శిరస్సుపై ధరింపబడినవాడు. తౌ = ఆ పద్మచంద్రులు, త్వన్ముఖేన = నీ ముఖముతో, తుల్యౌ = సమాన మైనవి. ఇతి = ఈ విధముగ, సా = అది, ప్రశంసోపమా = ప్రశంసోపమగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

సాధారణముగ ఉపమేయముకంటె ఉపమానము ఉత్కృష్టముగ నుండును. బ్రహ్మకు ఉత్పత్తి స్థాన మగుటవలనను, శివుని శిరస్సుపై ధరింపబడుటవలనను ఉత్కృష్టము లగు పద్మచంద్రులకు ముఖమును ఉపమానముగ చూపుటచే దాని ప్రశంస చేయబడినది గాన ఇది ప్రశంసోపమ.

మూ. చన్ద్రేణ త్వన్ముఖం తుల్యమిత్యాచిఖ్యాసు మే మనః.
స గుణో వాస్తు దోషో వేత్యాచిఖ్యాసోపమాం విదుః. 32

వ్యా. త్వన్ముఖమ్ = నీ ముఖము, చన్ద్రేణ = చంద్రునితో, తుల్యమ్ = తుల్యమైనది; ఇతి = అని, మే = నా, మనః = మనస్సు, ఆచిఖ్యాసు = చెప్ప దలచినది. సః = అది (ఇట్లు చెప్పవలెననెడు అభిలాష), గుణో వా అస్తు = గుణము కానిమ్ము; దోషో వా = దోషము కానిమ్ము. ఇతి = ఈ విధముగ, ఆచిఖ్యాసోపమామ్ = ఆచిఖ్యాసోపమను, విదుః = చెప్పుచున్నారు (తెలుసికొనుచున్నారు). "ఇది తప్పు కానిమ్ము, లేదా ఒప్పు కానిమ్ము" అని చెప్పుటలోనే నీ ముఖమునకు చంద్రుని ఉపమానముగా చెప్పుట యుక్తము కాదు; ఐనను చెప్పవలసివచ్చినది; అని ముఖసౌందర్యాతిశయము గమ్య మగుచున్నది.

మూ. శతపత్త్రం శరచ్చన్ద్రస్త్వదాననమితి త్రయమ్
పరస్పరవిరోధీతి సా విరోధోపమా మతా. 33

వ్యా. శతపత్త్రమ్ = పద్మము, శరచ్చన్ద్రః = శరత్కాలచంద్రుడు, త్వదాననమితి = నీ ముఖము అను, త్రయమ్ = ఈ త్రయము, పరస్పర

విరోధి = పరస్పరము విరోధము కలది. ఇతి = ఈ విధముగ, విరోధోపమా = విరోధోపమాలంకారము, మతా = అంగీకరింపబడినది

సమానమైన విద్య కలవారు సాధారణముగ ఒకరితో ఒకరు పోటీ పడు చుందురు అను సామ్యమును ("ప్రాయః సమానవిద్యాః పరస్పరయశః పురోభాగాః") అనుసరించి ఈ మూడును పరస్పర విరోధముతో కూడిన వనగా పరస్పరసామ్యము కల నని తాత్పర్యము గాన ఇందు చమత్కారము.

**మూ. న జాతు శక్తిరిన్దోస్తే ముఖేన ప్రతిగర్జితుమ్**
**కలఙ్కినో జడస్యేతి ప్రతిషేధోపమైవ సా. 34**

వ్యా. కలఙ్కినః = కలంకవంతుడును, జడస్య = జడుడును (మూఢుడు; చల్లగ నున్నవాడు అను రెండర్థములు), ఇన్దోః = చంద్రునకు, తే = నీ, ముఖేన = ముఖముతో, ప్రతిగర్జితుమ్ = ఎదిరించుటకు, జాతు = ఎన్నటికిని, శక్తిః = సామర్థ్యము, న = లేదు. ఇతి = ఇట్లు, సా = అది, ప్రతిషేధోపమైవ = ప్రతిషేధోపమాలంకారము.

ఇచట సాదృశ్యమును నిషేధించుట ద్వారా సాదృశ్య మున్నట్లు సూచింపబడుచున్నది గాన ప్రతిషేధమూలక మగు ఉపమ యగుటచే ప్రతిషేధోపమ.

**మూ. చన్ద్రారవిన్దయోః కాన్తిమతిక్రమ్య ముఖం తవ**
**ఆత్మనైవాభవత్తుల్యమిత్యసాధారణోపమా. 35**

వ్యా. తవ ముఖమ్ = నీ ముఖము, చన్ద్రారవిన్దయోః = చంద్రపద్మముల, కాన్తిమ్ = కాంతిని, అతిక్రమ్య = అతిక్రమించి, ఆత్మనైవ = తనతోడనే, తుల్యమ్ = తుల్యమైనదై, అభవత్ = ఆయెను, ఇతి = ఇట్లు, అసాధారణోపమా = అసాధారణోపమ.

ముఖకాంతిచే చంద్రారవిందముల కాంతి తిరస్కరింపబడుటచే వాటిని ముఖమునకు ఉపమానములుగ చెప్ప వీలు లేదు గాన ముఖమునకు ముఖమునే

ఉపమానముగా చెప్పవలసి వచ్చెను. అందుచే ఇది అసాధారణోపమ. ఇది అర్వాచీనుల అనన్వయాలంకారము వంటిది.

మూ. మృగేక్షణాఙ్కం తే వక్త్రం మృగేణైవాఙ్కితః శశీ
తథాపి సమ ఏవాసౌ నోత్కర్షీతి చటూపమా 36

వ్యా. తే = నీ, వక్త్రమ్ = ముఖము, మృగేక్షణాఙ్కమ్ = మృగనేత్రములచే శోభిత మైనది. శశీ = చంద్రుడు, మృగేణైవ = పూర్తిగమృగముచేత, అఙ్కితః = శోభితుడు. తథాపి = అట్లైనను, అసౌ = ఈ చంద్రుడు, సమ ఏవ = తుల్యుడుమాత్రమే. ఉత్కర్షీ = ఉత్కర్షవంతుడు, న = కాడు, ఇతి = ఇట్లు. చటూపమా = చాటూపమాలంకారము.

నీ ముఖమునందు మృగనేత్రములు మాత్రమే ఉన్నవి. చంద్రునిలో పూర్తిగ మృగమే ఉన్నది. అందుచే వాస్తవమున చంద్రుడు నీ ముఖముకంటె గొప్పవాడు కావలెను. కాని అట్లుకాదు. ఆతడు నీ ముఖముతో సమముగ మాత్రమే కాగలిగినాడు. 'చాటువు' అనగా ప్రియమైన మాట. ఇది ముఖమునకు గల సౌందర్యాతిశయమును ప్రశంసించు ప్రియవాక్యమగుటచే "చటూపమ".

మూ. న పద్మం ముఖమేవేదం న భృఙ్గౌ చక్షుషీ ఇమే
ఇతి విస్పష్టసాదృశ్యాత్తత్త్వాఖ్యానోపమైవ సా. 37

వ్యా. ఇదమ్ = ఇది, పద్మం న = పద్మము కాదు, ముఖమేవ = ముఖమే, ఇమే = ఇవి, భృఙ్గౌ = తుమ్మెదలు, న = కావు. చక్షుషీ = నేత్రములే. ఇతి = ఈ విధముగా, విస్పష్టసాదృశ్యాత్ = సాదృశ్యమును స్పష్టముగ చెప్పుటవలన, సా = అది, తత్త్వాఖ్యానోపమైవ = తత్త్వాఖ్యానోపమాలంకారము.

ముందు సంశయము కలుగగా నిర్ణయము చేసినచో అది 'నిర్ణయోపమ'. ఈ అలంకారమునందు ముందు భ్రాంతి కలుగగా తన్నివారణార్థమై యథార్థ స్వరూపము స్పష్టీకరింపబడును.

మూ. సర్వపద్మప్రభాసారః సమాహృత ఇవ క్వచిత్
త్వదాననం విభాతీతి తామభూతోపమాం విదుః. 38

వ్యా. త్వదాననమ్ = నీముఖము, క్వచిత్ = ఒకచోట, సమాహృతః = ప్రోగుచేయబడిన, సర్వపద్మప్రభాసారఇవ = సమస్తములైన పద్మముల కాంతుల సారమువలె, విభాతి = ప్రకాశించుచున్నది. ఇతి = ఇట్లు, తామ్ = దానిని, అభూతోపమామ్ = అభూతోప మాలంకారమునుగా, విదుః = తెలుసుకొనుచున్నారు.

అన్ని పద్మములనుండియు సౌందర్యసారము ప్రోగుచేయుట అనునది అసంభావ్యము. కవిప్రతిభా మాత్రకల్పితము. అట్టి కవిప్రతిభామాత్రకల్పిత వస్తువును ఉపమానముగ చూపినచో అభూతోపమ లోకములో ఉన్న ఒక వస్తువునకు ఇతరవస్తువులతో సంబధము కల్పించి దానిని ఉపమానముగ వర్ణించినచో అది అద్భుతోపమాలంకారము.

మూ. చన్ద్రబిమ్బాదివ విషం చన్దనాదివ పావకః
పరుషా వాగితో వక్త్రాదిత్యసంభావితోపమా. 39

వ్యా. ఇతః = ఈ, వక్త్రాత్ = ముఖమునుండి, పరుషా = పరుషమైన, వాక్ = వాక్కు, చన్ద్రబిమ్బాత్ = చంద్రబింబమునుండి, విషమివ = విషము వంటిది. చన్దనాత్ = మంచిగంధమునుండి, పావకః ఇవ = అగ్ని వంటిది. ఇతి = ఇట్లు, అసమ్భావితోపమా = అసంభావితోపమాలంకారము. చంద్రచందనములనుండి విషాగ్నులు బయల్వెడలుట ఎట్లు అసంభావ్యమో, నీ ముఖమునుండి పరుషవాక్యము వెడలుట అట్లే అసంభావ్య మని భావము.

మూ. చన్దనోదక చన్ద్రాంశు చన్ద్రకాన్తాదిశీతలః
స్పర్శస్తవేత్యతిశయం బోధయన్తీ బహూపమా. 40

వ్యా. తవ స్పర్శః = నీ స్పర్శ, చనందనోదక - చన్ద్రాంశు - చన్ద్రకాన్తాది శీతలః = మంచిగంధపు నీటివలెను, చంద్రుని కిరణముల వలెను,

చంద్రకాంతశిలాదుల వలెను చల్లనైనది. ఇతి = ఇట్లు, అతిశయం = (చందనోదకాదులలో లేని, ఉపమేయములో నున్న) లేదా-అనేకములైన ఉపమానములను చెప్పుటచే శీతలత్వాధిక్యము తెలియుచున్నది అని అర్థము. అతిశయమును, బోధయన్తీ = బోధించునది; బహూపమా = బహూపమాలంకారము.

మూ. చన్ద్రబిమ్బాదివోత్కీర్ణం పద్మగర్భాదివోద్ధృతమ్.
తవ తన్వఙ్గి ! వదనమిత్యసౌ విక్రియోపమా. 41

వ్యా. హేతన్వఙ్గి = ఓ కృశాంగి, తవ = నీయొక్క, వదనమ్ = ముఖము, చన్ద్రబిమ్బాత్ = చంద్రబింబమునుండి, ఉత్కీర్ణమివ = చెక్కబడినది వలె ఉన్నది. పద్మగర్భాత్ = పద్మముయొక్క మధ్యభాగమునుండి, ఉద్ధృతమివ = తయారుచేసి వెలికి తీయబడినది వలె ఉన్నది. ఇతి = ఇట్లు, అసౌ = ఇది, విక్రియోపమా = విక్రియోపమాలంకారము. ఉపాదానకారణమునకు ప్రకృతి అనియు, కార్యమునకు వికృతి అనియు పేర్లు, ఇచట ఉపమానభూతము లగు చంద్రపద్మములనుండి ముఖము తయారుచేయబడినది అని చెప్పుటచే ముఖము వికృతి (విక్రియ) కావున ఇది విక్రియోపమ.

మూ. పూష్ణ్యాతప ఇవాహ్నీవ పూషా వ్యోమ్నీవ వాసరః
విక్రమస్త్వయ్యధాల్లక్ష్మీమితి మాలోపమా మతా. 42

వ్యా. ఆతపః = ప్రకాశము, పూష్ణీవ = సూర్యునియందు వలె (అనగా సూర్యునియందు లక్ష్మిని కూర్చినట్లు), పూషా = సూర్యుడు, అహ్నీవ = పగటి భాగమునందు వలె, వాసరః = పగటిభాగము, వ్యోమ్నీవ = ఆకాశమునందు వలె, విక్రమః = పరాక్రమము, త్వయి = నీయందు, లక్ష్మీమ్ = లక్ష్మిని (శోభను అని కూడ అర్థము), అధాత్ = ఉంచెను. ఇతి = ఇట్లు, మాలోపమా = మాలోపమాలంకారము, మతా = అంగీకరింపబడినది.

మాలలో ఒక్కొక్క పుష్పము వెనుక నున్న పుష్పముతోడను, తరువాతి పుష్పముతోడను సంబంధించి ఉన్నట్లు మొదటివాక్యములో ఆధారముగ పేర్కొన

బడిన సూర్యుడు, రెండవ వాక్యములో కర్తగ పేర్కొనబడినాడు. ఇట్లే దీప సాదుల విషయమునను. అందుచే ఇది మాలోపమ.

మూ. వాక్యార్థేనైవ వాక్యార్థః కోఽపి యద్యుపమీయతే
ఏకానేకేవశబ్దత్వాత్సా వాక్యార్థోపమా ద్విధా. 43

వ్యా. కోఽపి = ఒకానొక, వాక్యార్థః = వాక్యార్థము, వాక్యార్థేనైవ = మరియొక వాక్యార్థముతో, ఉపమీయతే యదీ = పోల్చబడినచో, సా = ఆ, వాక్యార్థోపమా = వాక్యార్థోపమ, ఏకానేకేవశబ్దత్వాత్ = ఒకే ఇవ శబ్దము కలిగి యుండుట, అనేక ఇవశబ్దములు కలిగియుండుట అను భేదముచే, ద్విధా = రెండు విధములు.

వాక్యములలో నున్న పదార్థము లన్నింటికిని పరస్పరసామ్యము స్పష్టముగ తెలియుటకై అనేకఇవశబ్దములను ప్రయోగించినచో అది ఒక భేదము. ప్రధానము లగు పదార్థములకు ఉపమానోపమేయభావములు చెప్పుటచే వాటితో సంబంధించిన ఇతరపదార్థముల ఉపమానోపమేయభావము అర్థాత్సిద్ధమైనచో అచట ఒక్క 'ఇవ'శబ్దము మాత్రమే ప్రధాన పదార్థముతో చేర్చి ప్రయోగింపబడును. అది రెండవ భేదము. ఇచట వాక్య మనగా పదసముదాయ మని అర్థము.

అవ. ఏకేవఘటితవాక్యార్థోపమకు ఉదాహరణము :—

మూ. త్వదాననమధీరాక్షమావిర్దశనదీధితి.
భ్రమద్భృఙ్గమివాలక్ష్యకేసరం భాతి పఙ్కజమ్. 44

వా. అధీరాక్షమ్ = చంచలమైన నేత్రములు కలదియు, ఆవిర్దశనదీధితి = పైకికనబడుచున్న దంతకాంతులు కలదియు అగు, త్వదాననమ్ = నీ ముఖము, భ్రమద్భృఙ్గమ్ = సంచరించుచున్న తుమ్మెదలు కలదియు, ఆలక్ష్యకేసరమ్ = కొంచెము పైకి కనబడుచున్న కింజల్కములు గల, పఙ్కజమివ = పద్మము వలె, భాతి = ప్రకాశించుచున్నది. ఇచట చంచలనేత్ర ప్రసరద్దంతకాంతులు

గల ముఖమునకు, చంచలభ్రమర-ఆలక్ష్యకేసర మగు పంకజము ఉపమానముగ చెప్పబడినది. "అధీరాక్షం ఆవిర్దశనదీధితి త్వదాననమ్" అనునది ఉపమేయ వాక్యము. "ఆలక్ష్యకేసరం భ్రమద్భృఙ్గం పఙ్కజమ్" అనునది ఉపమాన వాక్యము ఇచట ఆ యా విశేషణములతోకూడిన ముఖపద్మములకు ఉతమానోపమేయభావము గాన ఒక 'ఇవ' శబ్దము మాత్రమే ప్రయోగింపబడినది. ప్రధానపదార్థములగు ముఖపద్మములకు ఉపమానోపమేయభావము చెప్పుటచే వాటి విశేషణము లగు చంచలనేత్ర-చంచలభృంగములకును, ఆవిర్దశనదీధితి-ఆలక్ష్యకేసరములకును ఉపమానోపమేయభావము గమ్యము.

అవ అనేకేవఘటితవాక్యార్థోపమకు ఉదాహరణము :—

మూ. నలిన్యా ఇవ తన్వఙ్గ్యాస్తస్యాః పద్మమివాననమ్.
మయా మధువ్రతేనేవ పాయం పాయమరమ్యత. 45

వ్యా. మధువ్రతేనేవ = తుమ్మెదవలె, మయా = నాచేత(నేను), నలిన్యా ఇవ = పద్మలతయొక్కవలె, తస్యాః = ఆ, తన్వఙ్గ్యాః = కృశాంగి యగు సుందరి యొక్క, పద్మమివ = పద్మము వలె, ఆననమ్ = ముఖమును, పాయంపాయం = పానము చేసి చేసి, అరమ్యత = రమించుట (రమించితిని). "మయా అరమ్యత" అనునది భావేప్రయోగము భ్రమరము పద్మినియొక్క పద్మమును మాటిమాటికి పానము చేసి ఎట్లు రమించునో నేను కూడ అట్లే ఆమె ముఖమును పానము చేసి(చుంబించి)రమించితిని అని అర్థము. ఇచట నలినీ-తన్వంగులకును, ముఖపద్మములకును, మధుకర-నాయకులకును గల ఉపమానోపమేయభావములను స్పష్టీకరించుటకై మూడు 'ఇవ' శబ్దములు ప్రయోగింపబడినవి.

మూ. వస్తు కిఞ్చిదుపన్యస్య న్యసనాత్తత్సధర్మణః
సామ్యప్రతీతిరస్తీతి ప్రతివస్తూపమా యథా. 46

వ్యా కించిత్ = ఏదో ఒక, వస్తు = ప్రకృతవిషయమును, ఉపన్యస్య = (ముందుగా ఒకవాక్యమున) చెప్పి, తత్సధర్మణః = దానితో సమాన మగు ధర్మము గల మరి యొక వస్తువుయొక్క, న్యసనాత్ = (వాక్యాంతరముచే) ప్రతి

పాదనము చేయుటవలన, సామ్యప్రతీతిః = (ఆ రెండు వాక్యార్థములందును) సామ్యముయొక్క ప్రతీతి, అస్తి = ఉండును (కలుగును). ఇతి = ఇట్లు, ప్రతి వస్తూపమా = ప్రతివస్తూపమాలంకారము. యథా = ఎట్లనగా.

ప్రతివస్తు = ప్రతివాక్యార్థమునందును, ఉపమా = సమానధర్మము, యస్యాంసా = దేనియందు ఉండునో అది అను విగ్రహముచే రెండు వాక్యము లందును సమానధర్మమును చెప్పినచో అది ప్రతివస్తూపమ యని యర్థము. రెండు వాక్యములలో ఒకే సమానధర్మమును చెప్పినను, దానిని వేరు వేరు పద ములతో చెప్పవలెను. అట్లు కానిచో కథితపదత్వదోషము.

**మూ. నైకోఽపి త్వాదృశోఽద్యాపి జాయమానేషు రాజసు.**
**నను ద్వితీయో నాస్త్యేవ పారిజాతస్య పాదపః. 47**

వ్యా. జాయమానేషు = పుట్టుచున్న, రాజసు = రాజులలో, త్వాదృశః = నీవంటివాడు, ఏకోఽపి = ఒక్కడును, అద్యాపి = నేటికిని, న = లేడు. పారిజాతస్య = పారిజాతవృక్షమునకు, ద్వితీయః పాదపః = రెండవవృక్షము, అనగా దానితో సమాన మైనవృక్షము, నాస్త్యేవనను = లేనే లేదు కదా ? ఇచట సాటి లేకపోవుట అనునది సమానధర్మము. అది మొదటి వాక్యమున— "త్వత్సదృశః న" అను దానిచేతను, రెండవ వాక్యమున 'ద్వితీయో నాస్తి' అను దానిచేతను చెప్పబడినది. మరియొక సమానవస్తువు లేకపోవుటయే రాజునకును, పారిజాతవృక్షమునకును గల సామ్యము.

**మూ. అధికేన సమీకృత్య హీనమేకక్రియావిధౌ**
**యద్ బ్రువన్తి స్మృతా సేయం తుల్యయోగోపమా యథా.**

వ్యా. హీనమ్ = అల్పగుణములు గలదానిని, అధికేన = అధిక గుణములు కలదానితో, ఏకక్రియావిధౌ = ఒక క్రియను నిర్వహించువిష యమున, సమీకృత్య = సమముగ చేసి, యద్ బ్రువన్తి = చెప్పుచుందురు అనునది ఏది కలదో, సా ఇయం = ఇది, తుల్యయోగోపమా = తుల్యయో గోపమ. యథా = దీనికి ఉదాహరణమెట్లనగా. తుల్యయోగితాలంకారములో

ప్రకృతాప్రకృతము లన్నియు సమానరూపముగ వర్ణింపబడును. దానిలో ఉప మానోపమేయభావాపేక్ష ఉండదు. కాని తుల్యయోగోపములో ప్రకృతాప్రకృత ములకు ఉపమానోపమేయభావము వివక్షితము. తుల్యయోగితాలంకారములో స్తుతి కాని నింద గాని ప్రతీయమానముగ ఉండును. తుల్యయోగోపములో కేవలము సామ్యప్రతిపాదనమే ఉండును. దండి చెప్పిన తుల్యయోగోపమా-తుల్యయోగితలకు ఇదియే భేదము.

మూ. దివో జాగర్తి రక్షాయై పులోమారిర్భువో భవాన్
అసురాస్తేన హన్యన్తే సావలేపా స్త్వయా నరాః. 49

వ్యా. పులోమారిః = దేవేంద్రుడు, దివః = స్వర్గముయొక్క, రక్షాయై = రక్షణముకొరకు, జాగర్తి = జాగరూకుడై యున్నాడు. భవాన్ = నీవు, భువః = భూమియొక్క రక్షణముకొరకై జాగరూకుడవై ఉన్నావు. తేన = ఆతనిచే, సావలేపాః = గర్వముతో కూడిన, అసురాః = రాక్షసులు, హన్యన్తే = సంహరింపబడుచున్నారు. త్వయా = నీచేత, నరాః = గర్వముతో కూడిన మానవులు సంహరింపబడుచున్నారు. ఇచట హీనుడైన రాజు గుణాధి కుడైన ఇంద్రునితో తుల్యుడని వర్ణించుటచే తుల్యయోగోపమ. ఇవాదిపదములు లేకపోవుటచే సాధర్మ్యము వ్యంగ్యము.

మూ. కాన్త్యా చన్ద్రమసం ధామ్నా సూర్యం ధైర్యేణ చార్ణవమ్
రాజన్ననుకరోషీతి సైషా హేతూపమా మతా. 50

వ్యా. రాజన్ = ఓరాజా ! కాన్త్యా = కాంతిచేత, చన్ద్రమసమ్ = చంద్రుని, ధామ్నా = తేజస్సుచేత, సూర్యమ్ = సూర్యుని, ధైర్యేణ = ధైర్యముచేత, అర్ణవమ్ = సముద్రమును, అనుకరోషి = అనుకరించుచున్నావు ఇతి = ఇట్లు, సైషా = ఇది, హేతూపమా = హేతూపమగా, మతా = చెప్ప బడినది. రాజునకు చంద్రాదులతో ఉన్న సాదృశ్యమునకు కాంతి - తేజో - ధైర్యములు హేతువులుగ చెప్పబడినవి గాన ఇది హేతూపమ.

మూ. న లిఙ్గవచనే భిన్నే న హీనాధికతాపి వా
ఉపమాదూషణాయాలం యత్రోద్వేగో న ధీమతామ్. 51

వ్యా. యత్ర = వేఁటి విషయమున, ధీమతామ్ = పండితులకు, ఉద్వేగః = మనస్సునకు చీకాకు, న = కలుగదో, అట్టి, భిన్నే లిఙ్గవచనే = వేరువేరైన లింగవచనములు, అనగా లింగభేదము, వచనభేదము. ఉపమానోపమేయములు వేరు వేరు లింగములలో నున్నచో అది లింగభేదము; అవి వేరు వేరు వచనములలో ఉన్నచో అది వచనభేదము. ఉపమాదూషణాయ = ఉపమాలంకారమును దుష్టముగా చేయుటకు, న అలమ్ = సమర్థము కావు. అనగా అవి ఉపమా దోషములు కావు. హీనతా = ఉపమాహీనత్వము, అధికతాపి వా = ఉపమాధిక్యము కూడ, న = ఉపమాదూషకములు కాజాలవు.

భామహుఁడు కావ్యాలంకారమున ఏడు ఉపమాదోషములను పేర్కొనెను— "హీనతాసమ్భవో లిఙ్గవచోభేదో విపర్యయః. ఉపమానాధికత్వం చ తేనాసదృశతాపి వా. త ఏతే ఉపమాదోషాః సప్త మేధావినోదితాః, (2.29-30). దండి ఈ ఏడు దోషములలో విపర్యయ - అసాదృశ్య - అసంభవములను అంగీకరింపలేదు. ఈతని ఉపమాలక్షణము ననుసరించి "సాదృశ్యము స్పష్టముగ భాసించునపుడే ఉపమాలంకారము" గాన ("సాదృశ్యం యత్రోద్భూతం ప్రతీయతే") పై మూడు దోషములును అసంభావ్యములు. అవి ఉన్నచో ఉపమాలక్షణమే పట్టదు కదా? ఇక మిగిలిన నాలుగు దోషముల విషయమున గూడ—అవి పఠితల మనస్సునకు చీకాకు కలిగించిననే దోషములు కాని అట్లుకానిచో. అనగా ఉపమానోపమేయ భావము స్పష్టముగ తెలియుచున్నచో, దోషములు కావని దండి అభిప్రాయము. ఉపమానోపమేయములు వేరు వేరు లింగములలో గాని, వేరువేరు వచనములలో గాని ఉన్నచో వాటితో అన్వయించుటకై ప్రయుక్తమగు, సాధారణధర్మము ఏదో ఒక దానితోడనే అన్వయించును. రెండవదానితో అన్వయించవలెనన్నిన దాని లింగమునో, వచనమునో మార్చవలసి యుండవచ్చును. అపుడు అది ఉద్వేగకరముగ ఉండును. కాని కొన్నిచోట్ల ప్రసిద్ధివశముచే అట్టి ఉద్వేగము కలుగదు. అప్పుడది దోషము కాదు. అట్లే ఉపమానము హీనమైనచో ఉపమేయ

మునకు అపకర్ష కలుగును ఉపమానము చాలా గొర్ప దైనను దాని ముందు ఉపమేయము సౌందర్య విహీనమై యుండును. కావున అవి కూడ దోషములే. కాని కొన్ని స్థలములలో అందము చెడకున్నచో ఇవి దోషములు కావు అను విషయము ఉదాహరణములవలన స్పష్ట మగును

అవ. లింగవచనభేదములు దోషము కాని ఉదాహరణలను చూపు చున్నాడు.

మూ. స్త్రీవ గచ్ఛతి షణ్ఢోఽయం వక్త్యేషా స్త్రీ పుమానివ.
ప్రాణా ఇవ ప్రియోఽయం మే విద్యా ధనమివార్జితా. 52

వ్యా. అయం షణ్ఢః = ఈ నపుంసకుడు, స్త్రీవ = స్త్రీవలె, గచ్ఛతి = నడచుచున్నాడు. ఏషా స్త్రీ = ఈ స్త్రీ, పుమానివ = పురుషుడు వలె, వక్తి = పలుకుచున్నది. అయం = ఇతడు, మే = నాకు, ప్రాణా ఇవ = ప్రాణముల వలె, ప్రియః = ప్రియుడు. విద్యా = విద్య, ధనమివ = ధనమువలె, అర్జితా = సంపాదింపబడినది.

మొదటి రెండు ఉదాహరణములలో ఉపమానోపమేయములు వేరు వేరు లింగములలో నున్నను, సాధారణధర్మ వాచకము లగు 'గచ్ఛతి' 'వక్తి' అను క్రియలు వాటితో సమముగ అన్వయించుటకు వీలున్నది గాన ఇది దోషము కాదు. మూడవ ఉదాహరణములో ఉపమానోపమేయములు వేరు వేరు వచనము లలో నున్నవి. ప్రాణ శబ్దము నిత్యబహువచన మగుటచే అట్లు ప్రయోగించక తప్పదు. "యథా ప్రాణాః ప్రియాః తథా అయం ప్రియః" అని మార్చుకొని అర్థము చెప్పవలసి యుండుకు. అంచే ఇది దోషము కాదు. అట్లే నాల్గవ ఉదా హరణములో ఉపమానోపమేయ వాచకములు నిత్య నపుంసకలింగ-నిత్య స్త్రీ లింగములు గాన అచట గూడ మరి యొక విధముగ ప్రయోగించుటకు వీలు లేదు గాన అదికూడ దోషముకాదు. "యథా ధనం అర్జితం తథా విద్యా అర్జితా" అని సమానధర్మ వాచకమును మార్చుకొని అర్థము చెప్పవలెను.

అవ. హీనోపమాధికోపమలు కొన్ని యెడల దోషము కావనుటకు ఉదాహరణము చెప్పుచున్నాను.

మూ. భవానివ మహీపాల దేవరాజో విరాజతే
అలమంశుమతః కక్షామారోఢుం తేజసా నృపః. 53

వ్యా. హే మహీపాల = ఓ రాజా, దేవరాజః = దేవేంద్రుడు, భవానివ = నీవు వలె, విరాజతే = ప్రకాశించు చున్నాడు. నృపః = రాజు, తేజసా = తేజస్సుచేత, అంశుమతః = సూర్యునియొక్క, కక్షామ్ = సామ్యమును, ఆరోఢుం = పొందుటకు, అలమ్ = సమర్థుడు.

మొదటి ఉదాహరణమున దేవేంద్రునకు రాజును ఉపమానముగ చెప్పుటచే హీనోపమ. రెండవ ఉదాహరణమున రాజుకు సూర్యుని ఉపమానముగ చెప్పుటచే ఇది అధికోపమ. ఐనను, రాజును ప్రశంసించుట యందే తాత్పర్యము గాన ఇవి లోకప్రసిద్ధి ననుసరించి దోషములు కావు.

మూ. ఇత్యేవమాదౌ సౌభాగ్యం న జహాత్యేవ జాతు చిత్
అస్త్యేవ క్వచిదుద్వేగః ప్రయోగే తద్విదాం యథా. 54

వ్యా .ఇత్యేవమాదౌ = ఇట్టి ఉదాహరణములలో, (ఉపమాలంకారము). జాతు చిత్ = ఎన్నడును, సౌభాగ్యం = సౌందర్యమును, న జహాత్యేవ = విడువదు, లేదా 'సౌభాగ్యం' అనుదానిని కర్తగ గ్రహించి, "సౌభాగ్యము తొలగిపోదు" అని అర్థము చెప్పవచ్చును. క్వచిత్ ప్రయోగే = కొన్ని ప్రయోగములలో మాత్రము, తద్విదాం = అలంకార ప్రయోగము నెరిగిన సహృదయులకు, ఉద్వేగః = ఉద్వేగము, అస్త్యేవ = ఉండనే ఉండును యథా = ఎట్లనగా —

మూ. హంసీవ ధవలశ్చన్ద్రః సరాంసీవామలం నభః
భర్తృభక్తో భటః శ్వేవ ఖద్యోతో భాతి భానువత్. 55

వ్యా. చంద్రః = చంద్రుడు (పుం లిం), హంసీవ = హంసివలె, (స్త్రీలిం) ధవళః = తెల్లగా నున్నాడు. నభః = అకాశము (ఏ.వ), సరాంసీవ = సరస్సులు వలె (బ వ.), అమలమ్ = స్వచ్ఛమైనది. భటః = భటుడు, శ్వేవ = కుక్క వలె, భర్తృ భక్తః = స్వామి భక్తుడు. ఖద్యోతః = మెరుగుడుపురుగు, భానువత్ = సూర్యుడు వలె, భాతి = ప్రకాశించుచున్నది. ఈ నాలుగు వాక్యము లును వరుస గలింగభేద-వచనభేద-హీనోపమా-అధికోపమలకు ఉదాహరణములు.

మూ. ఈదృశం వర్జ్యతే సద్భిః కారణం తత్ర చిన్త్యతామ్
గుణదోషవిచారాయ స్వయమేవ మనీషిభిః. 56

వ్యా. ఈదృశమ్ = ఇట్టిది. సద్భిః = సత్పురుషులచే, వర్జ్యతే = పరిహ రింపబడును. మనీషిభిః = బుద్ధిమంతులచే, తత్ర = ఆ విషయమై, గుణదోష విచారాయ = గుణదోషముల విచారణము కొరకై, కారణమ్ = కారణము, స్వయ మేవ = స్వయముగానే, చిన్త్యతామ్ = ఆలోచింపబడుగాక.

అవ. ఔపమ్యము కొన్ని చోట్ల వాచ్యముగ ఉండును, కొన్ని చోట్ల లక్ష్యముగ ఉండును, కొన్ని చోట్ల వ్యంగ్యముగ నుండును. వాచక-లక్షక-వ్యంజకపదముల ప్రయోగమును బట్టి ఈ భేదము లేర్పడును "శ్రౌతీ ఉపమా" "ఆర్థీ ఉపమా" మొదలగు భేదములు గూడ ఇట్టి పదముల ప్రయోగమును బట్టి ఏర్పడినవే. కాని దండి ఈ భేదములను వేటిని అంగికరింపక ఉపమాప్రతిపాదక పదముల నన్నింటిని తొమ్మిది శ్లోకములలో చెప్పుచున్నాడు. వీటిలో కొన్ని వాచకములు, కొన్ని లక్షకములు, కొన్ని వ్యంజకములు.

మూ. ఇవవద్వాయథాశబ్దాః సమాననిభసన్నిభాః
తుల్యసఙ్కాశ నీకాశ ప్రకాశ ప్రతిరూపకాః. 57

ప్రతిపక్ష ప్రతిద్వన్ద్వి ప్రత్యనీక విరోధినః
సదృక్సదృశ సంవాది సజాతీయానువాదినః. 58

ప్రతిబిమ్బప్రతిచ్ఛన్ద సరూపసమసమ్మితాః
సలక్షణ సదృక్షాభ సపక్షోపమితోపమాః. 59

కల్ప దేశీయదేశ్యాదిః ప్రఖ్యప్రతినిధీ అపి
సవర్ణతులితౌ శబ్దౌ యే చాన్యూనార్థవాదినః. 60

సమాసశ్చ బహువ్రీహిః శశాఙ్క-వదనాదిషు
స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి. 61

ఆక్రోశత్యవజానాతి కదర్థయతి నిన్దతి
విడమ్బయతి సన్ధత్తే హసతీర్ష్యత్యసూయతి. 62

తస్య ముష్ణాతి సౌభాగ్యం తస్య కాన్తిం విలుమ్పతి.
తేన సార్ధం విగృహ్ణాతి తులాం తేనాధిరోహతి. 63

తత్పదవ్యాం పదం ధత్తే తస్య కక్షాం విగాహతే
తమన్వేత్యనుబధ్నాతి తచ్ఛీలం తన్నిషేధతి. 64

తస్య చానుకరోతీతి శబ్దాః సాదృశ్యసూచకాః
ఉపమాయామిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః. 65

( ఇత్యుపమాచక్రమ్ )

వ్యా. (శ్లోక. 65) ఇతి = ఈ విధముగా, ఉపమాయామ్ = ఉపమయందు, సాదృశ్యసూచకాః = సాదృశ్యమును సూచించు నవియు, కవీనాం = కవుల, బుద్ధిసౌఖ్యదాః = బుద్ధికి ఆనందమును కలిగించు నవియు అగు, శబ్దాః = 'ఇవ' మొదలగు (67) శబ్దములు, ప్రోక్తాః = చెప్పబడినవి. ఇచ్చట దండి 67 శబ్దములను చూపి యున్నాడు. వీటిలో కొన్ని వాచకములు, కొన్ని లక్షకములు, కొన్ని వ్యంజకములు, కొన్ని లుప్తోపమావాచకములు. అందుచే అన్నింటికి వర్తించు విధమున 'సాదృశ్యసూచకాః, అను పదమును ప్రయోగించినాడు. వీటికి ఉదాహరణములు:-

1, ''ఇవ' "హంసీవ కృష్ణ తే కీర్తిః స్వర్గఙ్గామవగాహతే,"

2, 'వత్' - "గామ్భీర్యగరిమా తస్య సత్యం గఙ్గాభుజఙ్గవత్
దురాలోకః స సమరే నిదాఘామ్బరత్నవత్",

3. 'వా' - "మణీ వోష్ట్రస్య లమ్బేతే ప్రియౌ వత్సతరౌ మమ"

4. "యథా" - ధన్యస్యానన్యసామాన్యసౌజన్యోత్కర్షశాలినః.
కరణీయం వచశ్చేతః సత్యం తస్యామృతం యథా"

5. 'సమాన' - "భుజే భుజఙ్గేన్ద్ర సమానసారే
భూయః స భూమేర్ధుర మాససఞ్జ."

6. 'నిభ' - "ప్రబుద్ధపుణ్డరీకాక్షం బాలాతపనిభాంశుకమ్"

7. సన్నిభ' - "భగవాన్ యజ్ఞపురుషో జగర్జాగేన్ద్రసన్నిభః"

8 "తుల్య" - "అవేహి మాం కిఙ్కరమష్టమూర్తేః
కుమ్భోదరం నామ నికుమ్భతుల్యమ్."

9. 'సంకాశ' - విమానే సూర్యసఙ్కాశే రఘురాజో వ్యరాజత"

10. 'నీకాశ' - "అకాశనీకాశతటాం తీరవానీరసఙ్కులామ్,
"బభూవ చరతాం హర్షః పుణ్యతీర్థాం సరస్వతీమ్"

11. 'ప్రకాశ' - "చన్ద్రప్రకాశం వదనం తరుణ్యా భాతి సున్దరమ్."

12. 'ప్రతిరూపక' - "వాగ్భిః సుధాయాః ప్రతిరూపకాభి
స్తనోతి మోదం హృది మేఽనిశం యా"

13. 'ప్రతిపక్ష' - "పఙ్కేరుహశ్రీప్రతిపక్షభూత
నేత్రప్రభాభిః స్పృహణీయశోభమ్".

14, 'ప్రతిద్వన్ద్వి' - "చన్ద్రప్రతిద్వన్ద్వి విభాతి బాలా-
ముఖం నిశాయాం లలితోత్సవేషు",

15 'ప్రత్యనీక' - "కామస్య ప్రత్యనీకోఽయమ్".

16. 'విరోధిన్' - 'త్వం రతేశ్చ విరోధినీ'.

17. 'సదృక్' - " న త్వయా సదృగస్త్యే స్తి త్రైలోక్యేపి మనోరమః"

18. 'సదృశ' - "సుధాకరశ్రీసదృశీ చ కీర్తిః"

19. 'సంవాదిన్' - "విభాతి బాలావదనే స్మితశ్రీః
సంవాదినీ శారదచన్ద్రికాయాః"

20. 'సజాతీయ' - "కృష్ణాగురుసజాతీయమ్"

21. 'అనువాదిన్' - "పీయూషస్యానువాదినమ్",

22. 'ప్రతిబిమ్బ' - "చన్ద్రస్య ప్రతిబిమ్బం సత్సజ్జం సన్తాపహం శ్రయే"

23. 'ప్రతిచ్ఛన్ద' - "జామదగ్న్య ప్రతిచ్ఛన్దః"

24. 'సరూప' - 'సరూపో యః కిరీటినః'

25. 'సంమిత' - "సమ్మితో రఘునాథస్య శివరాజో విరాజతే".

26. 'సమ' - "పాణిః పల్లవేన సమస్తవ".

27. 'సలక్షణ' - "ఇన్దుసలక్షణవదనే".

28 'సదృక్ష' - "సుధాసదృక్షోధరస్య రసః".

29. 'ఆభా' - "జ్యోత్స్నాభాః స్మితమధురా నర్మాలాపాః".

30. 'సపక్ష' - "దలద్రాక్షా నిర్యద్రసభరసపక్షా భణితయః".

31. 'ఉపమిత' - "రాక్షసోపమితా వాగ్భిః ఖలా దీనాంస్తుదన్త్యలమ్"

32. 'ఉపమా' - "సాధవస్తోషయన్త్యన్యాంస్తాభిరేవ సురోపమాః"

33. 'కల్ప ' (ప్రత్యయ)- "పూర్ణేన్దుకల్పవదనా"

34. 'దేశ్య' (ప్రత్యయ) - "మృణాలీదేశ్యదోర్లతా".

35. "దేశీయ (ప్రత్యయ)" "చక్రదేశీయజఘనా సా స్వప్నేపి న దృశ్యతే"

36 'ప్రఖ్య'-"గుప్తమభ్రచయప్రఖ్యైర్గోపురైర్మన్దరోపమైః".

37 'ప్రతినిధి'-"భయోత్సృష్టవిభూషాణాం తేన కేరలయోషితామ్.
అలకేషు చమూరేణుశ్చూర్ణప్రతినిధిః కృతః"

38. 'సవర్ణ'-"గ్రథితమౌలిరసౌ వనమాలయా
తరుపలాశసవర్ణ తనుచ్ఛదః".

39. 'తులిత'- "ముఖం శ్లేష్మాగారం తదపి చ శశాఙ్కేన తులితమ్".

40. 'తీసిపోనిది' అను అర్థమును బోధించు 'అన్యూన' 'అనూన' 'అహీన' మొదలగు శబ్దములు ఉపమాసూచకములు

i. 'అన్యూన'- "సుధాన్యూనాని గఙ్గాయా జలాని"
ii. 'అనూన'- "అమృతానూనరసాధరా ప్రియా".
iii. 'అహీన'- "అహీనం చన్ద్రమణ్డలాత్ - తన్ముఖమ్".

41. బహువ్రీహి:- "కమలకరా కరభోరూః కువలయనయనా".

42. కర్మధారయ:- "శోణాధరాంశుసంభిన్నాస్తన్వి తే వదనామ్బుజే"

43. 'స్పర్ధతే':- "స్పర్ధతే రుద్ధమద్దైర్యో వరరామాముఖానిలైః"

44. "జయతి"- "జిగాయ జమ్బూజనితశ్రియః శ్రియం సుమేరుశృఙ్గస్య తదా తదాసనమ్."

45. ద్వేష్టి- "రాధాముఖం ద్వేష్టి సుధాకరస్తత్పాపేన లోకే వహతే కలఙ్కమ్"

46. 'ద్రుహ్యతి'- "ద్రుహ్యన్తి తల్లోచనమమ్బుజాని తతో నిమీలన్తి నిశాసు తాని".

47. ప్రతిగర్జతి'- "న జాతు శక్తిరిన్దోస్తే ముఖేన ప్రతిగర్జితుమ్"

48. 'ఆక్రోశతి'- "అబ్జమాక్రోశతి తే ముఖమ్".

49. "అవజానాతి"- "అవజానాతి తే వక్త్రం పద్మం సేయంకథామృషా"

50 'కదర్థయతి'- "కదర్థయతి కాన్తాయా ముఖం మే ఫుల్లపఙ్కజమ్"

51. "నిన్దతి"- "నిన్దత్యధరశ్చ బన్ధూకమ్".

52. "విడమ్బయతి"- "స ఏవముక్త్వా మఘవన్తమున్ముఖః
కరిష్యమాణః సశరం శరాసనమ్.
అతిష్ఠదాలీఢ విశేషశోభినా
వపుఃప్రకర్షేణ విడమ్బితేశ్వరః".

53. "సన్ధత్తే"- "చన్దనః శీతతాం ధత్తే సౌరభ్యం కమలం శశీ,
లావణ్యం త్వన్ముఖం బాలే సన్ధత్తే తత్త్రయం కథమ్".

54. 'హసతి'- "అకలఙ్కతయా వక్త్రం హసతీన్దుం కలఙ్కినమ్".

55. 'ఈర్ష్యతి'-"ఈర్ష్యతి కపిచేష్టాయై చపలమతిర్యో యదీయ దుశ్చరితమ్".

56. 'అసూయతి'- "నిత్యమసూయతి వానరవదనాయ నమః ఖలాయ
శతశస్తే."

57. "తస్య ముష్ణాతి సౌభాగ్యమ్",
58. "తస్య కాన్తిం విలుమ్పతి"
59. "తేన సార్ధం విగృహ్ణాతి".
60. "తులాం తేనాధిరోహతి".
61. "తత్పదవ్యాం పదం ధత్తే"
62. "తస్య కక్షాం విగాహతే".

(57–62) ఈ ఆరు వాక్యములును ఉదాహరణములుగ కూడ ఉపయోగించును.

63. "తమన్వేతి"- "పద్మమన్వేతి తే ముఖమ్".

64. "తమనుబధ్నాతి" "శశాఙ్కమనుబధ్నాతి ముఖమిత్యమృషా కథా".

65. "తచ్ఛీలమ్"-"శీలం ధత్తే పయోజస్య రాధాచరణయోర్యుగమ్".

66. "తన్నిషేధతి"- "నిషేధతి ముఖం భావే తవ ఫుల్లం కుశేశయమ్".

67. "తస్యానుకరోతి"- "సర్వదేవమయస్య ప్రకటితవిశ్వరూపాకృతేరను
కరోతి భగవతో నారాయణస్య".

ఈ శబ్దములే కాక 'అనుహరతి' (అనుహరతి మనోజబాణలక్ష్మీం సుభగతనో తవ చఞ్చలః కటాక్షః") "సహాధీతి" ("అవధృత్య దివోఽపి యౌవతైర్న సహాధీతవతీమిమామహమ్") "సతీర్థ్య" (కమలసతీర్థ్యం వదనం కుముదసహాధ్యాయినో హాసాః") మొదలగు పదములు కూడ ఉపమానసూచకములే.

పైన చూపిన పదములలో 'ఇవ' 'వత్' 'యథా' మొదలగునవి అభిధా వృత్తిచే ఉపమానవాచకములు. 'తుల్య' మొదలగు శబ్దములకు 'సమానమైనది' అని అర్థము. అందుచే అవి అభిధచే సాదృశ్యముకల వస్తువును బోధించును. తద్ద్వారా సాదృశ్యరూపార్థమును సూచించును. 'నిషేధతి' 'అసూయతి' ఇత్యాది శబ్దములు లక్షణావృత్తిచేత సాదృశ్యమును బోధించును. 'అనుకరోతి' మొద లగు పదములు వ్యంజనావృత్తిచే సాదృశ్యమును బోధించును.

సూ. ఉపమైవ తిరోభూతభేదా రూపకముచ్యతే
యథా బాహులతా పాణిపద్మం చరణపల్లవః. 66

వ్యా. తిరోభూతభేదా = కప్పివేయబడిన భేదము గల, ఉపమైవ = ఉపమాలంకారమే, రూపకమ్ = రూపకాలంకారముగా, ఉచ్యతే = చెప్పబడు చున్నది. ఉపమానోపమేయములు భిన్నములైనను (వాటికి భేదము లేనట్లు) ఉపమేయమునకు ఉపమానముతో తాదాత్మ్యమును చెప్పినచో అది రూపకా లంకార మని అర్థము. "రూపయతి" = ఉపమానోపమేయములకు ఏకరూపత్వ మును కల్పించునది గాన 'రూపకమ్' అని దీని అర్థము. యథా = ఎట్లనగా— బాహులతా = బాహువే లత. పాణిపద్మమ్ = హస్తమే పద్మము. చరణపల్లవః = పాదమే చిగురు.

ఈ ఉదాహరణములలో ఉపమేయము లగు బాహు-పాణి-చరణములకును ఉపమానము లగు లతా-పద్మ-పల్లవములకును ('బాహువే లత' ఇత్యాది విధమున) భేదము లేదన్నట్లు చెప్పబడినది గాన రూపకాలంకారము. ఈ మూడును సమస్తపదములు గాన ఇవి సమస్తరూపకమునకు ఉదాహరణము.

అవ. వ్యస్తరూపకమునకు ఉదాహరణములు చూపుచున్నాడు.

మూ. అఙ్గుల్యః పల్లవాన్యాసన్ కుసుమాని నఖత్విషః
బాహూ లతే వసన్తశ్రీస్త్వం నః ప్రత్యక్షచారిణీ. 67

వ్యా. అఙ్గుల్యః = వ్రేళ్ళు, పల్లవాని = చిగుళ్లుగా, ఆసన్ = అయినవి. నఖత్విషః = నఖకాంతులు, కుసుమాని = పుష్పములు. బాహూ = బాహువులు, లతే = లతలు. త్వమ్ = నీవు, నః = మాకు, ప్రత్యక్షచారిణీ = ఎదుట సంచరించుచున్న, వసన్తశ్రీః = వసంతలక్ష్మి. ఇచట 'అఙ్గుల్యః' 'పల్లవాని' ఇత్యాది విధమున ఉపమేయోపమావాచక పదములు సమాసము లేకుండగ ప్రయోగింపబడినవి గాన వ్యస్తరూపకము.

మూ. ఇత్యేతదసమస్తాఖ్యం సమస్తం పూర్వరూపకమ్
స్మితం ముఖేన్దోర్జ్యోత్స్నేతి సమస్తవ్యస్తరూపకమ్. 68

వ్యా. ఇతి = ఇట్లు, ఏతత్ = ఇది, అసమస్తాఖ్యమ్ = అసమస్త మను పేరు గల రూపకము. పూర్వరూపకమ్ = దీని వెనుక చెప్పిన రూపకము, సమస్తమ్ = సమస్తరూపకము. స్మితమ్ = చిరునవ్వు, ముఖేన్దోః = ముఖచంద్రునియొక్క, జ్యోత్స్నా = వెన్నెల; ఇతి = ఇట్లు, సమస్తవ్యస్తరూపకమ్ = సమస్తవ్యస్తరూపకము

'ముఖేన్దు' అనునపుడు ఉపమానోపమేయ వాచక పదములకు సమాసము చేయుటచే సమస్తరూపకము. "స్మితం జ్యోత్స్నా" అనునపుడు అసమస్త (వ్యస్త)రూపకము.

అవ. సకలరూపకమును ఉదాహరించుచున్నాడు:-

మూ. తామ్రాఙ్గులిదలశ్రేణి నఖదీధితి కేసరమ్
ధ్రియతే మూర్ధ్ని భూపాలైర్భవచ్చరణ పఙ్కజమ్. 69

వ్యా. తామ్రాఙ్గులిదలశ్రేణి = ఎఱ్ఱనైన వ్రేళ్లే దలముల పంక్తులుగా కలదియు, నఖదీధితి కేసరమ్ = నఖకాంతులే కింజల్కములుగా కలదియు అగు, భవచ్చరణపఙ్కజమ్ = నీ పాదపద్మము, భూపాలైః = రాజులచేత, మూర్ధ్ని = శిరస్సునందు, ధ్రియతే = ధరింపబడుచున్నది.

మూ. అఙ్గుల్యాదౌ దలాదిత్వం పాదే చారోప్య పద్మతామ్
తద్యోగ్యస్థాన విన్యాసాదేతత్ సకలరూపకమ్. 70

వ్యా. అఙ్గుల్యాదౌ = వ్రేళ్ళు మొదలగు వాటియందు, దలాదిత్వమ్ = దలాదిస్వరూపత్వమును, పాదే = పాదమునందు, పద్మతాం చ = పద్మత్వమును, ఆరోప్య = ఆరోపించి, తద్యోగ్యస్థాన నిర్దేశాత్ = ఆ పద్మము నుంచుటకు తగిన శిరోరూప మగు స్థానమును నిర్దేశించుటవలన, ఏతత్ = ఇది, సకలరూపకమ్ = సకలరూపకాలంకారము.

ఇచట ప్రధానముగ చరణమునందు పద్మత్వము ఆరోపింపబడినది పద్మములో దళము లుండును. అందుచే వ్రేళ్ళు దళము లని ఆరోపణ చేయబడినది. పద్మములో కేసరము లుండును. అందుచే నఖకాంతులయందు కేసరత్వము ఆరోపింపబడినది. ఈ విధముగ చరణమునందు పద్మత్వారోపణమునకు అనుగుణముగ, చరణావయవములందు పద్మావయవత్వారోపము చేయబడినది గాన సకలరూపకము. దీనిని అర్వాచీనులు 'సాంగరూపకము' 'సావయవరూపకము' అని పేర్కొనిరి.

సకలరూపకము గూడ సమస్తము, అసమస్తము అని రెండు విధములు. 'తామ్రాఙ్గులిదలశ్రేణి' అనునది సమస్త సకలరూపకము. 'అఙ్గుల్యః పల్లవాన్యాసన్' ఇత్యాది శ్లోకము అసమస్త సకలరూపకము.

అవ. అవయవరూపకమునకు ఉదాహరణము చూపుచున్నాడు:-

మూ. అకస్మాదేవ తే చణ్డి స్ఫురితాధరపల్లవమ్
ముఖం ముక్తారుచో ధత్తే ఘర్మామ్భఃకణమఞ్జరీః. 71

వ్యా. హేచణ్డి = ఓ కోపస్వభావము కలదానా. అకస్మాత్ ఏవ = హఠాత్తుగా (నిష్కారణముగా), స్ఫురితాధరపల్లవమ్ = కదలుచున్న అధరోష్ఠమనెడు చిగురు గల, తే = నీయొక్క, ముఖమ్ = ముఖము, ముక్తారుచః = ముత్యములవంటి కాంతి గల, ఘర్మామ్భఃకణమఞ్జరీః = చెమట బిందువు లనెడు గుత్తులను, ధత్తే = ధరించుచున్నది.

మూ. మఞ్జరీకృత్య ఘర్మామ్భః పల్లవీకృత్య చాధరమ్
నాన్యథా కృతమత్రాస్య మతోఽవయవరూపకమ్. 72

వ్యా. ఘర్మామ్భః = చెమటను, మఞ్జరీకృత్య = గుత్తిగా చేసి, అధరమ్ = అధరోష్ఠమును, పల్లవీకృత్య = చిగురుగా చేసి, అత్ర = ఈ ఉదాహరణమునందు, ఆస్యమ్ = ముఖము, అన్యథా = మరి యొక విధముగా, న కృతమ్ = చేయబడలేదు. అతః = ఆ కారణమువలన, అవయవరూపకమ్ = అవయవరూపకము. పూర్వోదాహరణములలో స్వేదోదక బిందువులందు మంజరీత్వము, అధరమునందు పల్లవత్వము ఆరోపింపబడినవి. కాని అవయవి యగు ముఖమునందు పద్మత్వారోపము చేయబడలేదు. అందుచే ఇది అవయవరూపకము. దీనినే అర్వాచీనాలు ఏకదేశ వివర్తిరూపక మనిరి. అవయవములలో ఏ ఒక్క అవయవమునకు రూపణము లేక పోయినను అది అర్వాచీనుల మతము ప్రకారము ఏకదేశవివర్తిరూపకము. కాని దండిప్రోక్త మగు ఈ అవయవరూపకములో అవయవికి రూపణ ముండదు. ఇదియే భేదము.

అవ. అవయవిరూపకమును ఉదాహరించుచున్నాడు:-

మూ. వల్గితభ్రు గలద్ఘర్మజల మాలోహితేక్షణమ్
వివృణోతి మదావస్థామిదం వదనపఙ్కజమ్. 73

వ్యా. వల్గితభ్రు = కదల్పబడిన కనుబొమ్మలు కలదియు, గలద్ఘర్మ జలమ్ = స్రవించుచున్న స్వేదము కలదియు, ఆలోహితేక్షణమ్ = బాగుగా ఎఱ్ఱనైన నేత్రములు కలదియు అగు, ఇదమ్ = ఈ, వదనపఙ్కజమ్ = ముఖ పద్మము, మదావస్థామ్ = మదావస్థను, వివృణోతి = వివరించుచున్నది.

మూ. అవికృత్య ముఖాఙ్గాని ముఖమేవారవిన్దతామ్
ఆసీద్గమిత మత్రేద మతోఽవయవిరూపకమ్. 74

వ్యా. అత్ర = ఈ ఉదాహరణమునందు, ముఖాఙ్గాని = ముఖము అంగములైన కనుబొమ్మలు మొదలగు వాటిని, అవికృత్య = మార్చకుండగా, అనగా వాటియందు ఉపమానాంగము లగు భ్రమరత్వాదులను ఆరోపింపకుండగా, ముఖమేవ = అవయవి యైన ముఖము మాత్రమే, అరవిన్దతామ్ = పద్మత్వమును గమితం పొందింపబడినదై, అసీత్ = ఆయెను. అతః = ఆకారణమువలన, అవయవిరూపకమ్ = అవయవిరూపకము,

ఇచట అవయవి (ప్రధానోపమేయము) అగు ముఖమునందు పద్మత్వము ఆరోపింప బడినది. ఈ ఉపమేయాంగము లగు భ్రూ–స్వేద–రక్తనేత్రాదులందు భ్రమర–మకరంద–కర్ణికాదుల ఆరోపణము లేదు గాన ఇది అవయవి రూపకము, అర్వాచీనుల మతమున ఇదికూడ ఏకదేశవివర్తి రూపకమే.

అవ. అవయవరూపక భేదములలో ఒక భేదమగు ఏకాంగరూపకమును ఉదాహరించుచున్నాడు.

మూ. మదపాటలగణ్డేన రక్తనేత్రోత్పలేన తే
ముఖేన ముగ్ధః సోఽప్యేష జనో రాగమయః కృతః. 75

వ్యా. మదపాటలగణ్డేన = మదముచేత పాటలవర్ణము గల (పాటల మనగా ఎరుపు కలిసిన తెలుపు) గండస్థలములు గల, రక్తనేత్రోత్పలేన = ఎఱ్ఱనైన నేత్రములే ఉత్పలములు గల, తే = నీయొక్క, ముఖేన = ముఖము

చేత, ముగ్ధః = మోహపెట్టబడిన. సః ఏషః జనోపి = ఈజనుడు కూడా (నేను), రాగమయః = అనురాగము కలవాడుగా (ఎఱ్ఱగా అని మరి యొక అర్థము,) కృతః = చేయబడిననాడు.

మూ. ఏకాఙ్గరూపకం చైతదేవం ద్విప్రభృతీన్యపి
అఙ్గాని రూపయన్త్యత్ర యోగాయోగౌ భిదాకరౌ. 76

వ్యా. ఏతత్ = ఇది, ఏకాఙ్గరూపకమ్ = ఏకాంగరూపకము. ద్విప్రభృతీని = రెండు మొదలైన, అఙ్గాన్యపి = అంగములను కూడ, ఏవం = ఇట్లే, రూపయన్తి = ఆరోపింతురు. అత్ర = ఈ అవయవిరూపకమునందు, యోగాయోగౌ = యుక్తత్వాయుక్తత్వములు, భిదాకరౌ = భేదమును కలిగించును. పూర్వోక్తోదాహరణమున కేవలము రక్తనేత్రరూపమను ఒక అంగమున ఉత్పలత్వము ఆరోపింపబడినది గండాదులయందు రూపకము లేదు. అందుచే ఇది ఏకాంగరూపకము. ఈ విధముగ రెండు అంగములయందు రూపకమున్నచో ద్వ్యంగరూపకము. ఇట్లే త్ర్యంగరూపకము మొదలగునవి. ఈ అవయవరూపకమునందు రూపణము యుక్తముగా ఉన్నచో యుక్తరూపకము, లేనిచో అయుక్త రూపకము.

అవ. యుక్తరూపకమును ఉదాహరించుచున్నాడు:—

మూ. స్మితపుష్పోజ్జ్వలం లోలనేత్రభృఙ్గమిదం ముఖమ్.
ఇతి పుష్పద్విరేఫాణాం సఙ్గత్యా యుక్తరూపకమ్. 77

వ్యా ఇదమ్ = ఈ, ముఖమ్ = ముఖము, స్మితపుష్పోజ్జ్వలమ్ = చిరునవ్వు అనెడు పుష్పముతో ప్రకాశించుచున్నది. లోలనేత్రభృఙ్గమ్ = చంచలమైన నేత్రములనెడు తుమ్మెదలు కలది. ఇతి = ఈ విధముగా, పుష్పద్విరేఫాణామ్ = పుష్పములకును, తుమ్మెదలకును, సంగత్యా = పరస్పరసంబంధము ఉచితమగుటచే, ఇది, యుక్తరూపకమ్ = యుక్త రూపకము. పుష్పముల దగ్గర తుమ్మెద లుండుట యుక్తము గాన, స్మితమునందు పుష్పత్వారోపము. నేత్రములయందు భృంగత్వారోపము యుక్తమని భావము.

అవ. అయుక్తరూపకమును ఉదాహరించుచున్నాడు:-

మూ. ఇదమార్ద్రస్మితజ్యోత్స్నం స్నిగ్ధనేత్రోత్పలం ముఖమ్
ఇతి జ్యోత్స్నోత్పలాయోగాదయుక్తం నామ రూపకమ్

వ్యా. ఇదమ్ = ఈ, ముఖమ్ = ముఖము, ఆర్ద్రస్మితజ్యోత్స్నమ్ = ప్రేమార్ద్రమైన చిరునవ్వే వెన్నెలకలది. స్నిగ్ధనేత్రోత్పలమ్ = స్నేహపూర్ణములైన నేత్రములే పద్మములుగా కలది. ఇతి = ఇట్లు, జ్యోత్స్నోత్పలాయోగాత్ = వెన్నెలకును పద్మములకును సంబంధము అయుక్తమగుటచే, అయుక్తంనామ = అయుక్తమనెడు, రూపకమ్ = రూపకము.

అను. విషమరూపకమును నిరూపించుచున్నాడు:-

మూ. రూపణాదఙ్గినోఽఙ్గానాం రూపణారూపణాశ్రయాత్
రూపకం విషమం నామ లలితం జాయతే యథా. 79

వ్యా. అఙ్గినః = ప్రధానమైన వర్ణనీయవస్తువుయొక్క, రూపణారూపణాశ్రయాత్ = కొన్నింటిని రూపించుట, కొన్నింటిని రూపింపకపోవుట అను దానిని ఆశ్రయించుటవలన, విషమం నామ = విషమ మను పేరు గల, లలితం = సుందరమైన రూపకము, జాయతే = ఏర్పడును. యథా = ఎట్లనగా-

మూ. మదరక్తకపోలేన మన్మథస్త్వన్ముఖేన్దునా
నర్తితభ్రూలతేనాలం మర్దితుం భువనత్రయమ్. 80

వ్యా. మదరక్తకపోలేన = మదముచే ఎఱ్ఱబారిన చెక్కిళ్ళు కలదియు. నర్తితభ్రూలతేన = నాట్యమాడింపబడిన కనుబొమ్మ లనెడు లతలు గల, త్వన్ముఖేన్దునా = నీ ముఖ మనెడు చంద్రునిచే, మన్మథః = మన్మథుడు, భువనత్రయమ్ = మూడులోకములను, మర్దితుమ్ = పీడించుటకు, అలమ్ = సమర్థుడు.

ఇచట అంగి యగు ముఖమునందు చంద్రత్వారోపము చేయబడినది. కపోలములు, కనుబొమ్మలు అను రెండు అంగములలో కనుబొమ్మలయందు మాత్రమే లతాత్వారోపము చేయబడినది. అందుచే ఇది విషమరూపకము.

అవ. సవిశేషణరూపకమును ఉదాహరించుచున్నాడు:—

మూ. హరిపాదః శిరోలగ్నజహ్నుకన్యాజలాంశుకః
జయత్యసురనిఃశఙ్కసురానన్దోత్సవధ్వజః. 81

వ్యా. శిరోలగ్నజహ్నుకన్యా జలాంశుకః = అగ్రభాగమునందు లగ్నమైన గంగాజల మనెడు వస్త్రము కలదియు, అసురనిఃశఙ్క సురానన్దోత్సవధ్వజః = రాక్షసభయము లేని దేవతల ఆనందోత్సవమునకు సంబంధించిన ధ్వజమైన, హరిపాదః = విష్ణుపాదము, జయతి = సర్వోత్కర్షగా ఉన్నది.

మూ. విశేషణసమగ్రస్య రూపం కేతోర్యదీదృశమ్
పాదే తదర్పణాదేతత్సవిశేషణరూపకమ్. 82

వ్యా. విశేషణసమగ్రస్య = శిరోలగ్నవస్త్రరూప మగు విశేషణముతో కూడిన, కేతోః = కేతువుయొక్క, యత్ = ఏ, ఈదృశమ్ = ఇట్టి, రూపమ్ = రూపము కలదో, పాదే = పాదమునందు, తత్సమర్పణాత్ = ఆ కేతురూపమును ఆరోపించుటవలన, ఏతత్ = ఇది, సవిశేషణరూపకమ్ = సవిశేషణరూపకాలంకారము.

ఇచట పాదము అంగి. దానియందు ధ్వజత్వము ఆరోపింపబడినది. పాదముతో సంబంధించిన గంగాజలము విశేషణము. దానియందు పటత్వము ఆరోపింపబడినది. అందుచే ఇది సవిశేషణరూపకము. విశేషణ మనగా ఒకదానితో సంబంధించినది అని అర్థము. ఇచట జలము పాదవిశేషణము; అంశుకము ధ్వజవిశేషణము.

అవ. విరుద్ధరూపకము నుదాహరించుచున్నాడు:—

మూ. న మీలయతి పద్మాని న నభో ప్యవగాహతే
త్వన్ముఖేన్దుర్మమాసూనాం హరణాయైవ కల్పతే. 83

వ్యా. త్వన్ముఖేన్దుః = నీ ముఖచంద్రుడు, పద్మాని = పద్మములను, నమీలయతి = = మూసుకొని పోవునట్లు చేయుట లేదు. నభః అపి = ఆకాశమును కూడా, న అవగాహతే = ప్రవేశించుటలేదు. మమ = నా, అసూనామ్ = ప్రాణముల, హరణాయైవ = హరణముకొరకే (నా ప్రాణములను తీయుటకు మాత్రమే) కల్పతే = సమర్థ మగుచున్నది.

ఇచట చంద్రరూపమున రూపిత మగు ముఖము చంద్రకార్యములు చేయుటకు బదులు, అందులకు విపరీత మగు కార్యమును చేయుచున్నట్లు వర్ణింపబడినది గాన ఇది విరుద్ధరూపకము. ఈ విషయమునే క్రింది శ్లోకములో చెప్పుచున్నాడు.

మూ. అక్రియా చన్ద్రకార్యాణామన్యకార్యస్య చ క్రియా
అత్ర సన్దర్శ్యతే యస్మాద్విరుద్ధం నామ రూపకమ్. 84

వ్యా. అత్ర = ఈ ఉదాహరణమునందు, చన్ద్రకార్యాణామ్ = చంద్రుడు చేయు కార్యముల, అక్రియా = చేయకుండుటయు, అన్యకార్యస్య = మరియొక కార్యముయొక్క (అనగా చంద్రుడు చేయని కార్యముయొక్క) క్రియాచ = క్రియయు, యస్మాత్ = ఏ కారణమువలన, సన్దర్శ్యతే = చూపబడుచున్నదో, (తస్మాత్ = ఆకారణము వలన), విరుద్ధం నామ = విరుద్ధ మను పేరు గల, రూపకమ్ = రూపకము.

అవ. హేతురూపకమును నిరూపించుచున్నాడు:-

మూ. గామ్భీర్యేణ సముద్రోఽసి గౌరవేణాసి పర్వతః
కామదత్వాచ్చ లోకానామసి త్వం కల్పపాదపః. 85

వ్యా. త్వమ్ = నీవు, గామ్భీర్యేణ = గాంభీర్యముచేత, సముద్రః = సముద్రముగా, అసి = అయి ఉన్నావు, గౌరవేణ = = గౌరవముచేత, పర్వతః

అసి = పర్వతముగా ఉన్నావు, లోకానామ్ = లోకములకు, కామదత్వాత్ = కోరికలను తీర్చువాడ వగుటవలన, కల్పపాదపశ్చ = కల్పవృక్షముగా కూడ, అసి అయి ఉన్నావు.

అవ. ఇది హేతురూపకమనుటకు హేతువును చెప్పుచున్నాడు:-

మూ. గామ్భీర్యప్రముఖైరత్ర హేతుభిః సాగరో గిరిః
కల్పద్రుమశ్చ క్రియతే తదిదం హేతురూపకమ్. 86

వ్యా. అత్ర = ఈ ఉదాహరణమునందు, (రాజుః), గామ్భీర్యప్రముఖైః = గాంభీర్యము మొదలైన, హేతుభిః = కారణములచే, సాగరః = సముద్రముగాను, గిరిః = పర్వతముగాను, కల్పద్రుమశ్చ = కల్పవృక్షముగాను, క్రియతే = చేయబడుచున్నాడు. తత్ = ఆకారణమువలన, ఇదమ్ = ఇది, హేతురూపకమ్ = హేతురూపకాలంకారము.

అవ. శ్లిష్టరూపకమును నిరూపించుచున్నాడు:-

మూ. రాజహంసోపభోగార్హం భ్రమరప్రార్థ్యసౌరభమ్
సఖి వక్త్రామ్బుజమిదం తవేతి శ్లిష్టరూపకమ్. 87

వ్యా. సఖి = ఓసఖురాలా, తవ = నీయొక్క, ఇదమ్ = ఈ, వక్త్రామ్బుజమ్ = ముఖపద్మము, రాజహంసోపభోగార్హమ్ = రాజశ్రేష్ఠుడు (రాజహంస అని రెండవ అర్థము) అనుభవించుటకు తగినది. భ్రమరప్రార్థ్యసౌరభమ్ = కాముకులచే(తుమ్మెదలచే) ప్రార్థింపదగిన పరిమళము కలది. ఇతి = ఇట్లు చెప్పినచో, శ్లిష్టరూపకమ్ = శ్లిష్టరూపకాలంకారము.

అవ. ఉపమానరూపక — వ్యతిరేకరూపకముల లక్షణము చెప్పుచున్నాడు:-

మూ. ఇష్టం సాధర్మ్యవైధర్మ్యదర్శనాద్గౌణముఖ్యయోః
ఉపమావ్యతిరేకాఖ్యం రూపకద్వితయం యథా. 88

వ్యా. గౌణముఖ్యయోః —— ఆహ్లాదకత్వాదిగుణములను బట్టి ఆరోపించ బడిన చంద్రాదికము గౌణము. ప్రస్తుత మగు ముఖాదికము ముఖ్యము. ఆ గౌణ ముఖ్యముల, సాధర్మ్యవైధర్మ్యదర్శనాత్ = సాధర్మ్యవైధర్మ్యములు కానవచ్చుట వలన, (సాధర్మ్య మనగా పోలిక; వైధర్మ్యమనగా పోలిక లేకపోవుట,) ఉపమా వ్యతిరేకాఖ్యమ్ = ఉపమారూపకము, వ్యతిరేకరూపకము అను పేరు గల. రూపకద్వితయమ్ = రూపకద్వయము, ఇష్టమ్ = అంగీకరింపబడినది. యథా = ఎట్లనగా:-

అవ. గౌణముఖ్యముల సాధర్మ్యముచే ఏర్పడు ఉపమారూపకమునకు ఉదాహరణము చూపుచున్నాడు:-

మూ. అయమాలోహితచ్ఛాయో మదేన ముఖచన్ద్రమాః
సన్నద్ధోదయరాగస్య చన్ద్రస్య ప్రతిగర్జతి. 89

వ్యా. మదేన = మదముచేత, ఆలోహితచ్ఛాయః = ఎఱ్ఱనైన కాంతి గల, ముఖచన్ద్రమాః = (నీ) ముఖచంద్రుడు, సన్నద్ధోదయరాగస్య = ఉదయ సమయమునందు ఏర్పడిన ఎరుపుగల, చన్ద్రస్య = చంద్రుని (విషయమున), ప్రతిగర్జతి = ఎదిర్చించుచున్నాడు. ఇచట చంద్రత్వము ఆరోపించిన ముఖమునకు చంద్రునితో రక్తకాంతిత్వరూప మగు సాధర్మ్యముచే ఔపమ్యము చెప్పబడినది గాన ఇది ఉపమారూపకము.

అవ. గౌణముఖ్యముల వైధర్మ్యమును బట్టి ఏర్పడిన వ్యతిరేక రూపకము ఉదాహరించుచున్నాడు:-

మూ. చన్ద్రమాః పీయతే దేవైర్మయా త్వన్ముఖచన్ద్రమాః
అసమగ్రోఽప్యసౌ శశ్వదయమాపూర్ణమణ్డలః. 90

వ్యా. దేవైః = దేవతలచేత, చన్ద్రమాః = చంద్రుడు, పీయతే = పానము చేయబడుచున్నాడు. త్వన్ముఖచంద్రమాః = నీ ముఖ మనెడు చంద్రుడు, మయా = నాచేత పానము చేయబడుచున్నాడు. అసౌ = ఆ చంద్రుడు, అసమగ్రోఽపి

= అసంపూర్ణుడుగా కూడ ఉండును. అయం = ఈ (త్వన్ముఖ) చంద్రుడు, శశ్వత్ = ఎల్లప్పుడును, ఆపూర్ణమణ్డలః = పూర్ణమైన మండలము కలవాడు.

ఆ చంద్రుని దేవతలు పానము చేయగా ఈ ముఖచంద్రుని ప్రియుడు పానము చేయుచున్నాడు. ఆ చంద్రుడు అపూర్ణుడు; ఈ చంద్రుడు పూర్ణుడు. ఈ విధముగ వైధర్మ్య ముండుటచే ఇది వ్యతిరేకరూపకాలంకారము.

అవ. ఆక్షేపరూపకమును నిరూపించుచున్నాడు:—

మూ. ముఖచన్ద్రస్య చన్ద్రత్వమిత్థమన్యోపతాపినః
న తే సున్దరి సంవాదీత్యేతదాక్షేపరూపకమ్. 91

వ్యా. హేసున్దరి = ఓసుందరి! ఇత్థమ్ = ఈవిధముగా, అన్యోపతాపినః = ఇతరులకు తాపమును కలిగించు, తే = నీయొక్క, ముఖచన్ద్రస్య = ముఖచంద్రునియొక్క, చన్ద్రత్వమ్ = చంద్రత్వము, న సంవాది = అనుగుణముగాలేదు. ఇతి ఏతత్ = ఈ విధముగా చెప్పినచో ఇది, అక్షేపరూపకమ్ = ఆక్షేపరూపకాలంకారము.

చంద్రుడు అందరిని సంతోషపెట్టును; నీ ముఖము నీ సపత్నులకు లేదా నిన్ను పొందజాలని కాముకులకు విషాదము కలిగించుచున్నది. అందుచే దీనికి చంద్రత్వము యుక్తముకాదు అని చంద్రత్వమును నిషేధించుటచే ఇది ఆక్షేపరూపకము.

అవ. సమాధానరూపకమును నిరూపించుచున్నాడు:—

మూ. ముఖేన్దురపి తే చణ్డి మాం నిర్దహతి నిర్దయమ్
భాగ్యదోషాన్మమైవేతి తత్సమాధానరూపకమ్. 92

వ్యా. హేచణ్డి = ఓ కోపస్వభావముకలదానా! తే = నీయొక్క, ముఖేన్దురపి = ముఖచంద్రుడు కూడా, మమ = నాయొక్క, భాగ్యదోషాదేవ = దురదృష్టము వలననే, మాం = నన్ను, నిర్దయమ్ = దయారహితముగా, నిర్దహతి =

కాల్చివేయుచున్నాడు; ఇతి = ఈ విధముగ, తత్ = అది, సమాధానరూపకమ్ సమాధానరూపకము.

ముఖచంద్రుడు దహించుటకు కారణము నా దురదృష్టమే అని సమాధానము కూడ చెప్పుటచే ఇది సమాధానరూపకము.

అవ. రూపకరూపకమును నిరూపించుచున్నాడు:—

మూ. ముఖపఙ్కజరఙ్గేఽస్మిన్ భ్రూలతా నర్తకీ తవ.
లీలానృత్యం కరోతీతి రమ్యం రూపకరూపకమ్. 93

వ్యా. అస్మిన్ = ఈ, ముఖపఙ్కజరఙ్గే = ముఖపద్మ మనెడు రంగస్థలమునందు, తవ = నీ, భ్రూలతానర్తకీ = భ్రూలత యనెడు నర్తకి, లీలానృత్యమ్ = విలాసనృత్యమును, కరోతి — చేయుచున్నది. ఇతి = ఈ విధముగ, రమ్యమ్ = సుందరమైన, రూపితరూపకమ్ = రూపితరూపకాలంకారము.

ముఖమునందు పంకజత్వమును ఆరోపించి పిదప దానియందు రంగస్థలత్వము ఆరోపింపబడినది. అట్లే, కనుబొమ్మయందు లతాత్వమును ఆరోపించి మరల దానియందు నర్తకీత్వము ఆరోపింపబడినది. ఈ విధముగ ఒక రూపకముపై మరల మరి యొక రూపక ముండుటచే ఇది రూపితరూపకము.

అవ. తత్త్వాపహ్నవ రూపకమును నిరూపించుచున్నాడు:—

మూ. నైతన్ముఖమిదం పద్మం న నేత్రే భ్రమరావిమౌ.
ఏతాని కేసరాణ్యేవ నైతా దన్తార్చిష స్తవ. 94

వ్యా. ఏతత్ = ఇది, ముఖమ్ = ముఖము, న = కాదు, ఇదమ్ = ఇది, పద్మమ్ = పద్మము. నేత్రే = నేత్రములు, న = కావు ఇమౌ = ఇవి, భ్రమరౌ = తుమ్మెదలు. ఏతాః = ఇవి, తవ = నీ, దన్తార్చిషః = దంతకాంతులు, న = కావు, ఏతాని = ఇవి, కేసరాణ్యేవ = కింజల్కములే.

మూ. ముఖాదిత్వం నివర్త్యైవ పద్మాదిత్వేన రూపణాత్
ఉద్భావితగుణోత్కర్షం తత్త్వాపహ్నవరూపకమ్. 95

వ్యా. ముఖాదిత్వమ్ = ముఖత్వాదికమును, నివర్త్యైవ = నిషేధించిన పిమ్మటనే, పద్మాదిత్వేన = పద్మాదిరూపమున, రూపణాత్ = ఆరోపించుటవలన, ఉద్భావితగుణోత్కర్షమ్ = ప్రకటించబడిన గుణాతిశయముగల, తత్త్వాపహ్నవ రూపకమ్ = తత్త్వాపహ్నవరూపకము.

తత్త్వాపహ్నవ మనగా ఉపమేయము లగు ముఖాదుల వాస్తవరూపమును (ముఖత్వాదికమును) కప్పిపుచ్చుట అని అర్థము. ఇట్లు చేయుటచే ముఖాదుల సౌందర్యాతిశయము ప్రకటింపబడు నని అభిప్రాయము.

మూ. న పర్యన్తో వికల్పానాం రూపకోపమయోరతః
దిఙ్మాత్రం దర్శితం ధీరైరనుక్తమనుమీయతామ్. 96

(ఇతి రూపకచక్రమ్)

వ్యా. రూపకోపమయోః = రూపకోపమాలంకారముల, వికల్పానామ్ = భేదముల, పర్యన్తః = అంతము, న = లేదు. అతః = ఆకారణమువలన, దిఙ్మాత్రమ్ = దిక్కు (ఒక పద్ధతి) మాత్రమే, దర్శితమ్ = చూపబడినది. అనుక్తమ్ = ఇచ్చట చెప్పబడని విశేషము, ధీరైః = బుద్ధిమంతులచే, అనుమీయతామ్ = ఊహింపబడుగాక.

అవ. దీపకాలంకారము :—

మూ. జాతిక్రియాగుణద్రవ్యవాచినైకత్ర వర్తినా
సర్వవాక్యోపకారశ్చేత్ తమాహుర్దీపకం యథా. 97

వ్యా. ఏకత్రవర్తినా = ఒక వాక్యములో నున్న, జాతిక్రియాగుణద్రవ్యవాచినా = జాతి-గుణ-క్రియా-ద్రవ్యములలో ఏదో ఒక దానిని బోధించు పద

ముచే, సర్వవాక్యోపకారశ్చేత్ = అన్నివాక్యములకును ఉపకార మైనచో, తమ్ = దానిని, దీపకమ్ = దీపకాలంకారమునుగా, ఆహుః = చెప్పుచున్నారు. యథా = ఎట్లన —

ఇంట్లో వెలిగించిన దీపము ఇంటిని వీధిని కూడ ప్రకాశింపచేసినట్లు, ఒక వాక్యములో నున్న పదము ఇతర వాక్యములలోనికి కూడ అన్వయించి అర్థబోధ కలిగించినచో అది దీపక మని యర్థము. దీనిని బట్టి దీపకస్థలమున రెండు లేక అంతకంటె అధికసంఖ్యాకము లగు వాక్యము లుండవలె నని చెప్పినట్లైనది. కాని ప్రకృతాప్రకృతములకు ఒక ధర్మముతో సంబంధ మున్నట్లు వర్ణించినచో అది దీపకమని కావ్యప్రకాశకారాదుల లక్షణము.

అవ. జాతిదీపకమును ఉదాహరించుచున్నాడు:-

మూ. పవనో దక్షిణః పర్ణం జీర్ణం హరతి వీరుధామ్
స ఏవావనతాఙ్గీనాం మానభంగాయ జాయతే. 98

వ్యా. దక్షిణః పవనః = దక్షిణవాయువు, వీరుధామ్ = మొక్కలయొక్క, జీర్ణమ్ = ఎండిన, పర్ణమ్ = ఆకును, హరతి = హరించుచున్నది. స ఏవ = ఆ దక్షిణపవనమే, అవనతాఙ్గీనామ్ = స్త్రీల, మానభఙ్గాయ = ప్రణయకోపమును తొలగించుటకు, జాయతే = సమర్థమగుచున్నది.

ఇచట మొదటి వాక్యములో నున్న 'పవన' శబ్దము రెండవ వాక్యములోనికి కూడ అన్వయించుచున్నది. 'పవన' శబ్దము జాతివాచకము గాన ఇది జాతిదీపకము.

మూ. చరన్తి చతురమ్భోధివేలోద్యానేషు దన్తినః
చక్రవాలాద్రికుఞ్జేషు కున్దభాసో గుణాశ్చ తే. 99

వ్యా. తే = నీయొక్క, దన్తినః = ఏనుగులు, చతురమ్భోధివేలోద్యానేషు = చతుస్సముద్రతీరములందలి ఉద్యానవనములందు, చరన్తి = సంచ

రించుచున్నవి. కున్దభాసః = మల్లిపూలవంటి కాంతిగల, గుణాశ్చ = గుణములు కూడ, చక్రవాలాద్రికుఞ్జేషు = చక్రవాల పర్వతముయొక్క పొదరిండ్లలో సంచరించుచున్నవి.

ఇచట మొదటి వాక్యములో నున్న 'చరన్తి' అను క్రియ రెండవ వాక్యములో కూడ అన్వయించుటచే క్రియాదీపకము.

అవ. గుణదీపకమును ఉదాహరించుచున్నాడు:—

మూ. శ్యామలాః ప్రావృషేణ్యాభిర్దిశో జీమూతపఙ్క్తిభిః
భువశ్చ సుకుమారాభిర్నవశాద్వలరాజిభిః. 100

వ్యా. దిశః = దిక్కులు, ప్రావృషేణ్యాభిః = వర్షర్తువుకు సంబంధించిన, జీమూతపఙ్క్తిభిః = మేఘపంక్తులచే. శ్యామలాః = నల్లగా నున్నవి. భువశ్చ = భూములుకూడా, సుకుమారాభిః = సుకుమారమైన, నవశాద్వలరాజిభిః = నూతనమైన పచ్చికబీళ్ల పంక్తులచే, నల్లగా ఉన్నవి.

ఇచట మొదటి వాక్యములో నున్న 'శ్యామలాః' అను గుణవాచకశబ్దము రెండవ వాక్యములోనికి కూడ అన్వయించుటచే గుణదీపకాలంకారము.

అవ. ద్రవ్యదీపకము నుదాహరించుచున్నాడు :—

మూ. విష్ణునా విక్రమస్థేన దానవానాం విభూతయః
క్వాపి నీతాః కుతోఽప్యాసన్నానీతా దైవతర్ధయః. 101

వ్యా. విక్రమస్థేన = మూడు పాదవిన్యాసములలో ఉన్న, (పాదవిన్యాసములు చేసిన), విష్ణునా = వామనావతార మెత్తిన విష్ణువుచేత, దానవానామ్ = దానవుల, విభూతయః = ఐశ్వర్యములు, క్వాపి = ఎచటికో, నీతాః = తీసుకొనిపెళ్లబడినవి. దైవతర్ధయః = దేవతల ఐశ్వర్యములు, కుతోఽపి = ఎచటినుండియో, ఆనీతాః = తీసికొనిరాబడినవై, ఆసన్ = అయినవి.

'విష్ణు' శబ్దము "విష్ణువు" అనెడు ఒక వ్యక్తిని మాత్రమే బోధించు చున్నది గాన ద్రవ్యావాచకము పూర్వవాక్యములో ఉన్న ఆ పదము ఉత్తర వాక్యములోనికి కూడ అన్వయించుటచే ద్రవ్యదీపకము.

మూ. ఇత్యాదిదీపకాన్యుక్తాన్యేవం మధ్యాన్తయోరపి
వాక్యయోర్దర్శయిష్యామః కానిచిత్తాని తద్యథా. 102

వ్యా. ఇతి = ఈవిధముగ, ఆదిదీపకాని = ఆదిదీపకములు, ఉక్తాని = చెప్పబడినవి. పైన చెప్పిన చతుర్విధదీపకములలో దీపకపదము మొదటి వాక్యములలో ఉండుటచే ఇవి ఆదిదీపకములు. మధ్యాన్తయోః వాక్యయోరపి = మధ్యమవాక్య అన్త్యవాక్యములలో కూడ, కానిచిత్ = కొన్ని, తాని = ఆ దీపకములను, దర్శయిష్యామః = చూపెదము. తత్ = అది, యథా = ఎట్లనగా:-

అవ. దీపకపదము మధ్యలోనున్నచో మధ్యదీపకము, అంతమున నున్నచో అంతదీపకము, ఇవి కూడ జాత్యాదిభేదముచే నాలుగేసి యుండును. వాటిలో కొన్నింటిని ఉదాహరించుచు మధ్యగత జాతి దీపకమునకు ఉదాహరణము చూపుచున్నాడు:-

మూ. నృత్యన్తి నిచులోత్సఙ్గే గాయన్తి చ కలాపినః
బధ్నన్తి చ పయోదేషు దృశో హర్షాశ్రుగర్భిణీః. 103

వ్యా. కలాపినః = నెమళ్లు, నిచులోత్సఙ్గే = వేతసగుల్మముల క్రింద (పేపడొంకల క్రింద), నృత్యన్తి = నాట్యముచేయుచున్నవి. గాయన్తి చ = గానము కూడ చేయుచున్నవి. హర్షాశ్రుగర్భిణీః = ఆనందబాష్పములతో గూడిన, దృశః = నేత్రములను, పయోదేషు = మేఘములపై, బధ్నన్తి = నిలుపుచున్నవి.

ఇచట మధ్యమవాక్యములో నున్న 'కలాపినః' అను జాతివాచకపదము ప్రథమ తృతీయ వాక్యములలోనికి కూడ అన్వయించుచున్నది గాన మధ్యగత జాతిదీపకము.

అవ. మధ్యగతక్రియాదీపకమును ఉదాహరించుచున్నాడు:-

మూ. మన్దో గన్ధవహః క్షారో వహ్నిరిన్దుశ్చ జాయతే
చర్చాచన్దనపాతశ్చ శస్త్రపాతః ప్రవాసినామ్. 104

వ్యా. ప్రవాసినామ్ = వియోగులకు, మన్దః = మందమైన, గన్ధవహః = వాయువు, క్షారః = గాయముపై ఉప్పుగా, జాయతే = అగుచున్నది. ఇన్దుః = చంద్రుడు, వహ్నిశ్చ = అగ్నిగా కూడ, అగుచున్నది. చర్చాచన్దనపాతశ్చ = దేహమునకు పూయుటకై తయారుచేసిన చందనముయొక్క పూతకూడ, శస్త్రపాతః = ఆయుధప్రహారముగా, అగుచున్నది.

ఇచట 'జాయతే' అను క్రియాపదము మధ్యవాక్యములో నున్నది గాన ఇది మధ్యగతక్రియా దీపకము.

అవ. అన్తగతజాతిదీపకమును ఉదాహరించుచున్నాడు :-

మూ. జలం జలధరోద్గీర్ణం కులం గృహశిఖణ్డినామ్
చలం చ తడితాం దామ బలం కుసుమధన్వనః 105

వ్యా. కుసుమధన్వనః = మన్మథునకు, జలధరోద్గీర్ణమ్ = మేఘములచే విడువబడిన, జలం = జలము, బలమ్ = సైన్యము: గృహశిఖణ్డినామ్ = గృహమునందలి నెమళ్లయొక్క, కులమ్ = సముదాయము, సైన్యము: తడితామ్ = మెరుపుల, చలం = చంచలమైన, దామచ = పఙ్క్తి కూడ, సైన్యము.

ఇచట జాతివాచకపద మైన 'బలమ్' అనునది అంత్యవాక్యములో ఉన్నది గాన ఇది అన్తగతజాతిదీపకము.

అవ. అన్తగతక్రియాదీపకమును ఉదాహరించుచున్నాడు :-

మూ. త్వయా నీలోత్పలం కర్ణే స్మరేణాస్త్రం శరాసనే
మయాపి మరణే చేతస్త్రయమేతత్ సమం కృతమ్. 106

వ్యా. త్వయా = నీచేత, నీలోత్పలమ్ = నల్ల కలవ, కర్ణే = కర్ణమునందు, కృతమ్ = ఉంచబడినది. స్మరేణ = మన్మథునిచేత, అస్త్రమ్ = అస్త్రము,

శరాసనే = ధనస్సునందు, ఉంచబడినది. మయా = నాచేత, చేతః = చిత్తము, మరణే = మరణమునందు, చేయబడినది. ఏతత్ = ఈ, త్రయమ్ = త్రయము, సమమ్ = ఒక్కమారుగా, కృతమ్ = చేయబడినది.

ఇచట అంత్యవాక్యములో నున్న 'కృతమ్' అను క్రియావాచకపదము ఇతరవాక్యములలోనికి కూడ అన్వయించుచున్నది గాన ఇది అంతగతక్రియా దీపకము.

అవ. మాలాదీపకమును నిరూపించుచున్నాడు :-

మూ. శుక్లః శ్వేతార్చిషో వృద్ధ్యై పక్షః పఞ్చశరస్య సః
స చ రాగస్య రాగోఽపి యూనాం రత్యుత్సవశ్రియః. 107

వ్యా. శుక్లఃపక్షః = శుక్లపక్షము, శ్వేతార్చిషః = చంద్రునియొక్క, వృద్ధ్యై = వృద్ధికొరకు (భవతి = అగును) వృద్ధిని కలిగించు నని అర్థము. సః = ఆ చంద్రుడు, పఞ్చశరస్య = మన్మథునియొక్క, వృద్ధికొరకు అగును. స చ = ఆ మన్మథుడు కూడా, రాగస్య = అనురాగముయొక్క, అభివృద్ధికొరకు అగును. రాగోఽపి = అనురాగముకూడా, యూనామ్ = యువకులయొక్క. రత్యుత్సవశ్రియః = రత్యుత్సవలక్ష్మియొక్క, వృద్ధికొరకు అగును.

మూ. ఇత్యాదిదీపకత్వేఽపి పూర్వపూర్వవ్యపేక్షిణీ
వాక్యమాలా ప్రయుక్తేతి తన్మాలాదీపకం మతమ్. 108

వ్యా. ఇతి = ఈ విధముగ, ఆదిదీపకత్వేఽపి = ఆదిదీపకమైనను, (పూర్వోదాహరణమున 'వృద్ధ్యై' అను పదము ప్రథమవాక్యములో నుండి ఇతర వాక్యములలోనికి కూడ అన్వయించుటచే ఆదిదీపక మైనను అని యర్థము' పూర్వపూర్వవ్యపేక్షిణీ = పూర్వాపూర్వవాక్యముల (లోని పదముల) అపేక్షగల, వాక్యమాలా = వాక్యముల పంక్తి, ప్రయుక్తా = ప్రయోగింపబడినది, ఇతి = ఈ కారణముచే, తత్ = అది, మాలాదీపకమ్ = మాలాదీపకాలంకారముగా, మతమ్ = అంగీకరింపబడినది.

మొదటి వాక్యములో చెప్పిన చంద్రుని రెండవ వాక్యమునందును, రెండవ వాక్యములోని మన్మథుని మూడవ వాక్యమునందును, మూడవ వాక్యములోని రాగమును నాల్గవ వాక్యమునందును గ్రహించుటచే ఉత్తరోత్తరవాక్యములు పూర్వపూర్వ వాక్యసాపేక్షములై యున్నవి గాన ఇది మాలాదీపక మని భావము,

అవ. విరుద్ధార్థదీపకమును నిరూపించుచున్నాడు :—

మూ. అవలేపమనఙ్గస్య వర్ధయంతి బలాహకాః
క్రశయన్తి తు ఘర్మస్య మారుతోద్ధూతశీకరాః. 109

వ్యా. బలాహకాః = మేఘములు, అనఙ్గస్య = మన్మథునియొక్క. అవలేపమ్ = గర్వమును, వర్ధయన్తి = వృద్ధిపొందించుచున్నవి. మారుతోద్ధూతశీకరాః = వాయువుచే చిమ్మబడిన జలబిందువులు కలవై, ఆ మేఘములు, ఘర్మస్యతు = గ్రీష్మర్తువుయొక్క, గర్వమునైతే, క్రశయన్తి = తగ్గించుచున్నవి.

మూ. అవలేపపదేనాత్ర బలాహకపదేన చ
క్రియే విరుద్ధే సంయుక్తే తద్విరుద్ధార్థదీపకమ్. 110

వ్యా. అత్ర = ఈ ఉదాహరమునందు, అవలేపపదేవ = అవలేపపదము తోడను, బలాహకపదేన చ = బలాహక శబ్దముతోడను, విరుద్ధే = విరుద్ధము లగు, క్రియే = క్రియలు, సంయుక్తే = సంబంధించినవి. తత్ = ఆ కారణము వలన, విరుద్ధార్థ దీపకమ్ = విరుద్ధార్థ దీపకాలంకారము.

'వర్ధయన్తి' 'క్రశయన్తి' అను క్రియలు పరస్పరవిరుద్ధార్థములు. ఆ క్రియలు, 'అవలేపమ్' అను పదముతోడను, 'బలాహకాః' అను పదముతోను అన్వయించుచున్నవి. అందుచే ఇది విరుద్ధార్థదీపకము.

అవ. ఏకార్థదీపకమును ఉదాహరించుచున్నాడు :—

మూ. హరత్యాభోగమాశానాం గృహ్ణాతి జ్యోతిషాం గణమ్
ఆదత్తే చాద్య మే ప్రాణానసౌ జలధరావలీ. 111

వ్యా. అద్య = ఈ రోజున, అసౌ = ఈ, జలధరావళీ = మేఘపంక్తి, ఆశానామ్ = దిక్కుల, ఆభోగమ్ = వైశాల్యమును, హరతి = హరించుచున్నది. జ్యోతిషామ్ = నక్షత్రములయొక్క, గణమ్ = సముదాయమును, గృహ్ణాతి = గ్రహించుచున్నది. మే = నాయొక్క, ప్రాణాన్ = ప్రాణములను, ఆదత్తేచ = గ్రహించుచున్నది కూడ.

ఇచట 'హరతి' 'గృహ్ణాతి' "ఆదత్తే" అను మూడు పదములును 'తొలగించున్నది' అను ఒకే అర్థమును బోధించుచున్నవి.

మూ. అనేకశబ్దోపాదానాత్ క్రియైకైవాత్ర దీప్యతే
యతో జలధరావల్యా తస్మాదేకార్థదీపకమ్. 112

వ్యా. అత్ర = ఈ ఉదాహరణమునందు, అనేకశబ్దోపాదానాత్ = అనేకశబ్దములచే గ్రహించుటవలన, ఏకైవ క్రియా = ఒకే క్రియ, జలధరావల్యా = 'మేఘపంక్తి' యను జాతివాచకశబ్దముచే, యతః = ఏ కారణమువలన, దీప్యతే = దీపింపచేయబడుచున్నదో, తస్మాత్ = ఆ కారణమువలన, ఏకార్థదీపకమ్ = ఏకార్థదీపకాలంకారము, 'హరతి' 'గృహ్ణాతి' 'ఆదత్తే' అను పదములు వేరువేరైనను వాటి అర్థము మాత్రము ఒక్కటే. అట్టి ఏకార్థవాచములగు మూడు పదములతో "జలధరావలీ" అను పదము సంబంధించుచున్నది గాన ఇది ఏకార్థదీపకము.

అవ. శ్లిష్టార్థదీపకమును నిరూపించుచున్నాడు ;—

మూ. హృద్యగన్ధవహాస్తుఙ్గాస్తమాలశ్యామలత్విషః
దివి భ్రమన్తి జీమూతా భువి చైతే మతఙ్గజాః

వ్యా. హృద్యగన్ధవహాః = మనోహరమైన వాయువుతో కూడినవియు (ఏనుగుల పక్షమున "మనోహరమైన సుగంధమును వహించుచున్న"), తుఙ్గాః ఎత్తైనవియు, తమాలశ్యామలత్విషః = తమాలవృక్షముల వలె శ్యామలమైన కాంతి కలవియుఅగు, జీమూతాః = మేఘములు, దివి = ఆకాశమునందు, భ్రమన్తి = సంచరించుచున్నవి. ఏతే = ఈ, మతఙ్గజాః = ఏనుగులు, భువి = భూమియందు,

సంచరించుచున్నవి. పై మూడు విశేషణములు "మత్తగజాః" అనుదానితో కూడ అన్వయించును.

అత్ర ధర్మైరభిన్నానామభ్రాణాం దన్తినాం తథా.
భ్రమణేనైవ సమ్బన్ధ ఇతి శ్లిష్టార్థదీపకమ్. 114

వ్యా. అత్ర = ఈ ఉదాహరణమునందు, ధర్మైః = హృద్యగన్ధవహత్వము మొదలగు ధర్మములచే, అభిన్నానామ్ = సమానములైన, అభ్రాణామ్ = మేఘములకును, తథా = మరియు, దన్తినామ్ = ఏనుగులకును, భ్రమణేనైవ = భ్రమణమను క్రియతోడనే, సమ్బన్ధః = సంబంధము. ఇతి = ఈ కారణముచే, శ్లిష్టార్థదీపకమ్ = శ్లిష్టార్థదీపకాలంకారము.

శ్లిష్టశబ్దములచే ప్రతిపాద్యము లగు సాధారణధర్మములు గల జీమూత మాతంగములకు 'భ్రమన్తి' అను ఒక క్రియతో అన్వయము చెప్పబడినది. గాన, శ్లిష్టార్థదీపక మని అభిప్రాయము.

మూ. అనేనైవ ప్రకారేణ శేషాణామపి దీపకే
వికల్పానామవగతిర్విధాతవ్యా విచక్షణైః. 115

(ఇతి దీపకచక్రమ్)

వ్యా. విచక్షణైః = నేర్పరులచేత, దీపకే = దీపకాలంకారము విషయమున శేషాణామ్ = మిగిలిన, వికల్పానామ్ = వికల్పముల (భేదముల) యొక్క, అవగతిః = జ్ఞానము, అనేన = ఈ, ప్రకారేణైవ = రీతిచేతనే, విధాతవ్యా = చేయదగినది.

అవ, ఆవృత్త్యలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. అర్థావృత్తిః పదావృత్తిరుభయావృత్తిరేవ చ
దీపకస్థాన ఏవేష్టమలఙ్కారత్రయం యథా. 116.

వ్యా. అర్థావృత్తిః = అర్థముయొక్క ఆవృత్తియు, పదావృత్తిః = పదముయొక్క ఆవృత్తియు, ఉభయావృత్తిరేవ చ = అర్థము, పదము ఈ రెంటింటియొక్క ఆవృత్తియుఅనెడు, అలఙ్కారత్రయమ్ = అలంకారత్రయము, దీపకస్థాన ఏవ = దీపకాలంకారము స్థానమునందే (దీపకాలంకారముగనే) ఇష్టమ్ = అంగీకరించబడినది. యథా = ఎట్లనగా.

దీపకాలంకారమున ఒకే పదము రెండు మూడు వాక్యములలోనికి అన్వయించును. ఆవృత్త్యలంకారమునందు పదమును గాని, అర్థమును కాని, ఆ రెండింటిని కాని ప్రతివాక్యమునందు ఆవృత్తి చేయుట యుండును, అంత మాత్రముచే దీనిని అలంకారాంతర మని చెప్ప బని లేదు. ఇది కూడ దీపకభేదమే యని అర్థము.

అవ. అర్థావృత్తిని ఉదాహరించుచున్నాడు :—

మూ. వికసన్తి కదమ్బాని స్ఫుటన్తి కుటజద్రుమాః
ఉన్మీలన్తి చ కన్దల్యో దలన్తి కకుభాని చ. 117

వ్యా. కదమ్బాని = కడిమిపూవులు, వికసన్తి = వికసించుచున్నవి. కుటజద్రుమాః = కుటజవృక్షములు, స్ఫుటన్తి = వికసించుచున్నవి. కన్దల్యః = అరంటులు, ఉన్మీలన్తి = వికసించుచున్నవి. కకుభాని చ = అర్జునపుష్పములు కూడా, దలన్తి = వికసించుచున్నవి.

ఇచట వికసించుట అను ఒకే అర్థము నాల్గుపర్యాయములు ఆవృత్తి చేయబడినది గాన అర్థావృత్తి.

మూ. ఉత్కణ్ఠయతి మేఘానాం మాలా వృన్దం కలాపినామ్
యూనాం చోత్కణ్ఠయత్యేవ మానసం మకరధ్వజః. 118

వ్యా. మేఘానాం మాలా = మేఘముల పంక్తి, కలాపినాం వృన్దమ్ = నెమళ్ల సముదాయమును, ఉత్కణ్ఠయతి = ఎత్తబడిన కంఠము కలదానినిగ

చేయుచున్నది. ఏషః = ఈ, మకరధ్వజశ్చ = మన్మథుడుకూడ, యూనామ్ = యువకుల, మానసమ్ = మనస్సును, ఉత్కణ్ఠయతి = బెంగగొన్నదానినిగా చేయుచున్నాడు.

ఇచట రెండు మూడు వాక్యములలో ఒకే 'ఉత్కణ్ఠయతి' అను పదము ఆవృత్తిచేయబడినది. అర్థము మాత్రము వేరుకావున ఇది పదావృత్తి.

అవ. ఉభయావృత్తిని ఉదాహరించుచున్నాడు :—

మూ. జిత్వా విశ్వం భవానద్య విహరత్యవరోధనైః
విహరత్యప్సరోభిస్తే రిపువర్గో దివం గతః. 119

(ఇత్యావృత్తి చక్రమ్)

వ్యా. భవాన్ = నీవు, విశ్వమ్ = ప్రపంచమును, జిత్వా = జయించి, అద్య = ఇపుడు, అవరోధనైః = అంతఃపురములతో, విహరతి = విహరించు చున్నావు. తే రిపువర్గః = నీ శత్రుసముదాయము, దివం గతః = స్వర్గమునకు వెళ్లినదై, అప్సరోభిః = అప్సరస్త్రీలతో, విహరతి = విహరించుచున్నది. ఇచట శబ్దార్థములు రెండింటికిని ఆవృత్తి గాన ఉభయావృత్తి.

అవ. ఆక్షేపాలంకారమును నిరూపించుచున్నాడు :—

మూ. ప్రతిషేధోక్తిరాక్షేపస్త్రైకాల్యాపేక్షయా త్రిధా
అథాస్య పునరాక్షేప్యభేదానన్త్యాదనన్తతా. 120

వ్యా. ప్రతిషేధోక్తిః = నిషేధమును చెప్పుట, ఒక ఇష్టమైన విషయమును చెప్పి దానికి సంబంధించిన ఒక విశేషమును ప్రతిపాదించుటకై, మొదటి విషయమును నిషేధించి నట్లు చెప్పుట అని అభిప్రాయము. అనగా ఇచట నిషేధించి నట్లు కనబడినను వాస్తవమున నిషేధించుటయందు తాత్పర్యము కాదు. ఆక్షేపః = ఆక్షేపాలంకారము. ఇది, త్రైకాల్యాపేక్షయా = భూత - వర్తమాన - భవిష్యత్తులకు సంబంధించుటచే, త్రిధా = మూడు విధములు. అనగా అతీతా

క్షేపము, వర్తమానాక్షేపము, భవిష్యదాక్షేపము అని మూడు విధములు. అథ = పిమ్మట, అస్య = దీనికి, పునః = మరల, ఆక్షేప్యభేదానన్త్యాత్ = నిషేధింప తగిన విషయము లో అనంతభేదము లుండుటచే, అనన్తతా = అనంతతత్వము.

కావ్యప్రకాశకారాదులు వక్ష్యమాణవిషయము, ఉక్తవిషయము అని రెండు భేదములనే అంగీకరించినారు. దండి ఉచ్యమానవిషయము అను (వర్తమాన) భేదమును కూడ అంగీకరించి ఆక్షేప్యభేదమును బట్టి అనేకభేదములను కూడ చూపించినాడు. ఈ భేదము లన్నియు కావ్యప్రకాశాదులలో లేవు.

అవ. అతీతాక్షేప మను భేదమును ఉదాహరించుచున్నాడు :—

మూ. అనఙ్గః పఞ్చభిః పౌష్పైర్విశ్వం వ్యజయతేషుభిః
ఇత్యసమ్భావ్యమథవా విచిత్రా వస్తుశక్తయః. 121

ఇత్యనఙ్గజయాయోగబుద్ధిర్హేతుబలాదిహ
ప్రవృత్తైవ యదాక్షిప్తా వృత్తాక్షేపః స ఈదృశః. 122

వ్యా. అనఙ్గః = మన్మథుడు, పౌష్పైః = పుష్పరూప మైన, పఞ్చభిః ఇషుభిః = ఐదు బాణములచే, విశ్వమ్ = ప్రపంచమును, వ్యజయత = జయిం చెను; ఇతి = ఈవిషయము, అసమ్భావ్యమ్ = ఊహింపదగనిది. అథవా = లేదా, వస్తుశక్తయః = వస్తువులశక్తులు, విచిత్రాః = విచిత్రమైనవి.

"మన్మథుడు విశ్వము నంతను జయించినాడు అనునది అసంభావ్యము" అను విషయమును —"అది అసంభావ్యమేమి? వస్తుశక్తి విచిత్రము గాన సంభా వ్యమే కావచ్చును" అని నిషేధించుటచే ఆక్షేపాలంకారము.

ఇతి = ఈ విధముగ, ఇహ = ఇచట, ప్రవృత్తైవ = మొదట ప్రవర్తించి యున్న, అనఙ్గజయాయోగబుద్ధిః = మన్మథుని జయము అసంభావ్యము అనెడు బుద్ధి, యత్ = ఏ కారణమువలన, హేతుబలాత్ = వస్తుశక్తులు విచిత్రములు కదా అను హేతువుయొక్క బలమువలన, ఆక్షిప్తా = నిషేధింపబడినదో,

అందుచే, సః = ఆ, వృత్తాక్షేపః = వృత్తాక్షేపము, (భూతకాలమున జరిగినదాని ఆక్షేపము), ఈదృశః = ఇట్టిది. పూర్వోదాహరణమున నిషేధవాచకపదము లేకపోవుటచే ప్రతిషేధము గమ్యము.

అవ. వర్తమానాక్షేపమును ఉదాహరించుచున్నాడు :—

మూ. **కుతః కువలయం** కర్ణే కరోషి కలభా**షిణి**
కిమపాఙ్గమపర్యాప్తమస్మిన్ కర్మణి మన్యసే. 123

వ్యా. హే కలభాషిణి = ఓ మధురభాషిణీ ! కువలయమ్ = నల్లకలువను, కుతః = ఎందువలన, కర్ణే కరోషి = చెవిలో ఉంచుచున్నావు? అస్మిన్ = ఈ అలంకరణ కర్మయందు, అపాఙ్గమ్ = నీ నేత్రాంతమును, అపర్యాప్తమ్ = సరిపోనిదానినిగా, మన్యసేకిమ్ = తలచుచున్నావా ?

మూ. స వర్తమానాక్షేపోఽయం **కుర్వత్యేవాసితోత్పలమ్**
కర్ణే కాచిత్ప్రియేణైవం **చాటుకారేణ** రుధ్యతే. 124

వ్యా. అసితోత్పలమ్ = నల్లకలువను, కర్ణే = చెవిపై, కుర్వతీ ఏవ = ఉంచుచున్నదేయైన (ఉంచుచుండగనే), కాచిత్ = ఒకానొకస్త్రీ, ఏవమ్ = ఈ విధముగ, చాటుకారేణ = ప్రియవాక్యములను పలుకుచున్న, ప్రియేణ = ప్రియుని చేత, రుధ్యతే = కువలయమును చెవిలో అలకరించకుండగ అడ్డుకొనబడుచున్నది. అందుచే, సఃఅయమ్ = ఇది, వర్తమానాక్షేపః = వర్తమానాక్షేపము. జరుగుచున్న విషయము నిషేధింపబడుచున్నది గాన వర్తమానాక్షేపము.

ఆవ. భవిష్యదాక్షేపమును ఉదాహరించుచున్నాడు :—

మూ. **సత్యం** బ్రవీమి న **త్వం మాం** ద్రష్టుం **వల్లభ** లప్స్యసే
**అన్య**చుమ్బనసఙ్క్రాన్తలాక్షారక్తేన చక్షుషా. 125

వ్యా. హే వల్లభ = ఓ ప్రియుడా ! అన్యచుమ్బనసఙ్క్రాన్తలాక్షారసేన = ఇతరస్త్రీల చుంబనముచే అంటుకొనిన (పెదవులయందలి) లత్తుక గల,

చక్షుషా = నేత్రముతో, మామ్ = నన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, న లప్స్యసే = పొందవు నీకు అట్టి అవకాశము లభింపదు. సత్యమ్ = నిజముగా, బ్రవీమి = చెప్పుచున్నాను.

మూ. సోఽయం భవిష్యదాక్షేపః ప్రాగేవాతిమనస్వినీ
కదాచిదపరాధోఽస్య భావీత్యేవమరుద్ధ యత్. 126

వ్యా. సోఽయమ్ = ఇది, భవిష్యదాక్షేపః = భవిష్యదాక్షేపము. యత్ = ఏలననగా, అతిమనస్వినీ = ఎక్కువ ఆత్మాభిమానము గల నాయిక, అస్య = ఈతనికి, (ఈతనివలన), అపరాధః = అపరాధము, కదాచిత్ = ఒకవేళ, భావీ = కాగలదు. ఇతి = ఈ అభిప్రాయముతో, ప్రాగేవ = ముందుగనే, అరుద్ధ = అడ్డుపెట్టెను.

అవ. ఇంతవరకును ఆక్షేపాలంకారమునకు సంబంధించిన మూడు సామాన్యభేదములను నిరూపించి మరి కొన్ని సూక్ష్మభేదములను నిరూపింప నున్నవాడై ధర్మాక్షేపమును ఉదాహరించుచున్నాడు :-

మూ తవ తన్వఙ్గి మిథ్యైవ రూఢమఙ్గేషు మార్దవమ్
యది సత్యం మృదూన్యేవ కిమకాణ్డే రుజన్తి మామ్. 127

వ్యా. హే తన్వఙ్గి = ఓ సన్నని శరీరము గలదానా, రూఢమ్ = లోక ప్రసిద్ధముగా నున్న, తవ నీయొక్క, అఙ్గేషు మార్దవమ్ = అవయవములందలి మృదుత్వము, మిథ్యైవ = అసత్యమైనదే. సత్యమ్ = నిజముగనే, మృదూన్యేవ యది = మృదువైనచో, మామ్ = నన్ను, అకాణ్డే = హటాత్తుగా లేదా అనావశ్యకముగా, కింరుజన్తి = ఎందుచే పీడించుచున్నవి ?

మూ. ధర్మాక్షేపోఽయమాక్షిప్తమఙ్గనాగాత్రమార్దవమ్
కాముకేన యదత్రైవం కర్మణా తద్విరోధినా. 128

వ్యా. యత్ = ఏ కారణమువలన, అత్ర = ఈ ఉదాహరణమునందు, ఏవమ్ = ఈ విధముగా, కాముకేన = కాముకునిచేత, తద్విరోధినా = మార్దవము

నకు విరుద్ధమైన, కర్మణా = క్రియద్వారా (పీడనముద్వారా), అఙ్గనాగాత్రమార్ద వమ్ = స్త్రీయొక్క అవయవముల మార్దవము (మార్దవరూప మగు ధర్మము) ఆక్షిప్తమ్ = నిషేధింపబడినదో, అందువలన, అయమ్ = ఇది, ధర్మాక్షేపః = ధర్మాక్షేపము.

అవ. ధర్మ్యాక్షేపమును ఉదాహరించుచున్నాడు :-

మూ. సున్దరీ సా న వేత్యేష వివేకః కేన జాయతే
ప్రభామాత్రం హి తరలం దృశ్యతే న తదాశ్రయః. 129

వ్యా. సా = ఆమె = సున్దరీ = సుందరియా, నవా = కాదా? ఇతి = ఇట్లు, ఏషః = ఈ, వివేకః = వివేకము, కేన = దేనిచే (ఏ ఉపాయముచే) జాయతే = కలుగును? తరలమ్ = చంచలమైన, ప్రభామాత్రమ్ = కాన్తి మాత్రమే, దృశ్యతే = చూడబడుచున్నది. తదాశ్రయః = దానికి ఆశ్రయ మైన వ్యక్తి, న దృశ్యతే = చూడబడుటలేదు.

మూ. ధర్మ్యాక్షేపోయమాక్షిప్తో ధర్మీ ధర్మం ప్రభాహ్వయమ్
అనుజ్ఞాయైవ యద్రూపమత్యాశ్చర్యం వివక్షతా. 130

వ్యా. రూపమ్ = (నాయికా)రూపమును, అత్యాశ్చర్యమ్ = అత్యాశ్చర్య కరమైనదానినిగా, వివక్షతా = చెప్పదలచిన నాయకునిచే, ప్రభాహ్వయమ్ = కాంతి యను పేరుగల, ధర్మమ్ = ధర్మమును, అనుజ్ఞాయైవ = అంగీకరించియే, యత్ = ఏకారణము వలన, ధర్మీ = ధర్మి (యైనసుందరి), ఆక్షిప్తః = నిషేధింప బడినదో, అందువలన, అయమ్ = ఇది, ధర్మ్యాక్షేపః = ధర్మ్యాక్షేపము.

అవ. కారణాక్షేపమును నిరూపించుచున్నాడు :-

మూ. చక్షుషీ తవ రజ్యేతే స్ఫురత్యధరపల్లవః
భ్రువౌ చ భుగ్నే న తథాప్యదుష్టస్యాస్తి మే భయమ్. 131

వ్యా. తవ చక్షుషీ = నీ నేత్రములు, రజ్యేతే = ఎఱ్ఱబడుచున్నవి. అధరపల్లవః = చిగురువంటి అధరోష్ఠము, స్ఫురతి = అదురుచున్నది. భ్రువౌ చ = కనుబొమ్మలు కూడా, భుగ్నే = వంగినవి. తథాపి = అట్లైనను, అనష్టస్య = అపరాధరహితుడ నైన, మే = నాకు, భయమ్ = భయము, నాస్తి = లేదు.

మూ. స ఏష కారణాక్షేపః ప్రధానం కారణం భియః
స్వాపరాధో నిషిద్ధోఽత్ర యత్ప్రియేణ పటీయసా. 132

వ్యా. స ఏషః = ఇది, కారణాక్షేపః = కారణాక్షేపము. యత్ = ఏలనన, పటీయసా = నేర్పరియైన, ప్రియేణ = ప్రియునిచేత. భియః = భయమునకు, ప్రధానంకారణమ్ = ప్రధానకారణ మైన, స్వాపరాధః = తన అపరాధము, నిషిద్ధః = నిషేధింపబడినది.

అవ. కార్యాక్షేపమును నిరూపించుచున్నాడు :—

మూ. దూరే ప్రియతమః సోఽయమాగతో జలదాగమః
దృష్టాశ్చ ఫుల్లా నిచులా న మృతా చాస్మి కిం న్విదమ్. 133

వ్యా. ప్రియతమః = ప్రియతముడు, దూరే = దూరమునం దున్నాడు. సః అయమ్ = ఈ, జలదాగమః = వర్షకాలము, ఆగతః = వచ్చినది. నిచులాః నిచులవృక్షములు, ఫుల్లాః = వికసించినవిగా, దృష్టాః = కనబడుచున్నవి. న మృతా చ అస్మి = ఇంత ఐనను మరణించకుండా ఉన్నాను. ఇదమ్ = ఇది, కిం ను = ఏమి ?

మూ. కార్యాక్షేపః స కార్యస్య మరణస్య నివర్తనాత్
తత్కారణముపన్యస్య దారుణం జలదాగమమ్. 134

వ్యా. తత్కారణమ్ = మరణమునకు కారణమైన, దారుణమ్ = భయంకరమైన, జలదాగమమ్ = వర్షకాలమును, ఉపన్యస్య = (వచ్చినట్లుగా) చెప్పి; కార్యస్య = కార్యమైన, మరణస్య = మరణముయొక్క, నివర్తనాత్ = నిషేధించుటవలన, సః = అది, కార్యాక్షేపః = కార్యాక్షేపము. ఇది విశేషోక్త్యలంకార

మని చెప్పకూడదు. దండిమతము ప్రకారము అప్రసిద్ధమైన కారణ మొకటి యున్నను కార్యము జనించకపోవుట విశేషోక్తిలక్షణము. ఇచట కారణము ప్రసిద్ధము.

అవ. అనుజ్ఞాక్షేపమును ఉదాహరించుచున్నాడు :-

**మూ. న చిరం మమ తాపాయ తవ యాత్రా భవిష్యతి**
**యది యాస్యసి యాతవ్యమలమాశఙ్కయాత్ర తే. 135**

వ్యా. తవ యాత్రా = నీ యాత్ర, మమ = నాకు, చిరమ్ = చిరకాలము పాటు, తాపాయ న భవిష్యతి = తాపమును కలిగింప సమర్థము కాజాలదు. యాస్యసి యది = నీవు వెళ్లవలసి యున్నచో, యాతవ్యమ్ = వెళ్లవచ్చును. అత్ర = ఈ విషయమున, తే = నీకు, ఆశఙ్కయా = ఆశంకచేత, అలమ్ = చాలును. నీవు సందేహించవలసిన పని లేదు.

**మూ. ఇత్యనుజ్ఞాముఖేనైవ కాన్తస్యాక్షిప్యతే గతిః**
**మరణం సూచయన్త్యేతి సోనుజ్ఞాక్షేప ఉచ్యతే. 136**

వ్యా. ఇతి = ఈ విధముగా, మరణమ్ = మరణమును, సూచయన్త్యా = సూచించుచున్న నాయికచేత, అనుజ్ఞాముఖేనైవ = అనుమతిఇచ్చుచున్నట్లు కనబడుచునే, కాన్తస్య = ప్రియునియొక్క, గతిః = గమనము, ఆక్షిప్యతే = నిషేధింపబడుచున్నది. ఇతి = ఈ కారణముచే, సః = అది, అనుజ్ఞాక్షేపః = అనుజ్ఞాక్షేపముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

అవ. ప్రభుత్వాక్షేపమును నిరూపించుచున్నాడు :-

**మూ. ధనం చ బహు లభ్యం తే సుఖం క్షేమం చ వర్త్మని**
**న చ మే ప్రాణసన్దేహ స్తథాపి ప్రియ మా స్మ గాః. 137**

వ్యా. హే ప్రియ = ఓ ప్రియుడా ! తే = నీకు, బహు = అధికమైన, ధనమ్ = ధనము, లభ్యమ్ = పొందబడును. వర్త్మని = మార్గమునందు, సుఖమ్

= సుఖము. క్షేమం చ = క్షేమముకూడ, ఉండును. మే = నాకు, ప్రాణసన్దేహః చ = ప్రాణభయము కూడ, న = లేదు. తథాపి = అట్లైనను, మాస్మగాః = వెళ్లవద్దు.

మూ. ఇత్యాచక్షాణయా హేతూన్ ప్రియయాత్రానుబన్ధినః
ప్రభుత్వేనైవ రుద్ధస్తత్ ప్రభుత్వాక్షేప ఉచ్యతే. 138

వ్యా. ఇతి = ఈ విధముగా, ప్రియయాత్రానుబన్ధినః = ప్రియుని దూర దేశగమనమునకు అనుకూల మైన, హేతూన్ = హేతువులను, ఆచక్షాణయా = చెప్పుచున్న నాయికచే, ప్రభుత్వేనైవ = అధికారముచేతనే, రుద్ధః = (ప్రియుడు అడ్డుకొనబడినాడు. తత్ = ఆ కారణమువలన, ప్రభుత్వాక్షేపః = ప్రభుత్వా) క్షేపముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

అవ. అనాదరాక్షేపమును ఉదాహరించుచున్నాడు :-

మూ. జీవితాశా బలవతీ ధనాశా దుర్బలా మమ
గచ్ఛ వా తిష్ఠ వా కాన్త స్వావస్థా తు నివేదితా. 139

వ్యా. హే కాన్త = ఓ ప్రియతమా! మమ = నాయొక్క, జీవితాశా = జీవితమునందు ఆశ, బలవతీ = బలవత్తర మైనది. నీదగ్గర ఉండి జీవించవలె నని నాకు దృఢమైన ఆశ ఉన్నది. ధనాశా = (నిన్ను విదేశమునకు పంపి వేసి) ఎక్కువ ధనము పొందవలె ననెడు ఆశ, దుర్బలా = దుర్బలమైనది. గచ్ఛ వా = వెళ్లినచో వెళ్ళుము. తిష్ఠవా = ఉన్నచో ఉండుము. స్వావస్థా తు = నా పరిస్థితి యైతే, నివేదితా = తెలుపబడినది.

మూ. అసావనాదరాక్షేపో యదనాదరవద్వచః
ప్రియప్రయాణం రున్ధత్యా ప్రయుక్తమిహ రక్తయా. 140

వ్యా. అసౌ = ఇది, అనాదరాక్షేపః = అనాదరాక్షేపము. యత్ = ఏలననగా, ఇహ = ఇచట, ప్రియప్రయాణమ్ = ప్రియుని ప్రయాణమును,

వ్యక్తాః = అడ్డుకొనుచున్న, రక్తయా = అనురాగవంతురాలగు నాయికచే, అనాదరవత్ = అనాదరముతో గూడిన, వచః = వాక్యము, ప్రయుక్తమ్ = ప్రయోగింప బడినది.

అవ. ఆశీర్వచనాక్షేపమును నిరూపించుచున్నాడు :-

మూ. గచ్ఛ గచ్ఛసి చేత్కాన్త పన్థానః సన్తు తే శివాః
మమాపి జన్మ తత్రైవ భూయాద్యత్ర గతో భవాన్. 141

వ్యా. హే కాన్త = ఓ ప్రియుడా, గచ్ఛసి చేత్ = వెళ్లేటట్లైతే, గచ్ఛ = వెళ్లుము. తే = నీ యొక్క, పన్థానః = మార్గములు, శివాః = మంగళప్రదమైనవై, సన్తు = అగుగాక. భవాన్ = నీవు, యత్ర = ఏచటికి, గతః = వెళ్ళావో, తత్రైవ = అచటనే, మమాపి = నాకుకూడా, జన్మ = పుట్టుక, భూయాత్ = అగుగాక.

మూ. ఇత్యాశీర్వచనాక్షేపో యదాశీర్వాదవర్త్మనా
స్వావస్థాం సూచయన్త్యేవ కాన్తయాత్రా నిషిధ్యతే. 142

వ్యా. ఇతి = ఈ విధముగా, ఆశీర్వచనాక్షేపః = ఆశీర్వచనాక్షేపము. యత్ = ఏలననగా, ఆశీర్వాద వర్త్మనా = ఆశీర్వాదపద్ధతిచే, స్వావస్థామ్ = తన అవస్థను, సూచయన్త్యేవ = సూచించుచునే యున్న నాయికచే, కాన్తయాత్రా = ప్రియుని యాత్ర, నిషిధ్యతే = నిషేధింప బడుచున్నది.

అవ. పరుషాక్షేపమును నిరూపించుచున్నాడు :-

మూ. యది సత్యైవ యాత్రా తే కాప్యన్యా మృగ్యతాం త్వయా
అహమద్యైవ రుద్ధాస్మి రన్ధ్రాపేక్షేణ మృత్యునా. 143

వ్యా. తే యాత్రా = నీ ప్రయాణము, సత్యైవ యది = సత్యమే యైనచో, త్వయా = నీ చేత, అన్యా = మరి యొక, కాపి = ఒకానొక భార్య : నీ విరహమునందు గూడ ప్రాణములను ధరించ గలిగిన భార్య అని యర్థము.

మృగ్యతామ్ = అన్వేషింప బడుగాక. రన్ధ్రాన్వేషిణా = అవకాశమును వెదకుచుండెడు, మృత్యునా = మృత్యువుచే, అహమ్ = నేను, అద్యైవ = ఇప్పుడే, రుద్ధా అస్మి = వశము చేసికొన బడితిని.

మూ. ఇత్యేష పరుషాక్షేపః పరుషాక్షరపూర్వకమ్
కాన్తస్యాక్షిప్యతే యస్మాత్ ప్రస్థానం ప్రేమనిఘ్నయా. 144

వ్యా. ఇతి = ఈ విధముగా, యస్మాత్ = ఏ కారణము వలన, ప్రేమ నిఘ్నయా = ప్రేమకు అధీనురాలైన నాయికచే, పరుషాక్షర పూర్వకమ్ = పరుషములైన మాటలు పూర్వమునందు కలుగునట్లుగా (పరుష వాక్కులతో), కాన్తస్య = ప్రియుని యొక్క, ప్రస్థానమ్ = ప్రయాణము, ఆక్షిప్యతే = నిషేధింప బడుచున్నదో, ఆకారణము వలన, ఏషః = ఇది, పరుషాక్షేపః = పరుషాక్షేపము.

అవ. సాచివ్యాక్షేపము :-

మూ. గన్తా చేద్గచ్ఛ తూర్ణం తే కర్ణౌ యాన్తి పురా రవాః
ఆర్తబన్ధుముఖోద్గీర్ణాః ప్రయాణపరిపన్థినః. 145

వ్యా. గన్తా చేత్ = వెళ్ళుచున్నచో, తూర్ణమ్ = శీఘ్రముగా, గచ్ఛ = వెళ్ళుము. ప్రయాణ పరిపన్థినః = ప్రయాణమునకు విఘ్నము కలిగించునవియు, ఆర్త బన్ధు ముఖోద్గీర్ణాః = దుఃఖితులైన బంధువుల ముఖముల నుండి బయల్వెడలినవియు అగు, రవాః = ధ్వనులు, తే = నీ యొక్క, కర్ణౌ = చెవులను, పురా యాన్తి = చేరగలవు.

మూ. సాచివ్యాక్షేప ఏవైష యదత్ర ప్రతిషిధ్యతే
ప్రియప్రయాణం సాచివ్యం కుర్వత్యేవాతిరక్తయా. 146

వ్యా. ఏషః = ఇది, సాచివ్యాక్షేప ఏవ = సాచివ్యాక్షేపము. యత్ = ఏలననగా, అత్ర = ఈ ఉదాహరణము నందు, సాచివ్యం కుర్వత్యా ఇవ = (ప్రియుని ప్రయాణమునకు) సాహాయ్యము చేయుచున్నది వలెనున్న, అతి

రక్తయా = మిక్కిలి అనురాగవంతురా లగు నాయికచేత, ప్రియప్రయాణమ్ = ప్రియుని ప్రయాణము, నిషిధ్యతే = నిషేధింప బడుచున్నది.

అవ. యత్నాక్షేపము.

మూ. గచ్ఛేతి వక్తుమిచ్ఛామి మత్ప్రియ త్వత్ప్రియైషిణీ
నిర్గచ్ఛతి ముఖాద్వాణీ మా గా ఇతి కరోమి కిమ్. 147

వ్యా. హే మత్ప్రియ = ఓ నాప్రియుడా! త్వత్ప్రియైషిణీ = నీ ప్రియమును కోరుచున్నదాన నై, గచ్ఛేతి = 'వెళ్ళుము' అని, వక్తుమ్ = చెప్పుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. మాగాఃఇతి = "వెళ్లకుము" అని, వాణీ = వాక్కు, ముఖాత్ = ముఖమునుండి, నిర్గచ్ఛతి = బయల్వెడలుచున్నది. కిమ్ కరోమి = ఏమిచేయుదును ?

మూ. యత్నాక్షేపః స యత్నస్య కృతస్యానిష్టవస్తుని
విపరీతఫలోత్పత్తేరానర్థక్యోపదర్శనాత్. 148

వ్యా. అనిష్టవస్తుని = తనకు ఇష్టము కాని 'వెళ్ళుము' అనిచెప్పుట విషయమున, కృతస్య = చేయబడిన, యత్నస్య = యత్నముయొక్క (దీనికి "అనర్థక్యోపదర్శనాత్" అనుదానితో అన్వయము)' విపరీతఫలోత్పత్తేః = విపరీతఫలము పుట్టుటవలన, ఆనర్థక్యోపదర్శనాత్ = వ్యర్థత్వమును చూపుటవలన, సః = అది, యత్నాక్షేపః = యత్నాక్షేపము.

అవ. పరవశాక్షేపము :-

మూ. క్షణం దర్శనవిఘ్నాయ పక్ష్మస్పన్దాయ కుప్యతః
ప్రేమ్ణః ప్రయాణం త్వం బ్రూహి మయా తస్యేష్టమిష్యతే.

వ్యా. ఓప్రియుడా ! త్వం = నీవు, ప్రయాణమ్ = నీప్రయాణమును గూర్చి, క్షణమ్ = క్షణకాలము పాటు, దర్శనవిఘ్నాయ = దర్శనమునకు విఘ్నమును కలిగించుచున్న, పక్ష్మస్పన్దాయ = రెప్పపాటుపై, కుప్యతః = కోప

గించుచున్న, ప్రేమ్ణః = ప్రేమను. బ్రూహి = చెప్పుము. తస్యై = దానికి, ఇష్టమ్ = ఇష్టమైనదే, మయా = నాచేత, ఇష్యతే = అంగీకరింపబడును.

"దేశాంతరము వెళ్లుచున్నాను, అనుజ్ఞ ఇమ్ము" అని నాతో చెప్పవలసిన పనిలేదు. ఆ ప్రేమతో చెప్పుము, దానికి ఏది ఇష్టమో నాకు కూడ అదే ఇష్టము అని తాత్పర్యము.

మూ. సోఽయం పరవశాక్షేపో యత్ప్రేమపరతన్త్రయా
తయా నిషిధ్యతే యాత్రాఽన్యస్యార్థస్యోపసూచనాత్. 150

వ్యా. సోఽయమ్ = ఇది, పరవశాక్షేపః = పరవశాక్షేపము; యత్ = ఏలననగా, ప్రేమపరతన్త్రయా = ప్రేమపరవశురాలైన, తయా = ఆ నాయికచేత, అన్యస్య = మరి యొక, అర్థస్య = (తానుదేనికి పరవశురాలైనదో అట్టి) ప్రేమరూపమగు అర్థముయొక్క, ఉపసూచనాత్ = సూచనముచేయుట వలన, యాత్రా = ప్రియుని ప్రయాణము, నిషిధ్యతే = నిషేధింపబడుచున్నది.

అప. ఉపాయాక్షేపము :-

మూ. సహిష్యే విరహం నాథ దేహ్యదృశ్యాఞ్జనం మమ
యదక్తనేత్రాం కన్దర్పః ప్రహర్తా మాం న పశ్యతి. 151

వ్యా. హే నాథ = ఓ ప్రియా! విరహమ్ = విరహమును, సహిష్యే = సహించగలను. మమ = నాకు, అదృశ్యాఞ్జనమ్ = ఇతరులకు కనబడకుండ చేయు అంజనమును, దేహి = ఇమ్ము. యదక్తనేత్రామ్ = దేనిచే పూయబడిన నేత్రములు గల, మామ్ = నన్ను, ప్రహర్తా = (బాణములచే) కొట్టెడు, కన్దర్పః = మన్మథుడు, న పశ్యతి = చూడజాలడో.

మూ. దుష్కరం జీవనోపాయముపన్యస్యోపరుధ్యతే
పత్యుః ప్రస్థానమిత్యాహురుపాయాక్షేపమీదృశమ్. 152

వ్యా. దుష్కరం = చేయశక్యముకాని, జీవనోపాయం = (అదృశ్యాంజ

నమును ఇచ్చుట అను) జీవించుటకు ఉపాయమును, ఉపన్యస్య = చెప్పి, పత్యుః = భర్తయొక్క. ప్రస్థానమ్ = ప్రయాణము, ఉపరుధ్యతే = అడ్డుపెట్టబడు చున్నది. ఇతి = ఈ కారణముచే, ఈదృశమ్ = ఇట్టిదానిని. ఉపాయాక్షేపమ్ = ఉపాయాక్షేపమునుగా, ఆహుః = చెప్పుదురు.

అవ. రోషాక్షేపము :—

మూ. ప్రవృత్తైవ ప్రయామీతి వాణీ వల్లభ తే ముఖాత్
అయతాపి త్వయేదానీం మన్దప్రేమ్ణా మమాస్తి కిమ్. 153

వ్యా. వల్లభ = ఓ ప్రియుడా, ప్రయామి ఇతి = "నేను వెళ్ళుచున్నాను" అని, వాణీ = వాక్కు, తే ముఖాత్ = నీ ముఖము నుండి, ప్రవృత్తైవ = బైటకు రానే వచ్చినది. మన్దప్రేమ్ణా = అల్పమైన ప్రేమగలవాడవైన; "నేను వెళ్లు చున్నాను" అని చెప్పుటచేతనే నీకు నా విషయమున ప్రేమ సన్నగిలిన దని తెలియుచున్న దని అభిప్రాయము. ఇదానీమ్ = ఇప్పుడు, అయతాపి = (ఏ కారణముచేతనైనను) వెళ్ళకపోయినను, త్వయా = నీచేత, మమ = నాకు, కిమ్ అస్తి = ఏమి ప్రయోజనమున్నది ?

మూ. రోషాక్షేపోయముద్రిక్తస్నేహనిర్యన్త్రితాత్మనా
సంరబ్ధయా ప్రియారబ్ధం ప్రయాణం యన్నిషిధ్యతే. 154

వ్యా. ఉద్రిక్తస్నేహనిర్యన్త్రితాత్మనా = తీవ్రమైన ప్రేమచే పీడింప బడిన మనస్సు గల, సంరబ్ధయా = తొందరపాటు చెందిన నాయికచేత, ప్రియారబ్ధమ్ = ప్రియునిచే ప్రారంభింపబడిన, ప్రయాణమ్ = ప్రయాణము, యత్ = ఏ కారణమువలన, నిషిధ్యతే = నిషేధింపబడుచున్నదో, ఆ కారణమువలన, అయమ్ = ఇది, రోషాక్షేపః = రోషాక్షేపము.

అవ. మూర్ఛాక్షేపము :—

మూ. ముగ్ధా కాన్తస్య యాత్రోక్తిశ్రవణాదేవ మూర్ఛితా
బుద్ధ్వా వక్తి ప్రియం దృష్ట్వా కిం చిరేణాగతో భవాన్.

వ్యా. కాన్తస్య = ప్రియునియొక్క, యాత్రోక్తి శ్రవణాదేవ = ప్రయాణమును గూర్చిన మాటను వినగనే, మూర్ఛితా = మూర్ఛచెందిన, ముగ్ధా = ముగ్ధయైన స్త్రీ, బుద్ధ్వా = స్పృహవచ్చి, ప్రియమ్ = ప్రియుని, దృష్ట్వా = చూచి, "భవాన్ = నీవు, చిరేణ = చాల కాలముక్రితమే, ఆగతః కిమ్ = వచ్చినావా?" (లేదా ఆలస్యముగా వచ్చినా వేమి ?) అని, వక్తి = పలుకుచున్నది.

మూ. ఇతి తత్కాలసంభూతమూర్ఛయాఽఽక్షిప్యతే గతిః
కాన్తస్య కాతరాక్ష్యా యన్మూర్ఛాక్షేపః స ఈదృశః. 156

వ్యా. ఇతి = ఈ విధముగా, యత్ = ఏ కారణమువలన, తత్కాలసంభూత మూర్ఛయా = ఆ సమయమున కలిగిన మూర్ఛగల, కాతరాక్ష్యా = చపలాక్షిచేత, కాన్తస్య = ప్రియుని యొక్క, గతిః = గమనము, ఆక్షిప్యతే = నిషేధింపబడుచున్నదో, ఆ కారణమువలన, ఈదృశః = ఇట్టిది, సః = ఆ, మూర్ఛాక్షేపః = మూర్ఛాక్షేపాలంకారము.

అవ. సానుక్రోశాక్షేపాలంకారము.

మూ. నాఘ్రాతం న కృతం కర్ణే స్త్రీభిర్మధుని నార్పితమ్
త్వద్ద్విషాం దీర్ఘికాస్వేవ విశీర్ణం నీలముత్పలమ్. 157

వ్యా. త్వద్ద్విషామ్ = నీ శత్రువులయొక్క, స్త్రీభిః = స్త్రీలచేత, నీలమ్ ఉత్పలమ్ = నల్లకలువ, నాఘ్రాతమ్ = వాసన చూడబడలేదు. కర్ణే = చెవియందు, న కృతమ్ = అలంకారముగా చేయబడలేదు. మధుని = మద్యమునందు, నార్పితమ్ = (సువాసన కొరకై) ఉంచబడలేదు. దీర్ఘికాస్వేవ = దిగుడు బావులందే, విశీర్ణమ్ = వాడిపోయినది.

మూ. అసావనుక్రోశాక్షేపః సానుక్రోశమివోత్పలే
వ్యావర్త్య కర్మ తద్యోగ్యం శోచ్యావస్థోపదర్శనాత్. 158

వ్యా. తద్యోగ్యమ్ = ఉత్పలముల విషయమున చేయదగిన, కర్మ = ఆఘ్రాణము మొదలగు క్రియను, వ్యావర్త్య = నిషేధించి, ఉత్పలే = ఉత్పలము

నందు, సానుక్రోశమివ = జాలితోకూడినట్లువలె, శోచ్యావస్థోపదర్శనాత్ = (శత్రు స్త్రీల) దయనీయమైన అవస్థను సూచించుటచే, అసౌ = ఇది, అనుక్రోశాక్షేపః = అనుక్రోశాక్షేపము.

ఉత్పలములు వ్యర్థముగ వాడిపోయినవి అని చెప్పుటలో ఉత్పలముల విషయమున జాలి ఉన్నట్లు పైకి కనబడుచున్నను, శత్రు స్త్రీల అవస్థ చాల దయ నీయముగ ఉన్నది అని చెప్పుటయందే కవికి తాత్పర్యము. ఈ విధముగ శత్రు స్త్రీల విషయమున అనుక్రోశము (జాలి)తో, ఆఘ్రాణాదికర్మ నిషేధింపబడినది గాన ఇది సానుక్రోశాక్షేపము.

అవ. శ్లిష్టాక్షేపము :—

మూ. అమృతాత్మని పద్మానాం ద్వేష్టరి స్నిగ్ధతారకే
ముఖేన్దౌ తవ సత్యస్మిన్నపరేణ కిమిన్దునా. 159

వ్యా. అమృతాత్మని = (ఆనందకరమగుటచే) అమృత స్వరూప మైన దియు, పద్మానామ్ = పద్మములకు, ద్వేష్టరి = (సౌందర్యాతి శయముచే) ద్వేషించునదియు, స్నిగ్ధతారకే = స్నేహపూర్ణమైన కనుగ్రుడ్లు కలదియు అగు, తవ = నీ యొక్క, అస్మిన్ = ఈ, ముఖేన్దౌ = ముఖచంద్రుడు, సతి = ఉండగా, అపరేణ = మరియొక, ఇన్దునా = చంద్రుని చేత, కిమ్ = ఏమి ప్రయోజనము ?

ముఖేన్దౌ అనుదానికి ఉపయోగించిన "అమృతాత్మని" మొదలగు విశేషణములను తృతీయాంతములుగా మార్చి—"అమృతాత్మనా = అమృత స్వరూపమైనవాడును, పద్మానాం ద్వేష్టా = పద్మములను ముకులీభవింపచేయు వాడును, స్నిగ్ధతారకేణ = స్నేహము గల భార్యలగు నక్షత్రములతో కూడిన వాడును అగు, ఇన్దునా = చంద్రునిచే అని అర్థములు చెప్పవలెను. ఈ విధముగ ఈ విశేషణములు శ్లిష్టములు.

మూ. ఇతి ముఖ్యేన్దురాక్షిప్తో గుణాన్ గౌణేన్దువర్తినః
తత్సమాన్ దర్శయిత్వేహ శ్లిష్టాక్షేపస్తథావిధః. 160

వ్యా. ఇతి = ఈ విధముగా, గౌణేన్దునక్రిసః = గౌణచంద్రుని యందున్న; "ముఖేన్దౌ" అనునపుడు ముఖమునందు ఇందుత్వము ఆరోపింపబడినది గాన ముఖము గౌణ చంద్రుడు, తత్సమాన్ = ముఖ్య చంద్రుని యం దున్న గుణము లతో సమానము లైన, గుణాన్ = అమృతాత్మత్వము మొదలగు గుణములను, దర్శయిత్వా = చూపి, ఇహ = ఈ ఉదాహరణమునందు, ముఖ్యేన్దుః = ముఖ్య చంద్రుడు, ఆక్షిప్తః = నిషేధింపబడినాడు. తథావిధః = అట్టి విధములో నుండునది, శ్లిష్టాక్షేపః = శ్లిష్టాక్షేపము.

అవ. అనుశయాక్షేపము :—

మూ. అర్థో న సమ్భృతః కశ్చిన్న విద్యా కాచిదర్జితా
న తపః సఞ్చితం కిఞ్చిద్గతం చ సకలం వయః. 161

వ్యా. కశ్చిత్ = ఏమియు. అర్థః = ధనము, న సమ్భృతః = ప్రోగు చేయబడలేదు. విద్యా = విద్య, కాచిత్ = ఏదియు, న అర్జితా = సంపాదింపబడ లేదు. కించిత్ = కొంచెమైనను, తపః = తపస్సు, న సఞ్చితమ్ = అనుష్ఠింప బడలేదు. సకలం చ = సమస్తమైన, వయః = వయస్సు, గతమ్ = గడిచి పోయినది.

మూ. అసావనుశయాక్షేపో యస్మాదనుశయోత్తరమ్
అర్థార్జనాదేర్వ్యావృత్తిర్దర్శితేహ గతాయుషా. 162

వ్యా. అసౌ = ఇది, అనుశయాక్షేపః = అనుశయాక్షేపము. యత్ = ఏలననగా—ఇహ = ఈ శ్లోకమున, గతాయుషా = ఒకానొక వృద్ధునిచేత, అనుశయోత్తరమ్ = పశ్చాత్తాపమునకు పిమ్మట, (పశ్చాత్తాపముతో) అర్థార్జనాదేః = ధనార్జనాదికముయొక్క, వ్యావృత్తిః = నిషేధము, దర్శితా = చూపబడినది.

అవ. సంశయాక్షేపము :—

మూ. కిమయం శరదమ్భోదః కిం వా హంసకదమ్బకమ్
రుతం నూపురసంవాది శ్రూయతే తన్న తోయదః. 163

వ్యా. అయమ్ = ఇది, శరదమ్భోదః = శరత్కాల మేఘమా? కింవా = లేక, హంస కదమ్బకమ్ = హంససముదాయమా ? నూపుర సంవాది = నూపుర శబ్దముతో సమానమైన, రుతమ్ = ధ్వని, శ్రూయతే = వినబడుచున్నది. తత్ = ఆ కారణమువలన, తోయదః = మేఘము, న = కాదు

మూ. ఇత్యయం సంశయాక్షేపః సంశయో యన్నివర్త్యతే
ధర్మేణ హంససులభేనాస్పృష్టఘనజాతినా. 164

వ్యా. ఇతి = ఈ విధముగా, అయమ్ = ఇది, సంశయాక్షేపః = సంశయాక్షేపము. యత్ = ఏలననగా, హంససులభేన = హంసలకు సులభమైనదియు, హంసలలో కనబడునది అని యర్థము, అస్పృష్ట ఘనజాతినా = స్పృశింపబడని మేఘజాతి గల, మేఘములలో కానరాని, ధర్మేణ = నూపురసంవాదిరవము అను ధర్మముచే, సంశయః = సంశయము, నివర్త్యతే = తొలగింపబడుచున్నది.

అవ. అర్థాన్తరాక్షేపమును నిరూపించుచున్నాడు.

మూ. చిత్రమాక్రాన్తవిశ్వోఽపి విక్రమస్తే న తృప్యతి
కదా వా దృశ్యతే తృప్తిరుదీర్ణస్య హవిర్భుజః. 165

వ్యా. ఆక్రాన్త విశ్వోఽపి = ఆక్రమించబడిన ప్రపంచముకలదైనను, తే విక్రమః = నీ పరాక్రమము, న తృప్యతి = తృప్తి పొందుటలేదు. చిత్రమ్ = ఆశ్చర్యము ! ఉదీర్ణస్య = విజృంభించిన, హవిర్భుజః = అగ్నికి, కదా వా = ఎప్పుడు, తృప్తిః = తృప్తి, దృశ్యతే = చూడబడుచున్నది ? అగ్నికి తృప్తి లేని విధముననే నీ పరాక్రమమునకు గూడ తృప్తి లేదని భావము.

మూ, అయమర్థాన్తరాక్షేపః ప్రక్రాన్తో యన్నివార్యతే
విస్మయోఽర్థాన్తరస్యేహ దర్శనాత్తత్సధర్మణః. 166

వ్యా. అయమ్ = ఇది, అర్థాన్తరాక్షేపః = అర్థాన్తరాక్షేపము. మరియొక విషయమును చూపి చేయబడిన ఆక్షేపము. యత్ = ఏకారణమువలన, ఇహ = ఇచట, ప్రక్రాన్తః = ప్రారంభింపబడిన, ప్రారంభమునందు చూపబడిన,

విస్మయః = ఆశ్చర్యము, తత్సధర్మణః = దానితో (విక్రమముతో) సమానమైన ధర్మము గల, అర్థాన్తరస్య = మరియొక పదార్థముయొక్క అగ్నియొక్క, దర్శనాత్ = చూపుటవలన, నివార్యతే = నివారింపబడుచున్నదో.

అవ. హేత్వాక్షేపము :-

మూ. న స్తూయసే నరేన్ద్ర త్వం దదాసీతి కదాచన
స్వమేవ మత్వా గృహ్ణన్తి యతస్త్వద్ధనమర్థినః 167

వ్యా. హే నరేన్ద్ర = ఓ రాజా! త్వమ్ = నీవు, దదాసీతి = ధనమును ఇచ్చెద వను అభిప్రాయముతో, కదాచన = ఎన్నడును, న స్తూయసే = స్తుతింపబడుటలేదు. యతః = ఏ కారణమువలన, అర్థినః = యాచకులు, త్వద్ధనమ్ = నీ ధనమును, స్వమేవ = తమధనముగనే, మత్వా = భావించి, గృహ్ణన్తి = గ్రహించుచున్నారో.

మూ. ఇత్యేవమాదిరాక్షేపో హేత్వాక్షేప ఇతి స్మృతః
అనయైవ దిశాన్యోఽపి వికల్పః శక్య ఊహితుమ్. 168

(ఇత్యాక్షేప చక్రమ్)

వ్యా. ఇత్యేవమాదిః = ఈ మొదలైన, ఆక్షేపః = ఆక్షేపము, హేత్వాక్షేపః ఇతి = హేత్వాక్షేపము అని, స్మృతః = చెప్పబడినది. ఒక హేతువును చూపి ఒక విషయము నిషేధింపబడుచున్నది గాన ఇది హేత్వాక్షేప మని అర్థము. అన్యః = ఇతరమైన, వికల్పోఽపి = భేదము కూడ అనయా దిశైవ = ఈ రీతిచేతనే, ఊహితుమ్ = ఊహించుటకు, శక్యః = శక్యమైనది. ఆక్షేపాలంకారములో పైన చూపిన విధముగ మరి కొన్ని భేదములు కూడ ఉండవచ్చును. వాటిని స్వయముగ ఊహించుకొనవలె నని అభిప్రాయము.

అవ. అర్థాన్తరన్యాసాలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసో వస్తు ప్రస్తుత్య కించన
తత్సాధనసమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః. 169

వ్యా. కించన = ఒకానొక, వస్తు = విషయమును, ప్రస్తుత్య = ప్రస్తావించి, తత్సాధన సమర్థస్య = ఆ ప్రస్తుత మైన వస్తువును సమర్థించుటకు సమర్థమైన, అన్యస్య వస్తునః = మరి యొక అప్రస్తుత విషయముయొక్క, యః = ఏ, న్యాసః = ఉపన్యాసము (ప్రతిపాదనము) కలదో, సః = అది, అర్థాన్తరన్యాసః = అర్థాన్తరన్యాసాలంకారముగా, జ్ఞేయః = తెలియదగినది.

ఒక వాక్యముచే ప్రతిపాదిత మగు విషయమును సమర్థించుటకై మరి యొక వాక్యమును ప్రయోగించినచో అది అర్థాంతరన్యాసాలంకారము. అందులో సమర్థ్యము ప్రకృతము. సమర్థకము అప్రకృతము. మమ్మటుని ప్రకారము ఈ రెండు వ్యాక్యార్థములలో ఒకటి సామాన్యము, రెండవది విశేషము అయి యుండును. కాని దండి ప్రకారము సామాన్య విశేషభావమే కాక కార్యకారణ భావము కూడ ఉండవచ్చును. అనగా ఒక వాక్యము కారణమును, రెండవది కార్యమును చెప్పును. అపుడు కూడ అర్థాంతరన్యాసమే. కార్యకారణ భావస్థలములో మమ్మటాదులు కావ్యలింగమును అంగీకరించిరి. దండి కావ్యలింగమును అంగీకరించలేదు. దృష్టాంతాలంకారములో సామాన్యముచే సామాన్యమును, విశేషముచే విశేషమును సమర్థించుట ఉండును. ఈ అలంకారములో సామాన్యముచే విశేషము, విశేషముచే సామాన్యము సమర్థింపబడును ఇది ఈ రెండు అలంకారములకును భేదము.

అవ. సమర్థక మగు విషయమునందలి భేదమును బట్టి అర్థాంతరన్యాసాలంకారములో ఏర్పడుటకు వీలగు భేదములను చెప్పుచున్నాడు.

మూ. విశ్వవ్యాపీ విశేషస్థః శ్లేషావిద్ధో విరోధవాన్
అయుక్తకారీ యుక్తాత్మా యుక్తాయుక్తో విపర్యయః. 170

మూ. ఇత్యేవమాదయో భేదాః ప్రయోగేష్వస్య లక్షితాః
ఉదాహరణమాలైషాం రూపవ్యక్త్యై భవిష్యతి. 171

వ్యా. విశ్వవ్యాపీ = సామాన్యరూపమున అంతటను వ్యాపించియున్నది. విశేషస్థః = విశేషమునందే ఉండునది, శ్లేషావిద్ధః = శ్లేషతో కూడినది శబ్ద

సామ్యముపై ఆధారపడి యున్నది, విరోధవాన్ = విరుద్ధార్థ మైనది, అయుక్త కారీ, అనౌచిత్యముతో కూడినది, యుక్తాత్మా = ఔచిత్యముతో కూడినది, యుక్తాయుక్తః = యుక్త మైనను అయుక్తముగ నుండునది, విపర్యయః = అయుక్త మైనను యుక్తముగ నుండునది, ఇత్యేవమాదయః = ఈ మొదలైన, అస్య = సమర్థక మగు అర్థము యొక్క, భేదాః = భేదములు, ప్రయోగేషు = ప్రయోగములయందు, లక్షితాః = చూడబడినవి. ఏషామ్ = వీటియొక్క, ఉదాహరణమాలా = ఉదాహరణముల పంక్తి, రూపవ్యక్త్యై = వీటి స్వరూపము స్పష్టముగ తెలియుటకు, నిదర్శ్యతే = చూపబడుచున్నది.

అర్థాంతన్యాసములో ఒక వాక్యార్థము మరి యొక వాక్యార్థమును సమర్థించును గాన, ఆ సమర్థించు వాక్యార్థము (సమర్థకము) 'విశ్వవ్యాపి' ఇత్యాది భేదములతో ఉండును. దాని భేదములను బట్టి అర్థాంతరన్యాసమునకు కూడ ఈ పేర్లు వచ్చినవి.

అవ. విశ్వవ్యాపికి ఉదాహరణము చూపుచున్నాడు :—

మూ. భగవన్తౌ జగన్నేత్రే సూర్యాచన్ద్రమసావపి
పశ్య గచ్ఛత ఏవాస్తం నియతిః కేన లఙ్ఘ్యతే. 172

వ్యా. భగవన్తౌ = సర్వసమర్థులును, జగన్నేత్రే = జగత్తుకు నేత్రము వంటి వారును అగు, సూర్యా చన్ద్రమసావపి = సూర్య చంద్రులు కూడా, అస్తం గచ్ఛతః ఏవ = అస్తమించుచునే ఉన్నారు. పశ్య = చూడుము. నియతిః = దైవము, కేన = ఎవనిచే, లఙ్ఘ్యతే = లంఘింపబడును ?

ఇచట "నియతిః కేన లఙ్ఘ్యతే" అను సామాన్యము సూర్యచంద్రులు అస్తమించుచుండుట అను విశేషమును సమర్థించుచున్నది. సమర్థకము సామాన్యము గాన, అనగా విశ్వవ్యాపి గాన, ఇది 'విశ్వవ్యాపి అర్థాంతరన్యాసము'.

అవ. విశేషస్థ మగు అర్థాన్తరన్యాసమును ఉదాహరించుచున్నాడు.

మూ. పయోముచః పరీతాపం హరన్త్యేవ శరీరిణామ్
నన్వాత్మలాభో మహతాం పరదుఃఖోపశాన్తయే. 173

వ్యా. మహతామ్ = మహాపురుషుల, ఆత్మలాభః = జన్మ, పరదుఃఖోపశాన్తయే నను = పరుల దుఃఖమును తొలగించుటకే కదా ? పయోముచః = మేఘములు, శరీరిణామ్ = ప్రాణుల, పరితాపమ్ = తాపమును, హర న్త్యేవ = తొలగించుచునే యుండును.

ఇచట ఉత్తరార్ధములోని సామాన్యార్థమును, పూర్వార్ధములోని విశేషార్థము సమర్థించుచున్నది గాన ఇది విశేషస్థార్థాంతరన్యాసము. ఇచట ఉత్తరార్ధమును 'నను' శబ్దముతో ప్రారంభించుటచే ఉత్తరార్ధమే పూర్వార్ధమును సమర్థించుచున్నట్లు కనబడుచున్నది కాని, అర్థస్వారస్యమునుబట్టి పైన చూపినట్లే గ్రహించుట యుక్తము.

అవ. శ్లేషావిద్ధార్థాంతరన్యాసమును ఉదాహరించుచున్నాడు :-

మూ. ఉత్పాదయతి లోకస్య ప్రీతిం మలయమారుతః
నను దాక్షిణ్యసంపన్నః సర్వస్య భవతి ప్రియః. 174

వ్యా. మలయమారుతః = మలయ వాయువు, లోకస్య = లోకమునకు, ప్రీతిమ్ = ఆనందమును, ఉత్పాదయతి = పుట్టించుచున్నది. దాక్షిణ్య సంపన్నః = దాక్షిణ్యముతో కూడినవాడు, సర్వస్య = అందరికిని, ప్రియః = ఇష్టుడుగా, భవతి నను = అగును కదా ?

ఇచట విశేషమును సామాన్యము సమర్థించుచున్నది. రెండవ వాక్యములోని దాక్షిణ్య సమ్పన్నః అనుదానికి 'దక్షిణ దిక్సంబంధము కలవాడు' 'మంచితనము కలవాడు' అని రెండు అర్థములు. అందుచే ఇది శ్లేషావిద్ధార్థాంతరన్యాసము.

అవ. విరోధవదర్థాన్తరన్యాసమును ఉదాహరించుచున్నాడు :-

మూ. జగదానన్దయత్యేష మలినోఽపి నిశాకరః
అనుగృహ్ణాతి హి పరాన్సదోషోఽపి ద్విజేశ్వరః 175

వ్యా. ఏషః = ఈ, నిశాకరః = చంద్రుడు, మలినోఽపి = కలంకముచే మలిన మైనవాడైనను, జగత్ = జగత్తును, ఆనన్దయతి = ఆనందింపచేయుచున్నాడు, ద్విజేశ్వరః = బ్రాహ్మణశ్రేష్ఠుడు. సదోషోఽపి = తాను దోషములతో కూడినవాడైనను, పరాన్ = ఇతరులను, అనుగృహ్ణాతి హి = ఉపదేశాదులచే అనుగ్రహించును కదా ?

'ద్విజేశ్వర' శబ్దమునకు బ్రాహ్మణశ్రేష్ఠు డనియు, చంద్రు డనియు రెండర్థములు. ద్విజేశ్వరుడు తాను దోషవంతు డైనను పరుల కుపకారము చేయును అను సామాన్యముచే నిశాకరరూపు డగు ద్విజేశ్వరుడు మలిను డైనను ఆనందమును కలిగించుచున్నాడు అను విశేషము సమర్థింపబడినది. ఇచట సమర్థక వాక్యములో నున్న సదోషత్వ - పరానుగ్రాహకత్వములు పరస్పరవిరుద్ధములు గాన ఇది విరోధవదర్థాంతరన్యాసము.

అవ. అయుక్తకార్యర్థాంతరన్యాసము నుదాహరించుచున్నాడు :-

మూ. మధుపానకలాత్కణ్ఠాన్నిర్గతోఽప్యలినాం ధ్వనిః
కటుర్భవతి కర్ణస్య కామినాం పాపమీదృశమ్. 176

వ్యా. అలినామ్ = తుమ్మెదలయొక్క, మధుపానకలాత్ = మకరందము పానము చేయుటచే మధుర మైన, కణ్ఠాత్ = కంఠమునుండి, నిర్గతోఽపి = బయల్వెడలినను, ధ్వనిః = ధ్వని, కామినామ్ = కాముకుల, కర్ణస్య = చెవికి, కటుః = కటువైనదై, భవతి = అగుచున్నది. పాపమ్ = పాపము, ఈదృశమ్ = ఈ విధముగనే ఉండును.

ఇచట భ్రమరధ్వని కర్ణకటువుగా నున్నది అను విశేషము, పాపము దుఃఖమును కలిగించును అను సామాన్యముచే సమర్థింపబడుచున్నది. కాముకులు పాపులు గాన వారి పాపముచే కలకంఠనిర్గతమగు ధ్వనికూడ కటువుగ నున్నది అని చెప్పవచ్చును, లేదా మధుపాన మనునది పాపకృత్యము గాన దానిచే కలకంఠనిర్గత మైన ధ్వనికూడ కటువుగ నున్నదని చెప్పవచ్చును. సమర్థ్యవాక్యార్థములో కలకంఠ వినిర్గతధ్వని అయుక్త మగు కటుత్వమును కలిగించుచున్నట్లు చెప్పబడుటచే ఇది అయుక్తకార్యర్థాంతరన్యాసమున కుదాహరణము.

అవ. యుక్తాత్మార్థాంతరన్యాసము నుదాహరించుచున్నాడు :-

మూ. అయం మమ దహత్యఙ్గమమ్భోజదలసంస్తరః
హుతాశనప్రతినిధిర్దాహాత్మా నను యుజ్యతే. 177

వ్యా. అయమ్ = ఈ, అమ్భోజదలసంస్తరః = పద్మదలముల ఆస్తరణము, మమ అఙ్గమ్ = నా శరీరమును, దహతి = కాల్చివేయుచున్నది. హుతాశనప్రతినిధిః = అగ్నికి ప్రతినిధి యైనది, దాహాత్మా = కాల్చేస్వభావము కలిగి యున్నది అన్నచో, యుజ్యతే నను = యుక్తమే కదా ?

'ప్రతినిధి' శబ్దమునకు ఒకదాని స్థానమున వచ్చినది, ఒకదానితో సమానమైనది అని యర్థము. పద్మముల రేకులతో ఏర్పరచిన శయ్య ఎఱ్ఱగా నుండుటచే అగ్నికి ప్రతినిధిగా ఉన్నది. అట్టి అగ్నిప్రతినిధి దహించుటలో నాశ్చర్యము లేదు కదా అని అర్థము. ఈ విధముగ 'యుక్తాత్మ' అను అర్థాంతరన్యాసము.

అవ, యుక్తాయుక్తార్థాంతరన్యాసమును ఉదాహరించుచున్నాడు :-

మూ. క్షిణోతు కామం శీతాంశుః కిం వసన్తో దునోతి మామ్
మలినాచరితం కర్మ సురభేర్నన్వసామ్ప్రతమ్. 178

వ్యా. శీతాంశుః = చంద్రుడు, మామ్ = నన్ను, కామమ్ = యథేచ్ఛగా, క్షిణోతు = పీడించుగాక. వసన్తోపి = వసంతఋతువు కూడ, కిమ్ = ఏల, దునోతి = పీడించుచున్నది ? మలినాచరితమ్ = పాపాత్ములచే చేయబడిన, చంద్రుడుకలంకవంతుడుగాన మలినుడు. కర్మ = పరపీడనరూప మగు కర్మ, సురభేః = వసంతఋతువునకు, సురభిశబ్దమునకు జగద్విఖ్యాతుడని కూడ అర్థము. అసామ్ప్రతంనను = అయుక్తము కదా ?

ఇచట లోకప్రసిద్ధుడై యుక్తు డగు (ఉత్తముడగు) వసంతుడు పరపీడనము చేయుట అయుక్తము గాన ఇది యుక్తాయుక్తార్థాంతరన్యాసమున కుదాహరణము.

అవ. విపర్యయార్థాన్తరన్యాసమును అనగా అయుక్త యుక్తార్థాన్తరన్యాసమును ఉదాహరించుచున్నాడు.

మూ. కుముదాన్యపి దాహాయ కిమయం కమలాకరః
న హీన్దుగృహ్యేష్వుగ్రేషు సూర్యగృహ్యో మృదుర్భవేత్.
(ఇత్యర్థాన్తరన్యాస చక్రమ్)

వ్యా. కుముదాన్యపి = చంద్రకిరణ సంపర్కముచే వికసించుటచే చల్లగ ఉండవలసిన కలువలు కూడ, దాహాయ = తాపమును కలిగించుచున్నవి. అయమ్ = ఈ, కమలాకరః = సూర్యకిరణములచే వికసించు పద్మవనము, కిమ్ = చెప్పనేల ? ఇన్దుగృహ్యేషు = చంద్రుని పక్షమునకు చెందినవి, ఉగ్రేషు = తీక్ష్ణముగా నుండగా, సూర్యగృహ్యః = సూర్యుని పక్షమునకు చెందినది, మృదుః = మృదువైనదై, న భవేత్ హి = కాదు కదా ? ఇచట కుముదములు అయుక్తకారులనియు, కమలములు యుక్తకారులనియు చెప్పబడినది గాన ఇది అయుక్తయుక్తార్థాంతరన్యాసము

అవ. వ్యతిరేకాలంకారమును నిరూపించుచున్నాడు.

మూ. శబ్దోపాత్తే ప్రతీతే వా సాదృశ్యే వస్తునోర్ద్వయోః
తత్ర యద్భేదకథనం వ్యతిరేకః స కథ్యతే. 180

వ్యా. ద్వయోః వస్తునోః = రెండు వస్తువులయొక్క, ఉపమానోపమేయములయొక్క, సాదృశ్యే = సాదృశ్యము, శబ్దోపాత్తేసతి = 'ఇవ' మొదలగు శబ్దములచే చెప్పబడినప్పుడును, వా = లేక, ప్రతీతే = 'తుల్య' మొదలగు శబ్దములను ప్రయోగించుటచే లక్షణచేత గాని, లేదా పూర్వాపరపర్యాలోచన చేత గాని గమ్యమాన మగుచుండగా, తత్ర = ఆ సాదృశ్యమునందు, యత్ భేదకథనమ్ = ఏ భేదప్రతిపాదనము కలదో, ఉపమానముకంటె ఉపమేయము గొప్పది అని సూచించుటకై ఏదియో ఒక ధర్మమును బట్టి, ఆ సాధర్మ్యమునందు భేదమును చెప్పుట అని అర్థము. సః = అది, వ్యతిరేకః = వ్యతిరేకాలంకారముగా, కథ్యతే = చెప్పబడుచున్నది.

(1) ఉపమేయోత్కర్షమును ఉపమానాపకర్షమును రెండింటిని స్పష్టముగ చెప్పుట, (2) ఉపమేయోత్కర్షమును మాత్రమే చెప్పుట, (3) ఉపమానాపకర్షమును మాత్రమే చెప్పుట, (4) రెండింటిని స్పష్టముగ చెప్పకుండుట అను భేదములచే వ్యతిరేకము నాలుగు విధములు. ఉపమానోపమేయములలో ఉన్న భేదము కొన్ని చోట్ల 'నఞ్' మొదలగు వాటిని ప్రయోగించుటచేతను, కొన్ని చోట్ల విరుద్ధ ధర్మమును మాత్రము గ్రహించుటచేతను, కొన్నిచోట్ల తాత్పర్యమును బట్టియు బోధింపబడుచుండును.

మూ. ధైర్యలావణ్యగామ్భీర్యప్రముఖై స్త్వముదన్వతః
గుణై స్తుల్యోఽసి భేదస్తు వపుషైవేదృశేన తే. 181

వ్యా. ధైర్యలావణ్య గామ్భీర్యప్రముఖైః = ధైర్యము (సముద్ర పక్షమున స్థిరత్వము,)లావణ్యము(ఉప్పదనము అని రెండవ అర్థము,)గాంభీర్యము (రాజు పక్షమున గూఢాభిప్రాయ శాలిత్వము సముద్రపక్షమున లోతు) మొదలగు, గుణైః = గుణములచే, త్వమ్ = నీవు, ఉదన్వతః = సముద్రమునకు, తుల్యః = తుల్యుడవు, అసి = అయి ఉన్నావు. తు = కాని, ఈదృశేన = ఇట్టి, తే = నీ, వపుషైవ = శరీరముచేతనే, భేదః = భేదము.

ఇచట ఉపమేయమునకు ఉపమాన మగు సముద్రమునకు లేని సుందర శరీర మున్నట్లు చెప్పబడినది గాన ఇది ఉపమేయోత్కర్షమును చెప్పుటచే ఏర్పడిన భేదమును బట్టి వ్యతిరేకము.

మూ. ఇత్యేకవ్యతిరేకోఽయం ధర్మేణైకత్ర వర్తినా
ప్రతీతివిషయప్రాప్తే ర్భేదస్యోభయవర్తినః. 182

వ్యా. ఇతి = ఈ విధముగా, ఏకత్ర = ఒకదానియందు (ఉపమేయమునందు), వర్తినా = ఉన్న, ధర్మేణ = సుందర శరీరిత్వరూప మగు ధర్మముచే, ఉభయవర్తినః = రెండింటియందును ఉన్న, రెండింటికిని సంబంధించిన, భేదస్య = భేదము, ప్రతీతి విషయప్రాప్తేః = ప్రతీయమాన (గమ్య)మగుటచే, అయమ్ = ఇది, ఏక వ్యతిరేకః = ఏకవ్యతిరేకము.

అవ. ఉభయ వ్యతిరేకమును ఉదాహరించుచున్నాడు:-

మూ. అభిన్నవేలౌ గమ్భీరావమ్బురాశి ర్భవానపి,
అసావఞ్జనసఙ్కాశ స్త్వం తు చామీకరద్యుతిః. 183

వ్యా. అమ్బురాశిః = సముద్రము, భవానపి = నీవును, అభిన్నవేలౌ = అతిక్రమింపబడని వేల కలవారు. 'వేల' అనగా సముద్ర పక్షమున 'తీరము' రాజు పక్షమున 'లోకమర్యాద'. గమ్భీరౌ = గంభీరమైనవారు. తు—కాని, అసౌ = ఈ సముద్రము, అఞ్జన సఙ్కాశః = కాటుక వలె నల్లగా నున్నది. త్వమ్ = నీవు, చామీకరద్యుతిః = బంగారు కాంతి కలవాడవు.

మూ. ఉభయవ్యతిరేకోఽయముభయోర్భేదకౌ గుణౌ,
కార్ష్ణ్యం పిశఙ్గతా చోభౌ యత్ పృథగ్ దర్శితావిహ. 184

వ్యా. ఉభయోః = ఉపమానోపమేయములు రెండింటికిని వేరువేరుగ సంబంధించిన, కార్ష్ణ్యమ్ = నలుపు, పిశఙ్గతా చేతి = పచ్చతనము అను, ఉభౌ = రెండు, గుణౌ = గుణములు, భేదకౌ = భేదకారణములుగా, యత్ = ఏ కారణము వలన, పృథక్ = వేరువేరుగా, ఇహ = ఇచట, దర్శితౌ = చూపబడినవో, ఆ కారణమువలన, అయమ్ = ఇది, ఉభయవ్యతిరేకః = ఉభయ వ్యతిరేకాలంకారము.

అవ. సశ్లేష వ్యతిరేకము.

మూ. త్వం సముద్రశ్చ దుర్వారౌ మహాసత్త్వౌ సతేజసౌ,
అయం తు యువయోర్భేదః స జడాత్మా పటుర్భవాన్.

వ్యా. త్వమ్ = నీవును, సముద్రశ్చ = సముద్రము, దుర్వారౌ = నివారింప శక్యము కాని వారు. మహాసత్త్వౌ = గొప్ప సత్త్వము (బలము) సత్త్వములు (జలజంతువులు), కలవారు. సతేజసౌ = తేజస్సు (బడబాగ్ని) కలవారు. తు = కాని, అయమ్ = ఇది, యువయోః = మీ ఇద్దరి యొక్కయు, భేదః = భేదము.

సః = ఆ సముద్రము, జడాత్మా = "లడయోరభేదః" అను న్యాయము ననుసరించి 'జలమయము' అని అర్థము. 'జడబుద్ధికలది' అని కూడ అర్థము. భవాన్ = నీవు = పటుః = సమర్థుడవు.

అవ. ఇచట రాజసముద్రముల భేదము శ్లేషపై ఆధారపడి యున్నది గాన ఇది శ్లేషవ్యతిరేక మని చెప్పుచున్నాడు :-

మూ. స ఏష శ్లేషరూపత్వాత్ సశ్లేష ఇతి గృహ్యతామ్.
సాక్షేపశ్చ సహేతుశ్చ దర్శ్యతే తదపి ద్వయమ్. 186

వ్యా. స ఏషః = ఇది, శ్లేషరూపత్వాత్ = 'జడాత్మా' అను నపుడు శ్లేషరూప మగుటచే, సశ్లేషః ఇతి = సశ్లేషము అని, గృహ్యతామ్ = గ్రహింపబడుగాక. సాక్షేపశ్చ = విరుద్ధ ధర్మమును చెప్పి సాదృశ్యమును నిషేధించుటచే ఏర్పడిన వ్యతిరేకము, సహేతుశ్చ = హేతువుతో కూడిన వ్యతిరేకము, తద్ద్వయమపి = ఆద్వయము కూడా, దర్శ్యతే = చూపబడుచున్నది.

అవ. సాక్షేప వ్యతిరేకమును ఉదాహరించుచున్నాడు :-

మూ. స్థితిమానపి ధీరోఽపి రత్నానామకరోఽపి సన్,
తవ కక్షాం న యాత్యేవ మలినో మకరాలయః 187

వ్యా. స్థితిమానపి = మర్యాదను అతిక్రమింపనివాడైనను, ధీరోపి = ధీరుడైనను, రత్నానామ్ = రత్నములకు, ఆకరోఽపిసన్ = ఉత్పత్తి స్థానమైనను, మలినః = శ్యామవర్ణముగల, మకరాలయః = సముద్రుడు, తవ కక్షామ్ = నీ సామ్యమును, న యాత్యేవ = పొందనే పొందడు.

ఉపమాన మైన సముద్రమునందలి మాలిన్యమును బట్టి రాజసాదృశ్యమును నిషేధించుటచే ఉపమేయ మగు రాజునకు ఉత్కర్ష గమ్యమగుచున్నది. అందుచే ఇది సాక్షేప వ్యతిరేకము.

అవ. సహేతు వ్యతిరేకమును ఉదాహరించుచున్నాడు :-

మూ. వహన్నపి మహీం కృత్స్నాం సశైలద్వీపసాగరామ్
భర్తృభావాద్భుజఙ్గానాం శేష స్త్వత్తో నికృష్యతే. 188

వ్యా. సశైలద్వీపకాననామ్ = పర్వత - ద్వీప-అటవులతో కూడిన, కృత్స్నమ్=సమస్తమైన, మహీమ్= భూమిని, వహన్నపి = మోయుచున్నను. శేషః = ఆదిశేషుడు, భుజఙ్గానామ్ = సర్పములకు (విటులకు అని అర్థాంతరము) భర్తృభావాత్ = ప్రభు వగుటవలన, త్వత్తః = నీ కంటె, నికృష్యతే = తక్కువ వాడు అగుచున్నాడు.

భూభారమును వహించుట అనునది మీ ఇద్దరికిని సమానమే యైనను ఆతనికి భుజంగ భర్తృత్వమను అవలక్షణ ముండుటచే ఆతడు నీకంటే తక్కువవాడు. ఈ విధముగ ఇచట ఉపమానభూతు డగు ఆదిశేషుని అప కృష్టత్వమునకు హేతువు చూపబడినది గాన ఇది సహేతు వ్యతిరేకము.

మూ. శబ్దోపాదానసాదృశ్యవ్యతిరేకోఽయమీదృశః
ప్రతీయమానసాదృశ్యోఽప్యస్తి సోఽప్యభిధీయతే. 189

వ్యా. అయమ్ = ఈ, "శబ్దోపాత్తే ప్రతీతే వా సాదృశ్యే" అను వ్యతిరేక లక్షణమున 'శబ్దోపాత్తసాదృశ్యము', "ప్రతీయమాన సాదృశ్యము" అని రెండు విధము లని చెప్పిన భేదములలో మొదటిదైన, శబ్దోపాదానసాదృశ్య వ్యతిరేకః = శబ్దముచేత గ్రహింపబడిన సాదృశ్యము గల వ్యతిరేకాలంకారము, ఈదృశః = ఈ విధమైనది. ప్రతీయమాన సాదృశ్యోఽపి = గమ్య మగు సాదృశ్యము గల వ్యతిరేకాలంకారము కూడ, అస్తి = ఉన్నది. సోఽపి = అది కూడ, అభిధీయతే = చెప్పబడుచున్నది.

మూ. త్వన్ముఖం కమలం చేతి ద్వయోరప్యనయోర్భిదా
కమలం జలసంరోహి త్వన్ముఖం త్వదుపాశ్రయమ్. 190

వ్యా. త్వన్ముఖమ్ = నీ ముఖము, కమలం చేతి = పద్మమును అనెడు, అనయోః = ఈ, ద్వయోః = రెంటింటికిని, భిదా = భేదము ఏ మనగా-కమలం =

పద్మము, జల సంరోహి = జలమునందుమొలచునది. త్వన్ముఖమ్ = నీ ముఖము, త్వదుపాశ్రయమ్ = నిన్నే ఆశ్రయించి ఉండునది.

ఇచట ముఖ—కమలముల సాదృశ్యము గమ్యమానము గాన ఇది ప్రతీయమానసాదృశ్య మగు వ్యతిరేకము.

మూ. అభ్రూవిలాసమస్పృష్టమదరాగం మృగేక్షణమ్
ఇదం తు నయనద్వన్ద్వం తవ తద్గుణభూషితమ్. 191

వ్యా. మృగేక్షణమ్ = లేడి కన్ను, అభ్రూవిలాసమ్ = కనుబొమ్మల విలాసము లేనిది. అస్పృష్ట మదరాగమ్ = మదముచే కలిగిన ఎఱుపుయొక్క స్పర్శ లేనిది. తవ = నీ యొక్క, ఇదమ్ = ఈ, నయనద్వన్ద్వం తు = నేత్ర ద్వంద్వ మైతే, తద్గుణభూషితమ్ = ఆ గుణములచే అలంకరింపబడినది. ఈ శ్లోకమునందు గూడ సాదృశ్యము గమ్యమే గాన ప్రతీయమానసాదృశ్య వ్యతిరేకము.

మూ. పూర్వస్మిన్ భేదమాత్రోక్తిరస్మిన్నాధిక్యదర్శనమ్
సదృశవ్యతిరేకశ్చ పునరన్యః ప్రదర్శ్యతే. 192

వ్యా. పూర్వస్మిన్ = త్వన్ముఖమ్ ఇత్యాది ప్రథమోదాహరణము నందు, భేదమాత్రోక్తిః = ఉపమేయోపమానము లగు ముఖకమలములకు గల భేదముమాత్రమే చెప్పబడినది. అస్మిన్ = ఈ ఉదాహరణమునందు, ఆధిక్యదర్శ ఉపమాన మగు మృగేక్షణముకంటె ఉపమేయ మగు నయనద్వంద్వమునకు నమ్ = ఆధిక్యము కూడ చూపబడినది. అన్యః = మరియొక, సదృశవ్యతిరేకశ్చ = సదృశవ్యతిరేకము గూడ, ప్రదర్శ్యతే = చూపబడుచున్నది.

మూ. త్వన్ముఖం పుణ్డరీకం చ ఫుల్లే సురభిగన్ధినీ
భ్రమద్భ్రమరమమ్భోజం లోలనేత్రం ముఖం తు తే. 193

వ్యా. త్వన్ముఖమ్ = నీ ముఖము, పుణ్డరీకం చ = పద్మము కూడ, ఫుల్లే = వికసించినవి; సురభిగన్ధినీ = ఘ్రాణేంద్రియమునకు తృప్తి కలిగించు గంధము కలవి.

ఇచట ఫుల్లత్వ—సురభిగంధత్వములు ముఖపద్మములు రెండింటి యందును ఉన్న సాధారణ ధర్మములు. ఈ సాధారణ ధర్మములు శబ్దముచే స్పష్టముగ చెప్పబడినవి గాన ఇచట సాదృశ్యము శాబ్దము.

అమ్భోజమ్ = పద్మము, భ్రమద్భ్రమరమ్ = తిరుగుచున్న తుమ్మెదలు గలది. తే = నీ, ముఖం తు = ముఖ మైతే = లోలనేత్రమ్ = చంచల మైన నేత్రములు కలది.

ఈ ఉదాహరణమున ఫుల్లత్వ—సురభిగంధత్వము లనెడు సాధారణ ధర్మములను పేర్కొనుటచే స్పష్టముగ చెప్పబడిన సాదృశ్యము గల ముఖ పుండరీకములకు, లోలనేత్రత్వ—భ్రమద్భ్రమరత్వరూప మగు వైధర్మ్యముచే వ్యతిరేకము చెప్పబడినది. కావున ఇది శాబ్దసాదృశ్యవ్యతిరేకము. ఇచట భేద హేతువులగు భ్రమద్భ్రమరములకును, లోలనేత్రములకును సామ్య మున్నది.

మూ. చన్ద్రోఽయమమ్బరోత్తంసో హంసోఽయం తోయభూషణమ్
నభో నక్షత్రమాలీదముత్ఫుల్లకుముదం పయః. 194

వ్యా. అయమ్ = ఈ, చన్ద్రః = చంద్రుడు, అమ్బరోత్తంసః = ఆకాశమునకు భూషణము. అయం హంసః = ఈ హంస, తోయభూషణమ్ = ఉదకమునకు భూషణము. నభః = ఆకాశము, నక్షత్రమాలి = నక్షత్రపంక్తి కలది ఇదం పయః = ఈ జలము, ఉత్ఫుల్ల కుముదమ్ = వికసించిన కలువలు కలది.

చంద్రునికిని, హంసకును భేద మేమనగా—చంద్రుడు ఆకాశాలంకారము, హంస జలాలంకారము. ఆకాశ—జలములకు భేద మేమనగా—ఆకాశమున నక్షత్రమాల యున్నది. జలమున కుముదము లున్నవి అని అర్థము, కాని ఇచట చంద్ర—హంసలకును, ఆకాశ-తోయములకును సామ్యము చెప్పబడలేదు, కేవలము గమ్యము.

ఇచట గూడ భేద హేతువు లగు అంబర-తోయములకును, నక్షత్ర కుముదములకును సామ్యమున్నది.

మూ. ప్రతీయమానశౌక్ల్యాదిసామ్యయోర్వియదమ్భసోః
కృతః ప్రతీతశుద్ధ్యోశ్చ భేదోஉస్మింశ్చన్ద్రహంసయోః. 195

వ్యా. అస్మిన్ = ఈ ఉదాహరణమునందు, ప్రతీయమానశౌక్ల్యాది సామ్యయోః = గమ్య మగుచున్న శుక్లత్వము మొదలగు సామ్యము గల, వియదమ్భసోః = ఆకాశజలములకును, ప్రతీతశుద్ధ్యోః = గమ్య మగు శుద్ధత్వరూప సాధారణ ధర్మము గల, చన్ద్రహంసయోశ్చ = చంద్రహంసలకును, భేదః = భేదము, కృతః = చెప్పబడినది.

మూ. పూర్వత్ర శబ్దవత్ సామ్యముభయత్రాపి భేదకమ్,
భృఙ్గనేత్రాది తుల్యం తత్ సదృశవ్యతిరేకితా. 196

వ్యా. పూర్వత్ర = త్వన్ముఖం 'పుణ్డరీకం చ' అను ఉదాహరణమునందు, సామ్యమ్ = సామ్యము, శబ్దవత్ = 'ఫుల్లే' 'సురభిగన్ధినీ' అను శబ్దములచే ప్రతిపాదింపబడినది. ఉభయత్రాపి = "త్వన్ముఖం పుణ్డరీకమ్", "చన్ద్రోஉయమమ్బరోత్తంసః" అను రెండు ఉదాహరణములందును, భేదకమ్ = ఉపమానోపమేయములకు గల భేదమును చెప్పు, భృంగనేత్రాది = భృంగ—నేత్రములు, ఆకాశతోయములు, నక్షత్రకుముదములు కూడ, తుల్యమ్ = సాదృశ్యము కలవి తత్ = ఆ కారణమువలన, సదృశవ్యతిరేకతా = ఈ రెండును సంద్రూశవ్యతిరేకమునకు ఉదాహరణములు.

అవ. సజాతి వ్యతిరేకమును నిరూపించుచున్నాడు :—

మూ. అరత్నాలోకసంహార్యమహార్యం సూర్యరశ్మిభిః,
దృష్టిరోధకరం యూనాం యౌవనప్రభవం తమః, 197

వ్యా. యౌవన ప్రభవమ్ = యౌవనమువలన కలిగెన, యూనామ్ = యువకులయొక్క, దృష్టిరోధకరమ్ = దృష్టికి నిరోధమును కలిగించు (వివేకమును తొలగించు అని రెండవ అర్థము), తమః = తమస్సు (చీకటి, అజ్ఞానము అని రెండర్థములు), అరత్నాలోక సంహార్యమ్ = రత్నముల కాంతిచే తొలగింప

శక్యము కానిది. సూర్యరశ్మిభిః = సూర్యకిరణములచే, అహార్యమ్ = నశింప చేయ శక్యము కానిది.

ఇచట యౌవనజన్య మగు తమస్సునకును, అంధకారమునకును దృష్టి నిరోధకత్వమనునది సమాన ధర్మము. అది శాబ్దము; అనగా శబ్దముచే స్పష్టముగ చెప్పబడినది. రత్న కిరణాదులచే నశింపచేయ శక్యము కాకుండుట అను ధర్మము భేదహేతువు. ఇది ఉపమేయమునం దున్నది.

మూ. సజాతివ్యతిరేకోఽయం తమోజాతేరిదం తమః,
దృష్టిరోధితయా తుల్యం భిన్నమన్యైరదర్శి యత్. 198

(ఇతి వ్యతిరేక చక్రమ్)

వ్యా. ఇదమ్ = ఈ, తమః = యౌవనప్రభవ మగు తమస్సు, తమోజాతేః = తమస్స్వజాతిని పట్టి, దృష్టిరోధితయా = దృష్టిని అడ్డుకొనుటచేత, తుల్యమ్ = సామ్యముగలదిగాను, అంధకారముతో సమానమైనది గాను, అన్యైః = అరత్నాలోకసంహార్యత్వాదులచే, భిన్నమ్ = ఇతర తమస్సుకంటె భిన్నమైనది గాను, యత్ = ఏ కారణమువలన, అదర్శి = చూపబడెనో, ఆ కారణమువలన, సజాతి వ్యతిరేకః = సజాతివ్యతిరేకము.

యౌవనప్రభవ మగు మోహము, అందకారము గూడ తమస్సులే. అందుచే సజాతీయములు. వాటికి ఇచట వ్యతిరేకము చెప్పబడినది గాన ఇది సజాతివ్యతిరేకము.

అవ. విభావనాలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. ప్రసిద్ధహేతువ్యావృత్త్యా యత్ కిఞ్చిత్ కారణాన్తరమ్
యత్ర స్వాభావికత్వం వా విభావ్యం సా విభావనా. 199

వ్యా. యత్ర = ఎచట, ప్రసిద్ధహేతువ్యావృత్త్యా = ప్రసిద్ధమైన కారణము యొక్క అభావమును ప్రతిపాదించుటచే, యత్కిఞ్చిత్ = ఏదైన ఒక, కారణా

న్తరమ్ = మరి యొక కారణము, విభావ్యమ్ = ఊహింప దగి యుండునో. స్వాభావికత్వం వా = కార్యము స్వభావసిద్ధము అను విషయము గాని, ఊహింప దగి యున్నదో, సా = అది, విభావనా = విభావనాలంకారము.

అవ. ప్రసిద్ధ కారణమును నిషేధింపగా మరి యొక కారణమును ఊహించుటచే ఏర్పడిన విభావనాలంకారమును చెప్పుచున్నాడు.

**మూ. అపీతక్షీబకాదమ్బమసంమృష్టామలామ్బరమ్**
**అప్రసాదితశుద్ధామ్బు జగదాసీన్మనోహరమ్. 200**

వ్యా. అపీతక్షీబకాదమ్బమ్ = మద్యపానము చేయకపోయినను మదించిన హంసలు కలదియు, అసంమృష్టామలామ్బరమ్ = తుడవకపోయినను నిర్మలముగా నున్న ఆకాశముకలదియు, అప్రసాదితశుద్ధామ్బు = ఇండుపు కాయ మొదలగు వాటిచే శోధింపకున్నను పరిశుద్ధమైన ఉదకము కలదియు అగు, జగత్ = జగత్తు, మనోహరమ్ = మనోహర మైనదై, ఆసీత్ = ఆయెను. మత్తెక్కుటకు మద్యపానము, శుభ్రముగ నుండుటకు తుడుచుట, నీరు శుద్ధమగుటకు ఇండుపుకాయ గంధము కలుపుట మొదలగునవియు ప్రసిద్ధ కారణములు. అవి లేకపోయినను హంసాదులకు మదాదులు కలిగిన వని చెప్పుటచే శరదాగమరూప మగు మరి యొక కారణము ఊహింపబడుచున్నది గాన విభావనాలంకారము.

**మూ. అనఞ్జితాసితా దృష్టిర్భ్రూరనావర్జితా నతా**
**అరఞ్జితోఽరుణశ్చాయమధర స్తవ సున్దరి. 201**

వ్యా. హే సున్దరి = ఓ సుందరీ, తవ = నీ యొక్క, దృష్టిః = దృష్టి అనఞ్జితాసితా = కాటుక పూయక పోయినను నల్లగా నున్నది. భ్రూః = కను బొమ్మ, అనావర్జితా = వంచబడకపోయినను, నతా = వంగినది. అయమ్ = ఈ, అధరః = అధరోష్ఠము, అరఞ్జితః = రంగు పూయక పోయినను, అరుణః = ఎఱ్ఱగా నున్నది.

కండ్లు నల్లగ నుండుటకు కాటుక పెట్టుకొనుట, కనుబొమ్మ వంకరగ నుండుటకు దానిని విరచుట. అధరము ఎఱ్ఱగా నుండుటకు రంగు పూయుట అనునవి ప్రసిద్ధకారణములు. ఆ కారణములు లేకపోయినను అసితత్వాది కార్యము లున్న వని వర్ణించుటచే అవి ఆమెకు స్వాభావికము లని ఊహింపబడుచున్నది. అందుచే ఇది విభావనాలంకారము.

మూ. యదపీతాదిజన్యం స్యాత్ క్షీబత్వాద్యన్యహేతుజమ్
అహేతుకం చ తస్యేహ వివక్షేత్యవిరుద్ధతా. 202

వ్యా. అపీతాదిజన్యమ్ = మద్యపానాదులు లేకున్నను కలిగిన, యత్ = ఏ, క్షీబత్వాది = మదాదికము కలదో, అది, అన్యహేతుజమ్ = ఇతర కారణముల వలన కలిగినది, స్యాత్ = అగును. మొదటి ఉదాహరణములోని మదాదులకు శరదాగమము కారణము. అహేతుకం చ = కారణము లేనిది కూడ. రెండవ ఉదాహరణములోని నేత్రాసితత్వాదులకు కారణమేమియు లేదు; అవి సహజము లని యర్థము. ఇహ = ఇచట, తస్య = కారణాంతరమున్నది; అవి సహజములు అను విషయమును, వివక్షా = చెప్పుటయందు తాత్పర్యము. ఇతి = కావున, అవిరుద్ధతా = విరోధము లేదు. అనగా కారణము లేకుండగ కార్యము ఎట్లు పుట్టును ? అట్లు పుట్టు నని చెప్పుట లోక విరుద్ధము కదా అను ఆశంకకు పని లేదని భావము.

అవ. పై ఉదాహరణములలో "కారణములు లేకుండగనే ఈ కార్యములు వచ్చినవి" అని ప్రత్యక్షముగ చెప్పలేదు ఇపుడు కారణమును నిషేధించి కార్యోత్పత్తిని బోధించు ఉదాహరణము చూపుచున్నాడు :-

మూ. వక్త్రం నిసర్గసురభి వపురవ్యాజసున్దరమ్
అకారణరిపుశ్చన్ద్రో నిర్నిమిత్తాసుహృత్ స్మరః. 203

వ్యా. వక్త్రమ్ = ముఖము, నిసర్గసురభి = స్వభావముచేతనే పరిమళించు చున్నది. వపుః = శరీరము, అవ్యాజసుందరమ్ = నిష్కపటముగ సుందరముగా నున్నది. చన్ద్రః = చంద్రుడు, అకారణరిపుః = కారణ మేమియు లేకుండ

గనే శత్రువు. స్మరః = మన్మథుడు, నిర్నిమిత్తా సుహృత్ = నిమిత్త మేదియు లేకుండగనే శత్రువు.

మూ. నిసర్గాదిపదైరత్ర హేతుః సాక్షాన్నివర్తితః
ఉక్తం చ సురభిత్వాది ఫలం తత్సా విభావనా. 204

(ఇతి విభావనా చక్రమ్)

వ్యా. అత్ర = ఈ శ్లోకమున, నిసర్గాదిపదైః = నిసర్గ మొదలగు పదములచే, హేతుః = కారణము, సాక్షాదేవ = ప్రత్యక్షముగనే, నివర్తితః = నిషేధింపబడినది. సురభిత్వాది = సురభిత్వము మొదలగు, ఫలం చ = ఫలము కూడ, ఉక్తమ్ = చెప్పబడినది. తత్ = ఆ కారణమువలన, సా = ఆ, విభావనా = విభావనాలంకారము.

మూ. వస్తు కిఞ్చిదభిప్రేత్య తత్తుల్యస్యాన్యవస్తునః
ఉక్తిః సంక్షేపరూపత్వాత్ సా సమాసోక్తిరిష్యతే. 205

వ్యా. కిఞ్చిత్ = ఒకానొక, వస్తు = విషయమును, అభిప్రేత్య = ఉద్దేశించి, ఏదియో యొక విషయమును సూచించవలె నను అభిలాషతో, తత్తుల్యస్య = దానితో సమానమైన, అన్యవస్తునః = మరియొక వస్తువుయొక్క, ఉక్తిః = ఏ చెప్పుటకలదో, సా = అది, సంక్షేపరూపత్వాత్ = సంక్షేపరూప మగుటచే, సమాసోక్తిఃఇష్యతే = సమాసోక్త్యలంకారముగా అంగీకరింపబడుచున్నది.

సమాస మనగా సంక్షేపము. ఒక విషయమును చెప్పుటతో రెండు విషయములను బోధించుట సంక్షేపము. సమాసముచే ఉక్తి సమాసోక్తి. ఒక ప్రస్తుత విషయమును వర్ణించుటచే అప్రస్తుతవిషయము ప్రతీయమాన మైనచో సమాసోక్తి.

మూ. పిబన్మధు యథాకామం భ్రమరః ఫుల్లపఙ్కజే
అప్యసన్నద్ధసౌరభ్యం పశ్య చుమ్బతి కుడ్మలమ్. 206

వ్యా. ఫుల్లపఙ్కజే=వికసించిన పద్మమునందు, యథాకామం= స్వేచ్ఛగా, మధు=మకరందమును, పిబన్=త్రాగుచున్న, భ్రమరః = తుమ్మెద, అసన్నద్ధసౌరభ్యమపి=పూర్తిగా ఏర్పడని సౌరభము కలదైనను, కుడ్మలమ్=(పద్మము)మొగ్గను, చుమ్బతి=చుంబనచేయుచున్నది. పశ్య= చూడుము.

మూ. ఇతి ప్రౌఢాఙ్గనాబద్ధరతిలీలస్య రాగిణః
కస్యాఞ్చిదిహ బాలాయామిచ్ఛావృత్తిర్విభావ్యతే. 207

వ్యా. ఇతి = ఈ విధముగా, ఇహ = ఈ ఉదాహరణమునందు, ప్రౌఢాఙ్గనాబద్ధరతిలీలస్య = ప్రౌఢనాయికతోరతిక్రీడలు చేయుచున్న, రాగిణః=కాముకునకు, కస్యాఞ్చిత్=ఒకానొక, బాలాయామ్=పూర్తిగ యౌవనోదయము లేని బాలయందు, ఇచ్ఛావృత్తిః=సురతాసక్తి, విభావ్యతే= ఊహింపబడుచున్నది. ఈ విధముగ ప్రస్తుత భ్రమరవృత్తాంతముచే అప్రస్తుత కాముక వ్యవహారము గమ్య మగుచున్నది గాన ఇది సమాసోక్త్యలంకారము.

అవ. శ్లేషభేదములను చెప్పుచున్నాడు :-

మూ. విశేష్యమాత్రభిన్నాపి తుల్యాకారవిశేషణా
అస్త్యసావపరాప్యస్తి భిన్నాభిన్న విశేషణా. 208

వ్యా. విశేష్యమాత్రభిన్నాపి = విశేష్యము మాత్రము భిన్నముగానున్నను, తుల్యాకారవిశేషణా=సమానమైన విశేషణములు గల, ఒక సమాసోక్తి, అస్తి= ఉన్నది. విశేషణములు శ్లిష్టము లగుటచే ప్రకృతార్థమునకు అప్రకృతార్థమునకు గూడ సంబంధించును. విశేష్యము మాత్రము, శ్లిష్టము కాకపోవుటచే, ప్రకృతమునకు మాత్రమే సంబంధించి యుండును. అది ఒక సమాసోక్తి. భిన్నాభిన్న విశేషణా=శ్లేష లేకపోవుటచే భిన్నము లైన కొన్ని విశేషణములు, శ్లేష ఉండుటచే అభిన్నము లైన కొన్ని విశేషణములును గల, అపరాపి= మరియొక సమాసోక్తి కూడ, అస్తి=ఉన్నది.

అవ తుల్యవిశేషణసమాసోక్తిని ఉదాహరించుచున్నాడు.

మూ. రూఢమూలః ఫలభరైః పుష్ణన్ననిశమర్థినః
సాన్ద్రచ్ఛాయో మహావృక్షః సోఽయమాసాదితో మయా.

వ్యా. రూఢమూలః = బాగా నాటుకొనిన మొదలు లేదా ఊడలు కలదియు, ధనికుని పక్షమున—అధికమైన మూలధనము కలవాడును, ఫలభరైః = ఫలభారములచే, వాంఛితార్థములను ఇచ్చుటచే అని రెండవ అర్థము, అనిశమ్ = ఎల్లప్పుడును, అర్థినః = ఫలములు కోరువారిని, యాచకులను అని రెండవ అర్థము, పుష్ణన్ = పోషించుచున్నదియు, పోషించుచున్నవాడును, సాన్ద్రచ్ఛాయః = దట్టమైన నీడ కలదియు, గొప్ప కాంతి కలవాడును అగు, సోఽయమ్ = ఈ, మహావృక్షః = మహావృక్షము, మయా = నా చేత, ఆసాదితః = పొందబడినది; పొందబడినాడు. ఇచట విశేషణము లన్నియు వృక్షమునకును, ధనికునకును గూడ అన్వయించును. 'మహావృక్షం' అను విశేష్యము వృక్షమును మాత్రమే బోధించును.

ఇచట అన్ని విశేషణములును తుల్యరూపములు. వీటిచే అప్రస్తుత ధనిక వృత్తాంతము గమ్యమగుచున్నది.

అవ. భిన్నాభిన్న విశేషణములు గల సమాసోక్తిని ఉదాహరించుచున్నాడు.

మూ. అనల్పవిటపాభోగః ఫలపుష్పసమృద్ధిమాన్
సోచ్ఛ్రాయః స్థైర్యవాన్ దైవాదేష లబ్ధో మయా ద్రుమః.

వ్యా. అనల్పవిటపాభోగః = గొప్పదైన—కొమ్మల వైశాల్యము కలదియు, ఫలపుష్ప సమృద్ధిమాన్ = ఫలపుష్పముల సమృద్ధి కలదియు, సోచ్ఛ్రాయః = ఔన్నత్యము కలదియు, (ఐశ్వర్యాధిక్యము కలవాడు అని ధనికుని పక్షమున అర్థము), స్థైర్యవాన్ = స్థిరత్వము కలదియు, (స్థిరనిశ్చయము కలవాడు), ఏషః = ఈ, ద్రుమః = వృక్షము, మయా = నాచేత, దైవాత్ = అదృష్టము వలన, లబ్ధః = పొందబడినది.

ఇచట ప్రయోగించిన నాలుగు విశేషములలో మొదటి రెండును వృక్షమునకు మాత్రమే అన్వయించును. చివరి రెండు విశేషణములు వృక్షమునకు, ధనికునకు గూడ అన్వయించును. అందుచే ఇది భిన్నాభిన్న విశేషణ సమాసోక్తి

మూ. ఉభయత్ర పుమాన్ కశ్చిద్వృక్షత్వేనోపవర్ణితః
సర్వే సాధారణా ధర్మాః పూర్వత్రాన్యత్ర తు ద్వయమ్. 211

వ్యా. ఉభయత్ర = పై రెండు ఉదాహరణములందును, కశ్చిత్ = ఒకానొక, పుమాన్ = పురుషుడు, వృక్షత్వేన = వృక్షముగా, ఉపవర్ణితః = వర్ణింపబడినాడు. పూర్వత్ర = మొదటి ఉదాహరణమునందు, సర్వే = సమస్తమైన, ధర్మాః = ధర్మములు, సాధారణాః = ప్రకృతా ప్రకృతార్థములు రెండింటికిని తుల్యముగ అన్వయించునవి. అన్యత్ర తు = రెండవ ఉదాహరణమునందైతే, ద్వయమ్ = రెండు విశేషణములు మాత్రమే సాధారణములు.

అవ. అపూర్వసమాసోక్తిని నిరూపించుచున్నాడు :-

మూ. నివృత్తవ్యాలసంసర్గో నిసర్గమధురాశయః
అయమమ్భోనిధిః కష్టం కాలేన పరిశుష్యతి. 212

వ్యా. నివృత్తవ్యాలసంసర్గః = జలజంతువుల సంబంధము లేనిదియు, (మహాపురుషుని పక్షమున 'వ్యాల' శబ్దమునకు 'దుష్టులు' అని అర్థము) నిసర్గమధురాశయః = స్వభావముచే మధురమైన జలమునకు స్థానమైనదియు, స్వభావముచే మధురమైన చిత్తవృత్తి కలవాడు అని రెండవ అర్థము, అయమ్ = ఈ, అమ్భోనిధిః = సముద్రము, కాలేన = కాలవశముచేత, పరిశుష్యతి = ఎండిపోవును. (నశించిపోవును) కష్టమ్ = ఎంతకష్టము !

మూ. ఇత్యపూర్వసమాసోక్తిః పూర్వధర్మనివర్తనాత్
సముద్రేణ సమానస్య పుంసో వ్యాపత్తిసూచనాత్. 213

(ఇతి సమాసోక్తి చక్రమ్)

వ్యా. ఇతి = ఈ విధముగా, పూర్వధర్మనివర్తనాత్ = సముద్రములో ప్రసిద్ధముగ మొదటినుండియు ఉన్న వ్యాళసంసర్గము, క్షారజలము అను ధర్మము లను నిషేధించుటవలనను, సముద్రేణ = సముద్రముతో, సమానస్య = సమానుడైన, పుంసః = పురుషునియొక్క, వ్యాపత్తిసూచనాత్ = ఆపదను సూచించుట వలనను, అపూర్వ సమాసోక్తిః = అపూర్వ సమాసోక్త్యలంకారము.

ఈ మహాపురుషుడు సముద్రము వంటివాడు. కాని సముద్రములో క్రూర జంతువులు, క్షారజలము ఉన్నవి. ఈతడు అవి లేని సముద్రమువంటి వాడు అని చెప్పుటయందు తాత్పర్యము.

అవ. అతిశయోక్త్యలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. వివక్షా యా విశేషస్య లోకసీమాతివర్తినీ
అసావతిశయోక్తిః స్యాదలఙ్కారోత్తమా యథా. 214

వ్యా. విశేషస్య = విశేషముయొక్క, లోకసీమాతివర్తినీ = లోకములో కనబడు పద్ధతిని అతిక్రమించు, యా = ఏ, వివక్షా = వర్ణించుటకు ఇచ్ఛ కలదో, లోకోత్తరమైన వర్ణనము కలదో, అసౌ = ఇది, అలఙ్కారోత్తమా = అలంకారము లన్నింటిలోకి శ్రేష్ఠమైన, అతిశయోక్తిః = అతిశయోక్తి. యథా = ఎట్లనగా :-

ఏ అలంకారమునకైనను మూలము విచిత్రవర్ణనము. లోకములో మామూలుగ కనబడని విధమున వర్ణించుట. ఇదియే అతిశయోక్తి స్వరూపము. కావుననే అతిశయోక్తి సర్వాలంకారమూలము గాన అది అలంకారోత్తమము. భామహుడు కూడ అతిశయోక్తియే వక్రోక్తి యని చెప్పుచు-

"సైషా సర్వైవ వక్రోక్తిరనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలఙ్కారోఽనయా వినా"

అని చెప్పియున్నాడు. (కావ్యాలంకారము. II-85).

అవ. అతిశయోక్తికి ఉదాహరణము చూపుచున్నాడు :—

మూ. మల్లికామాలభారిణ్యః సర్వాఙ్గీణార్ద్రచన్దనాః
క్షౌమవత్యో న లక్ష్యన్తే జ్యోత్స్నాయామభిసారికాః 215

వ్యా. మల్లికామాలభారిణ్యః = మల్లి పూవుల మాలలభారమును ధరించుచున్నవారును, సర్వాఙ్గీణార్ద్రచన్దనాః = దేహమునం దంతటను పూయబడిన తడిగా ఉన్న మంచిగంధము కలవారును, క్షౌమవత్యః = తెల్లని పట్టుచీరలను ధరించినవారును అగు. అభిసారికాః = అభిసారికలు, జ్యోత్స్నాయామ్ = వెన్నెలయందు, న లక్ష్యన్తే = గుర్తింపబడుటలేదు.

ఇచట వెన్నెల చాల తెల్లగా నున్నట్లు వర్ణింపబడినది గాన ఇది అతిశయోక్త్యలంకారము. ఇట్టి ఉదాహరణములలో మమ్మటాదులు మీలితాలంకారమును అంగీకరించినారు.

మూ. చన్ద్రాతపస్యబాహుల్యముక్తముత్కర్షవత్తయా
సంశయాతిశయాదీనాం వ్యక్త్యై కిఞ్చిన్నిదర్శ్యతే. 216

వ్యా. పై ఉదాహరమునందు, ఉత్కర్షవత్తయా = మల్లికా మాలాదుల ధావళ్యముతో అభేదమును పొందుటను చెప్పుటచే, చన్ద్రాతపస్య = వెన్నెలయొక్క, బాహుల్యమ్ = అత్యధికధావల్యము, ఉక్తమ్ = చెప్పబడినది. అందుచే ఇది అతిశయోక్తికి ఉదాహరణము. భేదాంతరమును చూపుచున్నాడు :— సంశయాతిశయాదీనామ్ = సంశయాతిశయోక్తి మొదలగువాటియొక్క, వ్యక్త్యై = స్పష్టత్వముకొరకు కించిత్ = కొంచెము, నిదర్శ్యతే = ఉదాహరింపబడుచున్నది.

అవ. సంశయాతిశయోక్తిని ఉదాహరించుచున్నాడు :—

మూ. స్తనయోర్జఘనస్యాపి మధ్యే మధ్యం ప్రియే తవ
అస్తి నాస్తీతి సన్దేహో న మేఽద్యాపి నివర్తతే. 217

వ్యా. హే ప్రియే = ఓ ప్రియురాలా, తవ = నీ యొక్క, స్తనయోః = స్తనములయొక్కయు, జఘనస్యాపి = జఘనముయొక్కయు, మధ్యే = మధ్యయందు, మధ్యమ్ = నడుము, అస్తి = ఉన్నదా, నాస్తి = లేదా, ఇతి = ఇట్లు, సన్దేహః = సందేహము, మే = నాకు, అద్యాపి = ఇప్పటికిని, ననివర్తతే = నివర్తించుటలేదు.

ఇచట సంశయముచే మధ్యము అతికృశ మని చెప్పబడుటచే సంశయాతిశయోక్తి.

అవ. నిర్ణయాతిశయోక్తిని ఉదాహరించుచున్నాడు :-

మూ. నిర్ణేతుం శక్యమస్తీతి మధ్యం తవ నితమ్బిని
అన్యథానుపపత్త్యైవ పయోధరభరస్థితేః. 218

వ్యా. హే నితమ్బిని = ఓ సుందరనితంబవంతురాలా, అన్యథా = నడుము లేకున్నచో, పయోధరభరస్థితేః = స్తనభారము నిలచుట, అనుపపత్త్యైవ = కుదరదు గాన, తవ మధ్యమ్ = నీ నడుము, అస్తీతి = ఉన్నది అని, నిర్ణేతుమ్ = నిర్ణయించుటకు, శక్యమ్ = శక్యమైనది.

ప్రయోధరభారము నిలచుట కుదరదు గాన దానిని బట్టి నడుము ఉన్నట్లు ఊహించబడుచున్నది. ఇది నడుము అతికృశ మని సూచించుచున్నది గాన నిర్ణయాతిశయోక్తి.

అవ. ఆశ్రయాధిక్యాతిశయోక్తిని ఉదాహరించుచున్నాడు :—

మూ. అహో విశాలం భూపాల భువనత్రితయోదరమ్
మాతి మాతుమశక్యోఽపి యశోరాశిర్యదత్ర తే. 219

వ్యా. హే భూపాల = ఓ రాజా, భువనత్రితయోదరమ్ = త్రిభువన మధ్యము, విశాలమ్ = విశాలమైనది. అహో = ఎంత ఆశ్చర్యము! యత్ = ఏలననగా, మాతుమ్ = ఇముడుటకు, అశక్యోఽపి = శక్యము కాకున్నను, తే = నీ యొక్క, యశోరాశిః = కీర్తి యొక్క రాశి, అత్ర = దీనియందు, మాతి =

ఇముడుచున్నది. ఇచట ఆశ్రయభూత మైన త్రిభువనమధ్యము విశాల మని వర్ణించుట ద్వారా కీర్తి చాలా గొప్ప దని వర్ణించుటచే అతిశయోక్త్యలంకారము.

మూ. అలఙ్కారాన్తరాణామప్యేకమాహుః పరాయణమ్
వాగీశమహితాముక్తిమిమామతిశయాహ్వయామ్. 220

(ఇత్యతిశయోక్తి చక్రమ్)

వ్యా. వాగీశమహితామ్ = పండితులచే ఆదరింపబడిన, ఇమామ్ = ఈ, అతిశయాహ్వయామ్ ఉక్తిమ్ = అతిశయ మను పేరు గల ఉక్తిని, అతిశయోక్తిని, అలఙ్కారాన్తరాణామపి = ఇతరాలంకారములకు కూడా, ఏకమ్ = ఒక, పరాయణమ్ = ప్రధాన మైన ఆశ్రయముగా, ఆహుః = చెప్పుదురు. అలంకారము లన్నింటికిని అతిశయోక్తియే మూలము. ఏదో ఒక అతిశయమును, విశేషమును, చెప్పిననే గదా అలంకార మగును. ఈ విషయమే ఈ క్రింది శ్లోకములో కూడ చెప్పబడినది. "కస్యాప్యతిశయస్యోక్తిరిత్యన్వర్థవిచారణాత్. ప్రాయేణామీ అలఙ్కారా భిన్నా నాతిశయోక్తితః".

అథ ఉత్ప్రేక్షాలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. అన్యథైవ స్థితావృత్తిశ్చేతనస్యేతరస్య వా
అన్యథోత్ప్రేక్ష్యతే యత్ర తాముత్ప్రేక్షాం విదుర్యథా. 221

వ్యా. చేతనస్య = చైతన్యవంతు లగు మనుష్యాదులయొక్కయు, అచేతనస్య = అచేతనము లైన వృక్షపర్వతాదులయొక్కయు, అన్యథైవ స్థితా = స్వభావసిద్ధముగ ఒక రీతిలో నున్న, వృత్తిః = ప్రవృత్తి, యత్ర = ఎచట, అన్యథా = మరి యొక విధముగ, ఉత్ప్రేక్ష్యతే = ఊహింపబడునో, తామ్ = దానిని, ఉత్ప్రేక్షామ్ = ఉత్ప్రేక్షనుగా, విదుః = తెలిసికొందురు. చెప్పుదురు.

ఉత్ప్రేక్షలో సంభావన యుండును. సంభావన యనగా ఉత్కటైక కోటిక సంశయము. సంశయములో రెండు కోటు లుండును ఉదా. కొమ్మలులేని ఒక

మోడు చెట్టును (స్థాణువును) దూరమునుండి చూచినపుడు అది స్థాణువా మనుష్యుడా అను బుద్ధి కలుగును. స్థాణువా అనునది ఒకకోటి, మనుష్యుడా అనునది రెండవకోటి సంశయమునందు ఈ రెండు కోటులును తుల్యబలములుగ ఉండును. ఒకదాని వైపు మొగ్గుదల ఉండదు. అట్లు కాక ఒక కోటివైపు మొగ్గుదల ఉన్నచో-ఇది మనుష్యుడే అని అన్నచో-అది సంభావనము. ఉత్ప్రేక్షలో అట్టి సంభావన ముండును. ఈ సంభావనమునకు ఉత్కటైకకోటికసంశయ మని పేరు. ఉత్ప్రేక్షారూప మగు సంభావనలో అప్రకృతమువైపే మొగ్గుదల ఉండును. అనగా అప్రస్తుతము ప్రస్తుమును గప్పివేయును. దీనిని "అప్రస్తుతేన ప్రస్తుతనిగరణమ్" అని యందురు ఇది ప్రస్తుతమును చెప్పకుండుటచేతను, లేదా ప్రస్తుతమును పూర్తిగ కప్పివేయుటచేతను జరుగవచ్చును.

అవ. చేతనగత మగు ఉత్ప్రేక్షను ఉదాహరించుచున్నాడు :-

మూ. మధ్యన్దినార్కసన్తప్తః సరసీం గాహతే గజః
మన్యే మార్తణ్డగృహ్యాణి పద్మాన్యుద్ధర్తుముద్యతః. 222

వ్యా. మధ్యన్దినార్కసన్తప్తః = మధ్యాహ్న సమయము నందలి సూర్యునిచే తపింపచేయబడిన, గజః = ఏనుగు, మార్తణ్డగృహ్యాణి = సూర్యుని పక్షమునకు చెందిన, పద్మాని = పద్మములను, ఉద్ధర్తుమ్ = పీకివేయుటకు, ఉద్యతః = ఉద్యమించినదై, సరసీమ్ = సరస్సును, గాహతే = ప్రవేశించుచున్నది, అని, మన్యే = తలచుచున్నాను.

ఇచట చేతన మైన గజము సూర్యకిరణసంతప్తమై చల్లదనము కొరకై సరస్సులో ప్రవేశించుచున్నది. కాని అది చల్లదనము కొరకు కాక, తనను పీడించుచున్న సూర్యునిపై కోపముచే, ఆ సూర్యుని పక్షమునకు చెందిన పద్మములను పెకలించుటకై సరస్సులోనికి ప్రవేశించుచున్నది అని కవి ఉత్ప్రేక్షించుచున్నాడు. అర్వాచీనులు ఇట్టి స్థలములలో ప్రత్యనీకాలంకారమును అంగీకరింతురు. తనను బాధించు శత్రువును ఏమియు చేయజాలక అతని పక్షము వారిని పీడించుట ప్రత్యనీకము. ఇచట 'మన్యే' పదప్రయోగ మున్నది గాన ఉత్ప్రేక్ష యనుటయే యుక్తము.

మూ. స్నాతుం పాతుం బిసాన్యత్తుం కరిణో జలగాహనమ్
తద్వైరనిష్క్రయాయేతి కవినోత్ప్రేక్ష్య వర్ణ్యతే. 223

వ్యా. స్నాతుమ్ = స్నానముచేయుట కొరకును, పాతుమ్ = జలపానము చేయుటకును, బిసాని = తామర తూడులను, అత్తుమ్ = తినుటకును. కరిణః = ఏనుగుయొక్క, జలగాహనమ్ = జలప్రవేశము, తద్వైర నిష్క్రయాయేతి = దానికి సూర్యునిపై నున్న పగను తీర్చుకొనుటకు అని, కవినా = కవిచేత, ఉత్ప్రేక్ష్య = ఊహించి, వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

అవ. అచేతనగతోత్ప్రేక్షను ఉదాహరించుచున్నాడు :-

కర్ణస్య భూషణమిదం మమాయతివిరోధినః
ఇతి కర్ణోత్పలం ప్రాయస్తవ దృష్ట్యా విలఙ్ఘ్యతే. 224

వ్యా. "ఇదమ్ = ఇది, మమ = నాయొక్క, ఆయతి విరోధినః = దీర్ఘత్వమునకు శత్రువైన, అనగా ఈ చెవి అడ్డు లేనిచో నేను ఇంకను పెద్దగ ఉండెడిదానను అని యర్థము. కర్ణస్య = కర్ణమునకు, భూషణమ్ = అలంకారము", ఇతి = ఈ కారణముచే, ఈ విధముగ ఆలోచించి, ప్రాయః = బహుశా, తవ దృష్ట్యా = నీ నేత్రముచే, కర్ణోత్పలమ్ = నీ కర్ణమునందలి నల్ల కలువ, విలఙ్ఘ్యతే = అతిక్రమింపబడుచున్నది, అనగా కాంతులచే కొట్టి ఓడింపబడుచున్నది.

మూ. అపాఙ్గభాగపాతిన్యా దృష్టేరంశుభిరుత్పలమ్
స్పృశ్యతే వా న వేత్యేవం కవినోత్ప్రేక్ష్య వర్ణ్యతే. 225

వ్యా. అపాఙ్గభాగపాతిన్యాః = నేత్రాంతములందు ప్రసరించుచున్న, దృష్టేః = దృష్టియొక్క, అంశుభిః = కిరణములచే, ఉత్పలమ్ = కర్ణములో నున్న ఉత్పలము, స్పృశ్యతే వా = స్పృశింపబడుచున్నదో, న వా = లేదో, ఇతి ఏవమ్ = ఈ స్థితిలో, కవినా = కవిచే, ఉత్ప్రేక్ష్య = ఊహించి, వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

ఇచట అచేతన మగు నేత్రము తనకు కర్ణము అడ్డు తగిలిన దను కోప ముచే దాని అలంకార మైన ఉత్పలమును తన నీలకాంతులతో కొట్టుచున్నట్లు ఉత్ప్రేక్షింపబడుచున్నది.

అవ. 'లిమ్పతీవ తమోఙ్గాని' ఇత్యాది ప్రసిద్ధ శ్లోకములలో 'ఇవ' శబ్ద ముండుటచే కొందరు ఇది ఉపమాలంకార మని భావించుచున్నారు. ఆ మతమును ఖండించుచు దీనిలో ఉత్ప్రేక్షాలంకార మే యని స్థాపించుచున్నాడు.

మూ. లిమ్పతీవ తమోఙ్గాని వర్షతీవాఞ్జనం నభః
ఇతీదమపి భూయిష్ఠముత్ప్రేక్షాలక్షణాన్వితమ్. 226

వ్యా. "తమః = తమస్సు, అఙ్గాని = అవయవములను లేదా దేహాను లను, లిమ్పతీవ = పూయుచున్నదా అన్నట్లున్నది. నభః = ఆకాశము, అఞ్జనమ్ = కాటుకను, వర్షతీవ = వర్షించుచున్నదా అన్నట్లున్నది" ఇతి = ఇట్లు, ఇదమపి = ఇది కూడా, భూయిష్ఠమ్ = చాలవరకు, ఉత్ప్రేక్షాలక్షణా న్వితమ్ = ఉత్ప్రేక్షాలక్షణముతో కూడినది.

"అసత్పురుష సేవేవ దృష్టిర్విఫలతాం గతా". అను ఉత్తరార్థము,

"పినష్టీవ తరఙ్గాగ్రైరుదధిః ఫేనచన్దనమ్
తదాదాయ కరైరిన్దుర్లిమ్పతీవ దిగఙ్గనాః"

అను శ్లోకము కూడ కొన్ని ప్రతులలో ఉన్నవి.

'లిమ్పతీవ' ఇత్యాది శ్లోకము మృచ్ఛకటికములోనిది. ఇచట తమస్సు యొక్క వ్యాపనరూపధర్మము లేపనము గాను, అధః ప్రసారణరూప మగు ధర్మము అంజనవర్షణము గాను ఉత్ప్రేక్షింపబడినది. రెండింటియందును సంభావ నాధికరణము లగు 'వ్యాపన' 'అధః ప్రసరణములు' గ్రహింపబడలేదు. 'అయం దూరస్థః దేవదత్త ఇవ భాతి' – (ఆ దూరాన కనబడువాడు దేవదత్తుడు వలె ఉన్నాడు) ఇత్యాదులలో ఇవ శబ్దము సంభావనార్థక మైనట్లే ఇచట కూడ 'ఇవ' శబ్దము సంభావనార్థకమే కాని ఔపమ్యార్థకము కాదు గాన ఇది ఉత్ప్రేక్షో దా

హరణమే యని అర్థము. "దృష్టి అసత్పురుషుని సేవ వలె నిరర్థక మైనది" అను అర్థము గల ఉత్తరార్ధమునందు మాత్రము ఉపమాలంకారమే. "సముద్రుడు తరంగాగ్రములచే నురుగు అనెడు చందనమును తీయుచున్నట్లున్నాడు, చంద్రుడు తన కరములతో దానిని తీసి దిగంగనలకు పూయుచున్నట్లున్నాడు". అను అర్థము గల రెండవశ్లోకములో కూడ ఉత్ప్రేక్షాలంకారమే.

మూ. కేషాఞ్చిదుపమాభ్రాన్తి రివశ్రుత్యేహ జాయతే
నోపమానం తిఙన్తేనేత్యతిక్రమ్యాప్తభాషితమ్. 227

వ్యా. ఇహ = 'లిమ్పతీవ' ఇత్యాది వాక్యద్వయమునందు, ఇవశ్రుత్యా = 'ఇవ' శబ్దము వినబడుటచే, కేషాఞ్చిత్ = కొందరికి, తిఙన్తేన = తిఙంతముతో, ఉపమానమ్ = ఉపమానము, న = ఉండదు, ఇతి = అను, ఆప్తభాషితమ్ = ఆప్తవాక్యమును, అతిక్రమ్య = అతిక్రమించి, (లెక్కచేయక), ఉపమాభ్రాన్తిః = ఉపమాలంకార మనెడు భ్రాంతి, జాయతే = కలుగుచున్నది.

"భవతి, భవతః, భవన్తి" ఇత్యాది క్రియాపదములను తయారుచేయుటకై భూ మొదలగు ధాతువుల చివర చేర్చు 'తి' 'తస్' మొదలగు ప్రత్యయములకు 'తిఙ్' ప్రత్యయము లని పేరు. అవి చేర్చుటచే ఏర్పడిన "భవతి" మొద లగునవి తిఙంతములు.

"ధాతోః కర్మణః సమానకర్తృకాదిచ్ఛాయాం వా" అను సూత్రమున భాష్యకారులు "నవై తిఙన్తేనోపమాన మస్తి" అని చెప్పియున్నారు. తిఙంతప్రతిపాద్య మగు అర్థము సాధ్యము; అనగా ఇంకను పూర్తిచేయదగినది, సిద్ధము కాదు అని శాస్త్రకారుల మతము అందుచే సాధ్యమైన తిఙంతార్థమునకు ఉపమానత్వము చెప్పకూడదు. కావుననే – "సిద్ధమేవ సమానార్థముపమానం విధీయతే. తిఙన్తార్థస్తు సాధ్యత్వాదుపమానం న జాయతే" అని చెప్పబడినది. తిఙంత శబ్దములతో "ఇవ" శబ్దప్రయోగ మున్నచో అచట అధ్యారోపమే కాని ఉపమానోపమేయభావము కాదని కైయటుడు చెప్పి యున్నాడు, "ఇవశబ్దప్రయోగే తు అధ్యారోపస్తు విద్యతే. రోదితీవ గాయతి. నృత్యతీవ గచ్ఛతి దేవదత్తః" దేవదత్తుడు ఏడ్చుచునట్లుగా పాడుచున్నాడు. నాట్యము చేయు

చున్నట్లుగా నడుచుచున్నాడు" ఇత్యాది వాక్యములలో "ఇవ" శబ్దప్రయోగ మున్నను ఉపమానత్వము లేదు. గానమునందు రోదనత్వారోపము, గమనము నందు నృత్యత్వారోపము బోధింపబడుచున్నది అని యర్థము. ఈ విధముగ తిఙంతప్రయోగస్థలమున ఉపమాలంకారమును అంగీకరింపరా దని భాష్యకారాదులు చెప్పుచున్నను కొందరు "లిమ్పతీవ" ఇత్యాదులందు ఉపమాలంకారమును అంగీకరించుట అయుక్త మని యర్థము. ఇట్టి స్థానములలో "ఇవ" శబ్దము సంభావనార్థకమే గాన ఉత్ప్రేక్షాలంకారమునే అంగీకరింపవలెను.

అవ. ఈ శ్లోకములో ఉపమాలంకారమును అంగీకరింపరాదు అనుటకు కారణాంతరమును కూడ ప్రతిపాదించుచున్నాడు :—

మూ. ఉపమానోపమేయత్వం తుల్యధర్మవ్యపేక్షయా
లిమ్పతేస్తమసశ్చాసౌ ధర్మః కోఽత్ర సమీక్ష్యతే. 228

వ్యా. ఉపమానోపమేయత్వమ్ = ఉపమానోపమేయభావము, తుల్యధర్మవ్యపేక్షయా = సమానధర్మముయొక్క అపేక్షచేత, కలుగును. సమానధర్మమేదైన లేకున్నచో ఉపమానోపమేయభావ ముండుటకు వీలులేదు. అత్ర = ఈ శ్లోకమునందు, లిమ్పతేః = లిమ్పధాతువునకును, అనగా లిమ్పధాత్వర్థమునకును, తమసశ్చ = తమస్సునకును, అసౌ = ఆ, ధర్మః = సమానధర్మము, కః = ఏది, సమీక్ష్యతే = చూడబడుచున్నది. "తమస్సు లేపనముచేయుచున్నది వలె ఉన్నది. అనునపుడు ఉపమానోపమేయభావమును అంగీకరించు మీ అభిప్రాయము ప్రకారము తమస్సునకును, లేపనక్రియకును సంబంధించిన సమానధర్మ మొకటి ఉండవలెను. అట్టి సమానధర్మమేదియు కనబడుట లేదు కదా ? ఉపమాలంకారమును అంగీకరించుట ఎట్లు కుదురును ?

అవ. తమో - లేపనక్రియలకు సమానధర్మము లేపనమే అని పూర్వపక్షి చెప్పవచ్చును. దానికి సమాధానము చెప్పుచున్నాడు :—

మూ. యది లేపనమేవేష్టం లిమ్పతిర్నామ కోఽపరః
స ఏవ ధర్మో ధర్మీ చేత్యనున్మత్తో న భాషతే. 229

వ్యా. లేపనమేవ = లేపనమే, ఇష్టం యది = సాధారణధర్మముగా అంగీకరింపబడినట్లైతే, లిమ్పతిర్నామ = లిమ్పధాత్వర్థమైన, అపరః = మరి యొకటి, కః = ఏది?

లిమ్పధాత్వర్థమైన లేపనము తమోలిమ్పత్యర్థముల సమానధర్మ మని అంగీకరించినచో ఈ లేపనధర్మమునకు ఆశ్రయమైన మరి యొక ధర్మి ఉండ వలెను కదా; అది యేది? "భావప్రధానమాఖ్యాతమ్; సత్త్వప్రధానాని నామాని" అని యాస్కవచనము. తిఙంతము క్రియను బోధించును అని దీని యర్థము. లింగ - వచనాదులతో అన్వయించునది సత్త్వము. ఈ యాస్కవచనము ప్రకారము 'లిమ్ప' ధాతువునకు లేపనము చేయుట అని యర్థము. ఈ లేపనమే సాధారణధర్మ మని అంగీకరించినచో ఈ ధర్మమునకు ఆశ్రయ మైన ఒక ధర్మి యుండవలెను కదా అని అర్థము. ధర్మియు కూడ ఆ లేపనమే అని ఆశంకించు కొని అది అయుక్త మని చెప్పుచున్నాడు. స ఏవ = ఆ లేపనమే, ధర్మః = ధర్మ మనియు, ధర్మీ చేతి = ధర్మి యనియు, అనున్మత్తః = ఉన్మత్తుడు కాని వాడు, న భాషతే = చెప్పడు 'ముఖం చంద్ర ఇవ సున్దరమ్' ఇత్యాద్యుపమాస్థలములందు సౌందర్య మను ధర్మము వేరు, తదాశ్రయమైన ముఖ - చంద్రరూప ధర్మిలు వేరు. అట్టి స్థలములలో ఉపమాలంకారమును అంగీకరించినను ఇచట కుదరదు అని భావము.

అవ. మరి యొక ఆశంకకు సమాధానము చెప్పుచున్నాడు :-

మూ. కర్తా యద్యుపమానం స్యాన్న్యగ్భూతో౽సౌ క్రియాపదే
స్వక్రియాసాధనవ్యగ్రో నాలమన్యదపేక్షితుమ్. 230

వ్యా. కర్తా = 'లిమ్పతి' అను పదమునందలి తిఙంతముచే వాచ్యు డగు కర్త, ఉపమానం స్యాత్ యది = ఉపమానము కావచ్చును అని అన్నచో (అది యుక్తముకాదు). క్రియాపదే = క్రియాపదమునందు, న్యగ్భూతః = అప్రధానమైనవాడును, స్వక్రియాసాధనవ్యగ్రః = తన క్రియను సాధించుటయందు ప్రవర్తించుచున్నవాడును అగు, అసౌ = ఈ కర్త, అన్యత్ = మరియొకదానిని, అపేక్షితుమ్ = అపేక్షించుటకు, నాలమ్ = సమర్థుడుకాడు.

"న వై తిజన్తేనోపమానమస్తి" అను భాష్యకారవాక్యము ననుసరించి తిజంతార్థ మగు లేపనమును ఉపమానముగ గ్రహించుటకు శక్యము కాకున్నను 'లిమ్పతి' అను పదములోని 'తిఙ్' ప్రత్యయముచే ప్రతిపాదింపబడు కర్తను ఉపమానముగా స్వీకరింపవచ్చునుకదా? అందుచే "తమః కర్తృకమైనవ్యాపరము లేపనక్రియాకర్తతో తుల్యమైనది" అను అర్థముసిద్ధించుటచే ఇది ఉపమాలంకారమే కావచ్చును అని పూర్వపక్షము. దీనికి సమాధాన మేమనగా – వైయాకరణమతానుసారము ధాతువు ప్రధానముగ వ్యాపారమును (క్రియను) బోధించును. ధాతువుకు చేర్చిన తిఙ్ ప్రత్యయములచే ప్రతిపాద్యము లగుకర్త మొదలైనవి ఆ వ్యాపారముతో సంబంధించుటచే అప్రధానములు. అందుచే కర్త మొదలగువాటిని (వ్యాపార) విశేషణము లని లేదా ప్రకారము లని అందురు. అందుచే తనకు విశేష్య మైన వ్యాపారమును సాధించు ప్రయత్నములో నిమగ్నమైన, కర్త మరి యొక పదార్థముతో, విశేష్యముతో, విశేషణముగ అన్వయింపజాలదు. ఈ విధముగ లేపన వ్యాపారములో విశేషణముగా అన్వయించిన కర్త ఉపమా సంబంధముచే మరి యొక దానితో అన్వయింపజాలదు గాన ఇచట ఉపమాలంకారమును అంగీకరించుట కుదరదు అని యర్థము. ఒక విశేష్యములో విశేషణముగ అన్వయించినది మరి యొక విశేష్యములో విశేషణముగ అన్వయింప జాల దని మంజూషలో నాగేశభట్టు చెప్పియున్నాడు :—"ఏకత్ర విశేషణత్వేన గృహీతశక్తికస్య జ్ఞాతస్య వా అపరత్ర విశేషణత్వాయోగః అత ఏవ రాజ్ఞః పురుషోఽశ్వశ్చేతి వత్ రాజపురుషోశ్వశ్చేతి న" ఒక విశేష్యమునకు విశేషణముగా అన్వయించిన విశేషణము మరి యొక దానిలో విశేషణముగా అన్వయింపదు. "రాజ్ఞః పురుషః అశ్వశ్చ", అను ప్రయోగములో రాజ్ఞః అనునది 'పురుష' శబ్దముతోడను, 'అశ్వ' శబ్దముతోడను కూడ విశేషణముగ అన్వయించవచ్చును. కాని 'రాజపురుషః అశ్వశ్చ' అని ప్రయోగించకూడదు. ఏల నన 'రాజపురుషః' అను సమాస వృత్తిలో 'రాజ' శబ్దము పురుష విశేషణముగ అన్వయించినది. అందుచే ఇది మరల అశ్వశబ్దముతో విశేషణముగ అన్వయింపజాలదు. అందుచే పై వాక్యమునకు "రాజ పురుషుడు ఒక అశ్వము" అని మాత్రమే అర్థము వచ్చును గాని "రాజపురుషుడు, రాజాశ్వము" అను అర్థమురాదు.

అవ. ఇంతవరకు వైయాకరణ ప్రక్రియ ప్రకారము ఉపమాలంకారము కుదర దని ప్రతిపాదించి, నైయాయికాభిమత మగు ప్రథమాన్తార్థప్రధానబోధ ప్రకారము కూడ ఉపమాలంకారము కుదర దని చెప్పుచున్నాడు :—

మూ. యో లిమ్పత్యమునా తుల్యం తమ ఇత్యపి శంసతః
అజ్ఞానీతి న సమ్బద్ధం సోఽపి మృగ్యః సమో గుణః. 231

వ్యా. యః = ఎవడు, లిమ్పతి = పూయుచున్నాడో, అమునా = ఆతనితో, తమః = తమస్సు, తుల్యమ్ = తుల్యమైనది, ఇతి = ఈ విధముగా, శంసతః = చెప్పువానికి కూడా, ఈ విధముగా సమన్వయముచేయు పక్షమున కూడా, 'అజ్ఞాని' ఇతి = 'అజ్ఞములను' అను పదము, న సమ్బద్ధమ్ = ఉపమేయగత మగు లేపనముతో సంబంధించుటలేదు. అందుచే, సః = ఆ, మరి యొక, సమఃగుణఃఅపి = సమానధర్మము కూడా, మృగ్యః = అన్వేషింప దగినది. ఏదైన మరి యొక సమానధర్మమును చెప్పవలసి యుండును.

వైయాకరణులు ఆఖ్యాతార్థప్రధాన మైన శాబ్దబోధను అంగీకరింతురు. నైయాయికులు ప్రథమాన్తార్థ ప్రధాన శాబ్దబోధను అంగీకరింతురు. ఉదాహరణమునకు—'రామఃఫలంఖాదతి' అను వాక్యమునకు "రామకర్తృకా, ఫలకార్మికా ఖాదన క్రియా" (రాముడు కర్తగా కలదియు, ఫలము కర్మగా కలదియు అగు భక్షణ మనెడు క్రియ) అని వైయాకరణులు శాబ్దబోధమును (వాక్యార్థమును) అంగీకరింతురు. నైయాయికులు—"ఫలకర్మక ఖాదనక్రియాశ్రయాభిన్నః రామః" (ఫలము కర్మగా గల ఖాదన మనెడు క్రియకు ఆశ్రయమైన రాముడు) అను శాబ్దబోధమును అంగీకరింతురు. వైయాకరణమతానుసారముగా వ్యాపారము ప్రధాన వాక్యార్థము గాన, పూర్వోదాహృతభాష్యకారవాక్యము ననుసరించి తిఙంతార్థము ఉపమానమగుటకు వీలు లేక పోయినను నైయాయిక మతము ప్రకారము లేపనక్రియాకర్తకు ప్రాధాన్య మున్నది గాన "తమస్సు లేపన క్రియచేయు వానితో సమానము" అని చెప్పి ఉపమాలంకారమును అంగీకరించ వచ్చును కదా యని పూర్వపక్షి అభిప్రాయము. దీనికి సిద్ధాంతి చెప్పు సమాధాన మేమనగా—ఇచట తమస్సు ఉపమేయము; 'లిమ్పతి' పదప్రతిపాద్యు డగు

లేపనకర్త ఉపమానము. ఈ వాక్యములోనున్న "అజ్ఞాని" అను పదము ఉపమేయమగు తమస్సుతో (తమస్సు అవయవములను పూయుచున్నది అను రీతిగ) అన్వయించుచున్నది గాని ఉపమాన మగు లేపనకర్తతో అన్వయించుట లేదు. అందుచే మరి యొక సాధారణధర్మమును చూపవలసియుండును. అట్టి సాధారణ ధర్మమేదియు లేదు గాన ఇది ఉపమాలంకారము కాజాలదు.

ఇక్కడ ఒక ఆశంక కలుగవచ్చును. ఒక లేపనకర్త చందనాదులను అవయవములకు పూసినట్లు తమస్సు అవయవములను పూయుచున్నది అని చెప్పినచో 'అజ్ఞాని' అనుదానికి ఉపమానముతో కూడ సంబంధ మున్నది కదా యని ప్రశ్నింపవచ్చును. "తమః లిమ్పతి" అను దానికి తమస్సు ఏదియో మరి యొక వస్తువును అవయవములకు పూయుచున్నది అని అర్థము కాదు. తమస్సు అవయవములకు (చందనాదిద్రవ్యము వలె) అంటుకొనుచున్నది అని యర్థము. అందుచే ఆ అర్థము చెప్పుటకు అవకాశమే లేదు.

అవ. సాధారణధర్మ మేదియు ఇచట లేదు గాన ఇది ఉపమాలంకారము కాదు అని చెప్పుట యుక్తము కాదు. సాధారణధర్మము లేనపుడు పూర్ణోపమ కాకపోయినను లుప్తోపమ కావచ్చును కదా అను ఆశంకకు సమాధానము చెప్పుచున్నాడు :-

**మూ. యథేన్దురివ తే వక్త్రమితి కాన్తిః ప్రతీయతే**
**న తథా లిమ్పతేర్లేపాదన్యదత్ర ప్రతీయతే.** 232

వ్యా. తే వక్త్రమ్ = నీ ముఖము, ఇన్దురివ = చంద్రుడు వలె ఉన్నది, ఇతి = ఈ విధముగ చెప్పినపుడు, కాన్తిః = ఆ ముఖ చంద్రులు రెండింటికిని సమానధర్మ మగు కాంతి, యథా = ఏ విధముగా, ప్రతీయతే = గమ్య మగుచున్నదో, తథా = ఆ విధముగా, అత్ర = ఇచట, లిమ్పతేః = లిమ్పధాతువు నుండి, లేపాత్ = లేపము కంటె, అన్యత్ = భిన్నమైనది మరి యొకటి ఏదియు, న ప్రతీయతే = గమ్య మగుటలేదు.

ఉపమాలంకారమున, ఉపమేయము, ఉపమానము, ఉపమావాచకము, సమానధర్మము అను నాలుగు అంశము లుండును. వదనమ్ ఇన్దురివ సున్దరమ్

అనునపుడు వదనము ఉపమేయము, ఇన్దుడు ఉపమానము. ఇవ ఉపమా వాచకము. సౌందర్యము సమానధర్మము. ఈ నాలిగింటిలో ఒకటి రెండు చెప్పక పోయినను అది ఉపమాలంకారమే. కాని దానిని లుప్తోపమ అందురు. "వక్త్రమ్ ఇన్దురివ" అనునపుడు సమానధర్మ మగు కాంతిని చెప్పకున్నను అది ప్రసిద్ధ మగుటచే గమ్య మగుచున్నది. దీనిని "ధర్మలుప్తోపమ" అందురు. పై ఉదాహరణములో కాంతిరూప సమాన ధర్మమును చెప్ప కున్నను తెలిసి నట్లు ప్రస్తుతోదాహరణములో "లిమ్పతి" అను పదము లేపనరూపార్థమును మాత్రమే బోధించుచున్నది. కాని అంతకు మించిన అర్థము (సమాన ధర్మము) ఏదియు గమ్య మగుటలేదు గాన ఇది లుప్తోపమ అనుట కూడ యుక్తము కాదు.

మూ. తదుపశ్లేషణార్థోఽయం లిమ్పతిర్ధ్వాన్తకర్తృకః
అఙ్గకర్మా చ పుంసైవముత్ప్రేక్ష్యత ఇతీష్యతామ్. 233

వ్యా. తత్ = ఆ కారణమువలన, ధ్వాన్తకర్తృకః = తమస్సుకర్తగా కలదియు, అఙ్గకర్మా చ = అవయవములు లేదా శరీరములు కర్మగా కలదియు అగు, అయమ్ = ఈ, లిమ్పతిః = లిమ్పధాతువు, ఉపశ్లేషణార్థః = వ్యాపించుట అను అర్థము కలది. పుంసా = కవికల్పితు డగు పురుషునిచే, ఏవమ్ = ఈ విధముగా, శరీరములను పూయుచున్నట్లుగా, ఉత్ప్రేక్ష్యతే = ఉత్ప్రేక్షింపబడు చున్నది. ఇతి = అని, ఇష్యతామ్ = అంగీకరింపబడుగాక.

అర్వాచీనులగు మమ్మటాదులు వివరించిన విధమున వ్యాపనము విషయము. లేపనము విషయి. వ్యాపనమునందు లేపనత్వము సంభావింపబడుచున్నది గాన ఇది ఉత్ప్రేక్షమే అని యర్థము.

మూ. మన్యే శఙ్కే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః.
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివశబ్దోఽపి తాదృశః. 234

వ్యా. "మన్యే" = నేనిట్లు అనుకొనుచున్నాను. "శఙ్కే" = ఈ విధముగా ఊహించుచున్నాను. "ధ్రువమ్" = ఇది వాస్తవము. "ప్రాయః" =

బహుశా. "నూనమ్" = నిశ్చయముగా, ఇత్యేవమాదిభిః = ఈ మొదలైన, ఇట్టి, శబ్దైః = శబ్దములచేత, ఉత్ప్రేక్షా = ఉత్ప్రేక్ష, వ్యజ్యతే = సూచింపబడును. ఇవశబ్దోపి = "ఇవ" శబ్దము కూడ, తాదృశః = అట్టిదే. అనగా "ఇవ" శబ్దము కూడ ఉత్ప్రేక్షావాచకమే గాన "లిమ్పతీవ తమోఙ్గాని" ఇత్యాదులలో ఉత్ప్రేక్షను నిఃశంకముగ అంగీకరింపవచ్చు నని యర్థము. "మన్యే" ఇత్యాది పదములను ప్రయోగించినపుడు వాచ్యోత్ప్రేక్ష యనియు, వాటిని ప్రయోగింపకున్నను ఉత్ప్రేక్ష గమ్యమైనచో గమ్యోత్ప్రేక్ష యనియు అందురు.

అవ. భామహుడు—"హేతుశ్చ సూక్ష్మో లేశోథ నాలఙ్కారతయా మతః. సముదాయాభిధానస్య వక్రోక్త్యనభిధానతః" అని చెప్పుచు చమత్కార శూన్యము లగుటచే హేతు-సూక్ష్మ-లేశాలంకారములకు అలంకారత్వమును నిరాకరించినాడు. కాని దండి ఈ మూడును కావ్యములలో స్వీకరింపదగిన ఉత్తమాలంకారములని చెప్పుచున్నాడు :-

మూ. హేతుశ్చ సూక్ష్మలేశౌ చ వాచాముత్తమభూషణమ్
కారకజ్ఞాపకౌ హేతూ తౌ చానేకవిధౌ యథా. 235

వ్యా. హేతుశ్చ = హేత్వలంకారము, సూక్ష్మలేశౌ చ = సూక్ష్మాలంకార లేశాలంకారములును, వాచామ్ = కావ్యములకు, ఉత్తమభూషణమ్ = ఉత్తమాలంకారము. కారకజ్ఞాపకౌ = కారకము, జ్ఞాపకము అగు, తౌ హేతూచ = ఆ హేతువులుకూడః అనేకవిధౌ = అనేక విధములైనవి. యథా = ఎట్లనగా—

కారకహేతు వనగా ఏదైన ఒక కార్యమును పుట్టించునది. అగ్నినుండి ధూమము పుట్టును గాన అగ్ని ధూమమునకు కారకహేతువు. జ్ఞాపకహేతు వనగా మరియొక వస్తువు అచట నున్నట్లుగా సూచించు హేతువు. ధూమమును చూడగనే అచట అగ్ని యుండియుండును అని తెలియును గాన ధూమము అగ్నికి జ్ఞాపక హేతువు. ఈ విధముగ రెండు విధము లగు హేతువులకు మరల ప్రవృత్తి-నివృత్త్యాది భేదములచే అనేక భేదము లున్నవి. అవి ఉదాహరణముల నుండి స్పష్ట మగును.

దండి ఈ హేత్వలంకారము నంగీకరించుటచే అర్వాచీను లంగీకరించిన కావ్యలింగము, అనుమానము, కార్యకారణభావమూలకార్థాంతరన్యాసము దీనిలో అంతర్గతములై పోయినవి. కావుననే దండి వీనికి, ప్రత్యేకముగ లక్షణోదాహరణాదులను చూపలేదు.

అవ. కారకహేతువును ఉదాహరించుచున్నాడు :-

**మూ. అయమాన్దోలితప్రౌఢచన్దనద్రుమపల్లవః**
**ఉత్పాదయతి సర్వస్య ప్రీతిం మలయమారుతః, 236**

వ్యా. ఆన్దోలిత...పల్లవః—ఆన్దోలిత = కదల్చబడిన, ప్రౌఢ ముదిరిన, చన్దనద్రుమ = చందనవృక్షముల, పల్లవః = చిగుళ్ళుగల, అయమ్ = ఈ, మలయమారుతః = మలయవాయువు, సర్వస్య = ప్రతివానికిని, ప్రీతిమ్ = ఆనందమును, ఉత్పాదయతి = పుట్టించుచున్నది.

ఇచట వాయువు ఆనందకరము గుటకు కారణము చందన ద్రుమ పల్లవస్పర్శము. అట్టి వాయువు ఆనందహేతువుగ నున్నట్లు వర్ణింపబడినదిగాన కారకహేత్వలంకారము.

**మూ. ప్రీత్యుత్పాదనయోగ్యస్య రూపస్యాత్రోపబృంహణమ్**
**అలఙ్కారతయోద్దిష్టం నివృత్తావపి తత్సమమ్. 237**

వ్యా. అత్ర = ఇచట, ప్రీత్యుత్పాదన యోగ్యస్య = ఆనందమును కలిగించుటకు యోగ్యమైన, రూపస్య = వాయుస్వరూపముయొక్క, ఉపబృంహణమ్ = చందన పల్లవములను కదల్చుటచే సౌరభముతో నిండినది అను విషయమును సూచించుటకై చేసిన విశిష్టవర్ణనము, అలఙ్కారతయా = అలంకారముగా, ఉద్దిష్టమ్ = ఉద్దేశింపబడినది. ఇది ప్రవృత్తి హేతువగు ఉపబృంహణము. నివృత్తౌ అపి = నివృత్తియందుగూడ, తత్ = ఆ ఉపబృంహణము, సమమ్ = తుల్యమైనది. ఇట్టి ఉపబృంహణము (విశిష్టవర్ణనము) నివృత్తిహేతువైనపుడు కూడ అలంకారత్వమును అంగీకరింపవలెనని అర్థము

అవ. నివృత్తి హేత్వలంకారమును ఉదాహరించుచున్నాడు :—

మూ. చన్దనారణ్యమాధూయ స్పృష్ట్వా మలయనిర్ఝరాన్
పథికానామభావాయ పవనోఽయముపస్థితః. 238

వ్యా. అయమ్ = ఈ, పవనః = వాయువు, చన్దనారణ్యమ్ = చందన వనమును, ఆధూయ = కదల్చి, మలయనిర్ఝరాన్ = మలయపర్వతమునందలి సెలయేళ్లను, స్పృష్ట్వా = స్పృశించి, పథికానామ్ = విరహవంతులగు పాంథుల యొక్క, అభావాయ = నాశనము కొరకు, ఉపస్థితః = వచ్చినది.

ఇచట వాయువు విరహివినాశరూపమగు నివృత్తికి హేతువైనట్లుగా వర్ణింపబడుటచే ఇది నివృత్తి హేత్వలంకారము.

మూ. అభావసాధనాయాలమేవంభూతో హి మారుతః
విరహజ్వరసంభూతమనోజ్ఞారోచకే జనే. 239

వ్యా. ఏవం భూతః = ఈ విధమైన, మారుతః = వాయువు, విరహ జ్వరసంభూతమనోజ్ఞారోచకే = విరహతాపముచేత సుందరవస్తువుల విషయమున జనించిన అరుచి గల, జనే = పాంథజనులవిషయమున, అభావసాధనాయ = అభావమును సాధించుటకు, అలమ్ = సమర్థమైనది.

అవ. క్రియార్థసంపాదకములు (క్రియారూపమగు అర్థమును సంపాదించునవి) కర్మార్థసంపాదకములు (కర్మరూపమగు అర్థమును సంపాదించునవి) అని హేతువులు రెండు విధములు. క్రియార్థసంపాదములు కారక హేతువులనియు, జ్ఞాపక హేతువు లనియు రెండు విధములు. ఈ ద్వివిధ హేతువులలో కారక హేతువు ఉత్పత్తిహేతు వనియు, నివృత్తిహేతు వనియు రెండు విధములు. ఈ రెండు విధముల హేతువులకును 236, 238 శ్లోకములు ఉదాహరణముగ చూపబడినవి. ఇపుడు కర్మార్థసంపాదక హేతువులకు ఉదాహరణములను చూపు చున్నాడు :—

మూ. నిర్వర్త్యే చ వికార్యే చ హేతుత్వం తదపేక్షయా
ప్రాప్యే తు కర్మణి ప్రాయః క్రియాపేక్షైవ హేతుతా. 240

వ్యా, నిర్వర్త్యే = నిర్వర్త్యకర్మవిషయమునను, వికార్యేచ = వికార్య కర్మ విషయమునను, హేతుత్వమ్ = హేతుత్వము, తదపేక్షయా = వాటిని బట్టి, అగును. ప్రాప్యే కర్మణి తు = ప్రాప్యకర్మ విషయమునందైతే, ప్రాయః = సాధారణముగా, హేతుతా = హేతుత్వము, క్రియాపేక్షైవ = క్రియను బట్టియే ఏర్పడును.

నిర్వర్త్యము, వికార్యము, ప్రాప్యము అని కర్మ మూడు విధములు, "కటం కరోతి" (చాప అల్లుచున్నాడు), "వస్త్రం వయతి" (వస్త్రమును నేయుచున్నాడు), ఇత్యాదులందు అంతకు పూర్వము లేని కటము, వస్త్రము అనునవి క్రొత్తగా పుట్టుచున్నవి గాన ఇవి నిర్వర్త్య కర్మలు. ఉన్న వస్తువునందు ఏదైన వికారము కలిగించినచో అది వికార్యకర్మ. ఇది రెండు విధములు. దాని సహజ ప్రకృతి పూర్తిగ మారిపోయినచో అది ప్రకృత్యుచ్ఛేదసంభూత మగు వికార్య కర్మ. ఉదా. "కాష్ఠం భస్మ కరోతి" — (కట్టెను భస్మము చేయుచున్నాడు). ఇచట కాష్ఠప్రకృతి పూర్తిగా మారిపోవుచున్నది. మరి యొక గుణము ఉత్పన్న మగుటచే ఏర్పడిన వికారము కలది గుణాన్తరోత్పత్తిసంభూత వికార్యకర్మ. 'సువర్ణం కుణ్డలం కరోతి' ఇత్యాదులలో సువర్ణము మరి యొక ఆకారమున మార్చబడినది గాన ఇది గుణాంతర ముత్పన్న మగుటచే వికారమును చెందిన కర్మ. ఈ నిర్వర్త్య వికార్యకర్మలలో పూర్వావస్థకంటె విశేషము కానవచ్చు చున్నది గాన అట్టి విశేషమునకు ఏదియో ఒక హేతువు అపేక్షింపబడును. అనగా ఏదియో ఒక హేతువును బట్టియే నిర్వర్త్యకర్మ పుట్టుచున్నది. వికార్యకర్మలో వికారము కలుగుచున్నది. ప్రాప్యకర్మవిషయమునందు మాత్రము హేతువు ఏదియో ఒక క్రియను కలిగించును. వస్తువును (కర్మను) పుట్టించుట గాని దానియందొక వికారమును కలిగించుట గాని ఉండదు. ఉదాహరణమునకు "గ్రామం గచ్ఛతి; సూర్యం పశ్యతి" ఇత్యాదులలో గ్రామ - సూర్యాదులు ప్రాప్యకర్మలు. ఈ కర్మలయందు ప్రత్యక్షముచేతగాని, అనుమానముచేత గాని ఎట్టిమార్పును తెలియబడుటలేదు. క్రియామాత్రమే ఉండును. ఈ విధముగ నిర్వర్త్యకర్మను పుట్టించుదానిని హేతువనుటకు కారణము అది దానిని పుట్టించుట. వికార్యకర్మలలో వికారమును కలిగించుదానిని హేతు వనుటకు కారణము అది

దానియందు వికారమును కలిగించుట. కావున మొదటిది నిర్వర్త్యాపేక్ష మగు హేతువు. రెండవది వికార్యాపేక్ష మగు హేతువు. ప్రాప్యకర్మకు ఒకదానిని హేతువనుటకు కారణము అది యొక క్రియ యగుటయే, పూర్వోదాహరణములలో గమన - దర్శనములచే కర్మలైన గ్రామసూర్యులందు ఎట్టి మార్పును కానవచ్చుటలేదు కదా.

మూ. హేతుర్నిర్వర్తనీయస్య దర్శితః శేషయోర్ద్వయోః
దత్త్వోదాహరణద్వన్ద్వం జ్ఞాపకో వర్ణయిష్యతే. 241

వ్యా. నిర్వర్తనీయస్య = నిర్వర్త్యకర్మకు, హేతుః = హేతువు, దర్శితః = 'అయమాన్దోలిత' 'చన్దనారణ్యమాధూయ' అను శ్లోకములలో చూప బడినది. శేషయోః ద్వయోః = మిగిలిన వికార్య - ప్రాప్యకర్మలు రెండింటికిని. ఉదాహరణద్వన్ద్వం = ఉదాహరణద్వయమును, దత్త్వా = ఇచ్చి, జ్ఞాపకః = జ్ఞాపకహేతువు, వర్ణయిష్యతే = వర్ణింపబడగలదు.

నిర్వర్త్యము, వికార్యము, ప్రాప్యము అని కర్మ మూడు విధములు గాన దానిని బట్టి కారక హేతువు కూడ నిర్వర్తకము, వికృతిజనకము, ప్రాపకము అని మూడు విధములుగ ఉండును. నిర్వర్తకహేతువునకు వెనుక ఉదాహరణము చూపబడినది. మిగిలిన రెండింటికి చెప్పనున్నాము అని అర్థము.

అవ. వికారజనక హేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. ఉత్ప్రవాలాన్యరణ్యాని వాప్యః సంఫుల్లపఙ్కజాః
చన్ద్రః పూర్ణశ్చ కామేన పాన్థదృష్టేర్విషం కృతమ్. 242

వ్యా. ఉత్ప్రవాలాని = బయల్వెడలిన చిగుళ్ళు గల, అరణ్యాని = అరణ్యములు, సంఫుల్ల పఙ్కజాః = వికసించిన పద్మములు గల, వాప్యః = దిగుడు బావులు, పూర్ణఃచన్ద్రశ్చ = పూర్ణచంద్రుడును, కామేన = మన్మథుని చేత, పాన్థదృష్టేః = విరహపీడితు లగు పాంథుల దృష్టికి, విషమ్ = విషముగా, కృతమ్ = చేయబడినది.

ఇచట మన్మథుడు అరణ్యాదులయందు విషత్వవికారమునకు హేతువైనట్లు వర్ణింపబడినది గాన ఇది వికారకజనకహేత్వలంకారమునకు ఉదాహరణము.

అవ. ప్రాప్యహేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. మానయోగ్యాం కరోమీతి ప్రియస్థానస్థితాం సఖీమ్
బాలా భ్రూభఙ్గజిహ్మాక్షీ పశ్యతి స్ఫురితాధరా. 243

వ్యా. మానయోగ్యామ్ = మానముయొక్క అభ్యాసమును ("యోగ్యా" శబ్దమునకు ప్రాక్టీసుచేయుట అని యర్థము) కరోమి ఇతి = చేయుదును అను అభిప్రాయముతో, బాలా = బాల, భ్రూభఙ్గజిహ్మాక్షీ = కనుబొమ్మల విరుపుచే వక్రమైన నేత్రములు కలదై, స్ఫురితాధరా = కదలుచున్న అధరోష్ఠము కలదై, ప్రియస్థానస్థితామ్ = ప్రియుని స్థానమునందున్న, అనగా ప్రియుడుగా కల్పింపబడిన, సఖీమ్ = సఖురాలిని, పశ్యతి = చూచుచున్నది.

అవసరము కలిగినప్పుడు ప్రియునిపై ఎట్లు అలుగవలెనో అభ్యాసము చేయుచున్నది. ఇచట దర్శనక్రియచే సఖురాలు నిష్పాదింపబడుట లేదు. ఆమెయందు వికార మేదియు కలిగింపబడుటలేదు. అందుచే సఖి ప్రాప్యకర్మ. ఇచట దర్శన క్రియను బట్టియే బాల హేతు వగుచున్నది. కావున ఇది ప్రాప్యకర్మకహేతుగత మగు హేత్వలంకారము.

అవ. జ్ఞాపక హేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. గతోఽస్తమర్కో భాతీన్దుర్యాన్తి వాసాయ పక్షిణః
ఇతీదమపి సాధ్వేవ కాలావస్థానివేదనే. 244

వ్యా. అర్కః = సూర్యుడు, అస్తంగతః = అస్తమించినాడు. ఇన్దుః = చంద్రుడు, భాతి = ప్రకాశించుచున్నాడు. పక్షిణః = పక్షులు, వాసాయ = నివాసస్థానమునకు, యాన్తి = వెళ్ళుచున్నవి. ఇతి = ఇట్లు, కాలావస్థానివేదనే = సంధ్యాకాలమును సూచించుటకై, ఇదమపి = ఈ విధ మగు వర్ణనము కూడ, సాధ్వేవ = చమత్కారజనకమే.

"ఇపుడు సంధ్యాకాల మైనది" అని చెప్పుటకంటె పై విధముగ చెప్పి, "సంధ్యా సమయ మైనది" అని సూచించుటలో చమత్కార మున్న దని. అర్థము సూర్యాస్తగమనాదులచే సంధ్యాసమయము సూచింపబడుచున్నది. గాన ఇది (సూర్యాస్తగమనాదికము) జ్ఞాపక హేతువు.

భామహుడు ఈ పద్యపూర్వార్ధమునే ఉదాహరించి "ఇది కూడ ఒక అలంకారమేనా? దీనిని వార్తాలాపమందురు" అని చెప్పినాడు :-

గతోऽస్తమర్కో భాతీన్దుర్యాన్తి వాసాయ పక్షిణః
ఇత్యేవమాది కిం కావ్యం వార్తా మేతాం ప్రచక్షతే (కా. అ. 2.87).

మూ. అవధ్యైరిన్దుపాదానామసాధ్యైశ్చన్దనామ్భసామ్
దేహోష్మభిః సుబోధం తే సఖి కామాతురం మనః. 245

వ్యా. సఖి = ఓ సఖురాలా! ఇన్దుపాదానామ్ = చంద్రకిరణములకు (లచే) అవధ్యైః = నశింపచేయ శక్యము కానివియు, చన్దనామ్భసామ్ = చందనోదకములకు (లచే) అసాధ్యైః = చికిత్స చేయుటకు శక్యము కానివియు అగు, దేహోష్మభిః = దేహము యొక్క సంతాపములచే, తే = నీ యొక్క, మనః = మనస్సు, కామాతురమ్ = కామముచే పీడిత మైనదిగా, సుబోధమ్ = సులభముగ తెలియ దగినది.

పూర్వ శ్లోకములో జ్ఞాప్య మగు సంధ్యా సమయమును వాచ్యము చేయక కేవలము సూచించుట జరిగినది. ఈ ఉదాహరణమున దేహసంతాపముచే జ్ఞాప్య మగు మదనబాధ వాచ్య మైనది.

మూ. ఇతి లక్ష్యాః ప్రయోగేషు రమ్యా జ్ఞాపక హేతవః
అభావహేతవః కేచిద్ వ్యాహ్రియన్తే మనోహరాః. 246

వ్యా. ఇతి = ఈ విధముగా, రమ్యాః = మనోహరమైన, జ్ఞాపక హేతవః = జ్ఞాపక హేతువులు, ప్రయోగేషు = ప్రయోగములలో, లక్ష్యాః = తెలిసికొన దగినవి. మనోహరాః = చమత్కారజనకము లగు కేచిత్ = కొన్ని, అభావ హేతవః = అభావహేతువులు, అభావరూపములగు హేతువులు, వ్యాహ్రియన్తే = చెప్పబడుచున్నవి.

ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యన్తాభావము, అన్యోన్యాభావము అని అభావము నాలుగు విధములు గాన అభావజ్ఞాపక హేతువు కూడ నాలుగు విధములుగ ఉండును. ఘటమును తయారు చేయుటకు పూర్వము ఘటము లేదు. ఆ అభావమునకు ఘటప్రాగభావ మని పేరు. తయారైన ఘటము బ్రద్దలై పోయినచో, నశించినచో, అప్పుడు కూడ ఘటము లేదు. ఈ అభావమునకు ప్రధ్వంసాభావ మని పేరు. చెవులపిల్లికి కొమ్ములు ఉండవు. ఈ అభావమునకు అత్యన్తాభావ మని పేరు. ఘటము పటము కంటే భిన్నము, పటము ఘటము కంటే భిన్నము. ఈ పరస్పర భేదమునకు అన్యోన్యాభావ మని పేరు.

అవ. ప్రాగభావహేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. అనభ్యాసేన విద్యానామసంసర్గేణ ధీమతామ్
అనిగ్రహేణ చాక్షాణాం జాయతే వ్యసనం నృణామ్. 247

వ్యా. విద్యానామ్ = విద్యలయొక్క, అనభ్యాసేన = అభ్యాసము చేయకపోవుటచేతను, ధీమతామ్ = బుద్ధిమంతులయొక్క, అసంసర్గేణ = సహవాసము చేయకపోవుటచేతను, అక్షాణామ్ = ఇంద్రియములయొక్క, అనిగ్రహేణ = నిగ్రహము లేకపోవుట చేతను, నృణామ్ = మానవులకు, వ్యసనమ్ = దుర్వ్యసనము, జాయతే = కలుగును. 'వ్యసనమ్' అనునానికి క్లేశము అనికూడ అర్థము చెప్పవచ్చును. ఇచట అభ్యాసాదిప్రాగభావము వ్యసనహేతువుగ వర్ణింప పడినది.

అవ. ప్రధ్వంసాభావహేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. గతః కామకథోన్మాదో గలితో యౌవనజ్వరః
గతో మోహశ్చ్యుతా తృష్ణా కృతం పుణ్యాశ్రమే మనః. 248

వ్యా. కామకథోన్మాదః = రతివిలాసలను గూర్చిన చర్చలు చేయుటయందలి ఉన్మాదము, గతః = పోయినది. యౌవనజ్వరః = యౌవనజ్వరము, గలితః = తొలగిపోయినది. తృష్ణా = దురాశ, చ్యుతా = జారిపోయినది.

పుణ్యాశ్రమే = పవిత్రమైన సన్యాసాశ్రమమునందు, మనః = మనస్సు, కృతమ్ = చేయబడినది.

ఇచట ఉన్మాదాదుల ప్రధ్వంసాభావము సంన్యాసాశ్రమ స్వీకారమునందు హేతువుగ వర్ణింపబడినది గాన ప్రధ్వంసాభావహేత్వలంకారము.

అవ. అన్యోన్యాభావహేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. వనాన్యమూని న గృహాణ్యేతా నద్యో న యోషితః
మృగా ఇమే న దాయాదాస్తన్మే నన్దతి మానసమ్. 249

వ్యా. ఇమాని = ఈ, వనాని = వనములు, గృహాణి న = గృహములు కావు. ఏతాః = ఈ, నద్యః = నదులు, యోషితః = స్త్రీలు, న = కారు. ఇమే = ఈ, మృగాః = మృగములు, దాయాదాః న = దాయాదులుకారు. తత్ = ఆ కారణమువలననే, మే = నాయొక్క, మానసమ్ = మనస్సు, నన్దతి ఆనందించుచున్నది.

గృహములు చిత్తోద్వేగమును కలిగించును. స్త్రీలు మనస్సుకు వికారము కలిగింతురు. దాయాదులు అసూయాగ్రస్తులై పీడింతురు. ఈ వనాదులు అట్టి గృహాదులకంటె భిన్నములైనవగుటచే, నా మనస్సు శాంతియుతమై ఆనందించు చున్నది. ఇచట వనగృహాదుల అన్యోన్యాభావము ఆనందహేతువుగ వర్ణింపబడినది గాన అన్యోన్యాభావహేత్వలంకారము.

అవ. అత్యన్తాభావహేతూదాహరణము చెప్పుచున్నాడు :-

మూ. అత్యన్తమసదార్యాణామనాలోచితచేష్టితమ్
అతస్తేషాం వివర్ధన్తే సతతం సర్వసమ్పదః. 250

వ్యా. ఆర్యాణామ్ = సత్పురుషులకు, అనాలోచితచేష్టితమ్ = ఆలోచించకుండగా పనులచేయుట అనునది, అత్యన్తమ్ = ఏ మాత్రము కూడ, అసత్ = లేనిది. అతః = ఆ కారణమువలన, తేషామ్ = వారియొక్క, సర్వ

సంపదః = సకలసంపదలును, సతతమ్ = ఎల్లప్పుడును, వివర్ధంతే = వృద్ధి పొందును.

ఇచట అవిమృశ్యకారిత్వాత్యన్తాభావము సర్వసంపదభివృద్ధికి హేతువుగ చెప్పబడినది గాన అత్యన్తాభావహేత్వలంకారము.

అవ. ఇంతవరకు భావప్రతియోగికము లగు అభావముల హేతుత్వము చెప్పబడినది. ఇపుడు అభావప్రతియోగిక మగు అభావముయొక్క హేతుత్వము చెప్పబడుచున్నది. ఘటము లేదు అని చెప్పినచో అది ఘటాభావము ఏది లేదు అని చెప్పుదుమో దాని అభావమున అది ప్రతియోగి. ఘటాభావమున ఘటము ప్రతియోగి. పై నాలుగు ఉదాహరణములలో చెప్పిన అభావములలో భావపదార్థములు (అభ్యాసము మొదలగునవి) ప్రతియోగులు. "తస్య అవివేకః నాస్తి" 'ఆతనికి వివేకము లేకపోవుట లేదు' అని చెప్పినపుడు ఈ అభావమున ప్రతియోగి వివేకాభావము, దీనిని అభావప్రతియోగికాభావ మందురు. ఏ అభావమునందు మరి యొక అభావము ప్రతియోగియో అది అని అర్థము. ఇపుడట్టి అభావప్రతియోగికాభావము హేతువుగ చెప్పబడుచున్నది.

మూ. ఉద్యానసహకారాణామనుద్భిన్నా న మఞ్జరీ
దేయః పథికనారీణాం సతిలః సలిలాఞ్జలిః. 251

వ్యా. ఉద్యాన సహకారాణామ్ = ఉద్యానవనమునందలి చూతవృక్షముల, మఞ్జరీ = పుష్పగుచ్ఛము, అనుద్భిన్నా = వికసించనిది, న = కాదు. పథికనారీణామ్ = పాంథులస్త్రీలకు, సతిలః = తిలలతో కూడిన, సలిలాఞ్జలిః = జలాంజలి, దేయః = ఈయ దగి యున్నది. ఇచట చూతగుచ్ఛముల వికాసాభావాభావము (వికాసము) పథికస్త్రీ మరణమునకు హేతువుగ చెప్పబడినది గాన ఇది అభావాభావహేత్వలంకారము.

మూ. ప్రాగభావాదిరూపస్య హేతుత్వమిహ వస్తునః
భావాభావస్వరూపస్య కార్యస్యోత్పాదనం ప్రతి. 252

వ్యా. అత్ర = పూర్వోక్తోదాహరణమునందు, ప్రాగభావాదిరూపస్య = ప్రాగభావాదిరూపమగు, వస్తునః = వస్తువునకు, భావాభావస్వరూపస్య = భావ

స్వరూపము అభావస్వరూపము అగు, కార్యస్య = కార్యముయొక్క, ఉత్పాదనం ప్రతి = ఉత్పాదనమును గూర్చి, హేతుత్వమ్ = కారణత్వము ప్రతిపాదింపబడినది.

ఈ ఉదాహరణములలో అభావము ఒక చోటి భావకార్యమునకు కారణముగ చెప్పబడినది, మరియొక చోట అభావరూపకార్యమునకు కారణముగ చెప్పబడినది విద్యాధ్యయనాభావము వ్యసనరూపభావపదార్థమునకు హేతువుగ వర్ణింపబడినది ఆమ్రమంజరీ వికాసాభావాభావము పథికస్త్రీల అభావమునకు హేతువుగ వర్ణింపబడినది

అవ. ఇంతవరకును కారక - జ్ఞాపక హేతువులను నిరూపించి ఇపుడు కొన్ని విచిత్రహేతుభేదములను నిరూపించుచున్నాడు :-

మూ. దూరకార్యస్తత్సహజః కార్యానన్తరజస్తథా
అయుక్తయుక్తకార్యౌ చేత్యసఙ్ఖ్యాశ్చిత్రహేతవః. 253

వ్యా. దూరకార్యః = దూరమైన కార్యము కలది, తత్సహజః = కార్యముతో పాటు పుట్టినది, కార్యానన్తరజః = కార్యము తరువాత పుట్టినది, తథా = మరియు, అయుక్తయుక్తకార్యౌచ = అయుక్తమైన కార్యము కలది, యుక్తమైన కార్యము కలది, ఇతి = అని, అసఙ్ఖ్యాః = అసంఖ్యాకములైన, చిత్రహేతవః = చిత్రమైన హేతువులు, ఉన్నవి.

అవ. వాస్తవమున హేతువనునది కార్యమునకు దగ్గరగ వెనుకనే ఉండవలెను. దూరముగ నున్నది గాని, కార్యముతో సమానకాలికమైనది గాని, కార్యము తరువాత వచ్చునది గాని హేతువు కాజాలదు. ఐనను వీటి హేతుత్వము గౌణము, అనగా ఆరోపితము అని చెప్పుచున్నాడు.

మూ. తేఽమీ ప్రయోగమార్గేషు గౌణవృత్తివ్యపాశ్రయాః
అత్యన్తసున్దరా దృష్టాస్తదుదాహృతయో యథా. 254

వ్యా. గౌణవృత్తివ్యపాశ్రయాః = గౌణవృత్తిని బట్టి ఏర్పడిన, అత్యన్తసున్దరాః = మిక్కిలి సుందరములైన, తే అమీ = ఈ ఈ చిత్రహేతువులు,

ప్రయోగమార్గేషు = కవిప్రయోగములయందు, దృష్టాః = చూడబడినవి. తదుదాహృతయః = వాటి ఉదాహరణములు, యథా = ఎట్లనగా-

అవ. దూరకార్యహేతువును ఉదాహరించుచున్నాడు :—

మూ. త్వదపాఙ్గాహ్వయం జైత్రమనఙ్గాస్త్రం యదఙ్గనే
ముక్తం తదన్యత స్తేన సోఽస్మ్యహం మనసి క్షతః. 255

వ్యా. హే అఙ్గనే = ఓసుందరాంగీ ! త్వదపాఙ్గాహ్వయమ్ = నీ క్రీగంటిచూపు అనెడు, యత్ = ఏ, జైత్రమ్ = జయస్వభావము గల, అస్త్రమ్ = అస్త్రముకలదో. తత్ = అది, అన్యతః = మరియొక వైపు, ముక్తమ్ = విడువబడినది. తేన = దానిచేత, అహమ్ = నేను, మనసి = మనస్సునందు, క్షతః = కొట్టబడినవాడనై, అస్మి = అయితిని.

ఒక వైపు విసరిన అస్త్రము ఎచటనో మరి యొక వైపున దూరముగ నున్న లక్ష్యమునందు ప్రహారరూప మగు కార్యమును చేసినట్లు వర్ణించుటచే ఇది దూరకార్యహేతువు.

అవ. కార్యసహజహేతువును ఉదాహరించుచున్నాడు :—

మూ. ఆవిర్భవతి నారీణాం వయః పర్యస్తశైశవమ్
సహైవ వివిధైః పుంసామఙ్గజోన్మాద విభ్రమైః. 256

వ్యా. నారీణామ్ = స్త్రీలయొక్క, పర్యస్తశైశవమ్ = తొలగింపబడిన శైశవముగల, వయః = వయస్సు, యౌవనము, పుంసామ్ = పురుషులయొక్క వివిధైః = అనేకవిధములైన, అఙ్గజోన్మాదవిభ్రమైః = మన్మథోన్మాదమువలన కలిగిన విలాసలతో, సహైవ = కలిసియే, ఆవిర్భవతి = ఆవిర్భవించుచున్నది.

యౌవనము కారణము; మన్మథవిలాసలు కార్యము. కారణము ముందు పుట్టవలెను, దాని కార్యము తరువాత పుట్టవలెను. రెండును కలిసియే పుట్టినట్లు వర్ణించుటచే కార్యసహజ హేతువు.

అవ. కార్యానంతరజన్య హేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. పశ్చాత్పర్యస్య కిరణానుదీర్ణం చన్ద్రమణ్డలమ్
ప్రాగేవ హరిణాక్షీణాముదీర్ణో రాగసాగరః. 257

వ్యా. కిరణాన్ = కిరణములను, పర్యస్య = అంతటను వ్యాపింపచేసి, చన్ద్రమణ్డలమ్ = చంద్రమండలము, పశ్చాత్ = తరువాత, ఉదీర్ణమ్ = ఉదయించినది. హరిణాక్షీణామ్ = స్త్రీలయొక్క, రాగసాగరః = అనురాగసముద్రము, ప్రాగేవ = చంద్రోదయమునకు పూర్వమే, ఉదీర్ణః = ఉప్పొంగినది చంద్రోదయమను కారణమునకు పూర్వమే రాగసాగరసముజ్జృంభణ మను కార్యము జనించినట్లు వర్ణింపబడినది గాన ఇది కార్యానంతర జహేతువుకు ఉదాహరణము.

అవ. అయుక్తకార్య మను హేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. రాజ్ఞాం హస్తారవిన్దాని కుడ్మలీకురుతే కుతః
దేవత్వచ్చరణద్వన్ద్వరాగ బాలాతపః స్పృశన్. 258

వ్యా. హే దేవ = ఓ రాజా ! త్వచ్చరణద్వన్ద్వరాగ బాలాతపః = నీ పాదద్వయమునందలి ఎరుపు అనెడు నీరు టెండ, రాజ్ఞామ్ = రాజులయొక్క, హస్తారవిన్దాని = హస్తపద్మములను, స్పృశన్ = స్పృశించుచు, కుతః = ఎందువలన, కుడ్మలీకురుతే = మొగ్గలనుగా చేయుచున్నది.

బాలాతపస్పర్శచే పద్మములు వికసించవలెను కాని ముకుళీభవించకూడదు. కాని ఇచట హస్త పద్మములు ముకుళీభవించుట యను అయుక్త కార్యము కలిగి నట్లు చెప్పబడినది గాన ఇది అయుక్త కార్యహేతువు.

అవ. యుక్తకార్యహేతువును ఉదాహరించుచున్నాడు :-

మూ. పాణిపద్మాని భూపానాం సజ్కోచయితుమీశతే
త్వత్పాదనఖచన్ద్రాణామర్చిషః కున్దనిర్మలాః. 259
ఇతి హేతువికల్పానాం దర్శితా గతిరీదృశీ.

ఇతి హేతు చక్రమ్

వ్యా. త్వత్పాదనఖ చన్ద్రాణామ్ = నీ పాదనఖము లనెడు చంద్రుల యొక్క, కున్దనిర్మలాః = మల్లిపూవుల వలె నిర్మల మైన, అర్చిషః = కాంతులు, భూపానామ్ = రాజులయొక్క, పాణిపద్మాని = హస్త పద్మములను, సఙ్కోచయితుమ్ = సంకోచింపచేయుటకు, ఈశతే = సమర్థ మగు చున్నవి. చంద్ర కాంతులు కమల సంకోచరూపకార్యమును చేయుట యుక్తమే గాన ఇది యుక్త హేతూదాహరణము ఇతి = ఈ విధముగా, హేతువికల్పానామ్ = హేత్వలంకార భేదముల, ఈదృశీ = ఈ విధ మగు, గతిః = పద్ధతి, దర్శితా = చూపబడినది.

అవ. సూక్ష్మాలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. ఇఙ్గితాకారలక్ష్యోఽర్థః సౌక్ష్మ్యాత్ సూక్ష్మఇతి స్మృతః. 260

కదా నౌ సఙ్గమో భావీత్యాకీర్ణే వక్తుమక్షమమ్
అవేత్య కాన్తమబలా లీలాపద్మం న్యమీలయత్, 261

వ్యా. సౌక్ష్మ్యాత్ = అతినిగూఢమైనదగుటచే, ఇఙ్గితాకార లక్ష్యః = ఇంగితముచేతను (శరీరచేష్టాదులచేతను) ఆకారముచేతను ఊహింపదగిన, అర్థః = అర్థము, సూక్ష్మ ఇతి = సూక్ష్మము అని, స్మృతః = చెప్పబడినది. అబలా = సుందరి, కాన్తమ్ = ప్రియుని, నౌ = మన ఇరువురియొక్క, సఙ్గమః = సంగమము, కదా = ఎప్పుడు, భావీ = కాగలదు, ఇతి = అని, ఆకీర్ణే = జనులతో నిండిన ప్రదేశమునందు, వక్తుమ్ = అడుగుటకు, అక్షమమ్ = అసమర్థునిగా, అవేత్య = తెలిసికొని, లీలాపద్మమ్ = చేతిలో విలాసార్థమై ధరించిన పద్మమును, న్యమీలయత్ = ముడుచుకొనునట్లు చేసెను.

ఇచట ఇంగితముచే అవగా కమల సంకోచనరూపచేష్టచే, మన సమాగమము రాత్రి కాగలదు అని సూచింపబడినది గాన ఇది ఇంగితముచే సూక్ష్మార్థ సూచనరూప మగు సూక్ష్మాలంకారము.

మూ. పద్మసంమీలనాదత్ర సూచితో నిశి సఙ్గమః
ఆశ్వాసయితుమిచ్ఛన్త్యా ప్రియమఙ్గజపీడితమ్. 262

వ్యా. అత్ర = ఇచట, అఙ్గజపీడితమ్ = మన్మథునిచే పీడితుడైన, ప్రియమ్ = ప్రియుని, ఆశ్వాసయితుమ్ = ఊరడించుటకు, ఇచ్ఛన్త్యా = కోరుచున్న నాయికచేత, పద్మసంమీలనాత్ = పద్మమును ముకులీభవింపచేయుటచే. నిశి = రాత్రియందు, సఙ్గమః = సంగమము, సూచితః = సూచింపబడినది.

పద్మము సాయంసమయమున ముకుళీభవించును గాన అదియే సమాగమ సమయమని సూచింపబడినది అని అర్థము.

అవ. ఆకారలక్ష్య మగు సూక్ష్మమును చెప్పుచున్నాడు :-

**మూ. మదర్పితదృశ స్తస్యా గీతగోష్ఠ్యామవర్ధత**
**ఉద్దామరాగతరలా ఛాయా కాపి ముఖామ్బుజే, 263**

వ్యా. గీతగోష్ఠ్యామ్ = సంగీతగోష్ఠియందు, మదర్పిత దృశః = నాపై నిలుపబడిన దృష్టి గల, తస్యాః = ఆమె యొక్క, ముఖామ్బుజే = ముఖపద్మమునందు, ఉద్దామరాగతరలా = తీవ్రమైన అనురాగముతో తొణికిసలాడుచున్న, కాపి = ఒకానొక, వర్ణింపరాని. ఛాయా = కాంతి, అవర్ధత = వృద్ధిపొందెను.

ఇచట మోమునందలి కవలికలచే రాగము సూచింపబడినది గాన ఇది ఆకారలక్ష్య సూక్ష్మము.

**మూ. ఇత్యనుద్భిన్నరూపత్వాద్రత్యుత్సవమనోరథః**
**అనుల్లఙ్ఘ్యైవ సూక్ష్మత్వమభూదత్ర వ్యవస్థితః, 264**

(ఇతి సూక్ష్మ చక్రమ్)

వ్యా. ఇతి = ఈ విధముగా, అత్ర = ఇచట, రత్యుత్సవ మనోరథః = సురతోత్సవమునందు అభిలాష, అనుద్భిన్నరూపత్వాత్ = స్పష్టముగా గోచరించని రూపము కలదగుటచే, సూక్ష్మత్వమ్ = సూక్ష్మత్వమును, అనుల్లఙ్ఘ్యైవ = అతిక్రమింపకుండగనే, అనగా అస్ఫుటముగనే, వ్యవస్థితః అభూత్ = ఉండిపోయినది.

అవ. లేశాలంకారమును నిరూపించుచున్నాడు. లేశాలంకారమునకే 'లవ' మని నామాన్తరము మొదట చెప్పబడినది (శ్లో॥ 5)

**మూ. లేశో లేశేన నిర్భిన్నవస్తురూపనిగూహనమ్**
**ఉదాహరణ ఏవాస్య రూపమావిర్భవిష్యతి. 265**

వ్యా. లేశేన = స్వల్పముగా, నిర్భిన్న వస్తురూపనిగూహనమ్ = తెలిసి పోయిన వస్తు స్వరూపముయొక్క(ను) కప్పిపుచ్చుట, లేశః = లేశాలంకారము. లేదా 'లేశేన' అను పదమునకు 'ఏదియో ఒక వంకచే' అని యర్థము. కారణాంతరముచే తెలిసిన విషయమును ఏదైన ఒక మిషచే కప్పిపుచ్చుట అని అర్థము. అస్య = దీని యొక్క, స్వరూపమ్=స్వరూపము, ఉదాహరణే ఏవ = ఉదాహరణమునందే, ఆవిర్భవిష్యతి=స్పష్టమగును.

అవ. ఇతరులకు తెలిసిపోయిన దనుకొన్న విషయమును, భయము చేత గాని, లజ్జచేత గాని కప్పిపుచ్చుటకై ప్రయత్నింతురు. భయముచే కప్పి పుచ్చుటకు ఉదాహరణమును చూపుచున్నాడు :-

**మూ. రాజకన్యానురక్తం మాం రోమోద్భేదేన రక్షకాః**
**అవగచ్ఛేయురా జ్ఞాతమహో శీతానిలం వనమ్. 266**

వ్యా. రాజపుత్రికను రహస్యముగ కలియుటకై వచ్చిన ఒక యువకుడు అనుకొనుచున్నవాక్య మిది. రోమోద్భేదేన = రోమాంచముచేత, మాం = నన్ను, రాజకన్యానురక్తమ్ = రాజకన్యయందు అనురాగము కలవానినిగా, రక్షకాః = రక్షకులు, అవగచ్ఛేయుః = తెలిసికొందురు. ఇట్టి పరిస్థితిలో ఏమి చేయవలెను? అని ఆలోచించి చెప్పుచున్నాడు. ఆః = ఆహా మంచి ఉపాయము తోచినది! వనమ్ = ఈ ఉద్యానవనము, శీతానిలమ్ = చల్లని గాలి కలది. అహో = ఏమి ఆశ్చర్యము!

ఇచట శీతానిలస్పర్శముచే రోమాంచము కలిగిన దని చెప్పి తన రాజ కన్యానురాగమును కప్పిపుచ్చుకొనుటచే ఇది లేశాలంకారము.

అవ. లజ్జచేత కప్పిపుచ్చుటకు ఉదాహరించుచున్నాడు :-

మూ. ఆనన్దాశ్రు ప్రవృత్తం మే కథం దృష్ట్వైవ కన్యకామ్
అక్షి మే పుష్పరజసా వాతోద్ధూతేన దూషితమ్. 267

వ్యా. కన్యకామ్ = వివాహమండపములోనికి వచ్చిన కన్యకను, దృష్ట్వైవ = చూడగనే, మే = నాకు, ఆనన్దాశ్రు = ఆనంద బాష్పము, కథం ప్రవృత్తమ్ = ఏల ప్రవర్తించుచున్నది. ఈ విధముగ ఆనందాశ్రువులు వచ్చుచున్నవే! ఏమి చేయవలెను అని మనస్సులో అనుకొని, అందుకు కారణమును కప్పిపుచ్చుటకు పైకి చెప్పుచున్నాడు. వాతోద్ధూతేన = వాయువుచే కదల్చబడిన, పుష్పరజసా = పుష్పపరాగముచేత, మే = నా యొక్క, అక్షి = నేత్రము, దూషితమ్ = దూషితమైనది.

ఇచట ఆనందాశ్రువులను పుష్పపరాగముకంటిలో పడుటచే కలిగినట్లు చెప్పి కప్పిపుచ్చుటచే ఇది లజ్జాకృతనిగూహనరూప మగు లేశము

మూ. ఇత్యేవమాదిస్థానేఽయమలఙ్కారోఽతిశోభతే
లేశమేకే విదుర్నిన్దాం స్తుతిం వా లేశతః కృతామ్, 268

వ్యా. ఇతి = ఈ విధముగా ఏవమాదిస్థానే = ఇట్టి స్థానమునందు, అయమ్ = ఈ, అలఙ్కారః = అలంకారము, అతిశోభతే = మిక్కిలి శోభించును. లేశతః = మిషచేత, కృతామ్ = చేయబడిన నిన్దామ్ = నిందనుగాని, స్తుతింవా = స్తుతినిగాని, లేశమ్ = లేశాలంకారమునుగా, ఏకే = కొందరు, విదుః = తెలుసుకొనుచున్నారు. అంగీకరింతురు. దీనినే (ఈ రెండవ లేశమునే) వ్యాజస్తుతి యని అర్వాచీను లంగీకరించినారు.

అవ. స్తుతివ్యాజముచే నిందారూప మగు లేశాలంకారమును ఉదాహరించుచున్నాడు :-

మూ. యువైష గుణవాన్రాజా యోగ్యస్తే పతిరూర్జితః
రణోత్సవే మనః సక్తం యస్య కామోత్సవాదపి, 269

వ్యా. స్వయంవర మండపమునకు వచ్చిన కన్యతో సఖి పలికిన మాట లివి. యువా = యువకుడును, గుణవాన్ = గుణవంతుడును, ఊర్జితః = తేజః శాలియు అగు, ఏషః రాజా = ఈ రాజు. తే = నీకు, యోగ్యః పతిః = తగిన భర్త. యస్య = ఎవని యొక్క, మనః = మనస్సు, కామోత్సవాదపి = సుర తోత్సవముకంటె, రణోత్సవే = యుద్ధోత్సవమునందు, సక్తమ్ = అధికముగ ఆసక్తి కలదో.

మూ. వీరోత్కర్ష స్తుతిర్నిన్దైవాస్మిన్ భావనివృత్తయే
కన్యాయాః కల్పతే భోగాన్నిర్విविక్షో ర్నిరన్తరమ్. 270

వ్యా. వీరోత్కర్ష స్తుతిః = వీరోత్కర్షయొక్క స్తోత్రము, నిన్దైవ = నిందారూపమైనదే అగుచు, నిరన్తరమ్ = అవిచ్ఛిన్నముగా, భోగాన్ = భోగములను, నిర్విविక్షోః = అనుభవించుటకు అభిలషించుచున్న, కన్యాయాః = కన్యకు, అస్మిన్ = ఈ రాజుయందు, భావనివృత్తయే = ప్రేమభావము మరలుటకు, కల్పతే = సమర్థమగుచున్నది.

ఆ వధువు ఈ రాజును వివాహ మాడకుండుటకై ఈమె స్తుతివ్యాజమున నింద చేసిన దని భావము.

అవ. నిందావ్యాజముచే స్తుతిరూప మగు లేశమును ఉదాహరించు చున్నాడు.

మూ. చపలో నిర్దయశ్చాసౌ జనః కిం తేన మే సఖి
ఆగః ప్రమార్జనాయైవ చాటవో యేన శిక్షితాః. 271

వ్యా. ప్రియుని విషయమున బిగువు చూప వలె నని బోధించుచున్న సఖితో నాయిక పలికిన మాటలివి. హేసఖి = ఓ సఖురాలా, అసౌ జనః = ఈ జనుడు, ప్రియుడు, చపలః = చపలస్వభావము కలవాడు, నిర్దయశ్చ = దయ లేనివాడు కూడ. యేన = ఎవనిచే, చాటవః = చాటు వాక్యములు, ప్రియముగా మాటలాడు మాటలు, ఆగః ప్రమార్జనాయైవ = తన అపరాధమును తొలగించు

కొనుటకు మాత్రమే, శిక్షితాః = అభ్యసింపబడినవో, తేన = వానితో, వాని విషయమున, కిమ్ = ఏమి చేయశక్యమగును ?

మూ. దోషాభాసో గుణః కోఽపి దర్శితశ్చాటుకారితా
మానం సఖీజనోద్దిష్టం కర్తుం రాగాదశక్తయా. 272

(ఇతి లేశచక్రమ్)

వ్యా. సఖీజనోద్దిష్టమ్ = సఖీజనముచే ఉపదేశింపబడిన, మానమ్ = ప్రణయ కోపమును, కర్తుమ్ = ప్రియుని విషయమున చూపుటకు, రాగాత్ = అతనిపై నున్న అనురాగాతిశయమువలన, అశక్తయా = అసమర్థురాలైన నాయికచే, చాటుకారితా = ప్రియవాక్యములను పలుకుట అనెడు, గుణః = స్త్రీలకు ఇష్టమైన ప్రియునియందలి గుణము, దోషాభాసః = దోషాభాసముగా, వాస్తవమున దోషము కాకపోయినను దోషముగ చెప్పబడినది దోషాభాసము. దర్శితః = చూపబడినది.

అవ. క్రమాలంకారమును నిరూపించుచున్నాడు :

మూ. ఉద్దిష్టానాం పదార్థానామనూద్దేశో యథాక్రమమ్
యథాసఙ్ఖ్యమితి ప్రోక్తం సంఖ్యానం క్రమ ఇత్యపి. 273

వ్యా. ఉద్దిష్టానాం = మొదటపేర్కొనబడిన, పదార్థానామ్ = పదార్థములయొక్క (లను) యథాక్రమమ్ = అదే క్రమమున, అనూద్దేశః = మరల చెప్పుట, యథాసఙ్ఖ్యమితి = యథాసంఖ్య మనియు, సంఖ్యానమ్ = సఖ్యానమనియు, క్రమఇత్యపి = క్రమాలంకార మనియు, ప్రోక్తమ్ = చెప్పబడినది. కొన్ని విషయములను మొదట ఒక వరుసలో చెప్పి అవి మరి కొన్ని విషయయములతో అదే వరుసలో అన్వయించునట్లు చెప్పినచో దానికి యథాసంఖ్యము లేదా సంఖ్యానము లేదా క్రమము అని పేరు.

మూ. ధ్రువం తే చోరితా తన్వి స్మితేక్షణముఖద్యుతిః
స్నాతుమమ్భః ప్రవిష్టాయాః కుముదోత్పలపఙ్కజైః. 274

వ్యా. హే తన్వి = ఓ తనుగాత్రీ, స్నాతుమ్ = స్నానముచేయుటకు, అమ్భః = ఉదకమును, ప్రవిష్టాయాః = ప్రవేశించిన, తే = నీయొక్క, స్మితేక్షణ ముఖద్యుతిః = చిరునవ్వు, నేత్రములు, ముఖము = వీటికాంతి, కుముదోత్పల పఙ్కజైః = తెల్లకలువలచేతను, నల్లకలువలచేతను, పద్మములచేతను, చోరితా = అపహరింపబడినది. ధ్రువమ్ = సత్యము.

స్మితద్యుతిని కుముదములు, ఈక్షణద్యుతిని ఉత్పలములు, ముఖద్యుతిని పంకజములు అపహరించినవి అని అర్థము. ఒక క్రమములో చెప్పిన స్మిత – ఈక్షణ – ముఖములు అదే క్రమములో కుముద – ఉత్పల – పంకజములతో అన్వయించుచున్నవి గాన యథాసంఖ్యము.

అవ. ప్రేయో రసవదూర్జస్వినామకము లగు మూడు అలంకారములను నిరూపించుచున్నాడు :–

**మూ. ప్రేయః ప్రియతరాఖ్యానం రసవద్రసపేశలమ్**
**ఊర్జస్విరూఢాహఙ్కారం యుక్తోత్కర్షం చ తత్త్రయమ్.**

వ్యా. ప్రియతరాఖ్యానమ్ = అత్యంతము ప్రియమైన విషయమును చెప్పుట, ప్రేయః = ప్రేయోలంకారము. దీనికి కొందరు వ్యాఖ్యాతలు దేవాది విషయకరత్యాది భావములను, ఇతరము లగు నిర్వేదాదిభావములను ప్రకటించుట ప్రేయోలంకారమని అర్థము చెప్పినారు. అది అర్వాచీనాలంకారికుల లక్షణమును దృష్టిలో నుంచుకొని చెప్పినట్లు కనబడును. కాని, వక్తకును, శ్రోతకును అత్యంతప్రియ మగు విషయమును చెప్పుట ప్రేయోలంకార మని మాత్రమే దండి అభిప్రాయమై యుండును. దండి ఇచ్చిన ఉదాహరణాదులను బట్టి, దేవతాదుల విషయమున రతిని ఆతడు ప్రీతి యన్నట్లును, అట్టి ప్రీతిరూపభావావిష్కరణమును ప్రేయోలంకార మన్నట్లును ఊహించుటకు వీలున్నది. రసపేశలమ్ = రసముచే సుందరమైనది, రసవత్ = రసవదలంకారము. రూఢాహఙ్కారమ్ = అత్యధిక మగు గర్వమును బోధించునది, ఊర్జస్వి = ఊర్జస్విఅలంకారము. తత్త్రయమ్ = ఆ త్రయము కూడ, యుక్తోత్కర్షమ్ = వాచ్యశోభాకరత్వరూప మగు ఉత్కర్షతో కూడినది.

"వాచ్యశోభాకరాన్ధర్మానలఙ్కారాన్ ప్రచక్షతే" అని వెనుక చెప్పన విధమున కావ్యశోభకు హేతువు లగుటచే ఈ మూడును అలంకారములే అని యర్థము

అవ. ప్రేయోలంకారమును ఉదాహరించుచున్నాడు :-

**మూ. అద్య యా మమ గోవిన్ద జాతా త్వయి గృహాగతే**
**కాలేనైషా భవేత్ ప్రీతిస్తవైవాగమనాత్ పునః.** 276

వ్యా. ఇంటికి వచ్చిన శ్రీకృష్ణునితో విదురుడు పలికిన మాట లివి. **హే** గోవిన్ద = ఓ శ్రీకృష్ణా, త్వయి = నీవు, అద్య = నేడు, గృహాగతే = గృహమునకు వచ్చినవాడ వగుచుండగా, మమ = నాకు, యా = ఏ ఆనందము, జాతా = కలిగినదో, ఏషా = ఈ, ప్రీతిః = ఆనందము, కాలేన = కాలానంతరమున, పునః = మరల, తవ = ఆగమనాత్ ఏవ = నీ రాకవలననే, భవేత్ = కలుగును.

ఇచట శ్రీకృష్ణునకు అత్యంతప్రియ మగు విషయము చెప్పబడినది గాన ప్రేయోలంకారము. అర్వాచీనులు చెప్పిన ప్రేయోలంకారలక్షణమును ఇచట సమన్వయింపచూచువారు, విదురునకు గల భగవద్విషయకరతి (భక్తి) వ్యంజిత మగుచున్నది గాన ఇది ప్రేయోలంకారము అని చెప్పుదురు. ఈ శ్లోకమునకు — "యా ప్రీతిః పుణ్డరీకాక్ష తవాగమన కారణాత్. సా కిమాఖ్యాయతే తుభ్యమన్తరాత్మాసి దేహినామ్" అను మహాభారతశ్లోకము ఆధారము.

**మూ. ఇత్యాహ యుక్తం విదురో నాన్యతస్తాదృశీ ధృతిః**
**భక్తిమాత్రసమారాధ్యః సుప్రీతశ్చ తతో హరిః.** 277

వ్యా. విదురః = విదురుడు, ఇతి = ఈ విధముగా, యుక్తమ్ = యుక్తముగా, ఆహ = పలుకుచున్నాడు. అన్యతః = మరి యొక వాక్యమువలన గానీ ఉపచారాది క్రియలవలన గాని, తాదృశీ = అట్టి, ధృతిః = ఆనందము, న = కలుగదు. తతః = ఆ వాక్యమువలన, భక్తిమాత్రసమారాధ్యః = భక్తిచేత మాత్రమే ఆరాధించుటకు శక్యుడైన, హరిః = శ్రీకృష్ణుడు, సుప్రీతశ్చ =

బాగుగాసంతసించినాడు కూడ. 'అన్యతః' అను పదమునకు మరి యొక అతిథి వలన, అనగా మరి యొక అతిథి వచ్చుట వలన అని కూడ అర్థము చెప్పవచ్చును.

అవ. ప్రేయోలంకారమునకు మరి యొక ఉదాహరణమును చూపు చున్నాడు :-

మూ. సోమః సూర్యో మరుద్భూమిర్వ్యోమ హోతానలో జలమ్
ఇతి రూపాణ్యతిక్రమ్య త్వాం ద్రష్టుం దేవ కే వయమ్. 278

వ్యా. హే దేవ = ఓ మహాదేవా సోమః = చంద్రుడు, సూర్యః = సూర్యుడు, మరుత్ = వాయువు, భూమిః = భూమి, వ్యోమ = ఆకాశము, హోతా = యజ్ఞము చేసినవాడు, అనలః = వాయువు, జలమ్ = ఉదకము, ఇతి = ఈ, రూపాణి = రూపములను, అతిక్రమ్య = మించి, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, వయమ్ = మేము, కే = ఎవరము. సోమసూర్యాది మూర్త్యష్టకమును తప్ప నీ అసలు స్వరూపమును చూచుటకు మాకు సామర్థ్య మెక్కడిది అని యర్థము

మూ. ఇతి సాక్షాత్కృతే దేవే రాజ్ఞో యద్రాతవర్మణః
ప్రీతిప్రకాశనం తచ్చ ప్రేయ ఇత్యవగమ్యతామ్. 279

వ్యా. దేవే = ఈశ్వరుడు, సాక్షాత్కృతే = ప్రత్యక్షముచేసి కొనబడి నపుడు, ఇతి = ఉ విధముగా, రాజ్ఞః = రాజైన, రాతవర్మణః = రాతవర్మ యొక్క, యత్ = ఏ, ప్రీతిప్రకాశనమ్ = ఆనందప్రకటనము కలదో, తచ్చ = అది కూడ, ప్రేయ ఇతి = ప్రేయోలంకారమే అని, అవగమ్యతామ్ = తెలియ బడుగాక.

పూర్వోదాహరణమున శ్రోత యగు శ్రీకృష్ణునకు ప్రీతి కలిగినది. ఈ ఉదాహరణమున వక్తయగు రాతవర్మయొక్క ప్రీతి స్పష్టనుగుచున్నది. రెండు ఉదాహరణము లిచ్చినందులకు ఏదియో ఒక ఉపపత్తి చూపుటయే కాని వాస్తవ మున రెండు ఉదాహరణములందును వక్తృప్రీతియే ప్రధానముగ గమ్య మగు

చున్నది. ఈ విధ మగు వక్తృగతమగు దేవవిషయకరతిభావావిష్కరణమే ప్రేయోలంకార మని దండి అభిప్రాయము. రసత్వస్థితివరకును పుష్టి చెందని ఏ భావమును అభివ్యంజించునను ప్రేయోలంకారమే అని అర్వాచీనులు అంగీకరించి నారు.

అవ. రసవదలంకారోదాహరణములలో మొదట శృంగారరసమును ఉదాహరించుచున్నాడు :—

మూ. మృతేతి ప్రేత్య సంగన్తుం యయా మే మరణం మతమ్.
సైవావన్తీ మయా లబ్ధా కథమత్రైవ జన్మని. 280

వ్యా. వాసవదత్త అగ్నిప్రమాదములో చనిపోయిన దను ప్రవాదమును విని, మిగుల దుఃఖించి కాలాంతరమున ఆమెను పొందిన ఉదయనుడు ఆనంద పరవశుడై పలికిన మాట లివి. మృతేతి = మరణించిన దని విని, ప్రేత్య = మరణించి, యయా = ఏ వాసదత్తతో, సఙ్గన్తుమ్ = కలియుటకై, మే = నాకు, మరణమ్ = మరణము, మతమ్ = అభిమత మైనదో, మరణించిన ఏ వాసవ దత్తను కలుసుకొనుటకై నేను కూడ మరణించ వలెనని తలచితినో, సా = ఆ, అవన్తీ = అవన్తీదేశరాజపుత్రి యైన వాసవదత్తయే, మయా = నాచేత, అత్ర జన్మన్యేవ = ఈ జన్మయందే, లబ్ధా = పొందబడినది. కథమ్ = ఏమి ఆశ్చర్యము. ఇచట సంభోగశృంగారరసము.

మూ. ప్రాక్ ప్రీతిర్దర్శితా సేయం రతిః శృఙ్గారతాం గతా
రూపబాహుల్యయోగేన తదిదం రసవద్వచః. 281

వ్యా. ప్రాక్ = పూర్వోదాహరణములలో, ప్రీతిః = ప్రీతి, అనగా దేవ విషయక మగు రతి, దర్శితా = చూపబడినది. రతి అనగా ప్రేమ. గురుదేవ తాది విషయకమగు రతిని భక్తి యందురు. మిత్రుని విషయమున రతి స్నేహము. పుత్రాదుల విషయమున రతి వాత్సల్యము. కాన్తాదుల విషయమునరతి అను రాగము. ఇచట దేవతావిషయక రతినే దండి ప్రీతి యని పేర్కొన్నాడు. సా ఇయం రతిః = ఈ రతియే, రూపబాహుల్యయోగేన = అనేకరూపములతో సంబం

ధముచే, అనగా విభావాదులచే పరిపుష్ట మగుటచే, శృఙ్గారతామ్ = శృంగారరసత్వ మును, గతా = పొందినది. తత్ = ఆకారణమువలన, ఇదం వచః = 'మృతేతి ప్రేత్య' ఇత్యాది వాక్యము, రసవత్ = రసముకలది.

అవ. రౌద్రరసవత్తును ఉదాహరించుచున్నాడు :—

మూ. నిగృహ్య కేశేష్వాకృష్టా కృష్ణా యేనాగ్రతో మమ
సోఽయం దుఃశాసనః పాపో లబ్ధః కిం జీవతి క్షణమ్. 282

వ్యా. యేన = ఎవనిచే, మమ అగ్రతః = నా ఎదుటనే, కృష్ణా = ద్రౌపది, కేశేషు = కేశములయందు, నిగృహ్య = పట్టి, ఆకృష్టా = లాగ బడినదో, సఃఅయమ్ = అట్టి ఈ, పాపఃదుఃశాసనః = పాపాత్ముడైన దుఃశాస నుడు, లబ్ధః = దొరికినాడు. ఇంక, క్షణమ్ = క్షణకాలముపాటైనను, జీవతి కిమ్ = జీవించునా ?

మూ. ఇత్యారుహ్య పరాం కోటిం క్రోధో రౌద్రాత్మతాం గతః
భీమస్య పశ్యతః శత్రుమిత్యేతద్రసవద్వచః. 283

వ్యా. శత్రుమ్ = శత్రువును, పశ్యతః = చూచుచున్న (చూచిన) భీమస్య = భీమునియొక్క, క్రోధః = కోపము, ఇతి = ఈ విధముగా, పరాం కోటిమ్ = అత్యధికమైన పరిపుష్టిని, ఆరుహ్య = అధిష్ఠించి, రౌద్రాత్మతామ్ = రౌద్రరసత్వమును, గతః = పొందినది. దుఃశాసనుడు ఆలంబనవిభావము, కృష్ణాకేశాకర్షణస్మరణము ఉద్దీపనవిభావము, 'పాపః' అను నిందావాక్యము అను భావము; గర్వాదులు వ్యభిచారిభావములు, వీటి సంయోగముచే భీమగతక్రోధ రూప మగు స్థాయిభావము పరిపుష్టమై రౌద్రరసత్వమును పొందినది.

అవ. వీరరసవత్తును ఉదాహరించుచున్నాడు :—

మూ. అజిత్వా సార్ణవాముర్వీమనిష్ట్వా వివిధైర్మఖైః
అదత్త్వా చార్థమర్థిభ్యో భవేయం పార్థివః కథమ్. 284

వ్యా. సార్ణవామ్ = సముద్రములతో కూడిన, సముద్రపర్యంతమైన, ఉర్వీమ్ = భూమిని, అజిత్వా = జయింపకుండగా, వివిధైః = అనేకవిధములగు, మఖైః = యజ్ఞములచే, అనిష్ట్వా = దేవతాపూజ చేయకుండగా, అర్థిభ్యః = యాచకులకు, అర్థమ్ = ధనమును, అదత్త్వా = ఈయకుండగా, కథమ్ = ఎట్లు, పార్థివః = రాజునుగా, భవేయమ్ = అగుదును.

**మూ. ఇత్యుత్సాహః ప్రకృష్టాత్మా తిష్ఠన్ వీరరసాత్మనా**
**రసవత్త్వం గిరామాసాం సమర్థయితుమీశ్వరః. 285**

వ్యా. ఇతి = ఈ విధముగా, ప్రకృష్టాత్మా = పరిపుష్టమైన స్వరూపము గల, ఉత్సాహః = సకలభూమండలమును జయించు విషయమునను, ధర్మకార్యాచరణవిషయమునను, యాచకమనోరథపూరణవిషయమునను చూపబడిన ఉత్సాహము, వీరరసాత్మనా, = వీరరసరూపమున, తిష్ఠన్ = ఉన్నదై, ఆసామ్ = ఈ, గిరామ్ = వాక్కులకు, రసవత్త్వమ్ = రసముకలిగియుండుటను, సమర్థయితుమ్ = సమర్థించుటకు, ఈశ్వరః = సమర్థమైనది.

ఈ విధముగ అభివ్యక్త మగు ఉత్సాహము యుద్ధవీర - ధర్మవీర - దానవీరరూపమున పరిపుష్టమైనది అని యర్థము. కొందరు అర్వాచీన ఆలంకారికుల వలె దండి కూడ యుద్ధ-ధర్మ-దయారూపమున మూడు విధము లగు వీరసమును అంగీకరించుచున్నట్లు స్పష్ట మగుచున్నది.

ఆవ. కరుణరసవదుదాహరణమును చూపుచున్నాడు :—

**మూ. యస్యాః కుసుమశయ్యాపి కోమలాఙ్గ్యా రుజాకరీ**
**సాధిశేతే కథం తన్వీ హుతాశనవతీం చితామ్. 286**

వ్యా. కోమలాఙ్గ్యాః = కోమలమైన శరీరముగల, యస్యాః = ఎవతెకు, కుసుమశయ్యాపి = పుష్పశయ్యకూడ, రుజాకరీ = పీడను కలిగించేదో, సా = అట్టి, తన్వీ = తనుగాత్రి, హుతాశనవతీమ్ = అగ్నితో కూడిన, చితామ్ చితను (పై), కథం అధిశేతే = ఏట్లు శయనించియున్నదో కదా!

మూ. ఇతి కారుణ్యముద్రిక్తమలఙ్కారతయా స్మృతమ్
తథాపరేఽపి బీభత్సహాస్యాద్భుతభయానకాః. 287

వ్యా- ఇతి = ఈ విధముగా ఉద్రిక్తమ్ = అత్యుత్కటావస్థను పొందిన, కారుణ్యమ్ = కారుణ్యము, అలఙ్కారతయా = కరుణరసవదలంకారముగా, స్మృతమ్ = చెప్పబడినది.

ఇచట మరణించిన రమణి ఆలంబనవిభావము. కుసుమశయనాది స్మరణము చితాశయన దర్శనము ఉద్దీపన విభావములు. ప్రతీయమానము అగు చింతాదులు వ్యభిచారి భావములు. ఈ విధముగ నాయకగత మగు శోకము పుష్టమై కరుణత్వమును పొందినది. అపరే = ఇతరములైన, బీభత్సహాస్యాద్భుత భయానకాః అపి = బీభత్స-హాస్య-అద్భుత-భయానకరసములు కూడ, తథా = అట్లే (చూపబడును).

అవ. బీభత్సరసవదుదాహరణమును చూపుచున్నాడు :—

పాయం పాయం తవారీణాం శోణితం పాణిసమ్పుటైః
కౌణపాః సహ నృత్యన్తి కబన్ధైరన్త్రభూషణాః 288

వ్యా. కౌణపాః = రాక్షసులు. పాణిసంపుటైః = దోసిళ్ళతో, తవ అరీణామ్ = నీ శత్రువుల, శోణితమ్ = రక్తమును, పాయం పాయమ్ = త్రాగి త్రాగి, అన్త్రభూషణాః = ప్రేగులే అలంకారముగా కలవారై, కబన్ధైః సహ = మరణించిన వారి మొండెములతో కూడా. నృత్యన్తి = నాట్యము చేయుచున్నారు.

ఇచట స్థాయిభావము జుగుప్స (ఏవగింపు). రాక్షసులు ఆలంబన విభావము అంత్రమాలాదులు ఉద్దీపన విభావములు. ప్రతీయమానము లగు, ఇచట చెప్పకపోయినను ఊహించుటకు వీలగు, వాంతి చేసికొనుట మొదలగునవి అను భావములు. ఈ విధముగ బీభత్సరసము నిష్పన్న మగుచున్నది గాన బీభత్సరసవదలంకారమునకు ఉదాహరణము.

అవ. హాస్యరసవత్తు నుదాహరించుచున్నాడు :—

ఇదమమ్లానమానాయా లగ్నం స్తనతటే తవ
ఛాద్యతాముత్తరీయేణ నవం నఖపదం సఖి. 289

వ్యా. హే సఖి = ఓ సఖురాలా, అమ్లానమానాయాః = మే మెంత చెప్పినను మానమును, ప్రియునిపై కోపమును, విడవని, తవ = నీ యొక్క, స్తనతటే = స్తనప్రదేశమునందు, లగ్నమ్ = లగ్నమైన, నవమ్ = నూతనమైన, నఖపదమ్ = నఖక్షతము, ఉత్తరీయేణ = ఉత్తరీయ ముచేత, ఛాద్యతామ్ = కప్పబడుగాక.

ఒక నాయిక సఖులు ఎంత చెప్పినను ప్రియుని విషయమున కోపము తగ్గనట్లు పైకి అభినయించుచు రహస్యముగ ప్రియసంగమము చేయుటచే క్రొత్తగ ఏర్పడిన నఖక్షతమును చూచిన ఒక సఖి ఆమెను పరిహసించుచు పలికిన మాట లివి. ఇచట హాసము స్థాయిభావము. మిథ్యామానవంతురా లగు నాయిక ఆలంభనవిభావము. నూతన నఖక్షతవీక్షణము అనుభావము. ఎత్తిపొడుపు మాటలు ఉద్దీపనవిభావము ఈ విధముగ హాసము హాస్యముగ పరిపుష్టిని పొందనది.

అవ. అద్భుతరసవత్తును ఉదాహరించుచున్నాడు:—

మూ. అంశుకాని ప్రవాలాని పుష్పం హారాది భూషణమ్
శాఖాశ్చ మన్దిరాణ్యేషాం చిత్రం నన్దనశాఖినామ్. 290

వ్యా. ఏషామ్ = ఈ, నన్దనశాఖినామ్ = నందనవృక్షముల, ప్రవాళాని = చిగుళ్ళు, అంశుకాని = వస్త్రములు. పుష్పమ్ = పుష్పము, హారాది = హారము మొదలైన, భూషణమ్ = అలంకారము, శాఖాశ్చ = కొమ్మలు, మన్దిరాణి = గృహములు. చిత్రమ్ = ఏమి ఆశ్చర్యము.

ఇచట విస్మయము స్థాయి భావము. నందన వృక్షములు ఆలంబన విభావములు. ప్రవాళాదులు వస్త్రాదిరూపమున ఉపకరించుట ఉద్దీపన విభావము.

ప్రతీయమానము లగు స్తంభస్వేదాదులు అనుభావములు. వీటిచే పుష్టమై విస్మయము రసత్వమును పొందుచున్నది.

అవ. భయానకరసవత్తును ఉదాహరించుచున్నాడు :-

**మూ. ఇదం మఘోనః కులిశం ధారాసన్నిహితానలమ్**
**స్మరణం యస్య దైత్యస్త్రీగర్భపాతాయ జాయతే. 291**

వ్యా. ఇదమ్ = ఇది, ధారాసన్నిహితానలమ్ = అంచులయందు ఉన్న అగ్ని గల, మఘోనః = దేవేంద్రునియొక్క, కులిశమ్ = వజ్రము, యస్య = దేనియొక్క, స్మరణమ్ = స్మరణము, దైత్యస్త్రీగర్భపాతాయ = దైత్యస్త్రీల గర్భస్రావమునకు, జాయతే = కారణమగుచున్నదో.

ఇచట భయము స్థాయిభావము, ఇంద్రుడు ఆలంబనవిభావము. గర్భస్రావాదులు అనుభావములు. ప్రతీయమానము లగు ఆవేగాదులు వ్యభిచారిభావములు వీటిచే పుష్టమై భయము భయానక రసత్వమును పొందుచున్నది.

ఇచట దండి ఎనమిది రసములను మాత్రమే పేర్కొనినాడు. దీనిని బట్టి భరతుడు కూడ ఎనమిది రసములనే చెప్పి యుండుననియు, అభినవ గుప్తాదులు శాంతమునకు కూడ రసత్వమును స్థాపించి భరతుడు కూడ శాంత రసమును అంగీకరించి నట్లు ప్రతిపాదించి యుందురనియు ఊహించవచ్చును. కావుననే దృశ్యకావ్యములలో శాంతరసమునకు అవకాశ ముండునా ఉండదా అను ప్రశ్న ఎట్లున్నను శ్రవ్యకావ్యములలో శాంతమును అంగీకరించుటకు ఎట్టి అభ్యంతరము ఉండరాదని పండితరాజాదులు ప్రతిపాదించుచున్నారు. భక్తి - వాత్సల్యాదులకు రసత్వకల్పనము ఇంకను అర్వాచీనము.

అవ. ప్రథమపరిచ్ఛేదమునందు మాధుర్యగుణనిరూపణ ప్రసంగమున 'మధురం రసవత్'అని మాధుర్యగుణమునకు లక్షణము రసవత్త్వము అని చెప్పటడినది కదా ? మరల ఇచట రసవత్తు అలంకార మని ఏల చెప్పబడుచున్నది అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు :-

మూ. వాక్యస్యాగ్రామ్యతాయోని ర్మాధుర్యే దర్శితో రసః
ఇహ త్వష్టరసాయత్తా రసవత్తా స్మృతా గిరామ్. 292

(ఇతిరసవచ్చక్రమ్)

వ్యా. మాధుర్యే = మాధుర్యగుణమును గూర్చి చెప్పు సందర్భమున, వాక్యస్య = వాక్యముయొక్క, అగ్రామ్యతాయోనిః = అగ్రామ్యత్వము కారణముగా గల, రసః = రసము, దర్శితః = చూపబడినది. వాక్యము గ్రామ్యతా దోషరహిత మైనచో అది రసవంతమై యుండు ననియు, అదియే మాధుర్యగుణ మనియు వెనుక చెప్పబడినది. ఇహతు = ఇక్కడ నైతే, అష్టరసాయత్తా = ఎనిమిది రసము లుండుటను బట్టి ఏర్పడిన, గిరామ్ = వాక్కులు, రసవత్తా = రసవత్త్వము, వాక్కులు రసవంతములై యుండుట, స్మృతా = చెప్పబడినది. కావున ఆ రసవత్త్వము గ్రామ్యతాదోషము లేకపోవుటచే లభించునది, ఈ రసవత్త్వము రసము లుండుటచే లభించునది. అందుచే ఈ రెండును వేరైన వని అభిప్రాయము.

అవ. ఊర్జస్విని ఉదాహరించుచున్నాడు :-

మూ. అపకర్తాహమస్మీతి హృది తే మా స్మ భూద్భయమ్.
విముఖేషు న మే ఖడ్గః ప్రహర్తుం జాతు వాఞ్ఛతి. 293

ఇతి ముక్తః పరో యుద్ధే నిరుద్ధో దర్పశాలినా.
పుంసా కేనాపి తద్ జ్ఞేయమూర్జస్వీత్యేవమాదికమ్. 294

(ఇత్యూర్జస్వి)

వ్యా. "అహమ్ = నేను, అపకర్తా = ఈతనికి, అపకారము చేసినవాడను, అస్మి = అయి ఉన్నాను", ఇతి = ఇట్లు, తే హృది = నీ మనస్సునందు, భయమ్ = భయము, మా స్మ భూత్ = కలుగకపోవు గాక. మే ఖడ్గః = నా ఖడ్గము, విముఖేషు = వెన్నిచ్చినవారిపై, ప్రహర్తుమ్ = కొట్టుటకు, జాతు = ఎన్నడును, న వాఞ్ఛతి = కోరదు.

యుద్ధే = యుద్ధమునందు, నిరుద్ధః = పట్టుబడిన, పరః = శత్రువు, ఇతి = ఈ విధముగ పలికి. దర్పశాలినా = గర్వవంతుడగు, కేనాపిపుంసా = ఒకానొకవీరపురుషునిచే, ముక్తః = విడువబడినాడు. ఏవమాదికమ్ = ఈ మొదలదునది, తత్ = అ, ఊర్జస్వి ఇతి = ఊర్జస్వి అలంకారముఅని, జ్ఞేయమ్ = తెలియ దగినది.

అవ పర్యాయోక్తాలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. ఇష్టమర్థ మనాఖ్యాయ సాక్షాత్తస్యైవ సిద్ధయే.
యత్ప్రకారాన్తరాఖ్యానం పర్యాయోక్తం తదిష్యతే. 295

వ్యా. ఇష్టమ్ = చెప్పదలచిన, అర్థమ్ = విషయమును, సాక్షాత్ = ప్రత్యక్షముగ, అనాఖ్యాయ = చెప్పకుండా, తస్య = ఆ అర్థముయొక్క, సిద్ధయే = ప్రతిపాదనముకొరకే, యత్ = ఏ, ప్రకారాన్తరాఖ్యానమ్ = మరియొక ప్రకారమున చెప్పుట అనునది కలదో, తత్ = అది, పర్యాయోక్తమ్ = పర్యాయోక్తాలంకారముగా, ఇష్యతే = అంగీకరించబడును.

చెప్పదలచిన విషయమును మామూలు మాటలలో చెప్పినచో చమత్కారముండదు. ఆ అర్థమే వచ్చెడు విధమున మరియొక రీతిలో చెప్పినచో అందముండును. అట్లు చెప్పుట పర్యాయోక్తాలంకారము. దీనిని ధ్వని అనుటకు వీలు లేదు. ధ్వనిస్థలమున వాచ్యార్థము వేరుగ నుండును, ధ్వన్యమానార్థము వేరుగ నుండును. కాని పర్యాయోక్తస్థలమున ఏది వాచ్యార్థమో అదియే వ్యంగ్యము.

మూ. దశత్యసౌ పరభృతః సహకారస్య మఞ్జరీమ్.
తమహం వారయిష్యామి యువాభ్యామాస్యతామిహ. 296

సఙ్గమయ్య సఖీం యూనా సంకేతే తద్రతోత్సవమ్
నిర్వర్తయితుమిచ్ఛన్త్యా కయాప్యపసృతం తతః 297

(ఇతిపర్యాయోక్తమ్)

వ్యా. అసౌ పరభృతః = ఈ కోకిల, సహకారస్య = మామిడిచెట్టుయొక్క, మఞ్జరీమ్ = గుత్తిని, దశతి = కొరుకుచున్నది. అహమ్ = నేను,

తమ్ = దానిని. వారయిష్యామి = నివారించెదను. యువాభ్యామ్ = మీ ఇరువు రును, ఇహ = ఇచట, ఆస్యతామ్ = ఉండురుగాక. ఇది భావిప్రయోగము.

సఖీమ్ = సఖురాలిని, సంకేతే = సంకేతస్థానమునందు, యూనా = యువకునితో, సంగమయ్య = కలిపి, తద్రతోత్సవమ్ = వారి సురతోత్సవమును నిర్వర్తయితుమ్ = నిర్విఘ్నముగజరుగునట్లు చేయుటకు, ఇచ్ఛన్త్యా = కోరు చున్న, కయాపి = ఒకానొక స్త్రీ, తతః = అచటనుండి, అపసృతమ్ = దూరముగాపోయినది.

మీరు యథేచ్ఛముగ సుఖము ననుభవింపుడు అను విషయమును ప్రత్యక్ష ముగ చెప్పక మరి యొక విధముగ చెప్పుటచే పర్యాయోక్తము]

అవ. సమాహితాలంకారమును చెప్పుచున్నాడు ;-

**మూ.** కిఞ్చిదారభమాణస్య కార్యం దైవవశాత్ పునః
తత్సాధన సమాపత్తిర్యా తదాహుః సమాహితమ్. 298

మానమస్యా నిరాకర్తుం పాదయోర్మే పతిష్యతః
ఉపకారాయ దిష్ట్యేదముదీర్ణం ఘనగర్జితమ్. 299

వ్యా. కిఞ్చిత్ = ఒకానొక, కార్యమ్ = కార్యమును, ఆరభమాణస్య = ప్రారంభించుచున్నవానికి, దైవవశాత్ = దైవవశమువలన, పునః = మరల, యా = ఏ, తత్సాధనసమాపత్తిః = ఆ కార్యమును సాధించుటకై ఉపయోగించు సాధనముయొక్క ప్రాప్తిగలదో, తత్ = దానిని, సమాహితమ్ = సమాహితా లంకారమునుగా, ఆహుః = చెప్పుచున్నారు.

అస్యాః = ఈమెయొక్క. మానమ్ = కోపమును, నిరాకర్తుమ్ = తొల గించుటకై, పాదయోః = పాదములపై, పతిష్యతః = పడనున్న, మే = నా యొక్క, ఉపకారాయ = ఉపకారముకొరకై, దిష్ట్యా = దైవవశముచేత, ఇదమ్ = ఈ, ఘనగర్జితమ్ = మేఘగర్జనము, ఉదీర్ణమ్ = బయలుదేరినది.

ఘనగర్జితము మానినీకామోద్దీపక మగుటచే ఆమె కోపము తొలగుటలో కొంత సౌకర్య మేర్పడినది గాన ఘనగర్జితము తలవని తలంపుగ వచ్చిన సాధన మని యర్థము.

అవ. ఉదాత్తాలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. ఆశయస్య విభూతేర్వా యన్మహత్త్వ మనుత్తమమ్.
ఉదాత్తం నామ తం ప్రాహురలఙ్కారం మనీషిణః 300

వ్యా. ఆశయస్య = అభిప్రాయముయొక్క గాని, విభూతేర్వా = ఐశ్వర్యము యొక్క గాని, యత్ = ఏ, అనుత్తమమ్ = అత్యుత్తమమైన, (దేనికంటె ఉత్తమమైనది లేదో అది), మహత్త్వమ్ = గొప్పదనము గలదో, తమ్ = దానిని, మనీషిణః = విద్వాంసులు, ఉదాత్తం నామ = ఉదాత్తమనెడు, అలఙ్కారం = అలంకారమునుగా, ప్రాహుః = చెప్పుదురు.

మూ. గురోః శాసనమత్యేతుం న శశాక స రాఘవః
యో రావణశిరశ్ఛేదకార్యభారేఽప్యవిక్లవః. 301

వ్యా. యః = ఏ రాముడు, రావణశిరశ్ఛేదకార్యభారేఽపి = రావణుని శిరస్సులను ఛేదించుట అనెడు కార్యభారమునందు గూడ, అవిక్లబః = వ్యాకులత్వము లేనివాడో, సః రాఘవః = అట్టి శ్రీరాముడు, గురోఃశాసనమ్ = తండ్రి ఆజ్ఞను, అత్యేతుమ్ = అతిక్రమించుటకు, న శశాక = సమర్థుడు కాలేదు.

ఇచట శ్రీరాముని అత్యుత్తమమైన ఆశయము వర్ణింపబడినది గాన ఉదాత్తాలంకారము.

అవ. మహావైభవవర్ణనాత్మక మగు ఉదాత్తమును ఉదాహరించుచున్నాడు :-

మూ. రత్నభిత్తిషు సఙ్క్రాన్తైః ప్రతిబిమ్బశతైర్వృతః
జ్ఞాతో లఙ్కేశ్వరః కృచ్ఛ్రాదాఞ్జనేయేన తత్త్వతః 302

వ్యా. రత్నభిత్తిషు = రత్నములు పొదిగిన గోడలపై, సఙ్క్రాన్తైః = సంక్రమించిన, ప్రతిబిమ్బశతైః = అనేక ప్రతిబింబములచే, వృతః = నలు మూలలచుట్టువారు కొనబడిన, తత్త్వతః లఙ్కేశ్వరః = యథార్థమైన రావణాసురుడు, ఆఞ్జనేయేన = ఆంజనేయునిచే, కృచ్ఛ్రాత్ = అతికష్టముగ, జ్ఞాతః = తెలియబడెను.

ఇచట రావణుని గృహకుడ్యములు రత్నమయము లని వర్ణించుటచే ఆతని మహావైభవము తెలియుచున్నది గాన ఇది వైభవాతిశయవర్ణనరూప మగు ఉదాత్తాలంకారము.

మూ. పూర్వత్రాశయమాహాత్మ్యమత్రాభ్యుదయగౌరవమ్.
సువ్యఞ్జితమితి ప్రోక్తముదాత్తం ద్వయమప్యదః 303

(ఇత్యుదాత్తమ్)

వ్యా. పూర్వత్ర = పూర్వశ్లోకమునందు, ఆశయమహాత్మ్యమ్ = ఆశయముయొక్క గొప్పతనము, అత్ర = ఈ శ్లోకమునందు, అభ్యుదయగౌరవమ్ = ఐశ్వర్యమహత్త్వము, సువ్యఞ్జితమ్‌ఇతి = బాగుగ వ్యంజింపబడినది గాన, అదః = ఈ, ద్వయమపి = ద్వయముకూడ, ఉదాత్తమ్ = ఉదాత్తాలంకారముగా, ప్రోక్తమ్ = చెప్పబడినది,

అవ. అపహ్నుత్యలంకారమును నిరూపించుచున్నాడు :-

మూ. అపహ్నుతిరపహ్నుత్య కిఞ్చిదన్యార్థదర్శనమ్
న పఞ్చేషుః స్మరస్తస్య సహస్రం పత్రిణామితి. 304

వ్యా. కించిత్ = ఏదైన ఒకదానిని, అపహ్నుత్య = కప్పివేసి, అన్యార్థదర్శనం = మరియొకవిషయమునుచూపుట, అపహ్నుతిః = అపహ్నుత్యలంకారము.

ప్రకృతమైన ఒక ధర్మిని నిషేధించి మరి యొక ధర్మిని ఆరోపించినచో తత్త్వాపహ్నవరూపక మని వెనుక (II - 95)చెప్పబడినది. ఒక ధర్మియం దున్న

ధర్మములను కప్పిపుచ్చి ధర్మాంతరములను ఆరోపించినచో ఈ అపహ్నవా లంకారము అన్యార్థదర్శనమ్, అని మాత్రమే చెప్పినచో రూపకాతిశయోక్తులందు అతివ్యాప్తివచ్చును. అందుచే "కించిత్ అపహ్నుత్య" అని చెప్పబడినది. ఇది మాత్రమే చెప్పినచో ఆక్షేపాలంకారమునందు అతివ్యాప్తి, అందుచే 'అన్యార్థ దర్శనమ్' అని కూడ చెప్పబడినది.

ఉదా. స్మరః = మన్మథుడు, పంచేషుః = ఐదు బాణములు కలవాడు, న = కాడు. తస్య = వానియొక్క, పత్రిణాం = బాణముల, సహస్రం = సహస్రము (ఉన్నది). ఇతి = ఇట్లు, ఉదాహరణము. ఇచట ధర్మియగు బాణములలో ఉన్న పంచత్వసంఖ్యారూపమగు ధర్మమును నిషేధించి, సహస్రసంఖ్యారూపమగు ధర్మమును ఆరోపించుటచే ఇది అపహ్నవోదాహరణము.

అవ. విషయాపహ్నుతిని ఉదాహరించుచున్నాడు :-

మూ. చన్దనం చన్ద్రికా మన్దో గన్ధవాహశ్చ దక్షిణః
సేయ మగ్నిమయీ సృష్టిర్మయి శీతా పరాన్ప్రతి. 305

వ్యా. చన్దనం = మంచిగంధము, చన్ద్రికా = వెన్నెల, మన్దః = మందమైన, దక్షిణః గన్ధవాహశ్చ = దక్షిణవాయువు, సా ఇయం = ఇది యంతయు, మయి = నా విషయమున, అగ్నిమయీ = అగ్నిమయమైన, సృష్టిః = సృష్టి. పరాన్ప్రతి = పరుల విషయమున, శీతా = చల్లనైనది.

అవ. లక్షణసమన్వయము చూపుచున్నాడు :-

మూ. శైశిర్యమభ్యుపేత్యైవ పరేష్వాత్మని కామినా
ఔష్ణ్యప్రకాశనాత్తస్య సేయం విషయ నిహ్నుతిః 306

వ్యా. కామినా = కాముకునిచేత, పరేషు = పరుల విషయమున, శైశిర్యం = (చందనాదుల) శిశిరత్వమును, అభ్యుపేత్యైవ = అంగీకరించియే, ఆత్మని = తనవిషయమున, తస్య = ఆ శైశిర్యమునకు, ఔష్ణ్యప్రకాశనాత్ = ఉష్ణత్వమును వ్యక్తీకరించుటవలన, సేయం = ఇది, విషయనిహ్నుతిః =

విషయాపహ్నవము. చందనాదులలో నున్న శైశిర్యమును నిషేధించి ఉష్ణత్వ మును వర్ణించుటవలన ఇది విషయాపహ్నుతి.

అవ. స్వరూపాపహ్నుతిని ఉదాహరించుచున్నాడు :-

మూ. అమృతస్యన్దికిరణశ్చన్ద్రమా నామతో మతః
అన్య ఏవాయమర్థాత్మా విషనిష్యన్దిదీధితిః. 307

వ్యా. చన్ద్రమాః = చంద్రుడు, నామతః = పేరుకుమాత్రమే, అమృతస్యన్దికిరణః = అమృతమును స్రవించు కిరణములు కలవాడుగా, మతః = చెప్పబడినాడు. అర్థాత్మా = యథార్థస్వరూపుడగు, అన్యఏవ = మరి యొక విధముగా ఉన్నవాడే అయిన, అయం = ఈతడు, విషనిష్యన్దిదీధితిః = విషమును స్రవించు కిరణములు కలవాడు.

పేరునకు అమృతస్యందికిరణుడు కాని ఇతడు వాస్తవమున విషనిష్యంది కిరణుడే అని అర్థము.

అవ. లక్ష్యలక్షణసమన్వయము చేయుచున్నాడు :-

ఇతి చన్ద్రత్వమేవేన్దౌ నివర్త్యార్థాన్తరాత్మతా
ఉక్తా స్మరార్తేనేత్యేషా స్వరూపాపహ్నుతిర్మతా. 308

వ్యా. ఇతి = ఈ విధముగా, ఇన్దౌ = చంద్రునియందు, చన్ద్రత్వమేవ = అహ్లాదకరత్వరూప మగు చంద్రత్వమునే, నివర్త్య = నిషేధించి, అర్థాన్తరాత్మతా = అన్యస్వరూపత్వము, స్మరార్తేన = మన్మథపీడితు డగు కాముకునిచేత, ఉక్తా = చెప్పబడినది. ఇతి = ఈ కారణమువలన, స్వరూపాపహ్నుతిః = స్వరూపాపహ్నుతి, అని, మతా = చెప్పబడినది.

చంద్రుని స్వరూపము ఆహ్లాదకత్వము. అదియే నిషేధింపబడుటచే ఇది స్వరూపాపహ్నుతి. పైన చెప్పిన విషయాపహ్నుతికిని దీనికిని భేద మేమనగా — చందనాదులు విరహము లేనివారి విషయమున శీతములే అయినను విరహవంతుని విషయమున ఉష్ణములుగ నున్నవి అని చెప్పుటచే శైత్యమును పూర్తిగా నిషేధించలేదు. ఇచట అమృతస్యంది కిరణత్వము పూర్తిగ నిషేధింపబడుచున్నది.

మూ. ఉపమాపహ్నుతిః పూర్వముపమాస్వేవ దర్శితా
ఇత్యపహ్నుతిభేదానాం లక్ష్యో లక్ష్యేషు విస్తరః. 309

వ్యా. ఉపమాపహ్నుతిః = ఉపమాపహ్నుతి, పూర్వం = వెనుక, ఉపమాస్వేవ = ఉపమాభేదములందే, దర్శితా = చూపబడినది. (చూ. II. 34). ఇతి = ఈ విధముగా, అపహ్నుతిభేదానాం = అపహ్నుత్యలంకారభేదముల, విస్తరః = విస్తరము, లక్ష్యేషు = లక్ష్యములయందు, లక్ష్యః = చూడుకొనతగినది.

అవ శ్లేషాలంకారమును నిరూపించుచున్నాడు :—

మూ. శ్లిష్టమిష్టమనేకార్థమేకరూపాన్వితం వచః
తదభిన్నపదం భిన్నపదప్రాయమితి ద్విధా. 310

వ్యా. అనేకార్థం = అనేకమైన అర్థములు కలదియు, అనగా అభిధచే అనేకార్థములను బోధించు నదియు, ఏకరూపాన్వితం = ఒకే రూపముతో కూడినదియు అగు, వచః = వాక్యము, శ్లిష్టం = శ్లేషతో కూడినదిగా, ఇష్టం = అంగీకరింపబడినది. అభిన్నపదం = అభిన్నపదము. భిన్నపదప్రాయమ్‌ఇతి = భిన్నపదప్రాయము అని, తత్ = అది, ద్విధా = రెండు విధములు.

'హరిః', 'రాజా' మొదలైన శబ్దములకు అనేకార్థములను బోధించు శక్తి ఉన్నది. ఇట్టి పదము లున్న వాక్యము అనేకార్థములను బోధించినచో అచట శ్లేషాలంకారమును అంగీకరింతురు అని అర్థము.

అనేకార్థబోధకత్వవిషయమున రెండు మతము లున్నవి. "హరిః" అను ఒక్కపదమే 'విష్ణువు' 'సింహము' అను రెండర్థములను బోధించును అని కొందరందురు. 'విష్ణువు' అను అర్థమును బోధించు 'హరి' శబ్దము వేరు, 'సింహము' అను అర్థమును బోధించు 'హరి' శబ్దము వేరు; ఈ రెండు పదములలో ఒకే రకమైన వర్ణములు ఒకే ఆనుపూర్విలో ఉండుటచే ఒకే పద మను భ్రాంతి కలుగుచున్నది అని కొంద రందురు. ఇది 'అర్థభేదాచ్ఛబ్దభేదః' అను మతము. వాస్తవమున అది ఒకే శబ్ద మని అంగీకరించినను, లేదా ఒక శబ్దము వలె కనబడు భిన్నశబ్ద

ములే అని అంగీకరించినను, అట్టి శబ్దములను ప్రయోగించినపుడు అర్థద్వయ ప్రతీతి కలుగుచున్నది కదా ? అదియే శ్లేషప్రయోజకము. "ఏకరూపాన్వితం" అనుటచే దండి "అర్థభేదాత్ శబ్దభేదః" అను పక్షమును అంగీకరించు నట్లు కనబడుచున్నది.

కొన్ని స్థలములలో అనేకార్థశబ్దములను ప్రయోగించినను ప్రకరణాదులను బట్టి ఆ ప్రకరణమునకు సంబంధించిన ఒక అర్థమునే అభిధచే ఆ పదము బోధించును. రెండవ అర్థమును బోధింపజాలదు. అన్యార్థబోధ కూడ కలిగినచో అది వ్యంజనవలన కలుగును అని కావ్యప్రకాశాదులందు స్పష్టీకరింపబడినది.

అర్థములు వేరైనను పదములో నున్న ప్రకృతిప్రత్యయములు ఒకే విధమున ఉన్నచో అది అభిన్నపదము. ఉదా 'హరిః' మొ. వేరువేరు ప్రకృతి ప్రత్యయములచే ఏర్పడి విరుపునుబట్టి అనేకార్థములను బోధించుపదములు ఎక్కువగానున్న శ్లిష్టమునకు 'భిన్నపదప్రాయము' అనగా భిన్నపదములు ఎక్కువగా ఉన్నది, అని పేరు. "అజరామరతా కస్య నాయోధ్యేవ పురీప్రియా" ఇత్యాదులలో అయోధ్య పక్షమున 'అజ + రామ + రతా' అని అర్థము. "అజరామరస్య భావః అజరామరతా" అని మరియొక అర్థము. "జరామరణములు లేకుండుట, అజ-రాములయందు ప్రేమగల అయోధ్య వలె ఎవరికి ఇష్టము కాదు ? " అని అర్థము. అభిన్నస్థలదపములలో అభంగశ్లేషము; ఇట్టి భిన్నపదస్థములలో సభంగ శ్లేషము అని చెప్పుదురు. ఒక వాక్యములో ప్రయోగించిన శబ్దములను మార్చి వాటి స్థానమున అన్యశబ్దములను ప్రయోగించినను రెండర్థములు బోధింపబడినచో అర్థశ్లేషయనియు, అట్లు శబ్దములు మార్చకుండ ఉన్నప్పుడే అర్థద్వయబోధ కలిగినచో శబ్దశ్లేష అనియు అర్వాచీనులు చెప్పినారు. కాని దండ్యాదిప్రాచీనాలంకారికులు ఈ రెండింటిని కూడ అర్థాలంకారములుగనే పరిగణించినారు. శబ్ద స్వరూపము ఎట్లున్నను, రెండర్థములు కలసి ఒక వాక్యమున ఉండుటయే శ్లేషాలంకారస్వరూపము గాన ఇది అర్థాలంకారముగనే పరిగణనీయ మని వీరి అభిప్రాయము.

అవ. అభిన్నపదశ్లేషమునకు ఉదాహరణము చూపుచున్నాడు :—

మూ. అసావుదయమారూఢః కాన్తిమాన్ రక్తమణ్డలః
రాజా హరతి లోకస్య హృదయం మృదుభిః కరైః. 311

వ్యా. ఉదయం = ఉన్నతిని, (చంద్రునిపక్షమున ఉదయాచలమును అని అర్థము), ఆరూఢః = పొందినవాడును, కాన్తిమాన్ = శరీరకాంతికలవాడును, (కిరణముల కాంతికలవాడును), రక్తమణ్డలః = అనురాగవంతులైన ప్రజలు కలవాడును (ఎఱ్ఱని మండలము కలవాడును) అగు, రాజా = రాజు, (చంద్రుడు), మృదుభిః = అత్యధికము కాని (చల్లని) కరైః = పన్నులచేత (కిరణములచేత), లోకస్య = లోకముయొక్క. హృదయం = హృదయమును, హరతి = ఆకర్షించుచున్నాడు.

ఇచట ప్రకరణము మొదలైనవి ఏవియు లేకపోవుటచే ఈ అర్థమునే చెప్పవలెను, ఆ అర్థమును చెప్పరాదు అను నియమ మేదియు లేదు గాన రెండర్థములను వాచ్యములే అగుటచే శ్లేషాలంకారము. "ఉదయమ్" మొదలైన పదములు రెండర్థములందును ఏకరూపములుగనే ఉండుటచే అభిన్నపదశ్లేషము.

అవ. భిన్నపదశ్లేషమునకు ఉదాహరణము చెప్పుచున్నాడు :—

మూ. దోషాకరేణ సంబధ్నన్నక్షత్రపథవర్తినా.
రాజ్ఞా ప్రదోషో మామిత్థమప్రియం కిం ను బాధతే. 312

వ్యా. ప్రదోషః = ఈ సాయంకాలసమయము, నక్షత్రపథవర్తినా = నక్షత్రమార్గమునందున్న వాడును, దోషాకరేణ = రాత్రిని చేయువాడును అగు, రాజ్ఞా = చంద్రునితో, సంబధ్నన్ = సంబంధించినదై, అప్రియం = ప్రియారహితుడైన, మాం = నన్ను, ఇత్థం = ఈ విధముగా, కిం ను = ఎందుచేత, బాధతే = బాధించుచున్నదో ? ఈ అర్థమున - "దోషా కరోతీతి = దోషాకరః". "నక్షత్రాణాం పన్థాః = నక్షత్రపథః, తస్మిన్ వర్తత ఇతి; తేన", "న విద్యతే ప్రియా యస్య సః = అప్రియః" అని విగ్రహవాక్యములు. రెండవ అర్థము :—

ప్రదోషః = అధిక మైన దోషములు గల కతడు, (ప్రకృష్టాః దోషాః యస్య సః) నక్షత్రపథవర్తినా = క్షత్రియు లుండవలసిన మార్గమునందు ప్రవర్తించని వాడును, (క్షత్రపథే వర్తతే ఇతి = క్షత్రపథవర్తీ. న క్షత్రపథవర్తీ = నక్షత్ర పథవర్తీ - తేన), దోషాకరేణ = దోషములకు నివాసభూతుడును (దోషాణాం ఆకరః) అగు, రాజ్ఞా = రాజుతో, సంబద్ధస్య = కలిసినవాడై, అప్రియం = శత్రువునైన (న ప్రియః = అప్రియః), మాం = నన్ను, ఇత్థం = ఈ విధముగా, కింనుబాధతే = ఏలబాధించుచున్నాడోకదా ?

ఇచట దోషాకారాదిపదములు ప్రకృతిప్రత్యయాదిభేదముచే వేరువేరు అర్థమును బోధించుచున్నవి గాన భిన్నపద (సభంగ) శ్లేషము.

అవ. శ్లేషాలంకారము స్వతంత్రముగనేకాక అలంకారాంతరోపస్కారక ముగ కూడ శోభాజనకముగ ఉండును అని సూచించుటకై చెప్పుచున్నాడు :-

మూ. ఉపమారూపకాక్షేప వ్యతిరేకాదిగోచరాః
ప్రాగేవ దర్శితాః శ్లేషాః దర్శ్యన్తే కేచనాపరే. 313

వ్యా. ఉపమారూపకాక్షేప వ్యతిరేకాదిగోచరాః = ఉపమా (చూ. II. 28; 29) రూపక (II. 87), ఆక్షేప (II. 161), వ్యతిరేకాద్య (II. 183) లంకారములకు సంబంధించిన; ఆదిపదముచే అర్థాన్తరన్యాస (II. 174) సమాసోక్తులను (II. 209) గ్రహింపవలెను. శ్లేషాః = శ్లేషాలంకారములు, ప్రాగేవ = పూర్వమే, దర్శితాః = చూపబడినవి. కేచన = మరికొన్ని, అపరే = ఇతర విధములైన శ్లేషాలంకారములు, దర్శ్యన్తే = చూపబడుచున్నవి.

మూ. అస్త్యభిన్నక్రియః కశ్చిదవిరుద్ధక్రియోఽపరః
విరుద్ధకర్మా చాస్త్యన్యః శ్లేషో నియమవానపి 314
నియమాక్షేపరూపోక్తిరవిరోధీ విరోధ్యపి
తేషాం నిదర్శనేష్వేవ రూపమావిర్భవిష్యతి. 315

వ్యా. అభిన్నక్రియః = అభిన్న మైన క్రియ కల, కశ్చిత్ = ఒక, శ్లేషః = శ్లేషాలంకారము. అస్తి = ఉన్నది. అవిరుద్ధక్రియః = అవిరుద్ధ మైన

క్రియ గల, అపరః = మరి యొక శ్లేషాలంకారము, విరుద్ధకర్మా = విరుద్ధక్రియ గల, అన్యశ్చ = మరి యొకటియు, నియమవానపి = నియమము కలదియు, అస్తి = ఉన్నది. నియమాక్షేపరూపోక్తిః = నియమాక్షేపరూపోక్తి రూప మైన దియు, అవిరోధీ = విరోధము లేనిదియు, విరోధ్యపి = విరోధము కలదియు, ఉన్నది. తేషాం = ఈ భేదముల, రూపం = స్వరూపము, నిదర్శనేష్వేవ = ఉదాహరణములందే, ఆవిర్భవిష్యతి = స్పష్టము కాగలదు.

అవ. అభిన్నక్రియ శ్లేషకు ఉదాహరణము :-

మూ. వక్రాః స్వభావమధురాః శంసన్త్యో రాగముల్బణమ్
దృశో దూత్యశ్చ కర్షన్తి కాన్తాభిః ప్రేషితాః ప్రియాన్.

వ్యా. కాన్తాభిః = ప్రియురాండ్రచేత, ప్రేషితాః = ప్రసరింపచేయబడి నవియు (పంపబడినవారును), వక్రాః = వంకరయైనవియు (వక్రోక్తియందు నిపుణలును), స్వభావమధురాః = అకృత్రిమసౌందర్యము కలవియు, (మధుర స్వభావము కలవారును), ఉల్బణం = తీవ్రమైన, రాగం = ఎరుపును (అను రాగమును), శంసన్త్యః = సూచించుచున్నవియు, (చెప్పుచున్నవారును), అగు, దృశః = చూపులును, దూత్యశ్చ = దూతికలును, ప్రియాన్ = ప్రియులను, కర్షన్తి = ఆకర్షించుచున్నవి (చున్నారు).

ఇచట దృక్కులకును, దూతికలకును ఏకక్రియా సంబంధ మున్నది గాన తుల్యయోగితాలంకారము. శ్లేష దానికి అంగముగ నున్నది. అందుచే అభిన్న క్రియ శ్లేషాలంకారము.

అవ. అవిరుద్ధక్రియశ్లేషకు ఉదాహరణము :-

మూ. మధురా రాగవర్ధిన్యః కోమలాః కోకిలాగిరః
ఆకర్ణ్యన్తే మదకలాః శ్లిష్యన్తే చాసితేక్షణాః. 317

వ్యా మధురాః = మధురమైనవియు ("సర్వావస్థావిశేషేషు మాధుర్యం రమణీయతా" అని చెప్పినట్లు సర్వావస్థలయందు రమణీయత్వముతో కూడిన

వారును), రాగ వర్ధిన్యః = అనురాగమును పెంచునవియు (ప్రేమను వృద్ధి పొందించువారును), కోమలాః = కోమల మైనవియు (సుకుమారులును), మద కలాః = మదమత్తములును (సౌభాగ్యగర్వవతులును) అగు, కోకిలాగిరః = కోకిలల వాక్కులు, ఆకర్ణ్యన్తే = వినబడుచున్నవి. అసితేక్షణాః = (పూర్వోక్త విశేషణ లగు) యువతులు, శ్లిష్యన్తే = కౌగలించుకొనబడుచున్నారు

ఇచట ఆకర్ణనాశ్లేషణక్రియలు విభిన్నేంద్రియముల ద్వారా జరుగుచున్నవి గాన ఈ క్రియలకు విరోధము లేదు. ఇచట గూడ శ్లేష తుల్యయోగితకు అంగము.

అవ. విరుద్ధక్రియాశ్లేషకు ఉదాహరణము :—

మూ. రాగమాదర్శయన్నేష వారుణీయోగవర్ధితమ్
తిరోభవతి ఘర్మాంశురఙ్గజస్తు విజృమ్భతే. 318

వ్యా. ఏషః = ఈ, ఘర్మాంశుః = సూర్యుడు, వారుణీయోగవర్ధితం = పశ్చిమదిక్కుయొక్క సంబంధముచేత వృద్ధిపొందింపబడిన, రాగం = ఎరుపును, ఆదర్శయన్ = చూపుచు, తిరోభవతి = అస్తమించుచున్నాడు. అఙ్గజస్తు = మన్మథుడైతే, వారుణీయోగవర్ధితం = మద్యసంబంధముచే వృద్ధిపొందింపబడిన, రాగం = అనురాగమును, ఆదర్శయన్ = చూపుచు, విజృంభతే = విజృంభించుచున్నాడు. ఇచట తిరోభవనము విజృంభణము అను క్రియలు విరుద్ధములు గాన ఇది విరుద్ధక్రియాశ్లేష. ఇది కూడ తుల్యయోగితాంగమే.

అవ. సనియమశ్లేషమున కుదాహరణము :—

మూ. నిస్త్రింశత్వమసావేవ ధనుష్యేవాస్య వక్రతా
శరేష్వేవ నరేన్ద్రస్య మార్గణత్వంచ వర్తతే. 319

వ్యా. నిస్త్రింశత్వం = ముప్పది అంగుళములకంటె అధిక పరిమాణము కలిగియుండుట, అస్య = ఈ, నరేన్ద్రస్య = రాజుయొక్క, అసావేవ = ఖడ్గము నందు మాత్రమే. ఇతనియందు నిస్త్రింశత్వము, అనగా, క్రూరత్వము లేదు అని

అర్థము. వక్రతా = వక్రకత్వము, ధనుష్వేవ = ధనుస్సునందు మాత్రమే మార్గణత్వం = బాణత్వము (యాచకత్వము అని రెండవఅరము), శరేష్వేవ = శరములందు మాత్రమే.

ఈతని కత్తిమాత్రమే క్రూరమైనది; స్వభావము కాదు. ధనస్సే వక్రమైనది; హృదయము కాదు. బాణములే మార్గణములు, ప్రజలలో మార్గణత్వము (యాచకత్వము), లేదు. ఈ విధముగ నిస్త్రింశత్వాదులను ఆస్యాదులందే నియమనము చేయుటవలన ఇది నియమశ్లేషము. ఇట్టి స్థలములలో అర్వాచీనులు పరిసంఖ్యాలంకారమును అంగీకరింతురు.

అవ. నియమాక్షేప రూపోక్తిశ్లేషమున కుదాహరణము :—

మూ. పద్మానామేవ దణ్డేషు కణ్టకస్త్వయి రక్షతి
అథవా దృశ్యతే రాగిమిథునాలిఙ్గనేష్వపి. 320

వ్యా. త్వయి = నీవు, రక్షతి సతి = రక్షించుచుండగా, పద్మానాం = పద్మముల, దణ్డేష్వేవ = నాళములందే, కణ్టకః = ముండ్లు ఉన్నవి. (నీకు కాని ప్రజలకు కాని కంటకములు, అనగా క్షుద్రశత్రువులు, లేరు.) అథవా = లేదా, రాగి మిథునాలిఙ్గనేష్వపి = అనురాగవంతు లగు మిథునముల ఆలింగనములందు కూడ, (కంటకము, అనగా రోమాంచము) దృశ్యతే = చూడబడుచున్నది.

కంటక శబ్దము జాత్యేకవచనమునందు ప్రయోగింపబడినది. కంటకములు పద్మనాళములందు మాత్రమే ఉన్నవని మొదట నియమము చెప్పి, మరల 'అథవా' ఇత్యాది వాక్యముచే దానిని ఆక్షేపించుటచే (నిరాకరించుటచే) ఇది నియమాక్షేపరూపోక్తిశ్లేషము.

అవ. అవిరోధశ్లేషమున కుదాహరణము :—

మూ. మహీభృద్భూరికటకస్తేజస్వీ నియతోదయః
దక్షః ప్రజాపతిశ్చాసీత్స్వామీ శక్తిధరశ్చ సః. 321

వ్యా. సః = అతడు, మహీభృత్ = భూమిని పాలించువాడుగను (పర్వతమును), భూరికటకః = విశాలమైన స్కంధావారము కలవాడుగను

(సర్వతపక్షమున విశాలమైన మధ్యప్రదేశము కలది), తేజస్వీ = ప్రతాపవంతుడుగను (సూర్యుడు), నియతోదయః = నిరంతరాభివృద్ధి గలవాడుగను (ప్రతిదినము ఉదయించువాడు), దక్షః = సమర్థుడుగను (దక్షుడు), ప్రజాపతిశ్చ = ప్రజలకు అధిపతిగను (ప్రజాపతి), స్వామీ = ప్రభువుగను, (కుమారస్వామి), శక్తిధరశ్చ = ప్రభుమన్త్రోత్సాహశక్తులు కలవాడుగను, (శక్తి అను ఆయుధమును ధరించినవాడును, ఆసీత్ = ఆయెను.

ఇచట ప్రయోగించిన 'మహీభృత్' మొదలైన శ్లిష్టపదముల అర్థములకు పరస్పరవిరోధ మేమియు లేదు గాన ఇది అవిరోధిశ్లేషాలంకారము.

అవ. విరోధిశ్లేషకు ఉదాహరణము :—

మూ. అచ్యుతోఽప్యవృషచ్ఛేదీ రాజాప్యవిదితక్షయః
దేవోఽప్యవిబుధో జజ్ఞే శఙ్కరోఽప్యభుజఙ్గవాన్. 322

(ఇతి శ్లేషచక్రమ్)

వ్యా. అచ్యుతోపి = సన్మార్గమునుండి భ్రంశమును పొందనివాడైనను, అవృషచ్ఛేదీ = అధర్మమును నశింపచేసినవాడగను (విష్ణువైనను వృషభాసుర సంహారము చేయనివాడు అను అర్థమున విరోధము. మొదటి అర్థమున విరోధపరిహారము. ఇట్లే ఇతరస్థలములందు చూచుకొనవలెను.) రాజాపి = రాజైనను, అవిదితక్షయః = సంపత్క్షయమనునది తెలియని వాడుగను, (చంద్రుడైనను క్షయరోగము లేనివాడు), దేవోఽపి = రాజైనను, అవిబుధః = పండితసంసర్గ రహితుడు కానివాడుగను, (దేవుడైనను దేవుడు కానివాడు,), శఙ్కరోఽపి = సుఖమును కలిగించువాడైనను, అభుజఙ్గవాన్ = దుష్టసహవాసము లేనివాడుగను (శివుడైనను సర్పములు లేనివాడు), జజ్ఞే = ఆయెను.

ఇచట "అచ్యుతః" మొదలగు పదములకు "విష్ణువు" మొదలగు అర్థములు చెప్పిన పక్షమున వృషచ్ఛేదాదికము లేకుండుట విరుద్ధము గాన ఇది విరోధిశ్లేషము ఇది విరోధాభాసాలంకారమునకు అంగము.

(శ్లేష చక్రము సమాప్తము)

అవ. విశేషోక్తి లక్షణము చెప్పుచున్నాడు :—

మూ. గుణజాతిక్రియాదీనాం యత్తు వైకల్యదర్శనమ్
విశేషదర్శనాయైవ సా విశేషోక్తిరిష్యతే. 323

వ్యా. విశేషదర్శనాయైవ = వర్ణనీయ వస్తువునం దున్న విశేషమును చూపుటకొరకే, గుణజాతిక్రియాదీనాం = గుణములు, జాతి, క్రియ మొదలైన వాటియొక్క, యత్ = ఏ, వైకల్యదర్శనం = వైకల్యముయొక్క (లోటు యొక్క) చూపుటకలదో, సా = అది, విశేషోక్తిః = విశేషోక్త్యలంకారముగా, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

ఒక కార్యమును సాధించుటకు ఆవశ్యక మైన గుణ - జాత్యాది సామగ్రి లేకపోయినను ఒక వ్యక్తి లేదా వస్తువు ఆ కార్యమును సాధించకలిగె నని వర్ణించినచో విశేషోక్తి. విశేషాయ = ఒక వ్యక్తియందు లేదా వస్తువునందు ఉన్న అతిశయమును సూచించుటకై, ఉక్తిః = గుణక్రియాదివైకల్యమును చెప్పుట విశేషోక్తి అని యర్థము. అతిశయోక్త్యలంకారములో వీర్యాద్యతియ వర్ణన మున్నను గుణక్రియాదివైకల్యము వర్ణింపబడదు. కారణము లేకున్నను కార్యము జనించుట అను విభావనాలంకారములో మరి యొక కారణము కాని, అట్లు కార్యమును జనింపజేయుట స్వభావసిద్ధ మని కాని ఊహింపబడును (విభావనా = ఊహ). ఈ విధముగ ఆ రెండు అలంకారములందును ప్రస్తుత విశేషము గమ్యము కాదు. "కారణము లున్నను కార్యము జనింపకపోవుట విశేషోక్తి" అని అర్వాచీనాలంకారికుల లక్షణము.

అవ. గుణవైకల్యవిశేషోక్తికి ఉదాహరణము :—

మూ. న కఠోరం న వా తీక్ష్ణమాయుధం పుష్పధన్వనః
తథాపి జితమేవాసీదమునా భువనత్రయమ్. 324

వ్యా. పుష్పధన్వనః = మన్మథుని, ఆయుధం = ఆయుధము, కఠోరం న = కఠినమైనది కాదు; న తీక్ష్ణం = తీక్ష్ణమైనది కాదు. తథాపి = అటులైనను,

ఉన్నాడు. సా ఏషా = ఇది, తేజస్వీతి విశేషణాత్ = "తేజస్వీ" అను విశేషణమును ప్రయోగించుటవలన, హేతువిశేషోక్తిః = హేతువిశేషోక్తి. సాధనములు సరిగా లేకున్నను సూర్యుడు ఆకాశపారమును పొందగలుగుచున్నాడు అని చెప్పుటచే సూర్యుని ప్రభావాతిశయము వ్యక్తమగుచున్నది. అట్టి సామర్థ్యమునకు కారణము తేజఃశాలిత్వమే అను విషయమును "తేజస్వీ" అను విశేషణము స్పష్టీకరించుచున్నది గాన ఇది హేతువిశేషోక్తి యని భావము. అన్యేషాం = ఇతరములైన, భేదానాం = భేదముల, ప్రకల్పనేఽపి = కల్పనమునందు కూడా, అయమేవ = ఇదియే, క్రమః = పద్ధతి.

( విశేషోక్తిచక్రము సమాప్తము )

అవ. తుల్యయోగితాలంకారమును నిరూపించుచున్నాడు :—

మూ. వివక్షితగుణోత్కృష్టైర్యత్సమీకృత్య కస్య చిత్
కీర్తనం స్తుతినిన్దార్థం సా మతా తుల్యయోగితా. 330

వ్యా. వివక్షితగుణోత్కృష్టైః = చెప్పదలచిన గుణములచే ప్రసిద్ధులైనవారితో, సమీకృత్య = సమముగచేసి, స్తుతినిన్దార్థం = స్తోత్రముకొరకు గాని నిందకొరకు గాని, కస్య చిత్ = ఒకానొకనియొక్క, యత్ = ఏ, కీర్తనం = వర్ణనము కలదో, సా = అది, తుల్యయోగితా = తుల్యయోగితగా, మతా = అంగీకరింపబడినది.

ఉపమాలంకారములో, సామ్యము శబ్దముచే స్పష్టముగ చెప్పబడును. ఈ అలంకారమున సామ్యము అర్థాత్సిద్ధము.

అవ. స్తుతియందు తుల్యయోగితాలంకారము :—

మూ. యమః కుబేరో వరుణః సహస్రాక్షో భవానపి
బిభ్రత్యనన్యవిషయాం లోకపాల ఇతి శ్రుతిమ్. 331

వ్యా యముడు, కుబేరుడు, వరుణుడు. ఇంద్రుడు, భవానపి = నీవును కూడ, అనన్యవిషయాం = ఇతరు లెవ్వరికిని లేని, లోకపాలాః ఇతి శ్రుతిమ్ = "లోకపాలులు" అను ప్రసిద్ధిని, బిభ్రతి = ధరించుచున్నారు.

లోకపాలకత్వ మనునది రాజుకు ఉన్న దని చెప్పవలె నను ఇచ్ఛతో, ఆ గుణముచే ప్రసిద్ధు లైన యమాదులను చెప్పి, వారితో ఈ రాజును కలిపి, వర్ణణము చేయబడినది. ఇది రాజస్తుత్యర్థము.

అవ. నిందయందు తుల్యయోగిత :—

మూ. సఙ్గతాని మృగాక్షీణాం తడిద్విలసితాని చ
క్షణద్వయం న తిష్ఠన్తి ఘనారబ్ధాన్యపి స్వయమ్. 332

( ఇతి తుల్యయోగితాచక్రమ్ )

వ్యా. స్వయం = స్వయముగ, ఘనారబ్ధాన్యపి = తీవ్రానురాగముతో ప్రారంభింపబడిన వైనను, (మేఘములచే ప్రారంభింపబడిన వైనను), మృగాక్షీణాం = స్త్రీల, సఙ్గతాని = సంగములు, తడిద్విలసితాని చ = మెరుపులును, క్షణద్వయం = రెండు క్షణములపాటు కూడ, న తిష్ఠన్తి = ఉండవు.

ఇచట చపలస్వభావములుగా ప్రసిద్ధములైన మెరపులతో కలిపి మృగాక్షీసంగమును వర్ణించుటచే ఇది నిందాగర్భతుల్యయోగిత. చాలసేపు ఉండక పోవుటయే నిందాహేతువు.

( తుల్యయోగితాచక్రము సమాప్తము )

అవ. విరోధాలంకారమును నిరూపించుచున్నాడు :—

మూ. విరుద్ధానాం పదార్థానాం యత్ర సంసర్గదర్శనమ్
విశేషదర్శనాయైవ స విరోధః స్మృతో యథా. 333

వ్యా. యత్ర = ఎచట, విశేషదర్శనాయ = ప్రస్తుతమైనదానియందలి విశేషమును చూపుటకొరకు, విరుద్ధానాం = విరుద్ధమైన, అనగా స్థూలదృష్టికి పరస్పరవిరుద్ధములుగ కనబడుచున్న, పదార్థానాం = పదార్థములయొక్క, సంసర్గదర్శనం = సంబంధమును చూపుట ఉండునో, సః = అది, విరోధః స్మృతః = విరోధాలంకారముగా చెప్పబడినది, యథా = ఎట్లనగా —

మూ. కూజితం రాజహంసానాం వర్ధతే మదమఞ్జులమ్
క్షీయతే చ మయూరాణాం రుతముత్క్రాన్తసౌష్ఠవమ్. 334

వ్యా. రాజహంసానాం = రాజహంసలయొక్క, మదమఞ్జులం = మదముచే మధురమైన, కూజితం = ధ్వని, వర్ధతే = వృద్ధిపొందుచున్నది. మయూరాణాం = నెమళ్లయొక్క, ఉత్క్రాన్తసౌష్ఠవం = తొలగిపోయిన మాధుర్యముగల, రుతం = ధ్వని, క్షీయతే = క్షీణించుచున్నది.

ఇచట ఒకే ధ్వనియందు వృద్ధిక్షయరూపము లగు విరుద్ధధర్మములు వర్ణింపబడినవి. ప్రకృతమున వర్ణనీయ మగు శరదృతువునకు, రెండు పక్షుల ధ్వనులు సజాతీయములే యైనను ఒక దానిని వృద్ధిపొందించి రెండవ దానిని క్షీణింపచేయు సామర్థ్య మున్న దని సూచించుటచే విరోధాలంకారము. ఇచట రెండు క్రియలకు విరోధము.

అవ. గుణవిరోధమునకు ఉదాహరణము —

మూ. ప్రావృషేణ్యైర్జలధరై రమ్బరం దుర్దినాయతే
రాగేణ పునరాక్రాన్తం జాయతే జగతాం మనః. 335

వ్యా. అమ్బరం = ఆకాశము, ప్రావృషేణ్యైః = వర్షకాలమునకు సంబంధించిన, జలధరైః = మేఘములచే, దుర్దినాయతే = మేఘచ్ఛన్న మగుటచే నల్లగ ఉన్నది. దిన మంతయు ఆకాశము మేఘచ్ఛన్న మైనచో ఆ దినమునకు దుర్దిన మని పేరు. జగతాం = మానవుల, మనః పునః = మనస్సైతే, రాగేణ = రాగముచే, (అనురాగము, ఎరువు అని రెండర్థములు) ఆక్రాన్తం = ఆక్రమింపబడినదై, జాయతే = అగుచున్నది.

నల్లగానుండు మేఘము రాగమును (ఎరుపును) కలిగించుచున్నట్లు వర్ణించుటచే శ్యామత్వరక్తత్వగుణములు పరస్పరవిరుద్ధములు గాన విరోధాలంకారము. దీనిచే వర్షాకాలవైశిష్ట్యము సూచిత మగుచున్నది.

మూ. తనుమధ్యా పృథుశ్రోణి రక్తోష్ఠమసితేక్షణమ్,
నతనాభి వపుః స్త్రీణాం కం న హన్త్యున్నతస్తనమ్ 336

వ్యా. తనుమధ్యం = సన్నని నడుము కలదియు, పృథుశ్రోణి = విశాలనితంబము కలదియు, రక్తోష్ఠం = ఎఱ్ఱనైన ఓష్ఠములు కలదియు, అసితేక్షణం = నల్లని నేత్రములు కలదియు, నతనాభి = లోతైన నాభి కలదియు, ఉన్నతస్తనం = ఉన్నత మైన స్తనములు కలదియు అగు, స్త్రీణాంవపుః = స్త్రీల శరీరము, కం = ఎవనిని, న హన్తి = పీడింపదు.

ఇచట ఒకే వనితయొక్క అవయవములలో తనుత్వపృథుత్వములు, రక్తత్వనీలత్వములు, నతత్వోన్నతత్వములు అను విరుద్ధగుణము లున్నట్లు వర్ణించుటచే విరోధాలంకారము.

మూ. మృణాలబాహు రమ్భోరు పద్మోత్పలముఖేక్షణమ్
అపి తే రూపమస్మాకం తన్వి తాపాయ కల్పతే 337

వ్యా. హే తన్వి = ఓ కృశాంగీ, మృణాలబాహు = తామరతూడుల వంటి బాహువులు కలదైనను, రమ్భోరు = అరటిచెట్లవంటి తొడలు కలదైనను, పద్మోత్పలముఖేక్షణమపి = పద్మమువంటి ముఖము నల్లకలువలవంటి నేత్రములు కలదైనను, తే రూపం = నీ రూపము, అస్మాకం = మాయొక్క, తాపాయ కల్పతే = తాపమును కలిగించుటకు సమర్థ మగుచున్నది.

మృణాలాదులతో సమానమైన అవయవములు గల శరీరము చల్లగ నుండుటకు బదులు తాపకర మగుటచే విరోధాలంకారము,

మూ. ఉద్యానమారుతోద్ధూతాశ్చూతచమ్పకరేణవః
ఉదశ్రయన్తి పాన్థానామస్పృశన్తోఽపి లోచనే. 338

వ్యా. ఉద్యానమారుతోద్ధూతాః - ఉద్యానవాయువులచే ఎగరగొట్టబడిన, చూతచమ్పకరేణవః = చూత - చంపకపుష్పముల పరాగములు. పాన్థానాం =

బాటసారుల, లోచనే = నేత్రములను, అస్పృశన్తోఽపి = స్పృశింపకపోయినను. ఉదశ్రయన్తి = అశ్రుపూర్ణములను చేయుచున్నవి.

కండ్లలో పుప్పొడి పడకపోయినను కన్నీరు వచ్చుట విరుద్ధము. దీనిచే పాంథుల వియోగదుఃఖము సూచిత మగుచున్నది.

అవ. శ్లేషమూలక మగు విరోధము :—

మూ. కృష్ణార్జునానురక్తాపి దృష్టిః కర్ణావలమ్బినీ
యాతి విశ్వసనీయత్వం కస్య తే కలభాషిణి. 339

ఇత్యనేకప్రకారోఽయమలఙ్కారః ప్రతీయతే.
(ఇతి విరోధచక్రమ్)

వ్యా. హే కలభాషిణి = ఓ మధురభాషిణీ, కృష్ణార్జునానురక్తాపి = కృష్ణునియందును అర్జునునియందును అనురాగము కలదైనను, కర్ణావలమ్బినీ = కర్ణుని ఆశ్రయించుచున్న, తే దృష్టిః = నీ దృష్టి, కస్య = ఎవనికి, విశ్వసనీయతాం = విశ్వాసయోగ్యత్వమును, యాతి = పొందును !

విరోధు లగువారి విషయమున ప్రేమచూపుటచే విరోధము. కృష్ణా = కొంతభాగమున నల్లనిదియు, అర్జునా = కొంతభాగమున తెల్లనిదియు, అనురక్తా = ప్రాంతభాగములందు ఎఱ్ఱనిదియు కర్ణావలమ్బినీ = కర్ణములను స్పృశించునదియు, అగు దృష్టి - అని అర్థము చెప్పినచో విరోధపరిహారము. ఈ విధముగ ఇచట విరోధము శ్లేషమూలకము.

( విరోధచక్రము సమాప్తము )

అవ అప్రస్తుతప్రశంసాలంకారమును నిరూపించుచున్నాడు :—

మూ. అప్రస్తుతప్రశంసా స్యాదప్రక్రాన్తేషు యా స్తుతిః. 340

వ్యా. అప్రక్రాన్తేషు = అప్రస్తుత మైనవాటి విషయమున, యా = ఏ, స్తుతిః = స్తోత్రము కలదో, అది, అప్రస్తుతప్రశంసా స్యాత్ = అప్రస్తుతప్రశంసా

లంకారము అగును. ప్రస్తుత మైన దానిని నిందించుటకై అప్రస్తుతమైనదానిని స్తుతించుట అని అర్థము.

అవ. అప్రస్తుతప్రశంసకు ఉదాహరణము :—

మూ. సుఖం జీవన్తి హరిణా వనేష్వపరసేవినః
అన్నైరయత్నసులభై స్తృణదర్భాఙ్కురాదిభిః. 341

వ్యా హరిణాః = లేళ్లు, అపరసేవినః = ఇతరులను సేవించనివై, అయత్నసులభైః = అప్రయత్నముగా లభ్యము లైన, తృణదర్భాంకురాదిభిః = గడ్డి, దర్భల అంకురములు మొదలగు, అన్నైః = ఆహారములతో, సుఖం = సుఖముగా, జీవన్తి = జీవించుచున్నది.

మూ. సేయమప్రస్తుతై వాత్ర మృగవృత్తిః ప్రశస్యతే
రాజానువర్తనక్లేశనిర్విణ్ణేన మనస్వినా. 342

( ఇత్యప్రస్తుతప్రశంసాచక్రమ్ )

వ్యా. అత్ర = ఇచట, రాజానువర్తనక్లేశనిర్విణ్ణేన = రాజుల సేవవలన కష్టముచే విసుగుచెందిన, మనస్వినా = ఆత్మాభిమానవంతునిచేత, సా ఇయం = ఈ. మృగవృత్తిః = మృగముల జీవనవిధానము, ప్రశస్యతే = ప్రశంసింపబడు చున్నది.

ఈ మృగప్రశంసచే రాజసేవకుని నింద ప్రతీతమగుచున్నది గాన ఇది అప్రస్తుత ప్రశంస.

(అప్రస్తుతప్రశంసాచక్రము సమాప్తము)

అవ. వ్యాజస్తుతిని నిరూపించుచున్నాడు :-

మూ. యది నిన్దన్నివ స్తౌతి వ్యాజస్తుతిరసౌ స్మృతా
దోషాభాసా గుణా ఏవ లభ్యన్తే హ్యత్ర సన్నిధిమ్. 343

వ్యా. నిన్దన్నివ = నిందించుచున్నవానివలె, స్తౌతి యది = స్తుతించి నట్లైతే, అసౌ = ఇది, వ్యాజస్తుతిః = వ్యాజస్తుత్యలంకారముగా, స్మృతా = చెప్పబడినది. అత్ర = ఇచట, గుణా ఏవ = గుణములే, దోషాభాసాః = దోషముల వలె కనబడుచు, సన్నిధిం = సాంనిధ్యమును, లభన్తే = పొందును ప్రయోగింపబడును అని అర్థము.

పైకి నింద వలె కనబడుచున్నను స్తోత్రమే గమ్యమాన మగుచో అది వ్యాజస్తుతి. అనగా నిందావ్యాజముచే స్తుతి, అని దండి అభిప్రాయము. స్తుతించి నట్లు కనబడినను నిందయే గమ్యమాన మైనచో అది కూడ వ్యాజస్తుతియే యని మమ్మటాదులు చెప్పినారు.

అవ. వ్యాజస్తుతికి ఉదాహరణము :-

**మూ. తాపసేనాపి రామేణ జితేయం భూతధారిణీ**

**త్వయా రాజ్ఞాపి సైవేయం జితా మా భూన్మదస్తవ.** 344

వ్యా. తాపసేనాపి = (సైన్యాదులు లేక) తపస్సు చేసుకొనువాడైనను, రామేణ = పరశురామునిచేత, ఇయం = ఈ, భూతధారిణీ = భూమి, జితా = జయింపబడినది. రాజ్ఞాపి = రాజువైనను, త్వయా = నీచేత, సా ఇయమేవ = ఆ భూమి మాత్రమే, జితా = జయింపబడినది. తవ = నీకు, మదః = గర్వము. మా భూత్ = లేకుండుగాక.

సాధనసంపద ఏమియు లేని పరశురాముడు ఏ భూమిని జయించినాడో ఆ మాత్రము భూమినే చతురంగబలాదిసాధనసంపద గల నీవును జయించినావు. ఇందు గర్వింపదగిన దేమి ఉన్నది అని పైకి నింద వలె కనబడుచున్నను, నీవు భూమండలము నంతను జయించిన మహాపరాక్రమశాలివి అను స్తుతి గమ్యమగుచున్నది గాన ఇది వ్యాజస్తుతి.

అవ. అర్థశ్లేషమూలక మగు వ్యాజోక్తిని ఉదాహరించుచున్నాడు :-

**మూ. పుంసః పురాణాదాచ్ఛిద్య శ్రీస్త్వయా పరిభుజ్యతే**

**రాజన్నిక్ష్వాకువంశ్యస్య కిమిదం తవ యుజ్యతే.** 345

వ్యా. హే రాజన్ = ఓ రాజా, పూరాణాత్ పుంసః = మహావిష్ణువు నుండి (వృద్ధుని నుండి అని రెండవ అర్థము), ఆచ్ఛిద్య = బలాత్కారముగ లాగికొని, త్వయా = నీచేత, శ్రీః = లక్ష్మి, పరిభుజ్యతే = అనుభవింపబడు చున్నది. ఇక్ష్వాకువంశ్యస్య = ఇక్ష్వాకువంశమునకు సంబంధించిన, తవ = నీకు, ఇదం = ఇది, యుజ్యతేకిమ్ = తగియున్నదా ?

పురాణపురుషుని నుంచి బలాత్కారముగా గ్రహించిన శ్రీని అనుభ వించుట మంచిది కాదు అను నిందచే నీవు అపారసంపద కాలవాడవు అను స్తుతి గమ్య మగుచున్నది. 'పురాణ' 'శ్రీ' శబ్దములలో అర్థశ్లేష.

అవ. శ్లేషమూలక మగు వ్యాజస్తుతిని ఉదాహరించుచున్నాడు.

మూ. భుజఙ్గభోగసంసక్తా కలత్రం తవ మేదినీ
అహఙ్కారః పరాం కోటి మారోహతి కుత స్తవ. 346

వ్యా. తవ = నీయొక్క, కలత్రం = భార్యయైన (భోగ్యురాలు, పరి పాలింపదగినది అనికూడ అర్థము), మేదినీ = భూమి, భుజఙ్గభోగసంసక్తా = ఆదిశేషుని పడగలపై నిలచి యున్నది (విటుల భోగమునందు ఆసక్తి కలది). తవ = నీయొక్క, అహఙ్కారః = అహంకారము, కుతః = ఎందువలన, పరాం కోటిం = అత్యున్నత మైన కోటిని, ఆరోహతి = అధిష్ఠించుచున్నది.

ఈ నిందచే "నీవు సార్వభౌముడవు" అను స్తుతి గమ్య మగుచున్నది. 'భుజఙ్గ-భోగ' శబ్దములు శ్లిష్టము లగుటచే ఇది శబ్దశ్లేషమూలక మగు వ్యాజస్తుతి.

మూ. ఇతి శ్లేషానువిద్ధానామన్యేషాం చోపలక్ష్యతామ్
వ్యాజస్తుతిప్రకారాణామపర్యన్తస్తు విస్తరః. 347

( ఇతి వ్యాజస్తుతిః )

వ్యా. ఇతి = ఈ విధముగా, శ్లేషానువిద్ధానాం = శ్లేషతో సంబంధించి నవియు, అన్యేషాం చ = ఇతరవిధములును, అనగా ఇతరాలంకారములతో సంబం ధించినవియు అగు, వ్యాజస్తుతిప్రకారాణాం = వ్యాజస్తుతిభేదముల, అపర్యన్తః

= అనంతమైన, విస్తరః = విస్తరము, ఉపలక్ష్యతామ్ = (స్వయముగ) ఊహించుకొనబడుగాక.

( వ్యాజస్తుత్యలంకారము సమాప్తము )

అవ. నిదర్శనాలంకారమును నిరూపించుచున్నాడు :–

మూ. అర్థాన్తరప్రవృత్తేన కిఞ్చిత్తత్సదృశం ఫలమ్
సదసద్వా నిదర్శ్యేత యది తత్స్యాన్నిదర్శనమ్. 348

వ్యా. అర్థాన్తరప్రవృత్తేన = ఏదియో ఒక కార్యమును చేయుటకై ఉద్యమించినవానిచేత, తత్సదృశం = దానితో సమాన మైన, సత్ = మంచిదిగాని, అసద్వా = చెడ్డది కాని అయిన, కించిత్ = ఏదైన, ఫలం = ఫలము, నిదర్శ్యేత యతి = బోధింపబడినచో, తత్ = అది, నిదర్శనం = నిదర్శనము అను అలంకారముగా స్యాత్ = అగును.

అవ. సత్ఫలనిదర్శనమునకు ఉదాహరణము :–

మూ. ఉదయన్నేష సవితా పద్మేష్వర్పయతి శ్రియమ్
విభావయితుమృద్ధీనాం ఫలం సుహృదనుగ్రహమ్. 349

వ్యా. ఏషః = ఈ, సవితా = సూర్యుడు, ఉదయన్ = ఉదయించుచు (అభివృద్ధిని పొందుచు) సుహృదనుగ్రహం = మిత్రుల అనుగ్రహమునే, మిత్రులకు సహాయముచేయుటనే, ఋద్ధీనాం = ఐశ్వర్యముల, ఫలం = ఫలమునుగా, విభావయితుం = తెలుపుటకై, పద్మేషు = పద్మములయందు, శ్రియం = శోభను, (ఐశ్వర్యమును) అర్పయతి = అర్పించుచున్నాడు.

తాను ఉదయించగనే పద్మములను శ్రీసంపన్నములనుగా చేయుచున్న సూర్యుడు, ఎవరైన ఒక వ్యక్తి అభివృద్ధి పొందినందులకు సత్ఫల మేమనగా మిత్రులకు ఉపకారము చేయుటయే అను విషయమును, తెలుపుచున్నట్లు వర్ణింపబడినది గాన ఇది నిదర్శనము.

అవ. అసత్పుల నిదర్శనమునకు ఉదాహరణము :-

మూ. యాతి చన్ద్రాంశుభిః స్పృష్టా ధ్వాన్తరాజీ పరాభవమ్
సద్యో రాజవిరుద్ధానాం సూచయన్తీ దురన్తతామ్. 350

(ఇతి నిదర్శనచక్రమ్)

వ్యా చన్ద్రాంశుభిః = చంద్రుని కిరణములచే, స్పృష్టా = స్పృశింపబడిన, ధ్వాన్తరాజీ = అంధకారపంక్తి, రాజ విరుద్ధానాం = రాజుతో విరోధము పెట్టుకున్న వారికి (రాజ శబ్దమునకు 'చంద్రుడు' 'రాజు' అని రెండు అర్థములు) సద్యః = వెంటనే, దురన్తతాం = దుఃఖకర మైన అవసానము కలుగును అను విషయమును, సూచయన్తీ = సూచించుచున్నదై, పరాభవం యాతి = పరాభవమును పొందుచున్నది.

(నిదర్శనాలంకారము సమాప్తము)

అవ. సహోక్తి పరివృత్త్యలంకారములను చెప్పుచున్నాడు :

మూ. సహోక్తిః సహభావేన కథనం గుణకర్మణామ్
అర్థానాం యో వినిమయః పరివృత్తిస్తు సా స్మృతా. 351

వ్యా. గుణకర్మణాం = గుణములను కర్మలను, కర్మ అనగా ఇచట క్రియ, ఉపలక్షణచే ద్రవ్యములను కూడ గ్రహింపవలెను, సహభావేన = కలిసి ఉన్నట్లుగా, కథనం = చెప్పుట, సహోక్తిః = సహోక్త్యలంకారము. అర్థానాం = పదార్థములయొక్క, యః = ఏ, వినిమయః = మార్పిడి కలదో, ఒక దాని నిచ్చి మరి యొక దానిని గ్రహించుట వినిమయము. సా = అది, పరివృత్తిఃస్మృతా = పరివృత్త్యలంకారముగా చెప్పబడినది

అవ. గుణసహోక్తికి ఉదాహరణము :-

మూ. సహదీర్ఘా మమ శ్వాసైరిమాః సంప్రతి రాత్రయః
పాణ్డురాశ్చ మమైవాఙ్గైః సహ తాశ్చన్ద్రభూషణాః. 352

వ్యా. ఇవి ఒక విరహిణి పలుకుచున్న మాటలు. సంప్రతి = ఇప్పుడు, ఇమాః = ఈ, రాత్రయః = రాత్రులు, మమ శ్వాసైఃసహ = నా నిఃశ్వాసములతో కూడ, దీర్ఘాః = దీర్ఘ మైనవి. నా నిఃశ్వాసము లెట్లు దీర్ఘములో రాత్రులు కూడ అట్లే దీర్ఘములుగ నున్నవి అని ఉపమానోపమేయ భావము గమ్యము. అదియే చమత్కారహేతువు. చన్ద్రభూషణాః = చంద్రుడే అలంకారముగా గల, తాః = ఆ రాత్రులు, మమైవ = నా యొక్కయే, అఙ్గైః సహ = అవయవములతో కూడ, పాణ్డురాః = తెల్లగా నున్నవి. మొదటి ఉదాహరణములో రెండు ద్రవ్యములకు సంబంధించిన దీర్ఘత్వగుణములును, రెండవ ఉదాహరణములో పాండురత్వ గుణములును కలిసి ఉన్నట్లు వర్ణింపబడినవి గాన సహోక్త్యలంకారము.

అవ. క్రియాసహోక్తికి ఉదాహరణము :—

మూ. వర్ధతే సహ పాన్థానాం మూర్ఛయా చూతమఞ్జరీ.
పతన్తి చ సమం తేషామసుభిర్మలయానిలాః. 353

వ్యా. చూతమఞ్జరీ = చూతపుష్పముల గుత్తి, పాన్థానాం = బాటసారులయొక్క, మూర్ఛయా సాకం = మూర్ఛతో కూడ, వర్ధతే = వృద్ధి పొందుచున్నది. చూతమంజరియు, పాంథమూర్ఛయు వృద్ధి పొందుచున్నవి అని అర్థము. తేషాం = ఆ పాంథుల, అసుభిః సమం = ప్రాణములతో కూడ, మలయానిలాః = మలయవాయువులు, పతన్తి = ప్రసరించుచున్నవి. ప్రాణముల పక్షమున 'పతన్తి' అనగా ఎగిరిపోవుచున్నవి అని అర్థము. పూర్వార్ధములో వర్ధన క్రియలకును, ఉత్తరార్ధములో పతన క్రియలకును సహోక్తి.

మూ. కోకిలాలాపసుభగాః సుగన్ధివనవాయవః
యాన్తి సార్ధం జనానన్దైర్వృద్ధిం సురభివాసరాః. 354

వ్యా. కోకిలాలాపసుభగాః = కోకిలధ్వనులచే మనోహర మైనవియు, సుగన్ధివనవాయవః = పరిమళించుచున్న వనవాయువులు కలవియు అగు, సురభి వాసరాః = వసన్త దివసములు, జనానన్దైఃసార్ధం = జనుల ఆనందములతో కూడా,

వృద్ధింయాన్తి = వృద్ధిపొందుచున్నవి. ఇచట రెండు వృద్ధిగమన క్రియలకు సహోక్తి

**మూ. ఇత్యుదాహృతయో దత్తాః సహోక్తేరత్ర కాశ్చన**
**క్రియతే పరివృత్తేశ్చ కిఞ్చిద్రూపనిదర్శనమ్. 355**

(ఇతి సహోక్తిః)

వ్యా. ఇతి = ఈ విధముగ, సహోక్తేః = సహోక్త్యలంకారమునకు, కాశ్చన = కొన్ని, ఉదాహృతయః = ఉదాహరణములు, అత్ర = ఇచట, దత్తాః = ఇవ్వబడినవి. పరివృత్తేశ్చ = పరివృత్త్యలంకారమునకు గూడ, కిఞ్చిత్ = కొంచెము, రూప నిదర్శనం = స్వరూప దర్శనము, క్రియతే = చేయ బడుచున్నది.

**మూ. శస్త్రప్రహారం దదతా భుజేన తవ భూభుజామ్**
**చిరార్జితం హృతం తేషాం యశః కుముదపాణ్డురమ్. 356**

(ఇతి పరివృత్తిః)

వ్యా. భూభుజాం = రాజులకు, శస్త్రప్రహారం = ఆయుధ ప్రహార మును, దదతా = ఇచ్చిన, తవ భుజేన = నీ భుజముచేత, చిరార్జితం = చిర కాలమునుండి సంపాదింపబడినదియు, కుముదపాణ్డురం = తెల్లకలువలవలె తెల్ల నైనదియు అగు, తేషాం యశః = వారి కీర్తి, హృతం = తీసికొనబడినది.

శస్త్రప్రహారము నిచ్చి యశస్సును గ్రహించి నట్లు వర్ణింపబడినది గాన ఇది పరివృత్త్యలంకారము. ఈ పరిస్పృత్తిలో సమమైనదాని నిచ్చి సమమైన దానిని తీసికొనుట, తక్కువదాని నిచ్చి ఎక్కువదానిని తీసికొనుట, ఎక్కువ దాని నిచ్చి తక్కువ దానిని తీసికొనుట అను మూడు భేదములను అర్వాచీనులు చెప్పిరి. ఇది ద్వితీయభేదమునకు ఉదాహరణము.

(పరివృత్త్యలంకారము సమాప్తము)

అవ. ఆశీరలంకారమును నిరూపించుచున్నాడు :-

**మూ. ఆశీర్నామాభిలషితే వస్తున్యాశంసనం యథా**
**పాతు వః పరమం జ్యోతిరవాఙ్మనసగోచరమ్. 357**

వ్యా. అభిలషితే = ఇష్టమైన, వస్తుని = వస్తువు విషయమున, ఆశంసనం = కోరికను ప్రకటించుట, ఆశీర్నామ = ఆశీః అను పేరు గల అలంకారము. యథా = ఎట్లనగా-అవాఙ్మనసగోచరం = వాక్కునకు గాని మనస్సునకు గాని అందని, పరమం జ్యోతిః = గొప్ప తేజస్సు, పరమాత్మ, వః = మిమ్ములను, పాతు = రక్షించుగాక.

కొందరు దీనిని అలంకారముగ అంగీకరింపలేదు. సాహిత్యదర్పణకారాదులు దీనిని నాట్యాలంకారముగ, అనగా రూపకములలో మాత్రము ప్రయోగించు అలంకారముగ అంగీకరించినారు. ఇది ప్రేయోలంకారములో అంతర్భూతమని కొందరి అభిప్రాయము.

అనన్వయససన్దేహావుపమాస్వేవ దర్శితౌ
ఉపమారూపకం చాపి రూపకేష్వేవ దర్శితమ్. 358
ఉత్ప్రేక్షాభేద ఏవాసావుత్ప్రేక్షావయవోఽపి చ.

వ్యా: అనన్వయససన్దేహౌ = అనన్వయ ససందేహాలంకారములు, ఉపమాస్వేవ = ఉపమాలంకార భేదములలోనే, దర్శితౌ = చూపబడినవి. అనగా అనన్వయాలంకారము ఉపమా భేదములలో ఒకటైన అసాధారణోపమలో (చూ. II. 35) అంతర్గతము ససన్దేహము సంశయోపమలో (చూ. II. 26) అంతర్గతము. అందుచే వాటిని స్వతంత్రాలంకారములుగ అంగీకరింప పని లేదని అర్థము. భామహుడు వీటిని స్వతంత్రాలంకారములుగ పేర్కొనినాడు (చూ. కావ్యాలంకారము. III-45, 46. III. 43, 44). ఉపమారూపకం చాపి = ఉపమారూపకము కూడా, రూపకేష్వేవ = రూపకాలంకార భేదములందే, దర్శితం = చూపబడినది. (చూ. II. 88.) భామహుడు దీనిని స్వతంత్రాలంకారముగ అంగీకరించినాడు (చూ. కావ్యాలంకారము. III. 35, 36). అసౌ = ఈ, ఉత్ప్రేక్షావయవోఽపిచ = ఉత్ప్రేక్షావయవము కూడా, ఉత్ప్రేక్షాభేద ఏవ = ఉత్ప్రేక్షలో ఒక భేదమే. స్వతంత్రాలంకారము కాదు. భామహుడు దీనిని స్వతంత్రాలంకారముగ అంగీకరించియున్నాడు (చూ. కావ్యాలంకారము. III. 47, 48) దండి అభిప్రాయము ప్రకారము ఇది శ్లేషరూపకాది సంకీర్ణోత్ప్రేక్ష.

అవ. సంసృష్ట్యలంకారములను నిరూపించుచున్నాడు :—

మూ. నానాలఙ్కారసంసృష్టిః సంసృష్టిస్తు నిగద్యతే. 359

మూ. అఙ్గాఙ్గిభావసంస్థానం సర్వేషాం సమకక్షతా
ఇత్యలఙ్కారసంసృష్టేర్లక్షణీయా ద్వయీ గతిః. 360

వ్యా. నానాలఙ్కారసంసృష్టిః తు = అనేకవిధములైన అలంకారముల కలయిక యైతే, సంసృష్టిః = సంసృష్టి యని, నిగద్యతే = చెప్పబడుచున్నది. ఒక వాక్యములో అనేకములైన అలంకారములు కలిసి యుండుటకు సంసృష్టి అని పేరు. అఙ్గాఙ్గిభావసంస్థానం = (ఒకవాక్యములలో నున్న) అనేకాలంకారములలో ఒకటి అంగిగను (ప్రధానముగను) మిగిలినవి అంగములుగను అప్రధానములుగను) ఉండుటయు. సర్వేషాం = అన్ని అలంకారములును, సమకక్షతా = సమప్రాధాన్యము కలిగియుండుట, ఇతి = ఈ విధముగా, అలఙ్కారసంసృష్టేః = అలఙ్కారసంసృష్టికి, ద్వయీ = రెండువిధములైన, గతిః = పద్ధతి, లక్షణీయా = గ్రహింపదగినది.

కలసి ఉన్న అలంకారములలో ఒకటి ప్రధానమై మిగిలిన వన్నియు దానికి అంగములుగా నున్నచో అది యొక సంసృష్టిభేదము, అన్ని అలంకారములును సమప్రాధాన్యము కలవైనచో అది రెండవ భేదము అని యర్థము. కాని అర్వాచీనాలంకారికులు, సమప్రాధాన్య మున్నచో సంసృష్టియనియు, గుణప్రధానభావ మున్నచో సంకర మనియు అంగీకరించిరి.

అవ. అంగాగిభావసంసృష్టికి ఉదాహరణము :—

మూ. ఆక్షిపన్త్యరవిన్దాని ముగ్ధే తవ ముఖశ్రియమ్
కోశదణ్డసమగ్రాణాం కిమేషామస్తి దుష్కరమ్. 361

వ్యా. హే ముగ్ధే = ఓ బాలా! అరవిన్దాని = పద్మములు, తవ = నీయొక్క, ముఖశ్రియం = ముఖలక్ష్మిని, ఆక్షిపన్తి = గ్రహించుచున్నవి.

కోశదణ్డసమగ్రాణాం = కోశముచేతను, (మొగ్గ, ధనాగారము అని రెండర్థములు, దండముచేతను ( కాడ. దండోపాయము అని రెండర్థములు ) పూర్ణమైన) ఏషాం = వీటికి, దుష్కరం = చేయ శక్యము కానిది, కిం = ఏది, అస్తి = ఉన్నది ? "ఆక్షిపన్తి" అనగా బలాత్కారముగ లాగుకొను చున్న వని యర్థము. ఇచట నీముఖముతో సామ్యమును పొందుచున్నవి అని అర్థమగుటచే పూర్వార్ధమున ఉపమాలంకారము. దీనికి 'కోశ' 'దణ్డ' పదములందు శ్లేషచే అనుప్రాణితమైన అర్థాన్తరన్యాసాలంకారము అంగముగా నున్నది గాన ఇది అంగాంగిభావసంసృష్టి.

అవ. సమకక్షతాసంసృష్టికి ఉదాహరణము :—

**మూ. లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీవాఞ్జనం నభః**
**అసత్పురుషసేవేవ దృష్టిర్నిష్ఫలతాం గతా. 362**

వ్యా. ఈ శ్లోకము 226 శ్లోకముగా వెనుక వచ్చినది. ఈ శ్లోకములో పూర్వార్ధమున రెండు ఉత్ప్రేక్షలును, ఉత్తరార్ధమున ఉపమాలంకారమును ఉన్నవి. అవి పరస్పరనిరపేక్షము లగుటచే ఇది సమకక్షతాసంసృష్టికి ఉదాహరణము.

**మూ. శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్**
**భిన్నం ద్విధా స్వభావోక్తిర్వక్రోక్తిశ్చేతి వాఙ్మయమ్. 363**

(ఇతి సంసృష్టిః)

వ్యా. ప్రాయః = సాధారణముగా, సర్వాసు = సమస్తమైన, వక్రోక్తిషు = వక్రోక్తులయందు. అనగా ఉక్తివైచిత్ర్యమూలకము లగు అలంకారముల యందు, శ్లేషః = శ్లేష, శ్రియం = శోభను, పుష్ణాతి = పెంచును. శ్లేషసంపర్క ముండుటచే అలంకారముల సౌందర్యము ఇనుమడించును. వాఙ్మయం = వాఙ్మయ మంతయు, స్వభావోక్తిః = స్వభావోక్తి యనియు, వక్రోక్తిశ్చేతి = వక్రోక్తి యనియు, ద్విధా = రెండు విధములుగా, భిన్నం = భిన్నమైనది. అనగా వాఙ్మయము నంతను స్థూలముగా, రెండు విధములుగ విభజింపవచ్చును. యథార్థ

స్వరూపమును వర్ణించు పద్ధతి ఒకటి. అదియే స్వభావోక్తి. కల్పనావైచిత్ర్యము తోడను, రచనావైచిత్ర్యముతోడను వర్ణించు పద్ధతి మరి యొకటి, అదియే వక్రోక్తి అని అర్థము. ఈవిధముగ దండి స్వభావోక్తి - వక్రోక్తులు రెండింటికిని తుల్య మగు ప్రాధాన్యమిచ్చెను. కాని కుంతకుడు స్వభావోక్తికి కావ్యమునందు ఎట్టి ప్రాధాన్యముకూడ లేదని చెప్పియున్నాడు.

ఇచట పైన చెప్పిన అర్థమును అంగీకరించినచో 'శ్లేషః సర్వాసు' ఇత్యాదిపూర్వార్థము అప్రస్తుతప్రసంగ మని తోచును. కొన్ని అలంకారములలో శ్లేష ఉండిన ఉండవచ్చును కాని, అన్ని అలంకారములందును శ్లేషసంపర్కము చేతనే శోభాతిశయ ముండును అని చెప్పుట కూడ అనుభవ విరుద్ధము. కావున ఇది అనేకాలంకారసంశ్లేషరూప మగు సంసృష్టిని ప్రతిపాదించు ఘట్టము గాన 'శ్లేషః' అనగా 'సంశ్లేషము', 'కలయిక' అని యర్థము. అనగా పైన చూపిన విధముగ అనేకము లైన అలంకారముల కలయికచే వక్రోక్తులలో, అనగా ఉక్తి వైచిత్ర్యప్రధానము లగు రచనలలో, సౌందర్యము ఇనుమడించును అని అర్థము చెప్పిన బాగుండు నని తోచుచున్నది. దీనిని బట్టి 'వక్రోక్తిషు' అనుదానికి "ఉక్తివైచిత్ర్యమూలకములగు అలంకారములందు" అని కాక "అలంకార ప్రధానములగు రచనలయందు" అని యర్థము చెప్పవలెను. ఉక్తియందు వక్రత్వ మనగా వివిధాలంకారయుక్తత్వమే కదా ? ఏతద్విరుద్ధ మగు, అలంకారరహిత మగు ఉక్తి, అనగా రచన, స్వభావోక్తి, ఈ విధముగ దండి అలంకారప్రధాన మగు వక్రోక్తి, తద్రహిత మగు స్వభావోక్తి అని వాఙ్మయము నంతను రెండు విధముల స్థూలముగ విభజించి వక్రోక్తిలో అనేకాలంకారసంశ్లేషము సౌందర్యాతిశయహేతు వని చెప్పుచున్నట్లు కనబడుచున్నది.

( సంసృష్ట్యలంకారము సమాప్తము )

అవ. ఇపుడు సర్వాలంకారములకంటెను ప్రధాన మైన భావిక మను ప్రబంధగుణమునుగూర్చి చెప్పుచున్నాడు :—

**మూ. తద్భావికమితి ప్రాహుః ప్రబన్ధవిషయం గుణమ్**
**భావః కవేరభిప్రాయః కావ్యేష్వాసిద్ధి సంస్థితః. 364**

వ్యా. ప్రబంధవిషయం = మహాకావ్య - నాటక-ఆఖ్యాయికాది ప్రబంధములకు సంబంధించిన, గుణం = గుణమును, తత్ = ఆ, భావికం = భావికమునుగా, ప్రాహుః = చెప్పుదురు. పూర్వోక్తాలంకారము లన్నియు వాక్యాదిగతములై యుండును. కాని ఈ భావికము ప్రబంధము నంతను వ్యాపించి యుండును. కావ్యేషు = కావ్యములందు, ఆసిద్ధి = సమాప్తి వరకును, సంస్థితః = ఉన్న, కవేఃఅభిప్రాయః = కవియొక్క అభిప్రాయము, భావః = భావము. అట్టి భావము నుండి ప్రవర్తించినది గాన ఇది భావిక మని యర్థము.

అవ. ఇపుడు కవియొక్క అభిప్రాయమునకు గోచరములగు కొన్ని ప్రబంధధర్మములను చెప్పుచున్నాడు :—

మూ. పరస్పరోపకారిత్వం సర్వేషాం వస్తుపర్వణామ్
విశేషణానాం వ్యర్థానామక్రియా స్థానవర్ణనా. 365
వ్యక్తిరుక్తిక్రమబలాద్గమ్భీరస్యాపి వస్తునః
భావాయత్తమిదం సర్వమితి తద్భావికం విదుః. 366

వ్యా. సర్వేషాం = సమస్తమైన, వస్తుపర్వణాం = ఆధికారికేతివృత్తములు, ప్రాకరణికేతివృత్తములును, పరస్పరోపకారిత్వం = పరస్పరము ఉపకారకములుగా నుండుట, రామాయణాదిప్రబంధములలో రామకథ మొదటి నుండి చివరవరకు నడుచుచు ప్రధానమగుటచే ఆధికారికేతివృత్తము. సుగ్రీవాది కథ మధ్య మధ్య వచ్చుచుండుటచే ప్రాకరణికేతివృత్తము. ఈ రెండింటికిని సంబంధ ముండవలెను అనియర్థము. వ్యర్థానాం విశేషణానాం = వ్యర్థవిశేషణముల, అక్రియా = ప్రయోగము చేయకుండుట. స్థానవర్ణనా = ప్రకృతోపయుక్తములగు విషయముల వర్ణనము, ఉక్తిక్రమబలాత్ = వాక్యక్రమవిన్యాససామర్థ్యమువలన, అనగా యుక్తమైన వాక్యములను ప్రయోగించుటవలన, గమ్భీరస్య వస్తునః అపి = నిగూఢమైన విషయమును కూడ, వ్యక్తిః = స్పష్టీకరించుట, ఇదం సర్వం = ఇది అంతయు, భావాయత్తం = కవియొక్క భావముపై ఆధారపడి యున్నది. ఇతి = ఈ కారణమువలన, తత్ = దానిని, భావికం = భావికాలంకారమునుగా విదుః = చెప్పుదురు. (తెలిసికొందురు).

కవి బాగుగా పర్యాలోచనము చేసి ఈ పరస్పరోపకారిత్వాదులను ప్రవేశ పెట్టినచో కావ్యమునందు అంతటను సౌందర్యవిశేషము వ్యాప్తమై యుండును. ఇదియే భావిక మని యర్థము.

మూ. యచ్చ సన్ధ్యఙ్గవృత్త్యఙ్గలక్షణాద్యాగమాన్తరే
వ్యావర్ణితమిదం చేష్టమలఙ్కారతయైవ నః. 367

వ్యా. ఆగమాన్తరే = నాట్యశాస్త్రమునందు, యత్ = ఏ, సన్ధ్యఙ్గ వృత్త్యఙ్గలక్షణాది = ముఖ - ప్రతిముఖ - గర్భ - విమర్శ - ఉపసంహృతు లను పంచసంధులు, "ఉపక్షేపః పరికరః పరిన్యాసో విలోభనమ్" ఇత్యాదు లగు వాటి అరువదినాలుగు అంగములు, "శృఙ్గారే కైశికీ వీరే సాత్వత్యారభటీ పునః. రసే రౌద్రే చ బీభత్సే వృత్తిః సర్వత్ర భారతీ" అని చెప్పిన నాలుగు వృత్తులు, "నర్మ - తత్స్ఫూర్జ - తత్స్ఫోట - తద్గర్భైశ్చతురంగికా" ఇత్యాద్యుక్తవిధమగు వాటి పదహారు అంగములు, భూషణ - అక్షరసంఘాతాదు లగు ముప్పదిఆరు లక్షణములు మొదలగునది, (ఇచట 'ఆది' శబ్దముచే నాట్యాలంకారాదులను గ్రహింపవలెను.) వ్యావర్ణితం = వర్ణింపబడినదో, ఇదం = ఇది, నః = మాకు, అలఙ్కారతయా = అలంకారముగనే, ఇష్టం = ఇష్టమైనది. వీటిలో కొన్నిటికి స్వభావాఖ్యానాదులలో అంతర్భావము; కొన్నిటికి భావికములో అంతర్భావము. అందుచే వీటిని వేరుగ పరిగణింపలేదని భావము.

మూ. పన్థాః స ఏష వివృతః పరిమాణవృత్త్యా
సంహృత్య విస్తరమనన్తమలఙ్క్రియాణామ్.

వాచామతీత్య విషయం పరివర్తమానా-
నభ్యాస ఏవ వివరీతుమలం విశేషాన్. 368

ఇత్యాచార్యదణ్డినః కృతౌ కావ్యాదర్శే

అర్థాలఙ్కార విభాగో నామ ద్వితీయ పరిచ్ఛేదః

వ్యా. అలఙ్క్రియాణాం = అలంకారములయొక్క, స ఏషః = ఈ, పన్థాః = మార్గము, అనన్తం = అనంతమైన, విస్తరం = విస్తరమును, సంహృత్య = సంక్షిప్తముచేసి, పరిమాణవృత్త్యా = పరిమితరూపముచే, వివృతః = వివరింపబడినది. వాచాం విషయం అతీత్య = వాగ్విషయమును దాటి, అనగా మాటలతో వర్ణింపశక్యము కానివిధమున, పరివర్తమానాన్ = ఉంటూన్న, విశేషాన్ = విశేషములను, అభ్యాస ఏవ = అభ్యాసమే,వివరీతుం = వివరించుటకు, అలం = సమర్థ మైనది. ఆ విశేషములన్నింటిని అభ్యాసముచేత స్వయముగ తెలుసు కొనవలెనే గాని మాటలలో వర్ణించి చెప్పుటకు సాధ్యముకాదు అని అర్థము.

కావ్యాదర్శవ్యాఖ్య యగు బాలానందినిలో
ద్వితీయపరిచ్ఛేదము సమాప్తము.

# అథ తృతీయః పరిచ్ఛేదః

అవ. యమకాలంకారమును నిరూపించుచున్నాడు :—

మూ. అవ్యపేతవ్యపేతాత్మా వ్యావృత్తిర్వర్ణసంహతేః
యమకం తచ్చ పాదానామాదిమధ్యాన్తగోచరమ్. 1

వ్యా. వర్ణసంహతేః = స్వరవ్యంజనసముదాయముయొక్క, అవ్యపేతవ్యపేతాత్మా = వ్యవధానము లేనిదియు, వ్యవధానము కలదియు అగు స్వరూపము గల, వ్యావృత్తిః = విశేషముగా ఆవృత్తి, అనగా ఒక వర్ణసముదాయమునే వ్యవధానముతోగాని, ప్రక్కప్రక్కలనే గాని, మరల మరల ప్రయోగించుట, యమకం = యమకాలంకారము, తచ్చ = అది, పాదానాం = పాదముల, ఆదిమధ్యాన్తగోచరం = ఆదికిని, మధ్యమునకును అంతమునకును సంబంధించి ఉండును. ఇది ఉపలక్షణము. పాదఖండమును గాని, పాదార్ధమును గాని, శ్లోకార్ధమునుగాని. పూర్ణశ్లోకమును గాని ఆవృత్తి చేసినను యమకాలంకారమే.

అవ. యమకభేదములను చెప్పుచున్నాడు :—

మూ. ఏకద్విత్రిచతుష్పాదయమకానాం వికల్పనాః
ఆదిమధ్యాన్తమధ్యాన్తమధ్యాద్యాద్యన్తసర్వతః. 2

వ్యా. ఏక ... యమకానాం = ఏకపాద - ద్విపాద - త్రిపాద - చతుష్పాదగతములగు యమకములకు, ఆది...సర్వతః (వర్ణతః) = ఆదియమక-మధ్యయమక - అన్తయమక - మధ్యాన్తయమక - ఆదిమధ్యయమక - ఆద్యన్తయమక - ఆదిమధ్యాన్తయమకములవలన, వికల్పనాః = వివిధభేదములు (ఏర్పడును).

యమకము ఒకే పాదములో ఉన్నచో అది ఏకపాదయమకము. అది ప్రథమపాదగతము, ద్వితీయపాదగతము, తృతీయపాదగతము, చతుర్థపాద

గతము అని నాలుగు విధములు. రెండు పాదములలో ఉన్న యమకము ద్విపాద యమకము. ప్రథమద్వితీయగతము, ప్రథమతృతీయగతము, ప్రథమ చతుర్థ గతము, ద్వితీయతృతీయగతము, ద్వితీయచతుర్థగతము, తృతీయచతుర్థగతము అని ఇది ఆరు విధములు. యమకము మూడు పాదములలో ఉన్నచో అది త్రిపాదయమకము. ప్రథమద్వితీయ తృతీయగతము, ప్రథమద్వితీయచతుర్థ గతము, ప్రథమతృతీయచతుర్థగతము, ద్వితీయతృతీయచతుర్థగతము అని అది నాలుగు విధములు, చతుష్పాదయమకము, అనగా నాలుగు పాదము లందును యమకముండుట, ఏకవిధమే. ఈ విధముగ పాదగతయమకభేదముల సంఖ్య పదిహేను. ఈ పదిహేను విధములగు యమకము పాదముయొక్క ఆదియందు గాని, మధ్యయందు గాని, అంతమందు గాని, ఆదిమధ్యాదులందు గాని ఉండవచ్చును. అదుచే వీటికి ఆదియమక - మధ్యయమక - అన్తయమక - ఆదిమధ్యయమక - ఆద్యన్తయమక - మధ్యాన్తయమక - ఆదిమధ్యాన్తయమకము లను ఏడు భేదము లేర్పడును. పై పదహేను భేదములను ఈ ఏడు భేదములతో గుణించగా 105 యమకభేములు వచ్చును. వీటిని మరల వ్యవహితయమకము, అవ్యవహితయమకము, వ్యవహితావ్యవహితయమకము అను మూడు భేదములచే గుంచినచో 315 యమకభేదములు వచ్చును.

మూ. అత్యన్తబహవస్తేషాం భేదాః సంభేదయోనయః
సుకరా దుష్కరాశ్చైవ దర్శ్యన్తే తత్ర కేచన. 3

వ్యా. తేషాం = పూర్వశ్లోకోక్తము లైన యమకభేదముల, సంభేద యోనయః = కలయికవలన ఏర్పడు, భేదాః = భేదములు, అత్యన్తబహవః = (పైన వ్యాఖ్యలో చూపబడిన విధముగ) చాల అధికసంఖ్యాకములు. సుకరాః = కొన్ని సులభముగ కూర్చుటకు శక్యమైనవి, దుష్కరాశ్చైవ = కూర్చుటకు కష్టమైనవి. తత్ర = వాటిలో, కేచన = కొన్ని, దర్శ్యన్తే = చూపబడుచున్నవి.

**మూ. మానేన మానేన సఖి ప్రణయోభూత్ప్రియే జనే**
**ఖణ్డితా కణ్ఠమాశ్లిష్య తమేవ కురు సత్రపమ్. 4**

వ్యా. ప్రియునిపై కోపగించిన ఖండితనాయికతో సఖురాలు చెప్పు ఉపదేశవాక్యములు. ప్రియునియందు పరాంగనాసంగ చిహ్నములు చూచి కుపిత యగు నాయికకు ఖండితనాయిక అని పేరు. హే సఖి = ఓ సఖీ! ప్రియ జనే = ప్రియుని విషయమున, అనేన = ఈ, మానేన = మానముతో, కోపముతో, కూడిన, ప్రణయః = ప్రేమ, మా భూత్ = లేకుండుగాక. ప్రియుని విషయమున ప్రణయమునే చూపవలెను గాని మానమును కూడ చూపుట తగదు అని అర్థము. ఖణ్డితా = ఖండితురాల వైన నీవు, కణ్ఠం = కంఠమును, ఆశ్లిష్య = కౌగలించు కొని, తమేవ = ఆతనినే, సత్రపం = సిగ్గుతో కూడినవానినిగా, కురు = చేయుము.

నీవు అపరాధి యగు ఆతని విషయమున కోపము చూపుటకు బదులు స్వయముగ కంఠాలింగనము చేసికొనినచో ఆతనికే సిగ్గు వచ్చునని అభిప్రాయము. ఇచట 'మానేన' అను వర్ణసముదాయమును ప్రథమపాదమున అవ్యవహితముగ ఆవృత్తి చేయుటచే ప్రథమపాదగత - అవ్యవహిత - ఆది యమకము.

మూ. మేఘనాదేన హంసానాం మదనో మదనోదినా
నున్నమానం మనః స్త్రీణాం సహ రత్యా విగాహతే. 5

వ్యా. హంసానాం = హంసలయొక్క, మదనోదినా = మదమును, తొలగించు (వర్షకాలమున హంసలు దేశాంతరమునకు పోవునని కవిలోకప్రసిద్ధి). మేఘనాదేన = మేఘధ్వనిచేత, నున్నమానం = తొలగింపబడిన కోపముగల, స్త్రీణాం మనః = స్త్రీల మనస్సును, మదనః = మన్మథుడు, రత్యా సహ = రతితో కూడ (మన్మథుని భార్య - ప్రేమ అని అర్థద్వయము) విగాహతే = ప్రవేశించుచున్నాడు. ఇది ద్వితీయపాదాదిగతయమకమున కుదాహరణము.

మూ. రాజన్వత్యః ప్రజా జాతా భవన్తం ప్రాప్య సత్పతిమ్
చతురం చతురంభోధిరశనోర్వీకరగ్రహే. 6

వ్యా. ప్రజాః = ప్రజలు, చతురంభోధిరశనోర్వీకరగ్రహే = నాల్గు సముద్రములే వడ్డాణముగా గల భూమియొక్క హస్తమును గ్రహించుటయందు,

చతురం = నేర్పుగల, భవన్తం = నిన్ను, సత్పతిం = ఉత్తమ మైన ప్రభువునుగా, ప్రాప్య = పొంది, రాజన్వత్యః = మంచి రాజు కలవారుగా, జాతాః = అయి నారు. ఇది తృతీయచరణాదిగతయమకమునకు ఉదాహరణము.

మూ. అరణ్యం కైశ్చిదాక్రాన్తమన్యైః సద్మ దివౌకసామ్
పదాతిరథనాగాశ్వరహితైరహితైస్తవ. 7

వ్యా. పదాతి ... రహితైః = కాలిబంట్లతోడను రథములతోడను, ఏనుగుల తోడను, అశ్వములతోడను, శూన్యులైన, (పదాత్యాదులు లేని) తవ అహితైః = నీ శత్రువులచేత, కైశ్చిత్ = కొంతమందిచే, అరణ్యం = అరణ్యము, ఆక్రాన్తం = ఆక్రమించబడినది. అన్యైః = మరికొందరి చేత, దివౌకసాం = దేవతల, సద్మ = గృహము, స్వర్గలోకము, ఆక్రమించ బడినది. ఇది చతుర్థపాదాదిగత యమకమున కుదాహరణము.

మూ. మధురంమధురమ్భోజవదనే వద నేత్రయోః
విభ్రమం భ్రమరభ్రాన్త్యా విడమ్బయతి కిం ను తే. 8

వ్యా. ఇది వసంతకాలమున పద్మములపై తిరుగు చున్న తుమ్మెదలను చూపి నాయకుడు నాయికతో పలుకు చాటువాక్యము. హే అమ్భోజవదనే = పద్మమువంటి ముఖము కలదానా, మధుః = వసంతఋతువు, భ్రమరభ్రాన్త్యా = భ్రమరముల భ్రమణచేత, తే నయనయోః = నీ నేత్రములయొక్క, మధురం = మధుర మైన, విభ్రమం = విలాసను, విడమ్బయతి కింను = అనుకరించు చున్నాడా? వద = చెప్పుము. ఇచట ద్విపాదగత–అవ్యవహిత–ఆదియమకము.

మూ. వారణో వా రణోద్దామో హయో వా స్మర దుర్ధరః
న యతో నయతోఽన్తం న స్తదహో విక్రమ స్తవ. 9

వ్యా. హేస్మర = ఓ మన్మథుడా, రణోద్దామః = యుద్ధమునందు తీవ్రమైన, వారణో వా = ఏనుగ గాని, దుర్ధరః = నిలుపుటకు శక్యము కాని, హయో వా = అశ్వము గాని, యతః = ఏ కారణమువలన, న = లేదో, తత్ =

అర్థైనను, నః = మమ్ములను, అస్తం నయతః = అంత మొందించుచున్న, తవ = నీయొక్క, విక్రమః = పరాక్రమము, అహో = ఎంత ఆశ్చర్యకర మైనది ? ఇచట ప్రథమతృతీయపాదాదిగత యమకము.

మూ. రాజితై రాజితైక్ష్ణ్యేన జీయతే త్వాదృశైర్నృపైః
నీయతే చ పునస్తృప్తిం వసుధా వసుధారయా. 10

వ్యా. ఆజితైక్ష్ణ్యేన = యుద్ధమునందు తీవ్రత్వముతో, రాజితైః = ప్రకాశించుచున్న, త్వాదృశైః = నీవంటి, నృపైః = రాజులచేత, వసుధా = భూమి, జీయతే = జయింపబడుచున్నది పునః = మరల, వసుధారయా = ధనప్రవాహముచేత, తృప్తిం = తృప్తిని, నీయతే చ = పొందింపబడుచున్నది కూడ. ఇచట ప్రథమచతుర్థపాదాదిగత యమకము.

మూ. కరోతి సహకారస్య కలికోత్కలికోత్తరమ్
మన్మనో మన్మనోఽప్యేష మత్తకోకిలనిస్వనః. 11

వ్యా సహకారస్య = చూతవృక్షముయొక్క, కలికా = మొగ్గ, మన్మనః = నా మనస్సును, ఉత్కలికోత్తరం = ఉత్కంఠాపూర్ణమునుగా, కరోతి = చేయుచున్నది. ఏషః = ఈ, మన్మనః = అవ్యక్తమధుర మైన, "మన్మనోఽవ్యక్త మధురో మన్మనో రతిభాషితమ్" అని విశ్వనిఘంటువు. మత్తకోకిలనిస్వనః అపి = మత్తకోకిలధ్వని కూడా (నా మనస్సును ఉత్కంఠాపూర్ణముగా చేయుచున్నది). ఇచట ద్వితీయ తృతీయపాదాదిగత యమకము.

మూ. కథం త్వదుపలమ్భాశా విహతావిహ తాదృశీ
అవస్థా నాలమారోఢుమఙ్గనామఙ్గనాశినీ. 12

వ్యా. ఇహ = ఈ వసంతసమయమునందు, త్వదుపలమ్భాశావిహతౌ = నీ ప్రాప్తిని గూర్చిన ఆశ భగ్న మైన దగుచుండగా, అఙ్గనాం = ఆ యువతిని, అఙ్గనాశినీ = శరీరమును నశింపచేయు, తాదృశీ = అట్టి, అవస్థా = మరణావస్థ, ఆరోఢుం = అధిష్ఠించుటకు, ఆమెకు సంప్రాప్తించుటకు, కథం = ఎట్లు, నాలం = సమర్థము కాదు. అట్టి మరణావస్థ ఆమెకు

తప్పక సంప్రాప్తించును అని అర్థము. ఇచట ద్వితీయ చతుర్థపాదాదిగత యమకము.

మూ. నిగృహ్య నేత్రే కర్షన్తి బాలపల్లవశోభినా
 తరుణా తరుణాన్ కృష్టావలినో నలినోన్ముఖాః. 13

వ్యా. నలినోన్ముఖాః = పద్మములకు అభిముఖము లైన, అనగా వాటి వైపు వెళ్లుచున్న, అలినః = తుమ్మెదలు, బాలపల్లవశోభినా = లేత చిగుళ్ళచే ప్రకాశించుచున్న, తరుణా = వృక్షముచేత, కృష్టాన్ = ఆకర్షింపబడిన, తరుణాన్ = యువకులకు, నేత్రే = వారినేత్రములను, నిగృహ్య = బలాత్కారముగ నిగ్రహించి, కర్షన్తి = లాగుచున్నవి.

తరుణులు ఆ వృక్షము వైపు చూచుచుండగా తుమ్మెదలు పద్మముల వైపు వెళ్ళుచుండుటచే, వారి దృష్టి వృక్షమునుండి పద్మముల వైపు మరలిన దని అర్థము. ఇచట తృతీయచతుర్థపాదాదిగత యమకము.

మూ. విశదా విశదామత్తసారసే సారసే జలే
 కురుతే కురుతేనేయం హంసీ మామన్తకామిషమ్. 14

వ్యా. విశదామత్తసారసే = (విశత్ + ఆమత్త) లోనికి ప్రవేశించుచున్న బాగుగా మదించిన సారసపక్షులు గల, సారసే = సరస్సుకు సంబంధించిన, జలే = జలమునందు, (ఉన్న), విశదా = తెల్లనైన, ఇయం = ఈ, హంసీ = ఆడు హంస, కురుతేన = (కామిజనబాధాజనక మగుటచే) చెడ్డదైన ధ్వనిచే, మాం = నన్ను, అన్తకామిషం = యమునకు ఆహారమునుగా, కురుతే = చేయుచున్నది. ఇది ప్రథమ ద్వితీయపాదగత - అవ్యవహిత - ఆదియమకము.

మూ. విషమం విషమన్వేతి మదనం మదనన్దనః
 సహేన్దుకలయాపోఢ మలయా మలయానిలః, 15

వ్యా. మలయానిలః = మలయవాయువు, మదనన్దనః = (మత్ + అనన్దనః) నాకు ప్రీతి కలిగించని వాడగుచు, అపోఢమలయా = తొలగిన

మాలిన్యము గల, శుద్ధమైన, ఇన్దుకలయా సహ = చంద్రకళతో కూడ, విషమం = భయంకరుడైనట్టియు, విషం = విషసదృశుడైన; మదనం = మన్మథుని, అన్వేతి = అనుసరించి వచ్చుచున్నాడు. ఇచట ప్రథమ - ద్వితీయ - చతుర్థ పాదగత యమకము.

**మూ. మానినీ మా నిసీషుస్తే నిషఙ్గత్వమనఙ్గ మే**
**హారిణీ హారిణీ శర్మ తనుతాం తనుతాం యతః. 16**

వ్యా. ప్రణయకలహకుపిత యగు మానినిని అనుగ్రహింపచేసుకొనుటకై నాయకుడు మన్మథుని ప్రార్థించుచున్నాడు. హే అనఙ్గ = ఓ మన్మథుడా! మా = నన్ను, తే = నీయొక్క, నిషఙ్గతాం = అంబులపొది యగుటను. నిసీషుః = పొందింపదలచినదియు, అనగా ఆమె నాపై కోపము వహింపచే నీ బాణములు నిరంతరము నాపై పడగలవు. ఆ విధముగ నన్ను అంబులపొందిగ చేయదలచినదియు, హారిణీ = హారములను ధరించినదియు, హారిణీ = మనోహారిణియు అగు, మానినీ = ఈ మానిని, తనుతాం = కృశత్వమును, యతః = పొందుచున్న, మే = నాకు, శర్మ = సుఖమును, తనుతాం = కలిగించుగాక. ఇచట ప్రథమ - తృతీయ - చతుర్థ పాదములయందు యమకము.

**మూ. జయతా త్వన్ముఖేనాస్మానకథం న కథం జితమ్**
**కమలం కమలం కుర్వదలిమద్దలి మత్ప్రియే. 17**

వ్యా. హే మత్ప్రియే = ఓ నా ప్రియురాలా, అస్మాన్ = మమ్మలను, జయతా = జయించుచున్న, అనగా ఆకర్షించుచున్న, త్వన్ముఖేన = నీ ముఖము చేత, కం = ఉదకమును, అలంకుర్వత్ = అలంకరించుచున్నదియు, అలిమద్దలి = తుమ్మెదలు గల దలములు కలదియు అగు, కమలం = పద్మము, అకథం = కథ లేకుండగా, అనగా ఇక నేమియు చెప్పవలసిన పని లేకుండగా, (న విద్యతే కథా యస్మిన్ కర్మణి తద్యథా తథా) కథం = ఎట్లు, న జితం = జయింపబడ లేదు, ఇచట ద్వితీయ తృతీయ చతుర్థ పాదములందు యమకము.

మూ. రమణీ రమణీయా మే పాటలాపాటలాంశుకా
వారుణీవారుణీభూతసౌరభా సౌరభాస్పదమ్. 18

వ్యా. పాటలాపాటలాంశుకా = పాటలపుష్పము వలె శ్వేత-రక్తవర్ణము గల వస్త్రము కలదియు, సౌరభాస్పదం = పద్మినీజాతి స్త్రీ అగుటచే పరిమళమునకు స్థాన మైనదియు అగు, మే రమణీ = నా ప్రియురాలు, అరుణీభూత సౌర + భా = ఎఱ్ఱ నైన సూర్యకాంతి గల, వారుణీవ = పశ్చిమ దిక్కువలె, రమణీయా = సుందర మైనది. ఇచట నాల్గు పాదములందును యమకము.

మూ. ఇతి పాదాదియమకమవ్యపేతం వికల్పితమ్
వ్యపేతస్యాపి వర్ణ్యన్తే వికల్పాస్తస్య కే చన. 19

వ్యా. ఇతి = ఈ విధముగా, అవ్యపేతం = వ్యవధానము లేని, పాదాదియమకం = పాదాదియం దుండు యమకము, వికల్పితం = వివిధరూపముల చూపబడినది. వ్యపేతస్య = వ్యవహితమైన, తస్య = ఆ యమకముయొక్క. కేచన = కొన్ని, వికల్పాః అపి = వికల్పములు (భేదములు) కూడా, వర్ణ్యన్తే = వర్ణింపబడుచున్నవి.

మూ. మధురేణదృశాం మానం మధురేణ సుగన్ధినా
సహకారోద్గమేనైవ శబ్దశేషం కరిష్యతి. 20

వ్యా. మధుః = వసంతము, మధురేణ = సుందర మైనదియు, సుగన్ధినా = పరిమళముతో కూడినదియు అగు, సహకారోద్గమేనైవ = చూతాంకురము చేతనే, ఏణదృశాం = మృగనయనల, మానం = కోపమును, శబ్దశేషం = శబ్దమే శేషము కలదానినిగా, కరిష్యతి = చేయగలదు. ఇచట ప్రథమ పాదాదియందున్న 'మధురేణ' అను పదము ద్వితీయపాదాది యందు కూడ ఆవృత్త మైనది. మధ్యయందు "దృశాం మానం" అను వర్ణముల వ్యవధాన మున్నది. అందుచే ప్రథమ ద్వితీయ పాదగత మైన వ్యపేతాదియమకము. 'వ్యపేత' అనగా దూరముగా నున్నది, వ్యవహితము అని అర్థము.

మూ. కరోఽతితామ్రో రామాణాం తన్త్రీ తాడనవిభ్రమమ్
కరోతి సేర్ష్యం కాన్తే చ శ్రవణోత్పలతాడనమ్. 21

వ్యా. అతితామ్రః = మిక్కిలి ఎఱ్ఱనైన, రామాణాం కరః = స్త్రీల హస్తము, తన్త్రీతాడనవిభ్రమం = వీణాతంత్రులను ప్రయోగించుట యను విలాసమును, కాన్తే = ప్రియుని విషయమున, సేర్ష్యం = కోపముతో గూడిన, శ్రవణోత్పలతాడనంచ = శ్రవణోత్పలముచే తాడనమును, కరోతి = చేయుచున్నది. ఇచట ప్రథమ తృతీయ పాదగతవ్యపేత యమకము.

మూ. సకలాపోల్లసనయా కలాపిన్యానునృత్యతే
మేఘాలీ నర్తితా వాతైః సకలాపో విముఞ్చతి. 22

వ్యా. వాతైః = వాయువులచేత, నర్తితా = నాట్యమాడింపబడిన, సకలా మేఘాలీ = సమస్తమైన మేఘపంక్తి, అపః = ఉదకములను, విముఞ్చతి = విడచుచున్నది. సకలాపోల్లసనయా = పింఛముయొక్క వికాసముతో కూడిన, కలాపిన్యా = ఆడ నెమలిచేత, అను నృత్యతే = (ఆమేఘమాల)అనుసరించి నాట్యము చేయబడుచున్నది (నాట్యము చేయుట. భావేప్రయోగము). ఇచట ప్రథమ చతుర్థపాదములందు యమకము.

మూ. స్వయమేవ గలన్మానకలి కామిని తే మనః
కలికామిహ నీపస్య దృష్ట్వా కాం న స్పృశేద్దశామ్ 23

వ్యా. హే కామిని = ఓ కామినీ ఇహ = ఇచట, నీపకలికాం = నీప వృక్షము మొగ్గను, దృష్ట్వా = చూచి, స్వయమేవ = తనంతట తానుగనే, గలన్మానకలి = జారిపోవుచున్న మానకలహముగల, తే మనః = నీమనస్సు, కాం = ఏ, దశాం = పరిస్థితిని, న స్పృశేత్ = స్పృశింపదు. ఇచట ద్వితీయ తృతీయ పాదములందు యమకము.

మూ. ఆరుహ్యాక్రీడశైలస్య చన్ద్రకాన్తస్థలీమిమామ్
నృత్యత్యేష లసచ్చారుచన్ద్రకాన్తః శిఖావలః, 24

వ్యా. లసచ్చారుచన్ద్రికాన్తః = ప్రకాశించుచున్న అందమైన చంద్రములచే ( నెమిలిపింఛమునందలి కన్నులు ) మనోహరమైన, ఏషః శిఖావలః = ఈ నెమలి, ఆక్రీడశైలస్య = ఉద్యానమునందలి పర్వతముయొక్క, ఇమాం = ఈ, చన్ద్రికాన్తస్థలీం = చంద్రకాంతమాణిక్యముల ఎత్తైన ప్రదేశమును, ఆరుహ్య = ఎక్కి, నృత్యతి = నాట్య మాడుచున్నది. ఇచట ద్వితీయ చతుర్థ పాదములలో యమకము.

**మూ. ఉద్ధృత్య రాజకాదుర్వీ ధ్రియతేఽద్య భుజేన తే**
**వరాహేణోద్ధృతా యాసౌ వరాహేరుపరి స్థితా. 25**

వ్యా. యాఉర్వీ = ఏభూమి, వరాహేణ = వరాహముచే, ఉద్ధృతా = ఉద్ధరింపబడినచో, వరాహేః = గొప్పసర్పము (ఆదిశేషుని) యొక్క, ఉపరి = పైన, స్థితా = ఉన్నదో, అసౌ = ఆ భూమియే, అద్య = ఇప్పుడు, తే = భుజేన = నీ భుజముచేత, రాజకాత్ = రాజసమూహమునుండి, ఉద్ధృత్య = ఉద్ధరించి, ధ్రియతే = ధరింపబడుచున్నది. వరాహము భూమిని ఉద్ధరించి ఆదిశేషునిపై నిలిపినాడు; నీవు ఉద్ధరించి భుజముపై నిలిపినావు అని అర్థము. తృతీయచతుర్థ పాదములందు యమకము.

**మూ. కరేణ తే రణేష్వన్తకరేణ ద్విషతాం హతాః**
**కరేణవః క్షరద్రక్తా భాన్తి సన్ధ్యాఘనా ఇవ. 26**

వ్యా. రణేషు = యుద్ధభూములయందు, ద్విషతాం = శత్రువులకు, అన్తకరేణ = నాశనమును చేయు, తే కరేణ = నీ హస్తము చేత, హతాః = చంపబడిన, కరేణవః = ఏనుగులు, క్షరద్రక్తాః = స్రవించుచున్న రక్తము కలవై, సన్ధ్యాఘనా ఇవ = సంధ్యాకాలమునందలి మేఘములవలె, భాన్తి = ప్రకాశించుచున్నవి. ఇచట ప్రథమ - ద్వితీయ - తృతీయ పాదాదిగత వ్యపేతయమకము.

**మూ. పరాగతరురాజీవ వాతైర్ధ్వస్తా భటైశ్చమూః**
**పరాగతమివ క్వాపి పరాగతతమమ్బరమ్. 27**

వ్యా. (ఓరాజా!)చమూః = (శత్రు) సేన, భటైః = నీ భటులచేత, వాతైః = వాయువులచేత, పరాగతరురాజీవ = (పర + అగ) ఉన్నత మైన, పర్వతముపై నున్న వృక్షపంక్తి వలె, ధ్వస్తా = నశింపచేయబడినది. పరాగతతం = పరాగతముచే వ్యాప్త మైన, అమ్బరం = ఆకాశము, క్వాపి = ఎచ్చటికో, పరాగతమివ = తొలగిపోయి నట్లున్నది. ఇచట ప్రథమ-తృతీయ-చతుర్థపాదాదిగత వ్యపేతయమకము.

మూ. పాతు వో భగవాన్ విష్ణుః సదా నవఘనద్యుతిః
స దానవకులధ్వంసీ సదానవరదన్తిహా. 28

వ్యా. నవఘనద్యుతిః = నవఘనము వంటి కాంతి కలవాడును, దానవకులధ్వంసీ = దానవకుల సంహారకుడును, సదాన + వర + దన్తిహా = మదోదకముతో కూడిన (కువలయ మను పేరుగల) ఏనుగను సంహరించినవాడునుఅగు, సః = ఆ, భగవాన్ = భగవంతు డైన, విష్ణుః = విష్ణువు, వః = మిమ్ములను, సదా = ఎల్లప్పుడును, పాతు = రక్షించుగాక. ఇచట ద్వితీయ - తృతీయ - చతుర్థపాదాదిగత వ్యపేతయమకము.

మూ. కమలేః సమకేశం తే కమలేర్ష్యాకరం ముఖమ్
కమలేఖ్యం కరోషిత్వం కమలే వోన్మదిష్ణుషు. 29

వ్యా (హే లలనే), తే = నీయొక్క, కం = శిరస్సు, అలేఃసమకేశం = తుమ్మెదతో సమానమైన కేశములు కలది. ముఖం = ముఖము, కమలేర్ష్యాకరం = పద్మమునకు ఈర్ష్యను కలిగించునది. త్వం = నీవు, కమలేవ = లక్ష్మివలె, కం = ఎవనిని, ఉన్మదిష్ణుషు = ఉన్మత్తులలో, అలేఖ్యం = వ్రాయ తగని వానినిగా, కరోషి = చేయుచున్నావు. నీవు అందరిని ఉన్మత్తుల కోటిలో వ్రాయదగిన వానినిగా చేయుచున్నావు అని అర్థము. ఇచట నాల్గుపాదములు ఆదియందును ఉన్న వ్యపేత యమకము.

మూ. ముదా రమణమన్వీత ముదారమణిభూషణాః
మదభ్రమద్దృశః కర్తు మదభ్ర జఘనాః క్షమాః. 30

వ్యా. ఉదారమణిభూషణాః = సుందరమైన మాణిక్యభూషణములు కలవారును, మదభ్రమద్దృశః = మదముచే చలించుచున్న నేత్రములు కలవారును, అదభ్రజఘనాః = విశాలమైన జఘనములు కలవారును అగు స్త్రీలు, రమణం = ప్రియుని, ముదా = సంతోషముతో, అన్వీతం = కూడినవానినిగా, కర్తుం = చేయుటకు, క్షమాః = సమర్థమైనవారు. ఇచట యమకము ప్రథమ ద్వితీయ పాదములలో ఒక విధముగను, తృతీయ చతుర్థపాదములలో మరి యొక విధముగను ఉన్నది. అందుచే సజాతీయ వ్యపేతయమక సంమిశ్రణము.

మూ. ఉదితైరన్యపుష్టానా మారుతైర్మే హతం మనః
ఉదితైరపి తే దూతి మారుతైరపి దక్షిణైః. 31

వ్యా. హే దూతి = ఓ దూతీ, అన్యపుష్టానాం = కోకిలలయొక్క ఉదితైః = స్పష్టముగా వినవచ్చుచున్న, రుతైః = ధ్వనులచేతను, ('ఆః + రుతైః, అని పదచ్ఛేదము), తే = నీ యొక్క, ఉదితైః = మాటలచేతను, దక్షిణైః మారుతైరపి = దక్షిణవాయువులచేతను, మే మనః = నా మనస్సు, హతం = పీడింపబడినది. ఆః = ఎంతకష్టము. ఇచట ప్రథమ తృతీయ పాదములందును ద్వితీయ చతుర్థ పాదములందును ఆదిగత వ్యపేతయమకము.

మూ. సురాజితహ్రియో యూనాం తనుమధ్యాసతే స్త్రియః
తనుమధ్యాః క్షరత్స్వేద సురాజిత ముఖేన్దవః. 32

వ్యా. తనుమధ్యాః = సన్నని నడుము కలవారును, క్షరత్స్వేదసురాజితముఖేన్దవః = స్రవించుచున్న చెమటచే బాగుగ ప్రకాశింపచేయబడిన ముఖపద్మము కలవారును అగు, స్త్రియః = స్త్రీలు, సురాజితహ్రియః = మద్యముచే జయింపబడిన లజ్జకలవారై, యూనాం = యువకుల, తనుం = శరీరమును, అధ్యాసతే = అధిష్ఠించుచున్నారు. ఇచట ప్రథమ చతుర్థపాదములందును. ద్వితీయతృతీయ పాదములందును ఆదిగత-విజాతీయ-వ్యపేతయమకము.

మూ. ఇతి వ్యపేతయమకప్రభేదో౽ప్యేష దర్శితః
అవ్యపేతవ్యపేతాత్మా వికల్పో౽ప్యస్తి తద్యథా. 33

వ్యా. ఇతి = ఈ విధముగా, ఏషః = ఈ, వ్యపేతయమకప్రభేదోపి = వ్యపేతయమకభేదము కూడ, దర్శితః = చూపబడినది. అవ్యపేతవ్యపేతాత్మా = అవ్యపేత వ్యపేత మిశ్రణరూప మగు, వికల్పో౽పి = వికల్పము కూడ, అస్తి = ఉన్నది. తత్ = అది, యథా = ఎట్లనగా.

మూ. సాలం సాలమ్బకలికాసాలం సాలం న వీక్షితుమ్
నాలీనాలీనబకులానాలీ నాలీకినీరపి. 34

వ్యా. సా ఆలీ = నా విరహముతో బాధపడుచున్న ఆ నా సఖురాలు, సాలమ్బకలికాసాలం = వ్రేలాడుచున్న మొగ్గలే ప్రాకారముగా గల, సాలం = చూతవృక్షమును, వీక్షితుం = చూచుటకు, నాలం = సమర్థురాలు కాదు. ఆలీన బకులాన్ = ఆశ్రయించబడిన వకులవృక్షములు గల, అలీన్ = తుమ్మెదలను, నాలీకినీః అపి = పద్మలతలను కూడ, చూడజాలదు. ప్రథమతృతీయపాదము లందు 'సాలం సాలం' 'నాలీ నాలీ' అని అవ్యపేతయమకము. అదే ద్వితీయ చతుర్థపాదములలో వ్యపేతయమకముగ నున్నది.

మూ. కాలం కాలమనాలక్ష్యతారతారకమీక్షితుమ్
తారతారమ్యరసితం కాలం కాలమహాఘనమ్. 35

వ్యా. అనాలక్ష్యతారతారకం = కనబడని, ముత్యములవంటి నక్షత్రములు కలదియు, తారతారమ్యరసితం = చాల పెద్దదిగా ఉండుటచే రమ్యము కాని ధ్వని కలదియు, కాలమహాఘనం = నల్లని గొప్ప మేఘములు కలదియు అగు, కాలం = వర్షాకాలమును, ఈక్షితుం = చూచుటకు, కా = ఏ విరహిణి, అలం = సమర్థురాలగును? ఇచట ప్రథమచతుర్థపాదములందును, ద్వితీయతృతీయ పాదములందును, అవ్యపేతవ్యపేత యమకము.

మూ. యామ యామత్రయాధీనాయామయా మరణం నిశా
యామయామ ధియాస్వర్త్యాయా మయా మథితైవ సా. 36

వ్యా. యామత్రయాధీనాయామయా = మూడు యామములకు సంబంధించిన విస్తారము గల, నిశా = రాత్రిచేత, మరణం యామ = ప్రియావిరహార్తుల మైనమేము మరణము పొందెదము, ధియా = బుద్ధిచేత, యాం = ఏ ప్రియురాలిని గూర్చి, అయామ = వెళ్లినామో, అనగా ఏ ప్రియురాలిని పొంద వలె నని సంకల్పించినామో, అస్వర్త్యాయా = (అసూనాంఅర్తిః = అస్వర్తిః. అస్వర్తిం అయతీతి అస్వర్త్యాయా) ప్రాణముల పీడను పొందు, సా = ఆమె, మయా = నాచేత, మథితైవ = ఎటులైనను చంపబడినదే.

రాత్రి నేను మరణించుట అనునది తథ్యమే. ఆమె కూడ మరణించును అనునదే దుఃఖకారణము అని భావము. ఇచట అన్నిపాదములందును యమకము.

మూ. ఇతి పాదాదియమకవిల్పస్యేదృశీ గతిః
ఏవమేవ వికల్ప్యాని యమకానీతరాణ్యపి. 37

వ్యా. ఇతి = ఇట్లు, పాదాదియమకవికల్పస్య = పాదాదియమకభేదమునకు, ఈదృశీ = ఈవిధమైన, గతిః = పద్ధతి. ఇతరాణి యమకాన్యపి = పాదమధ్యపాదాంతగతము లైన ఇతరయమకములు కూడ, ఏవమేవ = ఈ విధముగనే, వికల్ప్యాని = వివిధరూపములలో కల్పింపదగినవి.

మూ. న ప్రపఞ్చభయాద్భేదాః కార్త్స్న్యేనాఖ్యాతుమీహితాః
దుష్కరాభిమతా యే తు వర్ణ్యన్తే తేఽత్ర కేచన. 38

వ్యా. ప్రపంచభయాత్ = విస్తరభీతిచే, భేదాః = ఆ భేదములు, కార్త్స్న్యేన = పూర్తిగా, ఆఖ్యాతుం = చెప్పుటకు, న ఈహితాః = ఉద్దేశింపబడ లేదు. తు = కాని, యే = ఏవి, దుష్కరాభిమతాః = కూర్చుటకు కష్టమైనవిగా భావింపబడినవో, తే = అవి, అత్ర = ఇచట, కేచన = కొన్ని, వర్ణ్యన్తే = వర్ణింపబడుచున్నవి.

మూ. స్థిరాయతే యతేన్ద్రియో న హీయతే యతేర్భవాన్
అమాయతేయతేఽప్యభూత్ సుఖాయ తేఽయతే క్షయమ్.

వ్యా. స్థిరాయతే = స్థిర మైన ఉత్తరకాలము కలవాడా, శుభమైనభవిష్యత్తు కలవాడు అని అర్థము. యతేన్ద్రియః = నిగ్రహింపబడిన ఇంద్రియములు గల, భవాన్ = నీవు, యతేః = సంయమమునుండి, న హీయతే = తొలగవు. తే = నీయొక్క, అమాయతా = మాయ లేకుండుట, క్షయం = క్షయమును, అయతే = పొందని, ఇయతే = ఇంత, సుఖాయ = సుఖమునకు, అభూత్ = ఆయెను. సుఖకర మాయెను. ఇది సకలపాదమధ్యగత అవ్యపేతవ్యపేతయమకమునకు దాహరణము.

మూ. సభాసు రాజన్నసురాహతైర్ముఖై -
ర్మహీసురాణాం వసురాజితైః స్తుతాః,
న భాసురా యాన్తి సురాన్న తే గుణాః
ప్రజాసు రాగాత్మసు రాశితాం గతాః. 40

వ్యా. హే రాజన్ = ఓ రాజా! అసురాహతైః = మద్యముచే దూషితములు కానివియు, వసురాజితైః = (నీవు దానము చేసిన) ధనముచే ప్రకాశింపచేయబడినవియు అగు, మహీసురాణాం = బ్రాహ్మణులయొక్క, ముఖైః = ముఖముల చేత, సభాసు = లోకసమాజములయందు, స్తుతాః = స్తుతింపబడినవియు, రాగాత్మసు = అనురాముతో కూడిన హృదయములు గల, ప్రజాసు = ప్రజలయందు, రాశితాం = రాశిత్వమును, గతాః = పొందినవియు, భాసురాః = ప్రకాశించుచున్న, తే గుణాః = నీ గుణములు, సురాన్ - దేవతలను కూడ, నయాన్తి = పొందవు, అట్టి గుణములు దేవతలకు గూడ లభింప వని యర్థము. ఇది పాదచతుష్టయమునందును మధ్యగతమైన కేవలవ్యపేతయమకము.

మూ. తవ ప్రియా సచ్చరితాప్రమత్త యా
విభూషణం ధార్యమిహాంశుమత్తయా.

రతోత్సవామోదవిశేషమత్తయా
ప్రయోజనం నాస్తి హి కాన్తిమత్తయా. 41

వ్యా. ఒక ఖండితనాయిక తనను అనునయించుటకై వచ్చిన నాయకునితో పలికిన మాటలివి. హే అప్రమత్త = అపరాధము చేసియు కపటానునయాదులు చేయుటయందు జాగరూకతతో నుండువాడా! తవ = నీయొక్క, యా = ఏ, సచ్చరితా = సచ్చరితముకల, విపరీతలక్షణచే అసచ్చరిత యని అర్థము. ప్రియా = ప్రియురాలు కలదో, రతోత్సవామోదవిశేషమత్తయా = నీతో రతోత్సవానందమును అనుభవించుటచే అధికముగ మదించిన, తయా = ఆమెచేతనే, అంశుమత్ = కాంతితో కూడిన, విభూషణం = అలంకారము, ఇహ = రతోత్సవానందసమయమునందు, ధార్యం = ధరింపదగినది. (నీవు ఉపేక్షించిన నాకు) కాన్తిమత్తయా = (భూషణధారణముచే), కాంతివిశేషము కలిగి ఉండుటచే, ప్రయోజనం = ప్రయోజనము, నాస్తి హి = లేదు కదా. ఇచట పాదచతుష్టయాంతములందు వ్యపేతయమక మున్నది.

మూ. భవాదృశా నాథ నజానతే నతే
రసం విరుద్ధే ఖలు సన్నతేనతే.
య ఏవ దీనాః శిరసా నతేనతే
చరన్త్యలం దైన్యరసేన తేన తే. 42

వ్యా. హే నాథ = ఓ రాజా! భవాదృశాః = నీవంటి వారు, నతేః = వంగి ఉండుటయొక్క, రసం = రుచిని, న జానతే = తెలుసుకొనజాలరు. సన్నతేనతే = (సన్నతం చ + ఇనతా చ) వంగి ఉండుట ప్రభువుగా ఉండుట అనునవి, విరుద్ధే ఖలు = విరుద్ధమైనవి కదా. యే = ఎవరు, దీనాః = దీనులో, త ఏవ = వారే, నతేన = వంగిన, శిరసా = శిరస్సుతో, చరన్తి = ఇతరుల సేవ చేయుదురు. తే = నీకు, తేన = అట్లువంగుటచే కలిగిన, దైన్యరసేన = దైన్యమును రుచిచూచుటతో, అలం = చాలును. అట్లు వంగవలసిన పని నీకు లేదు అని అర్థము ఇచట నాలుగు చరణముల అంతమునందును అవ్యపేతయమకము.

మూ. లీలాస్మితేన శుచినా మృదునోదితేన
వ్యాలోకితేన లఘునా గురుణా గతేన,
వ్యాజృమ్భితేన జఘనేన చ దర్శితేన
సా హన్తి తేన గలితం మమ జీవితేన. 43

వ్యా. సా = ఆమె, శుచినా = తెల్లనైన, లీలాస్మితేన = విలాస పూర్వకమైన చిరునవ్వు చేతను, మృదునా = మృదువైన, ఉదితేన = మాటల చేతను, లఘునా = శీఘ్రమైన, వ్యాలోకితేన = చూపు చేతను, కటాక్షపాతముచే తను, గురుణా = స్తనాదిభారముచే అలసమైన, గతేన = గమనముచేతను. వ్యాజృమ్భితేన = ఆవులింతలచేతను, దర్శితేన = చూపబడిన, జఘనేన = జఘనముచేతను, హన్తి = (నన్ను) పీడించుచున్నది. తేన = దానిచేత, మమ జీవితేన = నా జీవనము చేత, గలితమ్ = తొలగి పోవుట. నా జీవితము తొలగి పోవుచున్నది అని అర్థము. భావే ప్రయోగము. ఇచట నాలుగుపాదము లందును మధ్యాంతములలో వ్యపేతయమకము.

మూ. శ్రీమానమానమరవర్త్మ సమానమాన
మాత్మానమానతజగత్ప్రథమానమానమ్.
భూమానమానమత యః స్థితిమానమాన
నామాన మానమత మప్రతిమానమానమ్. 44

వ్యా. యః = ఏ త్రివిక్రమమూర్తి, శ్రీమాన్ = లక్ష్మీసమేతుడో, అమాన్ = అపరిమితుడో, స్థితిమాన్ = మర్యాదను కాపాడువాడో, తం = అట్టి, అమాననామానం = అనంతనామధేయుడును, ఆనమతం = (అనన్తీతి = అనాః = ప్రాణులు) అందరు ప్రాణులచేతను పూజింపబడినవాడును, అప్రతిమానమానం = ప్రతిమానములచే, అనగా లౌకికప్రమాణములచే తెలిసికొనుటకు శక్యము కాని వాడును, ఆనతజగత్ప్రథమానమానం = సేవించుచున్న జగత్తునందు వృద్ధిపొందు చున్న పూజ కలవాడును, భూమానం = భూమిని కొలచినవాడును, అమరవర్త్మ సమానమానం = ఆకాశముతో సమానమైన ప్రమాణము కలవాడును, అనగా సర్వవ్యాపకుడు అని అర్థము, ఆత్మానం = ఆత్మస్వరూపుడును అగు భగవంతుని,

ఆనమత = నమస్కరించండి. ఇచట పాదచతుష్టయమునందును మధ్యాంతము లందు అవ్యపేతవ్యపేతయమకము.

మూ. సారయన్తమురసా రమయన్తీ సారభూతమురుసారధరా తమ్
సారవానుకృతసారసకాఞ్చీ సా రసాయనమసారమవైతి. 45

వ్యా సారయన్తం = సంకేతస్థానమునందు తనను చేర్చుచున్న, సారభూతం = సంసారమునందు సారమైన యౌవనముతో కూడిన, తం = ఆ ప్రియుని, ఉరసా = వక్షఃస్థలముచేత, రమయన్తీ = ఆలింగనాదులచే సుఖింపచేయుచున్నదియు, ఉరుసారధరా = గొప్పసారమును (యౌవనమును) ధరించుచున్నదియు, సారవానుకృతసారసకాఞ్చీ = ధ్వనితో కూడినదియు (కావుననే) అనుకరింపబడిన సారసపక్షులు కలదియు అగు వడ్డాణము గల, సా = ఆమె, రసాయనం = అమృతమును కూడ, అసారం = సారము లేనిదానినిగా, అవైతి = తెలుసుకొనుచున్నది. ప్రియసంగసౌఖ్యము ముందు, అమృతముగూడ అసారమని భావించుచున్నది అని అర్థము. ఇచట పాదచతుష్టయమునందును వ్యపేతయమకము.

మూ. నయానయాలోచన యానయానయా
నయానయాన్ధాన్ వినయా నయాయతే,
న యానయాసీజ్జినయానయా నయా
నయానయాంస్తాఞ్జనయానయాశ్రితాన్. 46

పదచ్ఛేదము :- నయానయాలోచనయా-అనయా-ఆనయాన్-అయానయాన్ధాన్-వినయ - అనయాయతే - న - యాన్ - అయాసీత్ - జినయానయాః - నయాన్-అయానయాన్ - తాన్ - జనయ - అనయాశ్రితాన్.

వ్యా. మంత్రి రాజునకు దుష్టశిక్షణము చేయుమని ఉపదేశించుచున్నాడు:- హే అయాయతే = అయము కాని, పోవునది కాని, అనగా నశింపని భవిష్యత్తు కలవాడా! అనగా మంచి భవిష్యత్తు కల ఓ రాజా! అనయా = ఈ,

నయానయాలోచనయా = న్యాయాన్యాయవివేచనముచే, అనయాన్ = న్యాయ విముఖులను, అయానయాన్ధాన్ = (అయము అనగా శుభకరమగు విధి) అయము విషయమునను అనయము విషయమునను అంధులైనవారును అగు దుష్టులను, వినయ = శిక్షింపుము. అనయాశ్రితాన్ = అన్యాయమార్గమును ఆశ్రయించిన, తాన్ = వారిని, యాన్ = వినీతులను, జినయానయాః = జైనమార్గమునసడచు వాడు, నఅయాసీత్ = అనుసరించలేదో, అట్టి, అయానయాన్ = శుభప్రాపకము లైన, నయాన్ = నీతులను, జనయ = కలిగింపుము. అన్యాయమార్గము ననుస రించువారిని న్యాయమార్గానుసారులనుగా చేయుము.

ఇచట నాలుగు పాదముల ఆద్యంతములందు అవ్యపేతవ్యపేత యమక ములు.

మూ. రవేణ భౌమో ధ్వజవర్తివీరవే
రవేజి సంయత్యతులాస్త్రగౌరవే.
రవేరివోగ్రస్య పురో హరేరవే
రవేత తుల్యం రిపుమస్య భైరవే. 47

వ్యా. అతులాస్త్రగౌరవే = సాటి లేని అస్త్రముల గౌరవము (ఆధిక్యము) కలదియు, భైరవే = భయంకర మైనదియు అగు, సంయతి = యుద్ధమునందు, భౌమః = నరకాసురుడు, ధ్వజవర్తి-వీర-వేః = శ్రీకృష్ణుని ధ్వజముపై ఉన్న వీరుడైన గరుత్మంతుని యొక్క (వేః), రవేణ = ధ్వనిచేత, అవేజి = భయపెట్ట బడెను. రవేరివ = సూర్యుడు వలె, ఉగ్రస్య = భయంకరమైన, అస్య పురః = ఈ శ్రీకృష్ణుని ఎదుట, రిపుం = శత్రువైన ఆ నరకాసురుని, హరేః = సింహము యొక్క ఎదుట ఉన్న, అవేః = గొఱ్ఱెతో, తుల్యం = సమానమైనవానినిగా, అవేత = తెలుసుకొనండి. ఇచట పాదచతుష్టయమాద్యంతములలో వ్యపేతయమ కము.

మూ. మయా మయాలమ్బ్యకలామయామయా
మయామయాతవ్యవిరామయామయా.
మయామయార్తిం నిశయామయామయా
మయామయామూం కరుణామయామయా. 48

పదవిభాగము. మయా-మయాలమ్బ్యకలామయామయాం-అయాం-అయాతవ్య విరాయామయా-మయామయార్తిం - నిశయా-అమయా - అమయా - అమయ-అమూం-కరుణామయ-అమయా.

ఒక విరహబాధితుడు మిత్రుని ప్రార్థించుచున్నాడు:-

హే అమయ = కపటము లేని వాడా, కరుణామయ = కరుణాస్వభావము కలవాడా, అయాతవ్యవిరామయామయా = గడపుటకు శక్యము కానంతగా దీర్ఘమైన యామములు గల, అమయా = శోభాశూన్య మైన, అమయా = విరహాంధకారపూర్ణ మగుటచే అమావాస్యతో సమానమైన, నిశయా = రాత్రిచేత, మయామయార్తిం = మయము (క్షయము) యొక్కయు ఆమయము (రోగము) యొక్కయు పీడను, అయాం = పొందితిని. అమయా = క్షయమును పొందిన, మయా = నాతో కూడ, మయాలమ్బ్య కలామయామయాం = క్షయముచేత గ్రహింపదగిన కళలు గల చంద్రుడే రోగముగా గల, అమూం = ఆ నాయికను, అమయ = కలుపుము. ఇచట నాలుగు పాదములందును ఆద్యంతములందు అవ్యపేతవ్యపేతయమకము.

మూ. మతా ధునానారమతామకామతా
మతాపలబ్ధాగ్రిమతానులోమతా.
మతావయత్యుత్తమతావిలోమతా
మతామ్యత స్తే సమతా న వామతా. 49

పదచ్ఛేదము:- మతా-ధునానా-అరమతాం-అకామతాం-అతాపలబ్ధాగ్రిమతానులోమతా-మతౌ-అయతీ-ఉత్తమతావిలోమతాం-అతామ్యతః-తే-సమతా-న-వామతా.

వ్యా అతామ్యతః = ఎన్నడును విషాదమును పొందని, తే = నీయొక్క, మతౌ = బుద్ధియందు (బుద్ధికి), ఉత్తమతావిలోమతాం = ఉత్తమత్వమునకు విరుద్ధత్వమును అనగా, అపకృష్టత్వమును, అయతీ = పొందనిదియు, ఆరమతాం = ఆత్మారాములగువారియొక్క, అకామతాం = స్పృహారహితత్వమును, ధునానా = తొలగించుచున్నదియు, ఇది మనకు కూడ లభించిన బాగుండును కదా యని యోగులు కూడ తలచుచుందు రని అభిప్రాయము. అతాపలాభ్ధాగ్రిమతానులోమతా = శ్రమలేకుండ పొందబడిన శ్రేష్ఠత్వము అనుకూలత్వము గల, సమతా = సర్వభూతసమత్వము, మతా = ఇష్టమైనది. వామతా = వైషమ్యము, న = ఇష్టముకాదు. ఇచట నాలుగుపాదములందును ఆదిమధ్యాంతగతమగు వ్యపేతయమకము.

మూ. కాలకాలగల కాలకాలముఖ కాలకాల
కాలకాలపన కాలకాలఘన కాలకాల
కాలకాలసిత కాలకా లలనికాలకాల
కాలకాలగతు కాలకాల కలికాలకాల. 50

వ్యా. నీ అనుగ్రహముచే నా ప్రియురాలు నన్ను ఆలింగనము చేసికొనును గాక అని ఒక కాముకుడు వర్షాకాలమును ప్రార్థించుచున్నాడు. సంస్కృత వృత్తములలో పూర్వార్ధముతో పదము పూర్తి అగును. తద్విరుద్ధముగా ఈ శ్లోకములో, ప్రారంభమునుండి మూడవపాదములోని 'కాలకాలసితకాలకాలకా' వరకును ఒకే సమాసపదము. నాయికకు విశేషణము. (కాల...కాలకా-లలనికా-అలకాలకాలక-ఆలగతు-కాలకాల-కలికాల్కాల). హే అలకాలకాలకాలక-అలకా = అలకాపట్టణమునకు(ను), అలక అలంకరించువాడైన కుబేరుని వలె, అలక = (జల దానముచే) తృప్తిని కలిగించుదానా, కాలకాల = వసంతాదికాలములలో శ్రేష్ఠమైనదానా, కలికాలకాల = కలికా = మొగ్గలచే, అలక = అలంకరించు వసంతాదులకంటె, అల = సమర్థమైన ఓ వర్షాకాలమా, కాలకాల... అలకా కాలకాల = యమునకు కూడ యముడైన శివునియొక్క, గలక =

కంఠము వలెను, ఆలి = అవి (తుమ్మెదల) సమూహమువలెను, కాలముఖ = కొండముచ్చు (ముఖము) వలెను, కాల = కలివలెను, కాల = యముడువలెను, కాలక = నల్లని శిరస్సుగల నెమళ్లకు, ఆలపనకాల = కూతలనుకలిగించు, 'రలయోరభేదః' అను న్యాయముచే 'ఆలపనకార' అనుటకు బదులు 'ఆలపన కాల' అని ప్రయోగము. కాల = నల్లని, ఘన = మేఘముల, కాల = కాలము (వర్షకాలము)వలెను, కాలక = నల్లనైన, అలక = ముంగురులచేత, లసిత = ప్రకాశించుచున్న. కాల = నల్లని, కా = శిరస్సుగల, లలనికా = ప్రశంశనీయు రాలగు ఆలలన, ఆలగతు = నాయందు లగ్నచిత్తయగుగాక, ఇచట నాలుగు పాదముల ఆదిమధ్యాంతములందు అవ్యపేతవ్యపేత యమకము.

మూ. సన్దష్టయమకస్థానమన్తాదీ పాదయోర్ద్వయోః
ఉక్తాన్తర్గతమప్యేతత్ స్వాతన్త్ర్యేణాత్ర కీర్త్యతే. 51

వ్యా. ద్వయోః = రెండు, పాదయోః = పాదములయొక్క, అన్తాదీ = అంతాదులు, అనగా ప్రథమపాదాన్త ద్వితీయపాదాదులు, ద్వితీయ పాదాన్తతృతీయపాదాదులు, తృతీయపాదాన్తచతుర్థపాదాదులు అని అర్థము, సన్దష్టయమకస్థానం = సందష్టయమకమునకు స్థానము. ఇట్టి యమకమునకు సందష్టయమక మని ప్రాచీనులు అంగీకరించినారు. ఏతత్ = ఇది, ఉక్తాన్తర్గత మపి = (వెనుక నాచే) చెప్పబడిన యమకభేదములలో అంతర్గతమే అయినను, అత్ర = ఇచట, స్వాతన్త్ర్యేణ = స్వతంత్రరూపమున, కీర్త్యతే = చెప్పబడు చున్నది.

వెనుకటి 47వ శ్లోకమునందు గూడ సందష్టయమక మున్నది కాని, దీనికి స్వతంత్రముగ కూడ ఉదాహరణము చూపబడుచున్నది అని అర్థము.

మూ. ఉపోఢరాగాప్యబలా మదేన సా
మదేనసా మన్యురసేన యోజితా.

న యోజితాత్మానమనఙ్గతాపితా
ఙ్గతాపి తాపాయ మమాస నేయతే. 52

వ్యా. మదేన = మద్యమదముచేతను, యౌవనమదముచేతను, ఉపోఢ రాగా = అత్యధిక మైన సురతాభిలాషకల దైనను, సా అబలా = ఆ యువతి, మదేనసా = నా దోషముచేత, మన్యురసేన = కోపముతో, యోజితా = కూర్చ బడినది నా దోషముచే కోపగించినది. అనఙ్గతాపితాం = మన్మథతాపము కలుగు టను, గతాపి = పొందినదైనను, (ఆమె) ఆత్మానం = తనను, (నాతో) న యోజితా = కలియునట్లు చేయలేదు, (ఇది) మమ = నాకు, ఇయతే = ఇంత, తాపాయ = మనస్తాపమునకు, నాస = కాలేదా? ఇది నాకు చాల మనస్తాపకర మైన దని అర్థము. ఇచట ప్రథమపాదాంతద్వితీయపాదాదులందును, ద్వితీయ పాదాంత తృతీయపాదాదులందును, తృతీయపాదాంత చతుర్థపాదాదులందును యమక ముండుటచే సందష్టయమకము.

మూ. అర్ధాభ్యాసః సముద్గః స్యాదస్య భేదాస్త్రయో మతాః
పాదాభ్యాసోఽప్యనేకాత్మా వ్యజ్యతే స నిదర్శనైః. 53.

వ్యా. అర్ధాభ్యాసః = శ్లోకార్థముయొక్క (రెండుపాదముల) ఆవృత్తి. సముద్గః = సముద్గ మను పేరు కలదిగా, స్యాత్ = అగును, అస్య = దీనికి, త్రయః = మూడు, భేదాః = భేదములు, మతాః = అంగీకరింపపడినవి. పాదా భ్యాసోఽపి = ఏకపాదాభ్యాసము కూడా, అనేకాత్మా = అనేకస్వరూపములు కలది. సః = అది, నిదర్శనైః = ఉదాహరణములతో, వ్యజ్యతే = స్పష్టముచేయ బడుచున్నది.

అవ. మొదటి సముద్గభేదమును ఉదాహరించుచున్నాడు.

మూ. నాస్థేయః సత్వయా వర్జ్యః పరమాయతమానయా
నాస్థేయః స త్వయావర్జ్యః పరమాయతమానయా. 54

వ్యా. పరమానతమానయా = మిక్కిలి విస్తృత మైన కోపము కల దానవుడు, స్థేయఃసత్త్వయా = స్థిర మైన స్వభావముగల దానవునుఅగు, త్వయా = నీచేత, సః నా = ఆ ప్రియుడు, న వర్జ్యః = విడువతగినవాడు కాడు, పరం = మిక్కిలి, ఆయతమానయా = ప్రయత్నము చేయుచున్న నీచేత, ఆస్థేయః = ఆదరింపదగినవాడు. ఆవర్జ్యః = వశముచేసుకొనదగినవాడు. ఇచట పూర్వార్థము ఆవృత్తి చేయబడినది గాన అర్థాభ్యాససముద్గము.

అవ. రెండవ సముద్గ భేదమును ఉదాహరించుచున్నాడు

మూ. నరా జితా మాననయాసమేత్య
న రాజితా మాననయా సమేత్య.
వినాశితా వై భవతాపనేన
వినాశితా వై భవతాపనేన. ౬౮

పదచ్ఛేదము. (ఇది రాజస్తుతిపర మైన శ్లోకము.) నరాః - జితాః - మానన యాసం - ఏత్య - న - రాజితాః - మాననయా - సమ-ఇత్య - వినాశితా - వైభవతాపనేన - వినా - ఆశితాః - వై - భవతా - ఆపనేన.

వ్యా. హే సమ = (మయా సహితః సమః) - లక్ష్మితో కూడినవాడా, మాననయా = ఆదరముచేత, ఇత్య = పొందదగినవాడా, జితాః = నీచేతజయింప బడిన, నరాః = శత్రువు లైన నరులు, మాన-నయ-ఆసం = గౌరవముయొక్కయు నీతియొక్కయు వినాశమును, ఏత్య = పొంది, నరాజితాః = శోభించుటలేదు. ఆపనేన = వ్యాపకుడ వైన, భవతా = నీచేత, వైభవతాపనేన = వైభవమును తొలగించుటచే, వినాశితాః = నశింపచేయబడిన ఆ శత్రువులు, వై = నిశ్చయ ముగ, వినా = గృధ్రపక్షిచేత, ఆశితాః = భక్షింపబడినారు ఇచట ప్రథమ

ద్వితీయపాదములును, తృతీయ చతుర్థపాదములును సమానములు.

అథ మూడవ సముద్గభేదమును ఉదాహరించుచున్నాడు.

మూ. కలాపినాం చారుతయోపయాన్తి
వృన్దాని లాపోఢఘనాగమానామ్.
వృన్దానిలాపోఢఘనాగమానాం
కలాపినాం చారుతయోపయాన్తి. 56.

వ్యా. లాపోఢఘనాగమానాం = శబ్దముచే (కేకాధ్వనిచే) పొందబడిన (స్వాగతము చెప్పబడిన) వర్షాకాలము గల, కలాపినాం = నెమళ్ల, వృన్దాని = సమూహములు, చారుతయా = శోభతో, ఉపయాన్తి = కలియు చున్నవి. సుందరముగ నున్నవి. వృన్దానిలాపోఢఘనాగమానాం = సంభూతరూప మైన వాయువుచేత (వాయుసమూహముచేత) తొలగింపబడిన ఘన మనునాట్యవిశేషముయొక్క పరిశీలనము గల, (వర్షాకాలమున హంసలు మదము తొలగి నాట్యము లేకుండ ఉండును), కలాపినాం = (క + లాపినాం) నీటిలో ధ్వని చేయు హంసల యొక్క, ఆరుతాని చ = ధ్వనులు కూడ, అపయాన్తి = తొలగిపోవుచున్నవి. ఇచట ప్రథమ చతుర్థపాదములును, ద్వితీయ తృతీయపాదములును సమానములు.

మూ. నమన్దయావర్జితమానసాత్మయా
న మన్దయావర్జితమానసాత్మయా.
ఉరస్యుపాస్తీర్ణపయోధరద్వయం
మయా సమాలిఙ్గ్యత జీవితేశ్వరః. 57

వ్యా. పాదములపై పడిన ప్రియుని నిరాకరించి పశ్చాత్తాపము చెందిన మానిని పలుకు మాటలు. మందయా = మూఢురాల నై నట్టియు. అవర్జితమాన-

సాత్మయా = విడువబడని కోపమునందు ప్రయత్నము చేయుచున్నదానను ఐనట్టియు, దయావర్జితమానసాత్మయా = దయాశూన్యమైన మనస్సు, స్వభావము కలదానను అయిన, మయా = నాచేత, నమన్ = నమస్కారము చేయుచున్న, జీవితేశ్వరః = ప్రియుడు, ఉరసి = (ఆతని) వక్షఃస్థలమునందు, ఉపాస్తీర్ణపయోధరద్వయం = ఉంచబడిన స్తనద్వయము కలుగునట్లుగా, న సమాలిఙ్గ్యత = కౌగలించుకొనబడలేదు. ఇచట ప్రథమద్వితీయపాదములు సమానములు.

మూ. సభా సురాణామబలా విభూషితా
గుణై స్తవారోహి మృణాలనిర్మలైః.
స భాసురాణామబలా విభూషితా
విహారయన్నిర్విశ సమ్పదః పురామ్. 58

వ్యా. అబలా = బలు డను దైత్యుడు లేనిదియు, కావుననే దైత్యభయము లేకపోవుటచే, విభూషితా = విభు + ఉషితా = ప్రభువైన ఇంద్రునిచే అధిష్ఠింపబడిన, సురాణాం సభా = దేవతల సభ, మృణాలనిర్మలైః = తామర తూడుల వలె నిర్మలమైన, తవ గుణైః = నీ గుణములచే, ఆరోహి = అధిష్ఠింపబడినది. నీ గుణములను దేవసభలో కూడ మెచ్చుకొనుచున్నా రని అర్థము. సః = అట్టి నీవు, విభూషితాః = అలంకరించుకొని ఉన్న, అబలాః = స్త్రీలను, విహారయన్ = విహరింపచేయుచు, భాసురాణాం = ప్రకాశించుచున్న, పురాం = పట్టణములయొక్క, సమ్పదః = సంపదలను, నిర్విశ = అనుభవింపుము. ఇచట ప్రథమ తృతీయపాదములు తుల్యములు.

మూ. కలం కముక్తం తనుమధ్యనామికా
స్తనద్వయీ చ త్వదృతే న హన్త్యతః.
న యాతి భూతం గణనే భవన్ముఖే
కలఙ్కముక్తం తనుమధ్యనామికా. 59

వ్యా. ఇది ఎవరో మహాపురుషునితో పలికిన వాక్యము. కలం = మధుర మైన, ఉక్తం = (యువతుల) వచనము, తమమధ్యనామికా = సన్నని నడుమును. వంగునట్లుచేయు, స్తనద్వయీ చ = స్తనద్వయము, త్వదృతే = నీవు తప్ప, కం = ఎవనిని, న హన్తి = పీడించుటలేదు. నిర్వికారచిత్తుడ వగు నిన్ను తప్ప అందరిని ఆపర్షించు నని అర్థము. భవన్ముఖే = నీతో ప్రారంభ మైన, గణనే = (మహాపురుష) గణనమునందు, అనామికా = అనామిక, కలఙ్కముక్తం = కలంకశూన్యు డైన, తనుమత్ = శరీరధారియైన, భూతం = జన్తువును, (పురుషుని), న యాతి హి = పొందదు కదా. "తనుమత్ + హి + అనామికా" అని పదచ్ఛేదము.

జితేంద్రియులను లెక్కించు నపుడు నీ పేరు కనిష్ఠికపైకి వచ్చినది. మరియొక రెవరును లేకపోవుటచే అనామికను మడచుటకు పేరు లేక పోయె నని అర్థము. ఇచట ప్రథమ తృతీయపాదములు తుల్యములు.

మూ. యశశ్చ తే దిక్షు రజశ్చ సైనికా
వితన్వతేజోపమ దంశితా యుధా.
వితన్వతేజోపమదం శితాయుధా
ద్విషాం చ కుర్వన్తి కులం తరస్వినః. ౬౦

వ్యా. హే అజోపమ = ఓ విష్ణువుతో సమాన మైనవాడా, దంశితాః = కవచమును ధరించిన వారును, శితాయుధాః = వాడి యైన ఆయుధములు కలవారును, తరస్వినః = వేగవంతులును అగు, తే సైనికాః = నీ సైనికులు, యుధా = యుద్ధముచేత, యశశ్చ = కీర్తిని, రజశ్చ = పరాగమును, దిక్షు = దిక్కులందు, వితన్వతే = ప్రసరింప చేయుచున్నారు. ద్విషాం = శత్రువుల, కులం చ = సముదాయమును కూడా, అతేజః = తేజోరహితముగను, అపమదం = తొలగిన మదము కలదాని గాను, వితను = శరీరము లేనిదానిని గాను, కుర్వన్తి = చేయుచున్నారు. ఇచట ద్వితీయ తృతీయపాదములు తుల్యములు.

మూ. బిభర్తి భూమేర్వలయం భుజేన తే
భుజఙ్గమోఽమా స్మరతో మదఞ్చితమ్.
శృణూక్తమేకం స్వమవేత్య భూధరం
భుజం గమో మా స్మ రతో మదం చితమ్. 61

వ్యా. (ఓరాజా), తే భుజేన అమా = నీ భుజముతో కూడా, భుజఙ్గమః = ఆదిశేషుడు, భూమేః వలయం = భూవలయమును, బిభర్తి = ధరించుచున్నాడు, స్మరతః = ఈ విషయమునంతను స్మరించుచున్న, మత్ = నానుండి, అఞ్చితం = (సర్వజన) పూజితమైన, ఏకం = ఒక, ఉక్తం = వచనమును, శృణు = వినుము. స్వం = తన సంబంధమైన, భుజం = భుజమును, ఏకం = సహాయాన్తరాపేక్ష లేని, భూధరం = (భూభారమును వహించుచు) పర్వతమునుగా, అవేత్య = తెలుసుకొని, రతః = సంతసించిన హృదయము కలవాడవై, చితం = అధికమైన, మదం = గర్వమును, మా స్మ గమః = పొందకుము. నీ భుజమే కాదు, ఆదిశేషుడు కూడ భూమిని ధరించుచున్నాడు. అందుచే నీవు గర్వపడవలసిన పని లేదు అని అర్థము. వ్యాజస్తుత్యలంకారము. ఇచట ద్వితీయ చతుర్థపాదములు తుల్యములు.

మూ. స్మరానలో మానవివర్ధితో యః
స నిర్వృతిం తే కిమపాకరోతి.
సమన్తతస్తామరసేక్షణేన
సమం తతస్తామరసే క్షణేన. 62

వ్యా. హే తామరసేక్షణే = ఓ పద్మములవంటి నేత్రములు కలదానా, హే అరసే = ఓ నీరసహృదయురాలా, యః = ఏది, మానవివర్ధితః = మానముచే వృద్ధి పొందింపబడినదో, క్షణేన సమం = ఉత్సవముతో కూడా, తతః = వ్యాప్తమైనదో, సః = అట్టి, స్మరానలః = మన్మథాగ్ని, సమన్తతః = పూర్తిగా,

తాం = ఆ (పూర్వము అనుభవింపబడిన), తే నిర్వృతిం = నీయొక్క ఆనంద మును, న అపాకరోతి కిం = తొలగించుట లేదా? "సమ స్తతః-తామర సేక్షణే - న - సమం - తతః - తాం - అరసే - క్షణేన" అని ఉత్తరార్ధమున పదచ్ఛేదము. ఇచట తృతీయ చతుర్థపాదములు తుల్యములు.

మూ. ప్రభావతోనామ న వాసరవస్య

ప్రభావతో నామన వా సవస్య.

ప్రభావతో నామ నవాసవస్య

విచ్ఛిత్తిరాసీ త్త్వయి విష్టపస్య. 63

వ్యా ఇది కృష్ణుని స్తుతి. ప్రభావతః = స్వప్రభావము వలన, ప్రభా వతః = కాంతిమంతు డైన, వాసవస్య = ఇంద్రుని కూడా, నామన = వంగ దీసినవాడా, హే అనామ = ఆమము (రోగము) లేని వాడా, త్వయి = నీవు, అతః = ఈ కారణమువలన, విష్టపస్య = లోకమునకు, ప్రభౌసతి - ప్రభువై ఉండగా, నవాసవస్య = నూతన మైన ఆసవమునకు గాని (యాదవుల ఉప యోగమునకు అని భావము) సవస్యవా = (బ్రాహ్మణాదులలో) యజ్ఞమునకు గాని, విచ్ఛిత్తిః నామ = విచ్ఛేద మనునది, నాసీత్ = కాలేదు. ఇచట మొదటి మూడు పాదములును తుల్యములు.

మూ. పరంపరాయా బలవారణానాం

పరం పరాయా బలవారణానామ్.

ధూళీః స్థలీర్వ్యోమ్ని విధాయ రున్ధన్

పరం పరాయా బలవా రణానామ్. 64

వ్యా. బలవారణానాం = ప్రబల మైన గజముల యొక్క, పరాయాః = చాల పెద్దదైన, పరంపరాయాః = పంక్తివలన, రణానాం స్థలీః = యుద్ధభూము

లను, వ్యోమ్ని = అకాశమునందు, ధూలీః = ధూలీరూప మైన వాటినిగా, విధాయ = చేసి, బలవాః = స్వబలముచే శత్రువులను నివారించు నీవు, పరం = గొప్పవాడైన,పరం = శత్రువును, రున్ధన్ = నిగ్రహించుచు, పరాయాః = బైటకు వచ్చితివి. ఇచట ప్రథమ ద్వితీయ - చతుర్థపాదములు తుల్యములు.

మూ. న శ్రద్దధే వాచమలజ్జ మిథ్యా
 భవద్విధానామసమాహితానామ్.
 భవద్విధానామసమాహితానాం
 భవద్విధానామసమాహితానామ్. 65

వ్యా. హేఅలజ్జ = ఓలజ్జలేనివాడా అసమాహితానాం = నిలకడ లేని వారును, అసమాహితానాం = గొప్ప శత్రువులును అగు, భవద్విధానాం = నీ వంటివారి యొక్క, మిథ్యాభవద్విధానాం = అసత్య మైన ప్రతిపాదనము కల దియు, అసమ + అహి + తానాం = కుటిల మైన సర్పముతో సమానమైన విస్తారము కలదియు, భవద్విధానాం = క్రొత్త క్రొత్తగా ఏర్పడు విధానము గల, వాచం = వాక్కును, న శ్రద్దధే = విశ్వసింపను. ఇచట ద్వితీయ తృతీయ చతుర్థపాదములు తుల్యములు.

మూ. సన్నాహితోమానమరాజసేన
 సన్నాహితోమానమ రాజసేన.
 సన్నా హితోమానమరాజసేవ
 సన్నాహితో మానమ రాజసే న. 66

పదచ్ఛేదము. సన్ - ఆహితోమానమరాజసేన - సన్నాహిత - ఉమానమ - రాజసేన - సన్ - నా - హితః - అమాన్ - సన్నాహితః - మా - అనమ రాజసే - న.

వ్యా. హేఅనమ = వంగనివాడా, ఆహితోమానమరాజసేన = (న నమ న్తీతి అనమాః = ద్విజులు. అనమానాం రాజా అనమరాజః = చంద్రుడు. ఉమా చ అనమరాజశ్చ ఉమానమరాజౌ = పార్వతీ చంద్రులు. ఆహితౌ ఉమా నమారాజౌ యేన సః = పార్వతీ శశాంకులను దేహార్ధ శిరోభాగములపై ధరించిన శివుడు, ఇనేన సహితః = ప్రభువు కలవాడు) = పార్వతీ చంద్రులను ధరించిన శివుడే ప్రభువుగా కలవాడా, సన్నాహిత = నశించిన శత్రువులు కలవాడా, ఉమానమ = పార్వతికి నమస్కారము చేయువాడా, రాజస + ఇన = రాజులకు ప్రభు వైనవాడా, అమరాజసేన = దేవతలను కూడా చిమ్మివేయ గల సేన కలవాడా, (నీవు) సన్ నా = ఉత్తముడ వైన పురుషుడవు. హితః = సర్వ హితుడవు. అమాన్ = చాల గొప్పవాడవు. సన్నాహితః సన్ = యుద్ధముకొరకై కవచధారణాదికము చేసినవాడవై, న మా రాజసే = ప్రకాశించుట లేదు . అను మాట లేదు. ఇచట నాలుగు పాదములును తుల్యములు.

మూ. సకృద్ద్విస్త్రిశ్చ యోఽభ్యాసః పాదస్యైవం ప్రదర్శితః
శ్లోకద్వయం తు యుక్తార్థం శ్లోకాభ్యాసః స్మృతో యథా 67

వ్యా. ఏవం = ఈ విధముగా, సకృత్ = ఒక పర్యాయము, ద్విః = రెండు పర్యాయములును, త్రిశ్చ = మూడు పర్యాయములును, పాదస్య = పాదము యొక్క, యః అభ్యాసః = ఏ ఆవృత్తి కలదో. అది, ప్రదర్శితః = చూపబడినది. యుక్తార్థం = కలిసిన అర్థముగల శ్లోకద్వయం = శ్లోకముల ద్వయము, శ్లోకాభ్యాసః = శ్లోకాభ్యాసముగా, స్మృతః = చెప్పబడినది. యథా = ఎట్లనగా:-

మూ. వినాయకేన భవతా వృత్తోపచితబాహునా
స్వమిత్రోద్ధారిణా భీతా పృథ్వీ యమతులాశ్రితా. 68

మూ, వినాయకేన భవతా వృత్తోపచితబాహునా
స్వమిత్రోద్ధారిణా భీతా పృథ్వీయమతులాశ్రితా. 69

వ్యా. ఇచట ఒకే విధమున ఉన్న ఈ రెండు శ్లోకములలో మొదటి శ్లోకమునందు శత్రురాజుల దురవస్థ వర్ణింపబడినది. రెండవ శ్లోకమునందు రాజు వర్ణింపబడినాడు. మొతటి శ్లోకమునకు అర్థము:- వినాయకేన = నశించిన సేనానాయకాదులు కలవాడును, వృత్త్యోపచితబాహునా = చితాసమీపమును చేరుటచే నష్టప్రాయ మైన బాహువులు కలవాడును (చితాయాః సమీపే = ఉపచితమ్. వృత్త్యా ఉపచితం బాహూ యస్య సః). స్వమిత్రోద్ధా = ధనమును మిత్రులను కోల్పోయినవాడును, (స్వం చ మిత్రాణి చ = స్వమిత్రాణి. స్వమిత్రాణి ఉజ్జహాతీతి = స్వమిత్రోద్ధాః), భీతా (భయం ఏతీతి = భీత్. తేన) = భయమును పొందిన, అరిణా = శత్రువుచేత, పృథ్వీ = విశాలమైన, యమతులా = (యుద్ధమునుండి వెన్నిచ్చి పారిపోయిన క్షత్రియులను దండించుటకై) యముడు ఏర్పరిచిన (కాల్చిన) ఇనుప తులాపండము, ఆశ్రితా = ఎక్కబడినది.

రెండవ శ్లోకమునకు అర్థము:- వినాయకేన = విశిష్టనాయకుడవును, వృత్తోపచితబాహునా = వర్తులాకార మైన లావైన బాహువులు కలవాడవును, స్వమిత్రోద్ధారిణా = తన మిత్రులను పోషించువాడవును, లేదా (సు + అమిత్ర) శత్రువులను పూర్తిగా నశింపచేసినవాడవును అగు, భవతా = నీచేత, ఆశ్రితా = వశమునందుంచుకొనబడిన, ఇయం = ఈ, పృథ్వీ = భూమి అభీతా = భయము లేనిది. అతులా = సాటిలేనిది.

మూ. ఏకాకారచతుష్పాదం తన్మహాయమకాహ్వయమ్.
తత్రాపి దృశ్యతేఽభ్యాసః సా పరా యమకక్రియా. 70

వ్యా. తత్ = ఆ, ఏకాకారచతుష్పాదం = ఒకే ఆకారములో ఉన్న నాలుగు పాదములు కలది, మహాయమకాహ్వయం = మహాయమక మను పేరు గలది. తత్రాపి = పాదమధ్యమునందు కూడ, అభ్యాసః = అవృత్తి, దృశ్యతే = కానవచ్చుచున్నది, సా = అది, పరా = గొప్పదైన, యమకక్రియా = యమకప్రక్రియ.

పాదత్రిరభ్యాసమునకు ఉదాహరణముగా చూపిన 'సన్నిహిత' ఇత్యాది శ్లోకమున (66) నాలుగు పాదములు తుల్యములే యైనను పాదములో పదావృత్తి లేదు. ఈ మహాయమకమున పాదములో కూడ పదావృత్తి ఉండును. అదియే ఈ రెండింటికిని భేదము

మూ. సమానయాఽసమానయా సమానయాఽసమానయా.

స మా న యాఽసమానయా సమాఽనయాఽసమానయా. 71

పదచ్ఛేదము:- సమానయా - అసమానయా - సమానయాసమానయా - సః - మా - న - యా - అసమానయా - సమానయ - అసమ - అనయా.

వ్యా. హే అసమ = ఓ సాటి లేని స్నేహితుడా, సః = అట్టి నీవు, మా = నన్ను, సమాన-యాస-మానయా = సమాన మైన ఆయాసముయొక్క ప్రమాణము కలదియు, సమానయా = మానముతో కూడినదియు, అసమాన యా = సాటి లేనిదియు అగు, అనయా = ఈ నాయికతో, సమానయ = కలుపుము. యా = ఏ నాయిక, అసమానయా = (మా చ నయశ్చ = మానయౌ. మానయాభ్యాం సహితా = సమానయా, న సమానయా = అసమానయా) లక్ష్మీ-నయములతో కూడినది కానిది, న = కాదో. ఆమె లక్ష్మి - నయములు గల నాయిక అగుటచే ఉపేక్షింపదగినది కాదు అని భావము.

అవ. వెనుక సజాతీయయమకముల కలయికచే ఏర్పడు కొన్ని భేదములు ప్రతిపాదింపబడినవి. ఇపుడు విజాతీయయమకముల కలయికచే ఏర్పడు కొన్ని భేదములను చెప్పుచున్నాడు.

మూ. ధరాధరాకారధరా ధరాభుజాం
భుజా మహీం పాతుమహీన విక్రమాః.
క్రమాత్ సహన్తే సహసా హతారయో
రయోద్ధురా మానధురావలమ్బినః. 72

వ్యా. ధరాధరాకారధరాః = భూమిని ధరించు ఆదిశేషుని ఆకారమును ధరించునవియు, అహీనవిక్రమాః = తక్కువ కాని(అధికమైన) పరాక్రమము కలవియు, సహసా = శీఘ్రముగా, హతారయః = చంపబడిన శత్రువులు కలవియు, రయోద్ధురాః = వేగముచేత తీవ్ర మైనవియు, మానధురావలమ్బినః = అభిమాన పూర్ణులును అగు, ధరాభుజాం = రాజుల, భుజాః = భుజములు, క్రమాత్ = కులక్రమమున, మహీం = భూమిని, పాతుం = రక్షించుటకు, సహన్తే = సమర్థ మగుచున్నవి. ఇచట "ధరాధరాకారధరాధరా" అనునపుడు అవ్యపేత-వ్యపేతయమకములు. "భుజాభ్భుజా" అనునపుడు సందష్టయమకము. "మహీం పాతుమహీ" "సహన్తే సహసా" అనునపుడు వ్యపేతయమకములు. "రయోరయో" అనునపుడు అవ్యపేతయమక - సందష్టయమకములు. "ధురామానధురా" అనునపుడు వ్యపేతయమకము. ఈ విధముగ ఇచట వివిధ యమకముల కలయిక ఉన్నది.

మూ. ఆవృత్తిః ప్రాతిలోమ్యేన పాదార్ధ శ్లోకగోచరా
యమకం ప్రతిలోమత్వాత్ ప్రతిలోమమితి స్మృతమ్. 73

వ్యా. ప్రాతిలోమ్యేన = విపరీతక్రమముచేత, పాదార్ధశ్లోకగోచరా = పాదమునకు గాని, శ్లోకార్ధమునకు గాని శ్లోకమునకు గాని సంబంధించిన, ఆవృత్తిః = ఆవృత్తి, ప్రతిలోమత్వాత్ = విపరీతక్రమమున ఉండుటచే, ప్రతిలోమంయమకమితి = ప్రతిలోమయమక మని, స్మృతం = చెప్పబడినది.

మూ. యామతాశ కృతాయాసా సా యాతా కృశతా మయా
రమణారకతా తేఽస్తు స్తుతేతాకరణామర. 74

వ్యా. ఖండితనాయిక ప్రియుని దూషించుచున్నది. హే అమతాశ = అమత మైనదానియందు, అనగా అనిష్టమైన పరనాయికాప్రసంగమునందు ఆసక్తి కలవాడా, యా = ఏది, కృతాయాసా = దుఃఖకర మైనదో, సా = అట్టి, కృశతా = (నీ విరహముచే కలిగిన) కృశత్వము, మయా = నాచేత,

యాతా = పొందబడినది. హే స్తుతేత = స్తోత్రమునుండి దూర మైనవాడా, అనగా నింద్యాచరణము కలవాడా, అకరణామర = చెడ్డపనులు చేయుటయందు దేవత వంటి వాడా, అనగా, అడ్డు లేని వాడా, హే రమణ = ఓ ప్రియుడా, తే = నీయొక్క, ఆరకతా = ఇచటినుండి వెళ్లిపోవుట, అస్తు = అగుగాక.

నీవు ఇచటినుండి వెళ్లిపొమ్ము. ఇచట మొదటి పాదమును చివరినుండి మొదటికి చదువగా రెండవపాదము, తృతీయపాదమును అట్లు చదువగా చతుర్థ పాదము ఎర్పడినవి గాన ఇది పాదప్రతిలోమ యమకము.

మూ. వాదినోమదనా ధీః స్వా న మే కాచన కామితా
కామికా న చ కామేన స్వాధీనా దమనోదినా. 75

వా. నాదినః = నాదబ్రహ్మోపాసనచేయు, మే = నాయొక్క, అమదనా = కామశూన్యమైన, స్వా = స్వీయమైన, ధీః = బుద్ధి, స్వాధీనా = స్వాధీనమైనది కాచన = ఏమియు, కామితా = కాముకత్వము, న = లేదు, దమనోదినా = ఇంద్రియనిగ్రహమును తొలగించు, కామేన = కామము చే, కామికాచ = మనఃక్లేశము కూడ, న = లేదు.

ఇచట పూర్వార్ధమును చివరినుండి మొదటికి పఠించగా ఉత్తరార్ధ మేర్పడినది గాన ఇది శ్లోకార్ధయమకము. "నానుస్వారవిసర్గౌ చ చిత్రభఙ్గాయ సంమతౌ" అని చెప్పిన విధమున అనుస్వార విసర్గములను బట్టి 'ధీః' 'ధీ' ఇత్యాదులలో భేద మున్నను చిత్రకావ్యత్వమునకు భంగములేదు.

మూ. యానమానయమారావికశోనానజనాశనా
యాముదారశతాధీనామాయామాయమనాదిసా 76

సా దినామయమాయామా నాధీతా శరదాముయా
నాశనాజననా శోకవిరామాయ న మానయా. 77

(ఇతి యమకచక్రమ్.)

పదచ్ఛేదము. యానమానయమారావికశా - ఊనానజనాశనా - యాం - ఉదార శతాధీనాం - అయాం - అయమనాదిసా - సా - దినామయమా - అయామా - న - అధీతా - శరదా - అమూయా - నాశనాజననా - శోకవిరామాయ - న - మానయా.

ఒక కాముడు తనకు పూర్వపరిచిత యగు గణికను ప్రశంసించుచున్నాడు:- ఉదార శతాధీనాం = చాల ధనము ఈయ గలిగిన ఎందరో కాముకులకు వశమైన దైనను, యాం = ఏ గణికను, అయాం = (అదృష్టవశముచే నేను) పొందితినో, సా = అట్టి, అమూయా = ఈ, శరదా = శరదృతువుచేత, అధీతా = ఆక్రమింప బడినదియు, అనగా జనించిన మన్మథుడు కలదియు, యాన-మాన-య-మార-అవి-కశా = కామిజనులను జయించుటకై ప్రయాణము చేయుటయందు అభిమాన మును పొందు మన్మథు డనెడు గొఱ్ఱెకు కొరడావంటిదియు, విజయయాత్రకై బయలుదేరిన మన్మథున కూడ వశములో నుంచుకొనగలిగినది అని అర్థము ఊన-అన-జన-అశనా = స్వల్ప మైన ప్రాణము (సామర్థ్యము) గల జనులను కాముకులను సర్వస్వాపహారముద్వారా) భక్షించునదియు, అయమన-ఆది-సా = ఇంద్రియనిగ్రహము గల యోగులను కూడ కృశీభవించునట్లు చేయునదియు, దిన-ఆమయ-మా = దివసభాగమును (కామభోగమునకు విఘ్నకర మగుటచే) గరోమునుగా భావించునదియు,అయ-అమా = శుభావహ మగు దైవమును పొందు నదియు, అనుకూల మైన దైవము కలదియు, నాశన-అజననా = కాముకులకు నాశనమును కలిగించునదియు, మాన-యా = సత్కారములను పొందునదియు, అగు ఆ గణిక, శోకవిరామాయ = నా శోకమును తొలగించుటకు, న ఇతి న = (సమర్థురాలు) కాదు అను మాట లేదు. అనగా తప్పక ఆమె నా శోకమును తొలగించును. ఇచట మొదటి శ్లోకమును పూర్తిగ చివరినుండి మొదటి వరకును చదువగా రెండవ శ్లోకము ఏర్పడినది.

(యమకచక్రము సమాప్తము)

మూ. వర్ణానామేకరూపత్వం యత్త్వేకాన్తరమర్ధయోః
గోమూత్రికేతి తత్ ప్రాహుర్దుష్కరం తద్విదో యథా. 78

వ్యా. అర్ధయోః = శ్లోకముయొక్క పూర్వార్ధోత్తరార్ధములయందు, (పూర్వార్ధమును మొదటి పంక్తిలోను ఉత్తరార్ధమును రెండవ పంక్తిలోను వ్రాయగా). వర్ణానాం = వర్ణములకు. ఏకాన్తరం = ఏకవర్ణవ్యవహిత మైన, ఏకరూపత్వం = ఒకే రూపములో నుండుట కలదో, అనగా వర్ణము విడచి వర్ణము చదువగా పూర్వార్థములో నున్న వర్ణములును, ఉత్తరార్ధములో నున్న వర్ణములును సమముగా నుండునని అర్థము, దుష్కరం = రచించుటకు చాల కష్టమైన, తత్ = దానిని, గోమూత్రికేతి = గోమూత్రికాబంధము అని, తద్విదః = దానిని గూర్చి తెలసినవారు, ప్రాహుః = చెప్పుదురు.

పాదగోమూత్రికా, అర్థగోమూత్రికా, శ్లోకగోమూత్రికా అని గోమూత్రిక మూడు విధములు. వాటిలో ఇది అర్ధగోమూత్రికాలక్షణము. ఎద్దు నడచుచు మూత్రము విడచు నపుడు భూమిపై ఎగుడుదిగుడుగా రేఖలు పడును. ఆ విధముగా గీతలు గీసి ఈ శ్లోకమును వ్రాసి చదువవలెను. గాన దీనికి గోమూత్రికాబంధ మని పేరు వచ్చి యుండును.

మూ. మదనో మదిరాక్షీణామపాఙ్గాస్త్రో జయేదయమ్
మదేనో యది తత్ క్షీణమనఙ్గాయాఞ్జలిం దదే. 79

వ్యా. అయం = ఈ, మదనః = మన్మథుడు, మదిరాక్షీణాం = మాదకము లైన నేత్రములు గల స్త్రీలయొక్క, అపాఙ్గాస్త్రః = అపాంగములే అస్త్రములుగ కలవాడై, జయేద్యది = (ఆ అపాంగములతో నన్ను) జయించినచో, తత్ = అప్పుడు, మదేనః = నా పాపము, క్షీణం = తొలగిపోవును. (ఆ అస్త్రములను నాపై ప్రయోగించవలె నని ప్రార్థించుచు) అనఙ్గాయ = మన్మథునకు, అఞ్జలిం దదే = దోసిలిఒగ్గుచున్నాను.

ఇది అర్ధగోమూత్రికాబంధము. మొదట ఉత్తరార్ధములోని ప్రథమాక్షరముతో ప్రారంభించి, తరువాత పూర్వార్ధములోని ద్వితీయాక్షరము, తరువాత ఉత్తరార్ధములోని తృతీయాక్షరము— ఈ విధముగ ద్వితీయార్ధములోని బేసి అక్షరములు, పూర్వార్ధములోని సరి అక్షరములును ఒకదాని తరువాత ఒకటి

చదువుకొనుచు వెళ్లగా పూర్వార్ధము వచ్చును. అట్లే పూర్వార్ధములోని బేసి అక్షరములు, ఉత్తరార్ధములోని సరి అక్షరములు ఒకదాని తరువాత ఒకటి చేర్చి చదివినచో ఉత్తరార్ధ మేర్పడును.

మూ. ప్రాహురర్ధభ్రమం నామ శ్లోకార్ధభ్రమణం యది
తదిష్టం సర్వతోభద్రం భ్రమణం యది సర్వతః 80

వ్యా. శ్లోకార్ధభ్రమణం యది = శ్లోకమునకు గాని, శ్లోకపాదమునకు గాని అర్ధమార్గముచే, అనగా కేవలము అనులోమమార్గముచే భ్రమణము (వర్ణముల విన్యాసక్రమము) ఉన్నచో, అర్ధభ్రమం నామ = అర్ధభ్రమ మనెడు చిత్రమును, ప్రాహుః = చెప్పుదురు. సర్వతః = అంతటను, అనగా అనులోమవిలోమ రూపములలో, భ్రమణం యది = భ్రమణ మున్నచో, తత్ = అది, సర్వతో భద్రం = సర్వతోభద్ర మని, ఇష్టం = అంగీకరింపబడినది.

అవ. అర్ధభ్రమమునకు ఉదాహరణము:-

మూ. మనోభవ తవానీకం నోదయాయ న మానినీ.
భయాదమేయామా మా వా వయయేనోమయా నత 81

వ్యా. హే నత = కామిజనులచే నమస్కరింపబడినవాడా, మనోభవ = ఓ మన్మథా, తవ = నీయొక్క, అనీకం = సైన్యము (వంటిది) అయినదియు, మానినీ = కోపస్వభావము కలదియు అగు ఈ నాయిక, ఉదయాయ న ఇతి న = విజయమునకు సాధనము కాదు అను మాట లేదు. వయం = మేము, ఏనోమయాః = పాపాత్ములము, మా వా = కాము, (ఐనను) భయాత్ = నీ సేన యైన మానినినుండి భయమువలన, అమేయామాః = అపరిమిత మైన బాధ కలవారముగా ఉన్నాము. అందుచేత ఈ మానినిని నావశంవదురాలిని చేసి నా భయమును తొలగింపుము అని అర్థము.

అవ. సర్వతోభద్రమునకు ఉదాహరణము:-

మూ. సామాయామా మాయా మాసా మారానాయాయానారామా
యానావారారావానాయా మాయారామా మారాయామా. 82

పదచ్ఛేదము. సామాయామా - మాయాః - మాసా - మారానాయాయానా - రామా - యానావారారావానాయా - మాయారామా - మారాయ - అమా.

వ్యా. సామాయామా = (ఆమస్య ఆయామః తేన సహవర్తతే ఇతి) విరహజ్వరముయొక్క దీర్ఘత్వముతో కూడినదియు, మాయాః = లక్ష్మికంటె, రామా = మనోహరమైనదియు, మారానాయాయానా = మారం ఆనయతీతి = మారానాయం. తాదృశం ఆయానం, సమాగమనం యస్యాః సా; మన్మథుని జనింపచేయు సమాగమము కలదియు, యానావారారావానాయా-యాన = పాదములకు, ఆవార = ఆచ్ఛాదకము లగు నూపురములయొక్క, ఆరావ = ధ్వనియే, ఆనాయా = కాముకులను బంధించు వలగా కలదియు, మాయారామా = మాయామయ మగు సృష్టివంటిదైన ఆ యువతి, మాసా అమా = చంద్రునితో కూడ, మారాయ = నా వధకై, ఉన్నది.

మూ. యః స్వరస్థానవర్ణానాం నియమో దుష్కరేష్వసౌ
ఇష్టశ్చతుష్ప్రభృత్యేష దర్శ్యతే సుకరః పరః. 83

వ్యా. స్వరస్థానవర్ణానాం = అచ్చులయొక్కయు స్థానముల యొక్కయు, అనగా కంఠాదిస్థానజన్యము లగు వర్ణములయొక్కయు, హల్లుల యొక్కయు, యః = ఏ, నియమః = నియమము కలదో, అసౌ = అది, దుష్కరేషు = రచించుటకు చాల కష్టమైనవాటిలో చేరినదిగా, ఇష్టః = అంగీకరింపబడినది. ఈ అచ్చులనే ఉపయోగించి శ్లోకము వ్రాయవలెను అను నియమము స్వరనియమము. ఈ స్థానముగల వర్ణములనే ఉపయోగించి వ్రాయవలెను అను

నియమము స్థాననియమము. ఈ హల్లునే ఉపయోగించవలెను అను నియమము వర్ణనియమము. ఇట్టి రచనలు దుష్కరములు అని అర్థము. ఏషః = ఈ నియమము, చతుష్ప్రభృతి = నాలుగుస్వరాదులు మొదలు, అనగా చతుస్స్వర-త్రిస్వర-ద్విస్వర-ఏకస్వర-చతుస్థానవర్ణ-త్రిస్థానవర్ణ-ద్విస్థానవర్ణ - ఏకస్థానవర్ణ చతుర్వ్యంజన-త్రివ్యంజన-ద్వివ్యంజన-ఏకవ్యంజనములు అని అర్థము. దర్శ్యతే = చూపబడుచున్నది. పరః = అంతకుమించినది (పంచస్వరాధికము), సుకరః = అనాయాసముగ కూర్చుటకు శక్యమైనది అందుచే వాటికి ఉదాహరణములు చూపబడుట లేదని అర్థము.

అవ. చతుఃస్వరనియమము:-

**మూ. ఆమ్నాయానామాహాన్త్యా వాగ్గీతీరీతీః ప్రీతీర్భీతీః.**
**భోగో రోగో మోదో మోహో ధ్యేయే వేచ్ఛేద్దేశే క్షేమే. 84**

వ్యా. ఆమ్నాయానాం = వేదములలో, అన్త్యా = చివరిదైన ఉపనిషత్తు, గీతీః = గానములను, ఈతీః = ఈతిబాధలనుగాను, "అతివృష్టిరనావృష్టిర్మూషకాః శలభాః శుకాః. అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః." ప్రీతీః = దారపుత్రాదులందు ప్రేమలను, భీతీః = భయస్వరూపమైనవాటిని గను, ఆహ = చెప్పుచున్నది. భోగః = విషయోపభోగము, రోగః = రోగహేతువు, మోదః = సాంసారికసుఖానుభవము, మోహః = అవివేకరూపమైనది. అందుచే, క్షేమే = ఉపద్రవరహితమైన, దేశే = ఏకాంత ప్రదేశమునందు, ధ్యేయేవా = ధ్యేయమగు పరమాత్మస్వరూపమునందే, ఇచ్ఛేత్ = మనస్సును నిలుపుటకు ఇచ్ఛయించవలెను. ఈ శ్లోకమున ఆ ఈ ఓ ఏ అను నాలుగు అచ్చులు మాత్రమే ఉపయోగింపబడినది.

అవ. త్రిస్వరనియమము:-

**మూ. క్షితివిజితిస్థితివిహితివ్రతరతయః పరమతయః**
**ఉరు రురుధుర్గురు దుధువుర్యుధి కురవః స్వమరికులమ్. 85**

వ్యా. క్షితి...రతయః - క్షితి విజితి = భూమిని జయించుటయందును, స్థితివిహితి = లోకమర్యాదలను నిలుపుటయందును, వ్రత = నియమమునందు, రతయః = ఆసక్తి కలవారును, పరమతయః = ఉత్కృష్టమైన బుద్ధి కలవారును అగు, కురవః = పాండవులు, యుధి = యుద్ధమునందు, ఉరు = గొప్పదైన, స్వమ్అరికులం = తమ శత్రుసముదాయమును, రురుధుః = చుట్టుముట్టిరి. గురు = అధికముగా, దుధువుః = కంపింపచేరిసి. ఈ శ్లోకమున ఇ, అ. ఉ అను మూడు అచ్చులు మాత్రమే ఉపయోగింపబడినవి.

అవ. ద్విస్వరనియమము:-

మూ. శ్రీదీప్తీ హ్రీకీర్తీ ధీనీతీ గీఃప్రీతీ
ఏధేతే ద్వే ద్వే తే యే నేమే దేవేశే. 86

వ్యా. యే = ఏ; ద్వేద్వే = రెండు రెండు గుణములు, దేవేశే = దేవేంద్రునియందు కూడ, న = లేవో, తే = అట్టి, ఇమే = ఈ, శ్రీదీప్తీ = లక్ష్మీ-కాంతులను, హ్రీకీర్తీ = లజ్జా-కీర్తులును, ధీనీతీ = బుద్ధి-నీతులును, గీఃప్రీతీ = వాగ్మిత్వ-సంతోషములును, నీయందు. ఏధేతే = వృద్ధిపొందు చున్నవి ఇచట ఈ, ఏ, అను రెండు అచ్చులు మాత్రమే ఉపయోగింపబడినవి.

అవ. ఏకస్వరమునకు ఉదాహరణము:-

మూ. సామాయామా మాయా మాసా
మారానాయాయానారామా
యానావారారావానాయా
మాయారామామారాయామా. 87

వ్యా. ఈ శ్లోకము సర్వతోభద్రమునకు ఉదాహరణముగ చూపబడినది. (మూ. III. 82).

అవ. చతుఃస్థాననియమమును ఉదాహరించుచున్నాడు.

మూ. నయనానన్దజననే నక్షత్రగణశాలిని
అఘనే గగనే దృష్టిరఙ్గనే దీయతాం సకృత్. 88

వ్యా. హే అఙ్గనే = ప్రశస్తమైన సర్వావయవములు కలదానా, నయనానన్దజననే = నేత్రానందమును కలిగించు నదియు, నక్షత్రగణశాలిని = నక్షత్ర సముదాయములో ప్రకాశించునదియు, అఘనే = మేఘరహితమును అగు, గగనే = ఆకాశమునందు, సకృత్ = ఒక పర్యాయము, దృష్టిః = దృష్టి, దీయతాం = ప్రసరింపచేయబడుగాక. ఇచట కంఠ-దన్త-తాలు-నాసికాస్థానములనుండి ఉత్పన్నము లగు వర్ణములు మాత్రమే ఉపయోగింపబడినవి.

అవ. త్రిస్థాననియమమునకు ఉదాహరణము:-

మూ. అలినీలాలకలతం కం న హన్తి ఘనస్తని.
ఆననం నలినచ్ఛాయనయనం శశికాన్తి తే. 89

వ్యా. హే ఘనస్తని = ఓ ఘనమైన స్తనములు కలదానా, అలినీలాలకలతం = తుమ్మెదలవలె నల్లనైనలతల వంటి ముంగురులు కలదియు, నలినసచ్ఛాయనయనం=పద్మమువంటి కాంతి గల నేత్రములు కలదియు, శశికాంతి = చంద్రుని వంటి కాంతి కలదియు అగు, తే = నీయొక్క, ఆననం= ముఖము, కం = ఎవనిని, న హన్తి = పీడించుటలేదు? ఇచట కంఠ-దంత-తాలుస్థానములనుండి ఉత్పన్నము లగు వర్ణములు మాత్రమే ప్రయోగింపబడినవి గాన త్రిస్థాననియమము.

అవ. ద్విస్థాననియమమునకు ఉదాహరణము:-

మూ. అనఙ్గలఙ్ఘనాలగ్నా నానాతఙ్కా సదఙ్గనా
సదానఘ సదానన్ద నతాఙ్గా సఙ్గసఙ్గత. 90

వ్యా. సదానఘ = ఎల్లప్పుడును పాపములు లేని వాడా, సదానన్ద = సత్పురుషులకు ఆనందమును కలిగించువాడా, నతాఙ్గ = వంగిన శరీరము గల వాడా, అనగా నమ్రుడా, అసఙ్గసఙ్గత = సంగరహితు లగు సత్పురుషుల సంగము చేయువాడా, సదఙ్గనా = (నీ ప్రియురా లగు) ఆ ఉత్తమస్త్రీ, అనఙ్గలఙ్ఘనాలగ్ననానాతఙ్కా = మన్మథుని ఆక్రమణముచే కలిగిన అనేకవిధము లైన వ్యథలు కలదై (ఉన్నది). ఇచట కంఠ్యతాలవ్యములను మాత్రమే ఉపయోగించుటచే ఇది ద్విస్థాననియమమునకు ఉదాహరణము.

అవ. ఏకస్థాననియమమునకు ఉదాహరణము:-

మూ. అగా గాఙ్గాఙ్గకాకాకగాహకాఘకకాకహా
అహాహాఙ్క ఖగాఙ్కాగ కఙ్కాగ ఖగకాకక 91

పదచ్ఛేదము. అగాః - గాఙ్గాఙ్గకాకాకగాహక - అఘకాకహా - అహాహాఙ్క - ఖగాఙ్కాగకఙ్క - అగఖగకాకక.

వ్యా. హేగాఙ్గాఙ్గకాకాకగాహక - గాఙ్గాఙ్గ = గంగయొక్క అవయవ మైన-అనగా గంగకు సంబంధించిన, క = జలముయొక్క అక = ధ్వని చేయు చున్న, అక = వంకరగానడచు ప్రవాహమునందు, గాహక = ప్రవేశించువాడా, స్నానము చేయువాడా, అహాహాఙ్గ = సంసారబాధచే హాహాధ్వని చేయనివాడా, ఖగాఙ్కాగకఙ్క-ఖగ = సూర్యుడు, అఙ్క = చిహ్నముగా గల అగ = మేరు పర్వతమువరకును, కఙ్క = వెళ్లేవాడా, అగఖకకాకక = అగ = కుటిలముగా ప్రవర్తించు, ఖక = ఇంద్రియములయందు, అకక = చాపల్యము లేనివాడా, కుటిలస్వభావము లగు ఇంద్రియములకు వశము కానివాడా, (నీవు) అఘక కాకహా = పాపము లనెడు కాకములను విడచినవాడవై, గాం = భూమిని,

అగాః = పొందితివి. ఈ శ్లోకములో కంఠ్యవర్ణములు మాత్రమే ప్రయుక్తము లగుటచే ఇది ఏకస్థాననియమమునకు ఉదాహరణము

అవ. చతుర్వర్ణనియమమును ఉదాహరించుచున్నాడు:—

మూ. రే రే రోరూరురూరోరుగాగోగోగాఙ్గగాగగుః
కిం కేకాకాకుకః కాకో మా మామామామమామమ. 92

వ్యా. ఒక యువతి తనను అభిలషించుచున్న వ్యాధునితో పలుకు మాటలివి. (పదచ్ఛేదము). రే-రే - రోరూరురూరోరుగాగః-అగాఙ్గగ-అగగుః- కిం - కేకాకాకుకః - కాకః - మా - మా - మాం - అమ - మామమ. రేరే = ఓరీ, మామమ = లక్ష్మియందు మమకారము కలవాడా, లక్ష్మిని కోరువాడా, మాం = నన్ను, మామాఅమ = దరిచేరకుము దరిచేరకుము. కోపములో ద్విరుక్తి రోరూ రురూరోరుగాగః - రోరూ = ధ్వనిచేయుచున్న, రురు = రురుమృగముయొక్క, ఉరః = వక్షస్థలమునందు, రుక్ = (శరపాతముచే చేయబడిన) పీడ గలవాడా, అగాఙ్గగః = పర్వతముయొక్క ఒక ప్రదేశమునందు నివసించువాడా, (నీవు) అగగుః = చపలమైన వాక్కు కలవాడవు. మాటలాడుటయందు చాతుర్యము లేనివాడవు. కాకః = కాకి, కేకాకాకుకః కిం = (నెమలి వలె) కేకాధ్వనులచే మధురముగ కూయగలుగునా? ఈ శ్లోకములో నాలుగు పాదములలో నాలుగు వర్ణములు మాత్రమే ఉపయోగింపబడినవి. ఙకారము సంధివలన ఏర్పడినది గాన అది ఐదవవర్ణముగా పరిగణింపబడదు.

అవ. త్రివర్ణనియమమునకు ఉదాహరణము:—

మూ. దేవానాం నన్దనో దేవో నోదనో వేదనిన్దినామ్.
దివం దుదావ నాదేన దానే దానవనన్దినః. 93

వ్యా. దేవానాం = దేవతలకు, నన్దనః = ఆనందకరుడును, వేద

నిన్దినాం = వేదమునకు నిందించువారిని, నోదవః = నివారించువాడును, అగు, దేవః = నరసింహస్వామి, దానవనన్దినః = దానవులకు ఆనందకరుడగు హిరణ్యకశిపునియొక్క, దానే = చీల్చుటయందు, నాదేన = సింహనాదముచేత, దివం = ఆకాశమును, దుదావ = పీడించెను. ఇచట ద-వ-న అను మూడు వర్ణములు మాత్రమే ప్రయోగింపబడినవి.

అవ. ద్వివర్ణనియమమునకు ఉదాహరణము:-

**మూ. సూరిః సురాసురాసారిసారః సారససారసాః**

**ససార సరసీః సీరీ ససూరూః స సురారసీ. 94.**

వ్యా. సూరిః = పండితుడును, సురాసురాసారిసారః = దేవతల విషయమునను అసురుల విషయమునను ప్రసరించు బలము కలవాడును, సురారసీ = మద్యమునందు ఆసక్తి కలవాడును అగు, సీరీ = బలరాముడు, ససూరూః = అందమైన ఊరువులు గల ప్రియురాలితో కూడినవాడై, సారసనసారసాః = ధ్వనితో కూడిన (ధ్వని చేయుచున్న) సారసపక్షులు గల, సరసీః = సరస్సులను, ససార = సంచరించెను. ఇచట రెండు వర్ణములు మాత్రమే ఉపయోగింపబడుటచే ద్వివర్ణనియమము.

అవ. ఏకవర్ణనియమమునకు ఉదాహరణము:-

**మూ. నూనం నున్నాని నానేన నాననేనాననాని నః**

**నానేనా నను నానూనే నైనేనానానినో నినీః. 95**

**(ఇతి చిత్రచక్రమ్)**

వ్యా. (పదచ్ఛేదము) నూనం - నున్నాని - న - అనేన - న - అననేన - అననాని - నః-న-అనేనాః - నను - నా - అనూనేన - ఏనేన -అనాన్ - ఇనః - నినీః. (అర్థము). అనేన = ఈ రాజుచేత, అననేన = స్వసామర్థ్యముచేత, నః =

మనయొక్క, అనసాని = సామర్థ్యములు, న నున్నాని ఇతి న = తొలగింపబడ లేదు అన్న మాట లేదు. అనూనేన = అధికబలశాలి యైన, ఏనేన = ఈతనితో, అనాన్ = బలము గల మనలను, నినీః = యుద్ధమునందు కలిపిన, ఈ బలవత్తరునితో మనలను యుద్ధము చేయించిన, ఇనః = మన ప్రభువైన, నా = పురుషుడు, అనేనాః = అపరాధరహితుడు, న = కాడు.

(చిత్రచక్రము సమాప్తము)

మూ. ఇతిదుష్కరమార్గేఽపి కశ్చిదాదర్శితః క్రమః
ప్రహేలికాప్రకారాణాం పునరుద్దిశ్యతే గతిః. 96

వ్యా. ఇతి = ఈ విధముగా, దుష్కరమార్గేఽపి = దుష్కరమైన చిత్రకవితామార్గమునందు గూడ, కశ్చిత్ = ఒక, క్రమః = పద్ధతి. ఆదర్శితః = చూపబడినది, పునః = మరల (ఇపుడు) ప్రహేలికా ప్రకారాణాం = ప్రహేలికా భేదముల, గతిః = పద్ధతి, ఉద్దిశ్యతే = ప్రతిపాదింపబడుచున్నది.

మూ. క్రీడాగోష్ఠీవినోదేషు తజ్జ్ఞైరాకీర్ణమన్త్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికాః. 97.

వ్యా. క్రీడా గోష్ఠీవినోదేషు = క్రీడార్థమై చేయు గోష్ఠులలో వినోదములందును, తజ్జ్ఞైః ఆకీర్ణమన్త్రణే = ప్రహేలికాపద్ధతులు తెలిసినవారితో కూడిన సమాజమునంధు గుప్తసంభాషణము చేయుటయందును, పరవ్యామోహనే చాపి = ఇతరులను మోహపెట్టుటయందును, అనగా వారికి అర్థము కాని విధమున చమత్కారముగ మాటలాడుట యందును, ప్రహేలికాః = ప్రహేళికలు, సోపయోగాః = ఉపయోగముతోకూడినవి.

మూ. ఆహుః సమాగతాం నామ గూఢార్థాం పదసన్ధినా.
వఞ్చితాన్యత్ర రూఢేన యత్ర శబ్దేన వఞ్చనా. 98

వ్యా. పదసన్ధినా = పదముల సంధిచే, గూఢార్థాం = అస్పష్ట మైన అర్థము గల ప్రహేలికను, సమాగతాం = 'సమాగతా' అను పేరు గలదానినిగా, ఆహుః = చెప్పుదురు. యత్ర = ఏచట, అన్యత్ర = మరి యొక అర్థమునందు, రూఢేన = రూఢ మైన, శబ్దేన = శబ్దము చేత, వంచనా = వంచన ఉండునో, (అచట) వఞ్చితా = 'వంచిత' అను ప్రహేళిక.

మూ. వ్యుత్క్రాన్తాతివ్యవహితప్రయోగాన్మోహకారిణీ
సా స్యాత్ ప్రముషితా యస్యాం దుర్బోధార్థా పదావలీ. 99

వ్యా. అతివ్యవహితప్రయోగాత్ = చాల దూరాన్వయము గల పదముల ప్రయోగమువలన, మోహకారిణీ = మోహమును కలిగించునది, వ్యుత్క్రాన్తా = "వ్యుత్క్రాంత" అను ప్రహేళిక, యస్యాం = దేనియందు, పదావలీ = పదముల పంక్తి, దుర్బోధార్థా = తెలుసుకొనుటకు కష్ట మైన పదములు కలదియో, సా = అది, ప్రముషితా = "ప్రముషిత" అను పేరు గల ప్రహేళికగా, స్యాత్ = అగును.

మూ. సమానరూపా గౌణార్థారోపితైర్గ్రథితా పదైః
పరుషా లక్షణాస్తిత్వమాత్రవ్యుత్పాదితశ్రుతిః. 100

వ్యా. గౌణార్థారోపితైః = గౌణ మైన అర్థమునందు ఆరోపితము లైన, పదైః = పదములచే, సమానరూపా = 'సమానరూప' అను ప్రహేళిక ఏర్పడును. లక్షణాస్తిత్వమాత్రవ్యుత్పాదితశ్రుతిః = వ్యాకరణలక్షణము ఉన్నది గాన తామాత్రముచేతనే అర్థము చెప్పదగిన పదములు గలది, పరుషా = 'పరుష' అను ప్రహేళిక. అనగా ఇందులో ప్రయోగించిన పదముల అర్థమును వ్యాకరణనియమములను పట్టి మాత్రమే చెప్పవలసి యుండును గాని ఆ అర్థములు ప్రసిద్ధములు కావు అని అర్థము.

మూ. సంఖ్యాతా నామ సంఖ్యానం యత్ర వ్యామోహకారణమ్.
అన్యథా భాసతే యత్ర వాక్యార్థః సా ప్రకల్పితా 101

వ్యా. యత్ర = ఏ ప్రహేళికయందు, సంఖ్యానం = వర్ణముల గణన, లేదా సంఖ్యావాచకశబ్దముల ప్రయోగము, వ్యామోహకారణం = శ్రోతల బుద్ధివ్యామోహమునకు కారణమో, అది, సంఖ్యాతా నామ = 'సంఖ్యాత' అను ప్రసిద్ధి గల ప్రహేళిక. యత్ర = దేనియందు. వాక్యార్థః = వాక్యార్థము, అన్యథా = మొదట పతీతమైనదానికంటె భిన్నముగ, భాసతే = భాసించునో, సా = అది, ప్రకల్పితా = ప్రకల్పిత యను ప్రహేళిక.

మూ. సా నామాన్తరితా యస్యాం నామ్ని నానార్థకల్పనా
నిభృతా నిభృతాన్యార్థా తుల్యధర్మస్పృశా గిరా. 102

వ్యా. యస్యాం = దేనియందు, నామ్ని = నామవాచకమునందు, నానార్థకల్పనా = బహువిధముల అర్థముల కల్పన ఉండునో, సా = అది, నామాన్తరితా = నామాంతరిత యను ప్రహేళిక, తుల్యధర్మస్పృశా = ప్రకృతాప్రకృతార్థములకు రెండింటికిని సమన్వయించు సాధారణధర్మములను ప్రతిపాదించు, గిరా = వాక్కుతో, నిభృతాన్యార్థా = కప్పివేయబడిన మరియొక (ప్రకృత) అర్థము గలది, నిభృతా = 'నిభృత' అను ప్రహేళిక.

మూ. సమానశబ్దోపన్యస్తశబ్దపర్యాయసాధితా
సంమూఢా నామ యా సాక్షాన్నిర్దిష్టార్థాపి మూఢయే. 103

వ్యా. ఉపన్యస్తశబ్దపర్యాయసాధితా = ప్రయుక్తములగు శబ్దముల సమన్వయవిశేషముచే సాధింపబడినది, సమానశబ్దా = సమానశబ్ద యను ప్రహేళిక. యా = ఏది. సాక్షాత్ = ప్రత్యక్షముగా (వాచకసశబ్దమును ప్రయోగించి) నిర్దిష్టాపి = బోధింపబడిన అర్థము కలదైనను, మూఢయే = శ్రోతల మౌఢ్యమునకు

కారణ మగునో, అనగా దేనిని విని శ్రోతలు అర్థము తెలియకుండ ఉందురో, అది, సంమూఢా నామ = 'సంమూఢ' అను ప్రసిద్ధి గల ప్రహేళిక.

మూ. యోగమాలాత్మికా నామ యా స్యాత్ సా పరిహారికా
ఏకచ్ఛన్నా శ్రితం వ్యక్తం యస్యామాశ్రయగోపనమ్. 104

వ్యా. యా = ఏది, యోగమాలాత్మికా = యౌగిక శబ్దముల సమూహముగ నుండునో, అనగా ఎచట ఒక్కొక్క రూఢార్థమును బోధించుటకు యౌగికపదములు ప్రయోగింపబడునో, సా = అది, పరిహారికానామ = 'పరిహారిక' అను పేరు గలదిగ, స్యాత్ = అగును. యస్యాం = దేనియందు, ఆశ్రితం = ఆధేయము, వ్యక్తం = స్పష్టముగ నుండునో, ఆశ్రయగోపనం = ఆధారముయొక్క గోపనము చేయబడునో, అది. ఏకచ్ఛన్నా = ఏకచ్ఛన్న.

మూ. సా భవేదుభయచ్ఛన్నా యస్యాముభయగోపనమ్
సఙ్కీర్ణా నామ సా యస్యాం నానాలక్షణసఙ్కరః. 105

వ్యా. యస్యాం = దేనియందు, ఉభయగోపనం = ఆధారాధేయములు రెండింటియొక్క గోపనము ఉండునో, సా = అది, ఉభయచ్ఛన్నా = 'ఉభయచ్ఛన్న' అను ప్రహేళిక, భవేత్ = అగును. యస్యాం = దేనియందు, నానాలక్షణసఙ్కరః = వివిధము లగు ప్రహేళికల లక్షణముల సంకర ముండునో, సా = అది, సఙ్కీర్ణా నామ = సంకీర్ణ అను పేరు గలది.

మూ. ఏతాః షోడశ నిర్దిష్టాః పూర్వాచార్యైః ప్రహేలికాః
దుష్టప్రహేలికాశ్చాన్యాస్తైరధీతాశ్చతుర్దశ. 106

వ్యా. పూర్వాచార్యైః = ప్రాచీనాచార్యులచేత, ఏతాః = ఈ షోడశ = పదహారు, ప్రహేలికాః = ప్రహేళికలు, నిర్దిష్టాః = ప్రతిపాదింపబడినవి. తైః =

వారిచేత, అన్యాః = వీటికంటె భిన్న మైన, చతుర్దశ = పదునాలుగు, దుష్టప్రహేలికాశ్చ = (చ్యుతాక్షర-దత్తాక్షరాదు లగు) దుష్టప్రహేళికలు కూడ, అధీతాః = చెప్పబడినవి.

మూ. దోషానపరిసంఖ్యేయాన్ మన్యమానా వయం పునః
సాధ్వీరేవాభిధాస్యామస్తా దుష్టా యాస్త్వలక్షణాః 107

వ్యా. వయం పునః = మేమైతే, దోషాన్ = దోషములను, అపరిసంఖ్యేయాన్ = లెక్కింప శక్యము కానివాటినిగా, అనగా దుష్టప్రహేలికలు పదునాలుగే కాదు, ఇంకను ఎన్నో ఉండవచ్చును అని అర్థము, సాధ్వీరేవ = సాధువులైన ప్రహేళికలు (పదహారింటిని) మాత్రమే, అభిధాస్యామః = చెప్పగలము. యాః = ఏవి, అలక్షణాః = లక్షణములుచే లేనివో, అనగా వేటికి మేము లక్షణములు చెప్పలేదో, అవి, దుష్టాః = దుష్టప్రహేలికలు.

అవ. 'సమాగత' అను ప్రహేళికను ఉదాహరించుచున్నాడు.

న మయా గోరసాభిజ్ఞం చేతః కస్మాత్ప్రకుప్యసి
అస్థానరుదితైరేభిరలమాలోహితేక్షణే. 108

వ్యా. హే ఆలోహితేక్షణే = ఎఱ్ఱని నేత్రములు కలదానా, మయా = నాచేత, చేతః = చిత్తము, గోరసాభిజ్ఞం = గోక్షీరపానాభిముఖముగ, న = చేయబడలేదు? కస్మాత్ = ఎందువలన, ప్రకుప్యసి = కోపగించుకున్నావు? ఏభిః = ఈ, అస్థానరుదితైః = వ్యర్థరోదనములచేత, అలం = చాలును.

ఇది ఒక గోపికతో శ్రీకృష్ణుడు పలికిన వాక్యము, నీ ఆవుపాలు త్రాగ వలె నని నాకు అభిలాష లేదు. వ్యర్థముగ ఏల నాపై కోపించెదవు అని పైకి కనబడు అర్థము. 'మే + ఆగోరసాభిజ్ఞం' అను పదచ్ఛేదముచే "నా మనస్సు పరవనితాసంగరూప మగు అపరాధమును చేయునది కాదు" అని

నిగూఢార్థము. ఇది సంధివశముచే ఏర్పడినది గాన "సమాగత" అను ప్రహే లిక.

అవ 'వఞ్చితా' ప్రహేళికకు ఉదాహరణము:-

కుబ్జామాసేవమానస్య యథా తే వర్ధతే రతిః
నైవం నిర్విశతో నారీరమరస్త్రీవిడమ్బినీః. 109

వ్యా. కుబ్జాం = గూనుగలస్త్రీని, ఆసేవమానస్య = సేవించుచున్న, తే=నీకు, రతిః = అనురాగము, యథా = ఏ విధముగ, వర్ధతే = వృద్ధి పొందునో, ఏవం = ఈ విధముగ, అమరస్త్రీవిడమ్బినీః = దేవతాస్త్రీలను అనుక రించుచున్న, నారీః = స్త్రీలను, నిర్విశతః = అనుభవించుచున్న నీకు, న = కలు గదు.

ఇచట 'కుబ్జాం' అనుదానికి 'కాన్యకుబ్జనగరమును' అను అర్థము వివక్షి తము. కాని 'కుబ్జా' అను పదము రూఢిచే గూను గల స్త్రీనే బోధించును గాన కాన్యకుబ్జ మను అర్థము వెంటనే స్ఫురింపదు. కావున ఇది 'వంచితా' అను ప్రహేళిక.

అవ. వ్యుత్క్రాంతకు ఉదాహరణము:-

దణ్డే చుమ్బతి పద్మిన్యా హంసః కర్కశకణ్టకే
ముఖం వల్గురవం కుర్వంస్తుణ్డేనాఙ్గాని ఘట్టయన్. 110

వ్యా. కర్కశకణ్టకే = కఠిన మైన కంటకములు గల, దణ్డే = తామర తూడుపై, అఙ్గాని = అవయవములను, ఘట్టయన్ = రాచుకొనుచు, వల్గు రవం = మధురధ్వనిని, కుర్వన్, చేయుచు, హంసః = హంస, తుణ్డేన = ముట్టితో, పద్మిన్యాః = పద్మలతయొక్క, ముఖం = ముఖమును (పద్మమును), చుమ్బతి = చుంబించుచున్నది.

ఈ శ్లోకములోని పదములకు దూరదూరాన్వయ ముండుటచే ఇది వ్యుత్క్రాంత యను ప్రహేళిక.

అవ. ప్రముషితాప్రహేళికను ఉదాహరించుచున్నాడు:-

మూ. ఖాతయః కని కాలే తే స్ఫాతయః స్ఫార్హవల్గవః
చన్ద్రే సాక్షాద్ భవన్త్యత్ర వాయవో మమ ధారిణః. 111

వ్యా. హేకని = ఓబాలా, "కన్యా కనీ కుమారీ చ" అని హేము చంద్రుడు. తే = నీయొక్క, కాలే = పాదమునందు (కాల్యతే క్షిప్యతే ఇతి కాలః) స్ఫాతయః = విస్తృతమైన, ఖాతయః శబ్దములు (నూపురశబ్దములు. ఖే = ఆకాశే, అతిః = గమనం యేషాంతే ఖాతయః) స్ఫార్హవల్గవః = చాల అధికముగ మనోహరములు. చన్ద్రే = ఆహ్లాదకరమైన, అత్ర అట్టి ఈ పాదము నందు, మమ వాయవః = నా ప్రాణవాయువులు, ప్రాణములు, ధారిణః సన్తి = స్థిరమైనవిగా, భవన్తి = అగుచున్నవి.

ఇచట అప్రసిద్ధార్థకము లగు పదములను ప్రయోగించుటచే ఇది ప్రముషిత అను ప్రహేళిక.

అవ 'సమానరూప' ప్రహేళికకు ఉదాహరణము:-

అత్రోద్యానే మయా దృష్టా వల్లరీ పఞ్చపల్లవా
పల్లవే పల్లవే తామ్రా యస్యాం కుసుమమఞ్జరీ. 112

వ్యా. అత్ర ఉద్యానే = ఈ ఉద్యానమునందు, పఞ్చపల్లవా = ఐదు చిగుళ్లు గల, వల్లరీ = లత, మయా = నాచేత, దృష్టా = చూడబడినది. యస్యాం = దేనియందు, పల్లవేపల్లవే = చిగురు చిగురునందును, తామ్రా = ఎఱ్ఱనైన, కుసుమమఞ్జరీ = పుష్పగుచ్ఛము (ఉన్నదో).

ఇచట ఉద్యాన మనగా నాయిక. పల్లరి హస్తము. పంచపల్లవములు పంచాగుళులు. కుసుమమంజరి అనగా నఖముల కాంతులు. ఈ విధముగ గౌణ శబ్దములను ప్రయోగించి వాస్తవార్థమును నిగూఢముగ నుండునట్లు చేయుటచే ఇది సమానరూపప్రహేళిక.

అవ. పరుషప్రహేళికకు ఉదాహరణము

> సురా సురాలయే స్వైరం భ్రమన్తి దశనార్చిషాః
> మజ్జన్త ఇవ మత్తాస్తే సౌరే సరసి సంప్రతి. 113

వ్యా. తే = ఆ, సురాః = సురా ఏషాం అస్తీతి సురా, = మద్యము కలవారు, అనగా మధ్యపానము చేయువారు, దశనార్చిషా = (నవ్వునపుడు ప్రకట మైన) దంతముల కాంతితో, సంప్రతి = ఇప్పుడు, సౌరేసరసి = సురతో నిండిన సరస్సులో, మజ్జన్త ఇవ = మునుగుచున్నవారు వలె, మత్తాః=మదించిన వారై, సురాలయే = కల్లుఅంగడిలో. స్వైరం = స్వేచ్ఛగా, భ్రమన్తి = తిరుగుచున్నారు.

ఇది ప్రకృతార్థము. అప్రకృతార్థ మేమనగా- సురాః = దేవతలు, సౌరే సరసి = మానససరోవరమునందు, మత్తాః = ప్రసన్నులై, సురాలయే = స్వర్గమునందు, ఇచట మద్యపానము చేయువారికి సంబంధించిన అర్థము కేవలము వ్యాకరణసాధ్యము లగు పదముల ప్రయోగముచే చెప్పబడుచున్నది గాన ఇది 'పరుష' ప్రహేళిక.

అవ. సంఖ్యాతప్రహేళికకు ఉదాహరణము:-

> నాసిక్యమధ్యా పరితశ్చతుర్వర్ణవిభూషితా
> అస్తి కాచిత్ పురీ యస్యామష్టవర్ణాహ్వయా నృపాః. 114

వ్యా. నాసిక్యమధ్యా = అనునాసికవర్ణము మధ్య యందు కలదియు, పరతః = రెండు వైపుల, చతుర్వ్యర్ణవిభూషితా = నాలుగు వర్ణములచే అలంకరింపబడిన, కాచిత్ పురీ = ఒకానొక పట్టణము, అస్తి = ఉన్నది. యస్యాం = దేని యందు, అష్టవర్ణాహ్వయాః = ఎనిమిది వర్ణములతో కూడిన పేర్లు గల, నృపాః = రాజులు (ఉన్నారో).

ఆ పట్టణము 'కాఞ్చీ' పురము. మొదట క్, అ వర్ణములును, మధ్య 'ఞ్' అను అనునాసిక వర్ణము, చివర చ్, ఈ అను రెండు వర్ణములును ఉన్నవి. ఇచటి రాజులు "పల్లవాః". ఇది "ప్ అ ల్ ల్ అ వ్ అః" అను ఎనిమిది అక్షరము లున్న పదము. ఈ విధముగ సంఖ్య ద్వారా అర్థము గూఢముగ నున్నది గాన ఇది "సంఖ్యాత" ప్రహేళిక.

అవ. ప్రకల్పితప్రహేళికకు ఉదాహరణము:-

గిరా స్ఖలన్త్యా నమ్రేణ శిరసా దీనయా దృశా
తిష్ఠన్తమపి సోత్కమ్పం వృద్ధే మాం నానుకమ్పసే. 115

వ్యా. హే వృద్ధే = ఓ వృద్ధురాలా, స్ఖలన్త్యా = తొట్రుపడుచున్న, గిరా = వాక్కుతోడను, నమ్రేణ = వంగిన, శిరసా = శిరస్సుతోడను, దీనయా = దీన మైన, దృశా = చూపుతోడను, సోత్కమ్పం = కంపముతో (కూడునట్లుగా) తిష్ఠన్తమపి = నిలచి ఉన్నను, మాం = నన్నుగూర్చి, నానుకమ్పసే = దయ చూపుటలేదు.

ఇది ఒక వృద్ధస్త్రీతో కాముకుని వాక్యము వలె కనబడుచున్నది. కాని 'వృద్ధా' శబ్దమునకు 'లక్ష్మి' అను నర్థమును గ్రహించుటచే ఈ అర్థము మారుచున్నది విష్ణువు పురాణపురుషుడు. పురాణపురుషుని భార్య గాన లక్ష్మి వృద్ధ. ఇచట మొదట భాసించు అర్థము కంటె రెండవ అర్థము భిన్న మగుటచే ఇది 'ప్రకల్పిత' ప్రహేళిక.

అవ. నామాన్తరిత ప్రహేళికకు ఉదాహరణము.

ఆదౌ రాజేత్యధీరాక్షి పార్థివః కోఽపి గీయతే
సనాతనశ్చ నైవాసౌ రాజా నాపి సనాతనః. 116

వ్యా. హే అధీరాక్షి = ఓ చపలాక్షీ, పార్థివః = పృథివీప్రసిద్ధుడైనట్టి కోఽపి = ఒకానొకడు, ఆదౌ = మొదట, రాజేతి := 'రాజా' అనియు, సనాతనశ్చ = 'సనాతనః' అనియు, గీయతే = చెప్పబడుచున్నాడు. అసౌ = ఇతడు. రాజా = రాజు, నైవ = కాడు, సనాతనః అపి = సనాతనుడు కూడ, న = కాడు.

ఈ విరోధమునకు సమాధాన మేమనగా- పార్థివః = భూజము, అనగా వృక్షము. దాని పేరు 'రాజాతన' వృక్షము. దీని పేరు మొదట 'రాజా' అని ఉన్నది, న తనః అతనః 'తన' కానిది. న అతనః = నాతనః. అతనము కానిది. అనగా 'తన' అనునది. నాతనము అనగా 'తన'తో కూడినది సనాతనము. అనగా ఈ వృక్షనామము మొదట 'రాజా' అనుదానితోడను, తరువాత 'తన' తోడను కూడిన దగుటచే 'రాజాతన' అయినది. ఇది ఎప్పటికైన నశించు వృక్షమే గాన రాజును కాదు సనాతనము కాదు. ఈ విధముగ 'రాజాతన' అను నామమునకు అనేకార్థకల్పన చేయుటచే ఇది 'నామాన్తరిత' ప్రహేళిక.

అవ. నిభృత ప్రహేళికకు ఉదాహరణము:-

హృతద్రవ్యం నరం త్యక్త్వా ధనవన్తం వ్రజన్తి కాః.
నానాభఙ్గిసమాకృష్టలోకా వేశ్యా న దుర్ధరాః 117

వ్యా. నానాభఙ్గిసమాకృష్టలోకాః = బహువిధచేష్టలచే ఆకర్షింపబడిన జనులు కలవారై, హృతద్రవ్యం = హరింపబడిన ద్రవ్యము గల, నరం = మనుష్యుని, త్యక్త్వా = విడచి, ధనవన్తం = ధనవంతుని గూర్చి, వ్రజన్తి =

వెళ్లుదురు. దుర్ధరాః = స్వాధీనము నందుంచుకొనుటకు శక్యము కాని, వేశ్యాః = వేశ్యాస్త్రీలు, న = కాదు. కాః = ఇంక ఎవరు? అని ప్రశ్న.

గూఢ మగు సమాధాన మేమనగా- నానాభఙ్గిసమాకృష్టలోకాః = అనేక తరంగములు గల జలముచే ఆకర్షింపబడిన లోకములుకల, దుర్ధరాః = నిలుపుటకు శక్యము కాని నదులు, హృతద్రవ్యం = హరింపబడిన గైరికాదుధాతువులనెడు ద్రవ్యముగల: నగం = పర్వతమును (లాక్షణికప్రయోగము), త్యక్త్వా = విడచి, ధనవన్తం = ధనము గల సముద్రమును గూర్చి, వ్రజన్తి = వెళ్లుచున్నవి. ఇచట నదీరూపార్థము నిగూఢముగ నుండుటచేత నిభృతప్రహేళిం.

అథ సమానశబ్దప్రహేళికకు ఉదాహరణము:-

**మూ.** జితప్రకృష్టకేశాఖ్యో యస్తవాభూమిసాహ్వయః
సమామద్య ప్రభూతోత్కం కరోతి కలభాషిణి. 118

వ్యా. హే కలభాషిణి = ఓ మధురభాషిణీ, జితప్రకృష్టకేశాఖ్యః = ప్రకృష్ట మైన కేశమునకు మరి యొక పేరు "ప్ర+వాలః". 'ప్రవాలః' అనగా చిగురు అని కూడ అర్థము. అందుచే ఇచట "జయింపబడిన 'ప్రవాలము' కల" అని యర్థము. అట్టి, తవ = నీయొక్క, యః = ఏ, అభూమిసాహ్వయః = "భూమి లేనిది" అనుదానికి మరి యొక పదము— 'అధరః.' "న విద్యతే ధరా యస్య" అని విగ్రహము. అందుచే 'అభూమి' తో సమానమైన పేరు గలది, అనగా అధరము అని యర్థము. అట్టి ఏ అధరము కలదో, సః = అది, అద్య = ఇపుడు, మాం = నన్ను, ప్రభూతోత్కం = అధిక మైన అభిలాష కలవానినిగా, కరోతి = చేయుచున్నది. ఇచట 'ప్రకృష్టకేశ' 'అభూమి' అను పర్యాయపదములను కల్పించి 'ప్రవాల' 'అధరము'లను బోధించుటచే ఇది సమానశబ్దప్రహేళిక.

అవ. సంమూఢప్రహేళికకు ఉదాహరణము:-

> శయనీయే పరావృత్య శయితౌ కామినౌ క్రుధా
> తథైవ శయితౌ రాగాత్ స్వైరం ముఖమచుమ్బతామ్. 119

వ్యా. క్రుధా = కోపముచేత, శయనీయే = శయనమునందు, పరావృత్య = వెనుదిరిగి, శయితౌ = శయనించిన, కామినౌ = కాముకులు, తథైవ = అటులనే, శయితౌ = శయనించినవారై, రాగాత్ = అనురాగమువలన, స్వైరం = సేచ్ఛగా, ముఖం = ముఖమును, అచుమ్బతాం = చుంబించిరి.

వెనుదిరిగి ఉన్నవారు ముఖచుంబనము చేసికొనుట ఎట్లు అను శంక కలుగును. కాని- కోపముతో వెనుదిరిగి శయనించినవారు రాగముచే అటులనే అయినపుడు- అనగా వెనుదిరిగినపుడు అభిముఖు లగుదురు గాన విరోధ పరిహారము.

అవ. పరిహారిక అను ప్రహేళికకు ఉదాహరణము:-

> విజితాత్మభవద్వేషిగురుపాదహతో జనః
> హిమాపహామిత్రధరైర్వ్యాప్తం వ్యోమాభినన్దతి. 120

వ్యా. వి...హతః- వి = గరుత్మంతునిచేత, జిత = జయింపబడిన ఇంద్రుని, ఆత్మభవ = కుమారుడైన అర్జునుని, ద్వేషి = ద్వేషించు కర్ణుని, గురు = తండ్రియైన సూర్యుని, పాదహతః = కిరణములచే పీడింపబడిన, జనః = జనము, హిమాపహామిత్రధరైః-హిమ = చలిని, అపహ = తొలగించు అగ్నికి, అమిత్ర = శత్రువైన జలమును, ధరైః = ధరించు మేఘములచే, వ్యాప్తం = వ్యాప్తమైన, వ్యోమ = ఆకాశమును, అభినన్దతి = అభినందించుచున్నది.

ఇచట అనేక యౌగికశబ్దములను ప్రయోగించుటచే ఇది పరిహారిక అను ప్రహేళిక.

అవ. ఏకచ్ఛన్న ప్రహేళికకు ఉదాహరణము:-

న స్పృశత్యాయుధం జాతు న స్త్రీణాం స్తనమణ్డలమ్
అమనుష్యస్య కస్యాపి హస్తోఽయం న కిలాఫలః. 121

వ్యా. కస్యాపి = ఒకానొక, అమనుష్యస్య = మనుష్యత్వయోగ్యత లేనివానియొక్క, హస్తః హస్తము, జాతు = ఎన్నడును, ఆయుధం = ఆయుధమును, న స్పృశతి = స్పృశింపదు. స్త్రీణాం = స్త్రీల, స్తనమండలమును గూడ, స్పృశింపదు. ఆయినను, అయం = ఇది, అఫలః = ఫలము లేనిది, (వ్యర్థము) న కిల = కాదట.

ఆయుధస్పర్శ లేకపోవుటచే పౌరుషము లేనిదియు, స్త్రీస్తనముమండల స్పర్శ లేకుండుటచే రసికత్వము లేనిదియు అగు హస్తము అఫలము కాకుండుట విరుద్ధము. ఈ విరోధమును పరిహరించుటకై, "అమనుష్య" శబ్దమునకు లక్షచే గంధర్వు డని చెప్పి 'అమనుష్యహస్తము' అనగా 'గంధర్వ హస్తము' అను అర్థము గ్రహింపవలెను. గంధర్వహస్త మనగా అముదము చెట్టు. అది సులభముగా విరిగిపోవును గాన దానికి ఆయుధస్పర్శ చేయవలసిన పని లేదు. అనుపయుక్త మగుటచే స్త్రీ స్తనస్పర్శ కూడ దానికి లేదు. అయినను అది సఫలము, అనగా పండ్లు లేనిది కాదు. ఇచట ఆశ్రిత మైన ఫలము వ్యక్తము, ఆశ్రయమైన వృక్షము గూఢపదములచే బోధింపబడినది గాన ఛన్నము. కావున ఇది ఏకచ్ఛన్నప్రహేళిక.

అవ. ఉభయచ్ఛన్నప్రహేళికకు ఉదాహరణము:-

కేన కః సహ సంభూయ సర్వకార్యేషు సన్నిధిమ్.
లబ్ధ్వా భోజనకాలేతు యది దృష్టో నిరస్యతే. 122

వ్యా. కః = ఏపదార్థము, కేనసహ = దేనితో కూడ, సంభూయ = ఉత్పన్నమై, సర్వకార్యేషు = అన్ని పనులందును, సన్నిధిం = సన్నిహితత్వమును,

లబ్ధ్వా = పొంది, భోజనకాలే తు = భోజనసమయమునం దైతే, దృష్టః = చూడబడినదై, నిరస్యతే = తొలగింపబడును?

దీనికి సమాధానము కూడ దీనియందే ఉన్నది. కేశము, కేన సహ = శిరస్సుతో కూడ జన్మించి, అలంకరణాదికార్యము లన్నింటియందును సన్నిహిత ముగా నుండి, భోజనసమయమునందు మాత్రము పాత్రలో కనబడినచో తీసి వేయబడును అని సమాధానము. ఇచట ఆధేయ మైన కేశము, ఆధార మైన శిరస్సునూ కూడ చ్ఛన్నములే గాన ఉభయచ్ఛన్న ప్రహేళిక.

అవ. సంకీర్ణ ప్రహేళికకు ఉదాహరణము :-

**మూ. సహయా సగజా సేనా సభటేయం న చేజ్జితా**
**అమాత్రుకోయం మూఢః స్యాదక్షరజ్ఞశ్చ నః సుతః 123**

వ్యా. ఆపాతతః గోచరించు అర్థము. సహయా = అశ్వములతో కూడినదియు, సగజా = గజములతో కూడినదియు, సభటా = భటులతో కూడినదియు అగు, ఇయం = ఈ, సేనా = సేన, నజితా చేత్ = జయింప బడకపోయినచో, అయం = ఈ, నః సుతః = మా కుమారుడు, అక్షరజ్ఞః = పరమార్థతత్త్వజ్ఞు డైనను, అమాత్రుకః = పరాపరసామర్థ్యమును కొలుచుటకు తగిన జ్ఞానము లేనివాడై, మూఢః స్యాత్ = మూఢు డగును.

వాస్తవ మైన అర్థ మేమనగా— సహయా = హకార యకారములతో కూడినదియు, సగజా = గకారజకారములతో కూడినదియు, సభటా = భకారట కారములతో కూడినదియు, సేనా = ఇకారనకారములతో కూడినదియు అగు, ఇయం = ఈ వర్ణమాల, న జితా = బాగుగ అభ్యసించి వ్రాయబడ కున్నచో, అక్షరజ్ఞః = వేదాభ్యాసముచేసినవా డైనను, అమాత్రుకః = వర్ణజ్ఞానము లేనివాడై, మూఢుడగును.

మూ. సా నామాన్తరితామిశ్రా వఞ్చితారూపయోగినీ
ఏవమేవేతరాసామప్యున్నేయః సఙ్కరక్రమః 124

(ఇతి ప్రహేలికాచక్రమ్)

వ్యా. సా = పై శ్లోకములోని ప్రహేళిక, నామాన్తరితామిశ్రా = హయాదిశబ్దములకు వివిధార్థములను కల్పించుటచే ఏర్పడిన నామాంతరిత అను ప్రహేళికతో కలిసినది, వఞ్చితారూపయోగినీ = సేనా, శబ్దమునకు ప్రసిద్ధార్థమును వదిలి అప్రసిద్ధార్థమును చెప్పుటచే ఏర్పడిన వంచితారూప ప్రహేళికతో కూడినది. ఏవమేవ = ఈ విధముగనే, ఇతరాసామపి = ఇతర ప్రహేళికలకు కూడ, సఙ్కరక్రమః = కలయికను ఏర్పరచు పద్ధతి, ఉన్నేయః = ఊహింపదగినది.

ప్రహేళికాచక్రము సమాప్తము.

అవ. ఇంతవరకు గ్రాహ్యములగు అర్థాలంకార శబ్దాలంకారములను నిరూపించి, హేయము లగు దోషములను విశదీకరించుచున్నాడు:-

మూ. అపార్థం వ్యర్థమేకార్థం ససంశయమపక్రమమ్
శబ్దహీనం యతిభ్రష్టం భిన్నవృత్తం విసన్ధికమ్. 125
దేశకాలకలాలోకన్యాయాగమవిరోధి చ
ఇతి దోషా దశైవేతే వర్జ్యాః కావ్యేషు సూరిభిః. 126

వ్యా. అపార్థం = అర్థశూన్యమైనది. వ్యర్థం = విరుద్ధార్థము, ఏకార్థం = అభిన్నమైన అర్థము గలది, అనగా పునరుక్తము, ససంశయం = సందిగ్ధార్థమైనది, అపక్రమం = క్రమరహితమైనది, శబ్దహీనం = అపేక్షితములైన శబ్దములు లేనిది, యతిభ్రష్టం = యతినియమమునకు విరుద్ధమైనగి, భిన్నవృత్తం = వృత్తనియమము లేనిది, విసన్ధి = సంధిలేనిది, దేశ-కాల-కలా-లోక-

న్యాయ-ఆగమవిరోధి చ = దేశకాలాదులకు విరుద్ధ మైనది, ఇతి = ఇట్లు, ఎతే = ఈ, దశైవ దోషాః = పది దోషములు మాత్రమే, కావ్యేషు = కావ్యములయందు, సూరిభిః = పండితులచేత, వర్జ్యాః = విడువదగినవి.

భరతుడు- "గూఢార్థమర్థాన్తరమర్థహీనం భిన్నార్థమేకార్థమభిప్లుతార్థమ్, న్యాయాదపేతం విషమం విసన్ధి శబ్దచ్యుతం వై దశ కావ్యదోషాః" అని పది దోషములను మాత్రమే పేర్కొని యున్నాడు. దండి కూడ పది దోషములను మాత్రమే అంగీకరించినాడు. అర్వాచీనులు పద పదాంశ-వాక్య-అర్థ-రసదోషములను పేర్లతో ఐదు విధము లగు దోషములను, వాటికి ఎన్నో అవాంతర భేదములను అంగీకరించి యున్నారు.

అవ. భామహుడు (కావ్యాలంకారపంచమపరిచ్ఛేదమున) ప్రతిజ్ఞా హేతు-దృష్టాన్తహీనత్వము లను మూడుదోషములను చెప్పి యున్నాడు. దానిని దృష్టిలోనుంచు కొని వ్రాయుచున్నాడు. కాని దండియే భామహునికంటె ప్రాచీను డన్నచో ప్రాచీనగ్రంథమును దేనినో దృష్టిలో నుంచుకొని వ్రాయుచున్నట్లు చెప్పవలెను.

మూ. ప్రతిజ్ఞాహేతుదృష్టాన్తహానిర్దోషో న వేత్యసౌ
విచారః కర్కశః ప్రాయస్తేనాలీఢేన కిం ఫలమ్ 127

వ్యా. ప్రతిజ్ఞాహేతుదృష్టాన్తహానిః = ప్రతిజ్ఞాహాని-హేతుహాని-దృష్టాంతహానులు, దోషః = దోషమా, న వా = కాదా, ఇతి = ఇట్లు, అసౌ = ఈ, విచారః = విమర్శ, ప్రాయః = సాధారణముగ, కర్కశః = కఠినమైనది. ఇది శాస్త్రీయవిషయము గాన సుకుమార మగు కావ్యమార్గమున అది కష్టమైనది. ఆలీఢేన = తెలుసుకొనబడిన, తేన = దానిచేత, కింఫలం = ఏమి ఫలము ?

అవ. అపార్థదోషమునకు లక్షణము :-

మూ. సముదాయార్థశూన్యం యత్తదపార్థమితీష్యతే
ఉన్మత్తమత్తబాలానాముక్తేరన్యత్ర దుష్యతి. 128

వ్యా. యత్ = ఏది, సముదాయార్థశూన్యం = సముదాయార్థములేనిదిగ ఉండునో, తత్ = అది, అపార్థమితి = అపార్థము అని, ఇష్యతే = అంగీకరింప బడుచున్నది. పదములకు ఆయాఅర్థము లున్నను మొత్తము మీద సంగత మగు అర్థ మేదియు ఉండనిది అపార్థము. ఉన్మత్తమత్తబాలానాం = ఉన్మత్తుల యొక్కయు, మత్తులయొక్కయు, బాలులయొక్కయు, ఉక్తేః = భాషణము కంటె, అన్యత్ర = ఇతరము లగు స్థలములందు, దుష్యతి = దూషణ మగును.

ఉన్మత్తాదుల మాటలు వర్ణించు నపుడు ఇట్టి అసంబద్ధ వాక్యములను కూర్చినను దోషము లేదు కాని తద్భిన్నవర్ణనావసరములందు ఇది దోషమే అని యర్థము.

అవ. అపార్థమునకు ఉదాహరణము :—

మూ. సముద్రః పీయతే దేవైరహమస్మి జరాతురః
అమీ గర్జన్తి జీమూతా హరేరైరావణః ప్రియః 129

వ్యా. దేవైః = దేవతలచేత, సముద్రః = సముద్రము, పీయతే = త్రాగబడుచున్నది. ఈ వాక్యములో పదము లన్నింటికిని అర్థము లున్నవి కాని దేవతల సముద్రపాన మనునది యోగ్యతారహిత మగు అర్థము గాన అపార్థము అహం = నేను, జరాతురః = ముసలితనముచే వ్యాకులుడనై, అస్మి = ఉన్నాను. అమీ = ఈ, జీమూతాః = మేఘములు, గర్జన్తి = గర్జించుచున్నవి. హరేః = ఇంద్రునకు, ఐరావణః = ఐరావణము, ప్రియః = ఇష్టమైనది. ఈ మూడు వాక్యములును వేరువేరుగ సార్థకములే యైనను, వీటికన్నింటికి కలిసి సముదాయార్థ మేదియు లేదు గాన అపార్థత్వదోషము.

మూ. ఇదమస్వస్థచిత్తానామభిధానమనిందితమ్
ఇతరత్ర కవిః కో వా ప్రయుఞ్జీతైవమాదికమ్. 130

వ్యా. అస్వస్థచిత్తానాం = ఉన్మాదాదులచే అస్వస్థమైన చిత్తము కల వారికి, ఇదం = ఈ, అభిధానం = పలుకు, అనిన్దితం = నిందింపదగినది కాదు. ఇతరత్ర = అస్వస్థచిత్తులు కాని వారి విషయమున, కో వాకవిః = ఏకవి, ఏవమాదికం = ఈ విధ మైన వాక్కును, ప్రయుఞ్జీత = ప్రయోగించును ?

అవ. వ్యర్థత్వదోషమును నిరూపించుచున్నాడు :-

**మూ. ఏకవాక్యే ప్రబన్ధే వా పూర్వాపరపరాహతమ్**
**విరుద్ధార్థతయా వ్యర్థమితి దోషేషు పఠ్యతే. 131**

వ్యా. ఏకవాక్యే = ఒక వాక్యమునందు గాని, ప్రబన్ధే వా = అనేక వాక్యసమూహాత్మక మైన ప్రబంధమునందు గాని, పూర్వాపరపరాహతం = పరస్పరవిరుద్ధమైనది, విరుద్ధార్థతయా = విరుద్ధ మైన అర్థము కల దగుటచే, వ్యర్థమితి = వ్యర్థము అని, దోషేషు = దోషములమధ్య, పఠ్యతే = పఠింప బడుచున్నది.

ఆకాంక్షాదులు లేకపోవుటచే శాబ్దబోధమే కలుగ కున్నచో అపార్థ దోషము. శాబ్దబోధ కలిగినను పరిశీలించిన పిదప అర్థము పూర్వాపర విరుద్ధముగ నున్నచో అది వ్యర్థము. ఇది అపార్థవ్యర్థముల భేదము. వాక్య ప్రబంధములను పర్యాలోచించగా విరోధము భాసించినచో వ్యర్థదోషము; ప్రక రణమును పర్యాలోచింపగా విరోధము భాసించినచో దేశకాలాదివిరోధదోష మని వీటి భేదము. అర్వాచీనులు అంగీకరించిన విరుద్ధమతికారిత్వ-ప్రకాశితవిరుద్ధత్వ-అమతపరార్థత్వ-పరిపన్థిరసాఙ్గవిభావాదిపరిగ్రహము లను దోషములు ఈ వ్యర్థత దోషమునందు అంతర్భూతము లగును.

అవ. ప్రబన్ధగత వ్యర్థత్వమునకు ఉదాహరణము :-

**మూ. జహి శత్రుబలం కృత్స్నం జయ విశ్వమ్భరామిమామ్**
**తవ నైకోఽపి విద్వేష్టా సర్వభూతానుకమ్పినః. 132**

వ్యా. కృత్స్నం=సమస్తమైన, శత్రుబలం=శత్రుసేనను, జహి = సంహరింపుము. ఇమాం = ఈ, విశ్వమ్భరాం = భూమిని, జయ = జయింపుము. సర్వభూతానుకమ్పినః = అన్ని భూతములయందును దయ గల, తవ = నీకు, విద్వేష్టా = శత్రువు, ఏకోఽపి = ఒక్కడును, న = లేడు.

శత్రువులు లేనివాడు శత్రుసంహారము చేయుట, సర్వభూతదయావంతుడు భూమిని జయించుట అనునవి పరస్పరవిరుద్ధములు గాన ఇచట వ్యర్థత్వ దోషము.

మూ. అస్తి కాచిదవస్థా సా సాభిషఙ్గస్య చేతసః
యస్యాం భవేదభిమతా విరుద్ధార్థాపి భారతీ. 133

వ్యా. సాభిషఙ్గస్య = దుఃఖముతో కూడిన, చేతసః = చిత్తముయొక్క, కా చిత్ = ఒకానొక, అవస్థా = అవస్థ, అస్తి = ఉన్నది యస్యాం = దేనియందు, విరుద్ధార్థా = విరుద్ధ మైన అర్థము గల, భారతీ అపి = వాక్కు కూడ, అభిమతా భవేత్ = అంగీకార్య మగునో.

దుఃఖాక్రాంతచిత్తులు ఇట్టి మాటలు పలికి నపుడు అచట వ్యర్థత్వమును దోషముగ పరిగణింప పని లేదని అర్థము.

అవ. వ్యర్థత్వమును గుణముగ గ్రహింపదగిన స్థానమును ఉదాహరించుచున్నాడు :-

మూ. పరదారాభిలాషో మే కథమార్యస్య యుజ్యతే
పిబామి తరలం తస్యాః కదా ను దశనచ్ఛదమ్. 134

వ్యా. ఆర్యస్య = సత్కులప్రసూతుడ నైన, మే = నాకు, పరదారాభిలాషః = పరభార్యాభిలాష, కథం = ఎట్లు, యుజ్యతే = యుక్త మగును ?

తస్యాః = ఆమెయొక్క, తరలం = చంచలమైన, దశనచ్ఛదం = అధరమును, కదా = ఎప్పుడు, పిబామిను = పానము చేయుదునో కదా ?

పూర్వార్ధమున, పరస్త్రీసమాగమము నింద్య మని చెప్పి, ఉత్తరార్ధమున తదభిలాషను ప్రకటించుటచే ఈ వాక్యములు పరస్పరవిరుద్ధములే యైనను ఇవి కామోపహతచిత్తుని వాక్యము లగుటచే ఇది దోషము కాదు.

అవ. ఏకార్థమును నిరూపించుచున్నాడు :-

**మూ. అవిశేషేణ పూర్వోక్తం యది భూయోఽపి కీర్త్యతే**
**అర్థతః శబ్దతో వాపి తదేకార్థం మతం యథా. 135**

వ్యా. పూర్వోక్తం = మొదట చెప్పబడిన వాక్యము, అర్థతః = అర్థమును బట్టి కాని, శబ్దతః వాపి = శబ్దమును బట్టి గాని, అవిశేషేణ = విశేషము లేకుండ, భూయోపి = మరల, కీర్త్యతేయది = చెప్పబడి నట్లైతే, తత్ = అది, ఏకార్థం = ఏకార్థము అని, మతం = చెప్పబడినది. యథా = ఎట్లనగా :-

**మూ. ఉత్కాముత్మనయన్త్యేతే బాలాం తదలకత్విషః**
**అమ్భోధరాస్తడిద్వన్తో గమ్భీరాః స్తనయిత్నవః 136**

వ్యా. తదలకత్విషః = ఆ బాలయొక్క ముంగురుల వంటి కాంతి కలవియు, తడిద్వన్తః = మెరుపులతో కూడినవియు, గమ్భీరాః = గంభీర మైన ధ్వని కలవియు, స్తనయిత్నవః = ఉరుముచున్నవియు అగు, ఏతే అమ్భోధరాః = ఈ మేఘములు, ఉత్కాం = ఉత్కంఠతో కూడిన, బాలాం = బాలను, ఉన్మనయన్తి = ఉత్కంఠితురాలినిగ చేయుచున్నవి. ఇచట ఉత్కాం "గమ్భీరాః" అను పదములచే బోధింపబడిన అర్థమునే "ఉన్మనయన్తి"

"స్తనయిత్నవః" అను పదములు మరల బోధించుచున్నవి గాన ఇది అర్థగతైకార్థత్వమునకు ఉదాహరణములు.

మూ. అనుకమ్పాద్యతిశయో యది కశ్చిద్వివక్ష్యతే
న దోషః పునరుక్తోఽపి ప్రత్యుతేయమలఙ్క్రియా 137

వ్యా. కశ్చిత్=ఏదైన, అనుకమ్పాద్యతిశయః=అనుకంప మొదలైన దానియొక్క ఆధిక్యము, వివక్ష్యతే యది = చెప్పుటకు ఉద్దేశింపబడినచో, పునరుక్తోఽపి=పునరుక్త మగు అర్థము కూడ, దోషః న=దోషము కాదు. ప్రత్యుత = దోష మగుటకు బదులు, ఇయం = ఇది, అలఙ్క్రియా = అలంకారము.

హన్యతే సా వరారోహా స్మరేణాకాణ్డవైరిణా
హన్యతే చారుసర్వాఙ్గీ హన్యతే మఞ్జుభాషిణీ 138

వ్యా. అకాణ్డవైరిణా=అకారణముగ శత్రువైన, స్మరేణ=మన్మథుని చేత, సా=ఆ, వరారోహా=శ్రేష్ఠమైన జఘనము గల సుందరి, హన్యతే = పీడింపబడుచున్నది. చారుసర్వాఙ్గీ=సుందరమైన సమస్తావయవములు గల ఆమె, హన్యతే=పీడింపబడుచున్నది. మఞ్జుభాషిణీ=మృదువైన పలుకులు గల ఆమె, హన్యతే=పీడింపబడుచున్నది.

ఇచట నాయికయొక్క దయనీయావస్థను సూచించుటకై 'హన్యతే' అను పదము ఆవృత్తిచేయబడినది గాన ఇది అలంకారమే (శోభాహేతువే) కాని పునరుక్తిదోషము కాదు.

అవ. ససంశయదోషమును నిరూపించుచున్నాడు :-

నిర్ణయార్థం ప్రయుక్తాని సంశయం జనయన్తి చేత్
వచాంసి దోష ఏవాసౌ ససంశయ ఇతి స్మృతః 139

వ్యా. నిర్ణయార్థం = నిశ్చయరూపజ్ఞానముకొరకై, ప్రయుక్తాని = ప్రయోగింపబడిన, వచాంసి = వాక్యములు, సంశయం = సంశయమును, జనయన్తి చేత్ = కలిగించినచో, అసౌ = ఇది, ససంశయ ఇతి = ససంశయ మను, దోష ఏవ = దోషముగనే, స్మృతః = చెప్పబడినది.

ఈ సంశయము శబ్దగతము, అర్థగతము అని రెండు విధములు. సంశయ ముండుటచే నిశ్చిత మైన వాక్యార్థాన్వయము లేనిచో అది శబ్దగతము. వాక్యార్థము తెలిసిన పిమ్మట, ప్రకరణజ్ఞానము లేకపోవుటచే వక్త అభిప్రాయ మేదియో తెలియనిచో అది అర్థగతసంశయము. "మాత్సర్యముత్సార్య విచార్య కార్యమార్యాః సమర్యాదముదాహరన్తు. సేవ్యా నితమ్బాః కిము భూధరాణాముత స్మరస్మేరవిలాసినీనామ్" ఇత్యాద్యు (కావ్యప్రకాశాదులలో ఇచ్చిన) దాహరణము లందు ప్రకరణము తెలియకపోవుటచే వక్త ఏది ఉత్తమ మని భావించుచున్నాడో తెలియకపోవుటచే అర్థగతసంశయము.

అవ. శబ్దగతసంశయమునకు ఉదాహరణము చూపుచున్నాడు;-

మనోరథప్రియాలోకరసలోలేక్షణే సఖి
**ఆరాద్వృత్తిరసౌ మాతా న క్షమా ద్రష్టుమీదృశమ్** 140

వ్యా. మనోరథప్రియాలోకరసలోలేక్షణే = మనోరథము ప్రకారము లభించిన ప్రియుని చూచుటయందు ఆసక్తిచే చంచల మైన నేత్రములు గల, సఖి = ఓ సఖురాలా, ఆరాద్వృత్తిః = సమీపమున ఉన్న, అసౌ మాతా = ఈ తల్లి, ఈదృశం = ఇట్టికార్యమును, ఈక్షితుం = చూచుటకు, న క్షమా = శక్తురాలు కాదు.

నీవిట్లు చేయుచున్నచో నీ తల్లి సహింప దని అర్థము. 'ఆరాత్' అను పదమునకు 'దూరము' 'సమీపము' అను రెండర్థము లుండుటచే "ఆరాద్వృత్తిః"

'దూరముగా నున్న' తల్లి ఇచట నీ వేమి చేసినను చూడజాల దని కూడ అర్థము చెప్పవచ్చును. అందుచే ఇచట ఏ అర్థము వివక్షితమో సందిగ్ధము గాన ఇది ససంశయదోషమునకు ఉదాహరణము.

మూ. ఈదృశం సంశయాయైవ యది జాతు ప్రయుజ్యతే
స్యాదలఙ్కార ఏవాసౌ న దోషస్తత్ర తద్యథా 141

వ్యా. సంశయాయైవ = సంశయము కావలె ననియే ఉద్దేశముతో, ఈదృశం = ఇట్టి వాక్యము, జాతు = ఎప్పుడైన, ప్రయుజ్యతే యది = ప్రయోగింపబడినచో, అసౌ = ఇది, అలఙ్కార ఏవ = అలంకారమే, స్యాత్ = అగును. తత్ర = దానియందు, దోషః న = దోషము లేదు. యథా = ఎట్లనగా—

మూ. పశ్యామ్యనఙ్గజాతఙ్కాలఙ్ఘితాం తామనిన్దితామ్
కాలేనైవ కఠోరేణ గ్రస్తాం కిన్నస్తదాశయా 142

వ్యా. ఇచట చతుర యగు ఒక దూతి నాయకునికి మనస్సునందు ఉద్వేగము కలిగించుటకై బుద్ధిపూర్వకముగనే రెండర్థములు గల వాక్యమును పలుకుచున్నది. అనఙ్గజాతఙ్కాలఙ్ఘితాం = అనఙ్గుని (మన్మథుని) వలన కలిగిన పాపముచే ఆక్రమింపబడిన, అనిన్దితాం = సుందరి యైన, తాం = ఆ నీ ప్రేయసిని, కఠోరేణ = భయంకర మైన, కాలేనైవ = మృత్యువుచేతనే, గ్రస్తాం = మ్రింగివేయబడినదానినిగా, పశ్యామి = చూచుచున్నాను (ఊహించుచున్నాను). తదాశయా = ఆమె విషయమున జీవనాశచే, నః = మనకు, కిమ్ = ఏమి ప్రయోజనము.

రెండవ అర్థము :- అనఙ్గజాతఙ్కాలఙ్ఘితాం = అంగజుని (మన్మథుని) తాపముచే ఆక్రమింపబడినది కాని, (న + అఙ్గజాత...అని పదచ్ఛేదము) అనగా

మన్మథతాపముకంటె భిన్న మైన గ్రీష్మతాపముచేతనే పీడితురా లైన అని అర్థము. అట్టి ఆమె తీవ్ర మైన గ్రీష్మముచేతనే పీడింపబడినట్లు భావించుచున్నాను అని అర్థము. ఈ విధముగ దూతి బుద్ధిపూర్వకముగ ససంశయ మగు వాక్యమును పలికినది గాన ఇచట ససంశయత్వము అలంకారము,

మూ. కామార్తా ఘర్మతప్తా వేత్యనిశ్చయకరం వచః
యువానమాకులీకర్తుమితి దూత్యాహ నర్మణా 143

వ్యా. దూతీ = దూతి, యువానం = యువకుని, ఆకులీకర్తుం = కంగారుపెట్టుటకు, కామార్తా = కామపీడితురాలా, ఘర్మార్తా వా = గ్రీష్మ పీడితురాలా, ఇతి = అని, అనిశ్చయకరం = నిశ్చయము లేని, వచః = వాక్యమును, నర్మణా = (పరిహాసమునకై) వచనచాతుర్యముతో, ఆహ = పలుకుచున్నది.

అవ. అపక్రమమును నిరూపించుచున్నాడు :-

మూ. ఉద్దేశానుగుణోఽర్థానామనూద్దేశో న చేత్కృతః
అపక్రమాభిధానం తం దోషమాచక్షతే బుధాః 144

వ్యా. అర్థానాం = పదార్థములయొక్క, ఉద్దేశానుగుణః = మొదట చేసిన నిర్దేశమునకు అనుగుణ మైన, అనూద్దేశః = రెండవ మారు నిర్దేశము, న కృతః చేత్ = చెప్పబడకపోయినచో, తం = దానిని, బుధాః = పండితులు, అపక్రమాభిధం = అపక్రమ మను పేరు గల, దోషం = దోషమునుగా, ఆచక్షతే = చెప్పుచున్నారు.

మూ. స్థితినిర్మాణసంహారహేతవో జగతామమీ
శమ్భునారాయణామ్భోజయోనయః పాలయన్తు వః 145

వ్యా. జగతాం = జగత్తులయొక్క, స్థితినిర్మాణసంహారహేతవః = స్థితి-సృష్టి-సంహారములకు కారణభూతులైన, అమీ = ఈ, శమ్భునారాయణామ్భోజయోనయః = శివ-నారాయణబ్రహ్మలు, వః = మిమ్ములను, పాలయన్తు = పాలింతురుగాక.

ఇచట మొదట చెప్పిన స్థితి-నిర్మాణ-సంహారక్రియల క్రమమును అనుసరించి ఆ కార్యములను చేయు దేవతల నామధేయములను నారాయణామ్భోజయోనిశివు లను క్రమమున చెప్పుట యుక్తము. అట్లు చెప్పకుండుటచే అపక్రమ దోషము.

అవ. కొన్ని చోట్ల ఇది దోషము కాదని చెప్పుచున్నాడు :-

**మూ. యత్నః సమ్బన్ధవిజ్ఞానహేతుకోఽపి కృతో యది**
**క్రమలఙ్ఘనమప్యాహుః సూరయో నైవ దూషణమ్ 146**

వ్యా. సమ్బన్ధవిజ్ఞానహేతుకః = అన్వయబోధమునకు ఉపయోగించు, యత్నః అపి = ప్రయత్నము కూడ, కృతః యది = చేయబడినచో, క్రమలఙ్ఘనమపి = క్రమముయొక్క విపర్యాసమును కూడ, సూరయః = పండితులు, దూషణం = దూషణమునుగా, నైవ ఆహుః = చెప్పరు.

అపక్రమముదోష మని చెప్పుటకు కారణము అన్వయము సరిగా కుదరక పోవుటయే. కాని ఆ అన్వయము కుదురుటకు మరొక విధమైన మార్గము చూపబడినచో అపక్రమము కూడ దోషము కాదని అర్థము.

**మూ. బన్ధుత్యాగస్తనుత్యాగో దేశత్యాగ ఇతి త్రిషు**
**ఆద్యన్తావాయతక్లేశౌ మధ్యమః క్షణికజ్వరః. 147**

వ్యా. బన్ధుత్యాగః = బంధువుల త్యాగము, తనుత్యాగః = దేహ

త్యాగము, దేశత్యాగః = దేశత్యాగము, ఇతి = అను, త్రిషు = మూడింటిలో, అద్యన్తౌ = మొదటిది చివరిది, ఆయతక్లేశౌ = దీర్ఘకాలము పాటు ఉండు క్లేశములు మధ్యమః = మధ్య నున్నది (దేహత్యాగము) క్షణికజ్వరః = క్షణకాలముపాటు మాత్రమే ఉండు క్లేశము.

ఇచట మొదట చెప్పిన బంధుత్యాగాదులను ఉత్తరార్ధమున మరల పేర్కొనుట జరిగినది. కాని "ద్వావేతావాయతక్లేశౌ తృతీయః క్షణికజ్వరః" అని, అనగా "వీటిలో రెండు ఆయతక్లేశములు, మూడవది క్షణికజ్వరము" అని చెప్పినచో, ఏ రెండు;మూడవది ఏది అని సందేహము కలుగును. అట్లు కాక "మొదటిది, చివరిది ఆయతక్లేశములు, మధ్యది క్షణికక్లేశము అని చెప్పుటచే అట్టి సందేహమునకు తావు లేదు. అని భావము.

వాస్తవమున ఈ శ్లోకమున అపక్రమదోషమునకు ప్రసక్తియే లేదు గాన, అపక్రమదోష మున్నను కొన్నిపరిస్థితులలో దోషము గాదు అని చూపుటకై చెప్పిన ఈ ప్రసంగములో దీనికి సమన్వయ మెట్లో ఆలోచింపవలసి యున్నది.

అన. శబ్దహీనమును ప్రతిపాదించుచున్నాడు :-

**మూ. శబ్దహీనమనాలక్ష్యలక్ష్యలక్షణపద్ధతిః**
**పదప్రయోగోఽశిష్టేష్టః శిష్టేష్టస్తు న దుష్యతి** 148

వ్యా. అనాలక్ష్యలక్ష్యలక్ష్యణపద్ధతిః = కనబడని లక్ష్యలక్షణమార్గము గల, లక్షణ మనగా వ్యాకరణశాస్త్రము, లక్ష్యము పదము. పదము వ్యాకరణ శాస్త్రానుసారముగ ఉండవలెను. కాని అట్లు లేనిచో తాదృశపదప్రయోగము లక్ష్యలక్షణమార్గమునకు విరుద్ధ మైనది. పదప్రయోగః = పదప్రయోగము, అశిష్టేష్టః = శిష్టులకు సంమతము కానిచో, అది, శబ్దహీనం = శబ్ధహీనము. శిష్టేష్టస్తు = శిష్టులకు ఇష్ట మైన ప్రయోగమైతే (అది వ్యాకరణసంమతము కాకున్నను) న దుష్యతి = దుష్టము కాదు.

మూ. అవతే భవతే బాహుర్మహీమర్ణవశక్వరీమ్
మహారాజన్న జిజ్ఞాసా నాస్తీత్యాసాం గిరాం రసః. 149

వ్యా. హే మహారాజన్ = ఓ మహారాజా, భవతేబహుః = నీ బాహువు, అర్ణవశక్వరీం = సాగరమే మేఖలగా గల, మహీం = భూమిని, అవతే = రక్షించుచున్నది. ఈ విధముగ ప్రత్యక్షముగ కనబడుటచే, జిజ్ఞాసా = ఈ విషయమును తెలుసుకొనవలె నను ఇచ్ఛ, న = లేదు. ఇతి = ఈ విధముగ, ఆసాం గిరాం = ఈ పదములకు, రసః = అందము, నాస్తి = లేదు.

ఇచట 'అవతే' అను ఆత్మనేపదప్రయోగము, 'భవతే' అని పంచమ్యంత మునకు బదులు చతుర్థ్యంతప్రయోగము, 'మహారాజ' అనుటకు బదులు 'మహా రాజన్' అను ప్రయోగము వ్యాకరణవిరుద్ధములు గాన రసభంగహేతువు లని అభిప్రాయము.

అవ. శిష్టసమ్మత మైనచో వ్యాకరణశాస్త్రవిరుద్ధ మైనను దోషము కాదనుటకు ఉదాహరించుచున్నాడు :-

మూ. దక్షిణాద్రేరుపసరన్ మారుతశ్చూతపాదపాన్
కురుతే లలితాధూతప్రవాలాఙ్కురశోభినః. 150

వ్యా. దక్షిణాద్రేః = మలయపర్వతమునుండి, ఉపసరన్ = మంద మందముగ వచ్చుచున్న, మారుతః = వాయువు, చూతపాదపాన్ = చూత వృక్షములను, లలితాధూతప్రవాలాఙ్కురశోభినః = అందముగ, మెల్లగ కదల్చబడిన చిగుళ్లయొక్క అంకురములచే ప్రకాశించుచున్నవాటినిగా, కురుతే = చేయుచున్నాడు.

'ఉపసరన్' అనునది ఉపపూర్వకసృధాతువు నట్టుకు 'శతృ' అను ఆదేశము చేయుటచే ఏర్పడినది. "పాఘ్రాధ్మా..." ఇత్యాదిపాణినిసూత్రముచే

(7-3-78) 'సృ' కు సార్వధాతుకము పర మగునపుడు 'ధా' అను ఆదేశము వచ్చి 'ఉపధావన్' అను రూపము కావలెను. కాని సృధాతువును శీఘ్రగమ నార్థమునందు ప్రయోగించి నపుడే ఈ ఆదేశము వచ్చు నని శిష్టసంప్రదాయము. అందుచే ఇది సూత్రవిరుద్ధ మైనను, శిష్టాంగీకృతము గాన గ్రాహ్యమే. "సర్తే ర్వేగితాయాం గతౌ ధావాదేశమిచ్ఛన్తి, అన్యత్ర 'సరతి' 'అనుసరతి' ఇత్యేవభవతి" అని కాశిక చెప్పుచున్నది. అట్లే ఫలము పరగామి గాన (శోభ చూతవృక్షములకు చెందును, వాయువునకు కాదు) పరస్మైపదమును ప్రయో గించుటకు బదులు 'కురుతే' అని ఆత్మనేపదము ప్రయోగింపబడినది. కాని ఫలము కర్తృగామియా, పరగామియా అనునది చేతనవిషయముననే; అచేతనముల విషయమున కాదు అని శిష్టసంప్రదాయము, అందుచే 'కురుతే' అను ప్రయోగము దుష్టము కాదు.

**మూ. ఇత్యాది శాస్త్రమాహాత్మ్యదర్శనాలసచేతసామ్**
**అపభాషణవద్భాతి న చ సౌభాగ్యముజ్ఝతి. 151**

వ్యా. ఇత్యాది = ఈ విధమైనది, శాస్త్రమాహాత్మ్యదర్శనాలసచేతసాం = శాస్త్రముయొక్క మాహాత్మ్యమును పరిశీలించువిషయమున అలస మైన చిత్తము కలవారికి, అపభాషణవత్ = అపప్రయోదము వలె, భాతి = కనబడును, ఐనను, సౌభాగ్యం = సౌందర్యమును, న ఉజ్ఝతి = విడువడు. అనగా దుష్టము కాదు.

అవ. యతిభ్రష్టదోషమును నిరూపించుచున్నారు:-

**మూ. శ్లోకేషు నియతస్థానం పదచ్ఛేదం యతిం విదుః**
**తదపేతం యతిభ్రష్టం శ్రవణోద్వేజనం యథా. 152**

వ్యా. శ్లోకేషు = శ్లోకములయందు, నియతస్థానం = నిశ్చిత మైన స్థానము కల, పదచ్ఛేదం = పదచ్ఛేదమును, యతిం = యతినిగా, విదుః =

అంగీకరించుచున్నారు. ఈ వృత్తములో ఇన్నవ అక్షరము మీద పదము విరుగ వలెను అనునియమమునకు యతి అని పేరు. తదపేతం = అట్టి యతి లేనిది, యతిభ్రష్టం = యతిభ్రష్టము. శ్రవణోద్వేజనం = ఇది వినుటకు బాధాకరముగా నుండును. యథా = ఎట్లనగా.

మూ. స్త్రీణాం సఙ్గీతవిధిమయమాదిత్యవంశ్యో నరేన్ద్రః
పశ్యత్యక్లిష్టరసమిహ శిష్టైరమాత్యాదిదుష్టమ్.
కార్యాకార్యాణ్యయమవికలాన్యాగమేనైవ పశ్యన్
వశ్యాముర్వీం వహతి నృప ఇత్యస్తి చైవం ప్రయోగః 153

వ్యా. ఈ శ్లోకములోని పూర్వార్ధము యతి భ్రష్టత్వమునకును, ఉత్తరార్ధము సంధి ఏర్పడిన స్థానమున యతిభ్రంశదోషము లేదు అని చెప్పుటకును ఉదాహరణము. అయం = ఈ, ఆదిత్యవంశ్యః=సూర్యవంశమునకు సంబంధించిన, నరేన్ద్రః = రాజు, శిష్టైః అమా = సభ్యులైనవారితో కూడ, అక్లిష్టరసం = రసమునకు భంగము లేని, సఙ్గీతవిధిం = నృత్యగీతవాద్య విధానమును, పశ్యతి = చూచుచున్నాడు. ఇత్యాది = ఈ విధమైనది, దుష్టం = దుష్టము.

మందాక్రాంతావృత్తమునందు చతుర్థవర్ణమునందు, దాని తరువాత షష్ఠవర్ణమునందు యతి ఉండవలెను. అనగా నాల్గవ వర్ణము, పదవ వర్ణము పదమధ్యమున రాకూడదు. ఇచట ప్రథమ ద్వితీయ పాదములలో చతుర్థ వర్ణములు (ఙ్గీ, క్లి), ద్వితీయపాదములోని దశమవర్ణమును పదమధ్యములో నున్నవి గాన యతిభంగము.

అయం = ఈ, నృపః = రాజు, అవికలాని = దోషరహితము లగు, కార్యాకార్యాణి = కార్యాకార్యములను, ఆగమేనైవ = శాస్త్రముచేతనే, పశ్యన్ = చూచుచు, వశ్యాం = స్వాధీన మైన, ఉర్వీం = భూమిని, వహతి =

పొరిపాలించుచున్నాడు ఇతి = ఇట్లు, ఏవం ప్రయోగః = ఈ విధ మైన ప్రయోగము, అస్తి = ఉన్నది.

"కార్యాకార్యాణి + అయం", అవికలాని + ఆగమేన" "ఇతి + అస్తి" అనునపుడు సంధిచే "కార్యాకార్యాణ్యయం" "అవికలాన్యాగమేన" "ఇత్యస్తి" అనురూపము లేర్పడినవి. ఇచట 'ర్యా' 'లా' 'ఇ' అనునవి పదము చివర లేకపోయినను సంధి వచ్చి యుండటచే వాటిని పదాంతమునం దున్నట్లే భావించ వలెను. ఈ విధముగ ఇట్టి స్థానములలో యతిభంగదోషములేదు. వినుటకు ఇంపుగ ఉండుట లేక పోవుట అనుదానిని బట్టి యతినియమములు ఏర్పడినవి. ఇట్టి స్థలములలో వినుటకు ఇంపుగచే ఉండును గాన దోషము కాదు.

అవ. సంధిస్థానములలో యతిభంగదోషాభావమునకు కారణమును ప్రతిపాదించుచున్నాడు:-

**మూ. లుప్తే పదాన్తే శిష్టస్య పదత్వం నిశ్చితం యథా**
**తథా సన్ధివికారాన్తం పదమేవేతి వర్ణ్యతే. 154**

వ్యా. పదాన్తే = పదాంతమునందున్న వర్ణము, లుప్తే సతి = లోపించిన దగుచుండగా, శిష్టస్య = మిగిలినదానికే, యథా = ఎట్లు, పదత్వం = పదత్వము, నిశ్చితం = నిశ్చిత మైనదో, సన్ధివికారాన్త పదం = సంధివికారము అంతమునందు గల పదము కూడ, తథా ఏవ = అట్లే, ఇతి = అని, వర్ణ్యతే = చెప్పబడుచున్నది.

నకారాంత మైన 'రాజన్' శబ్దము ప్రథమైకవచనమున నకారము లోపించిన పిదప మిగిలిన 'రాజా' అనునదియే పదముగ గ్రహింప బడును. అట్లే సంధిస్థానమునందు పూర్వవర్ణమునకు పరవర్ణముతో సంధి వచ్చి నపుడు పూర్వపదము చివరి వర్ణము ('కార్యాకార్యాణి' అను దానిలో 'ణి' అనునది చివరి వర్ణము) పరమైనపదములోని మొదటి వర్ణముతో కలిసిపోయి నపుడు ('ణి' అనునది 'అ'తో కలిసి నట్లు) మిగిలిన పదభాగమే (కార్యాకార్యా)

పదముగ గ్రహింపబడును గాన దాని చివరి వర్ణముపై యతిని అంగీకరింప వచ్చు నని అర్థము.

అవ. కాని కొన్ని స్థలములలో సంధిస్థానమునందు గూడ యతిని కూర్చినచో కర్ణకటువుగా నుండును గాన అది పరిహార్యమే అని చెప్పు చున్నాడు :-

మూ. తథాపి కటు కర్ణానాం కవయో న ప్రయుఞ్జతే
ధ్వజినీ తస్య రాజ్ఞః కేతూదస్తజలదేత్యదః. 155

వ్యా. తథాపి = పదాంతమునందు సంధి వికార మేర్పడి నపుడు మిగిలిన భాగమే పద మని స్వీకరించినను, కర్ణానాంకటు = చెవులకు కటువుగా ఉండు యతిని, కవయః = కవులు, న ప్రయుఞ్జతే = ప్రయోగింపరు. తస్య రాజ్ఞః = ఆ రాజుయొక్క, ధ్వజినీ = సేన, కేతూదస్తజలదా = ధ్వజములచేత తొలగింపబడిన మేఘములు కలది. ఇతి = ఇట్లు, అదః = ఇది (ఉదాహరణము).

ఉత్తరార్ధమున "కేతు + ఉదస్త" అనుచోట సంధి వచ్చి 'కేతూదస్త' అని యైనది. కాని ఇచట 'కే' దగ్గర యతి శ్రుతికటువుగ నుండుటచే ఇది దోషమే అని యర్థము.

అవ. భిన్నవృత్తమును నిరూపించుచున్నాడు :-

మూ. వర్ణానాం న్యూనతాధిక్యే గురులఘ్వయథాస్థితిః
యత్ర తద్భిన్నవృత్తం స్యాదేష దోషః సునిన్దితః. 156

వర్ణానాం = వర్ణముల, న్యూనతాధిక్యే = తక్కువ అగుట ఎక్కువ అగుట, గురులఘ్వయథాస్థితిః = గురులఘువర్ణములు ఉండవలసిన విధముగ

ఉండకుండుట, యత్ర = ఎచట ఉండునో, తత్ = అది, భిన్నవృత్తం = భిన్నవృత్త మను దోషము, స్యాత్ = అగును. ఏషః = ఇది, సునిన్దితః = చాలా నిందింపబడిన, దోషః = దోషము.

మూ. ఇన్దుపాదాః శిశిరాః స్పృశన్త్యూనవర్ణతా
సహకారస్య కిసలయాన్యార్ద్రాణీత్యధికాక్షరమ్. 157

శిశిరాః = చల్లని, ఇన్దుపాదాః = చంద్రకిరణములు, స్పృశన్తి = స్పృశించుచున్నవి. ఇతి = ఇది, ఊనవర్ణతా = వర్ణము తగ్గుట అను దోషమునకు ఉదాహరణము. మొదటి పాదమున ఎనిమిది వర్ణములకు బదులు ఏడు మాత్రమే ఉన్నవి. సహకారస్య = చూతవృక్షముయొక్క, కిసలయాని = చిగుళ్లు, ఆర్ద్రాణి = తడిగా ఉన్నవి, ఇతి = ఇది, అధికాక్షరం = అధికాక్షరము. తృతీయ పాదములో ఒక అక్షరము అధికముగా ఉన్నది. ఈ విధముగ ఇచట న్యూన వర్ణాధికవర్ణత్వములచే ఏర్పడిన భిన్నవృత్త దోషము.

అవ. గురులఘ్వయథాస్థితిచే ఏర్పడిన భిన్నవృత్తమునకు ఉదాహరణము :-

మూ. కామేన బాణా నిశాతా విముక్తా
మృగేక్షణాస్విత్యయథాగురుత్వమ్.
మదనబాణా నిశితాః పతన్తి
వామేక్షణాస్విత్యయథాలఘుత్వమ్. 158

వ్యా. కామేన = మన్మథునిచే, మృగేక్షణాసు = స్త్రీలపై, నిశాతాః = వాడియైన, బాణాః = బాణములు, విముక్తాః = విడువబడినవి. ఇతి = ఇట్లు, అయథాగురుత్వం = ఉండకూడనిచోట ('నిశాతా'లోని 'శా') గురు వుండుటకు ఉదాహరణము, నిశితాః = వాడియైన, మదనబాణాః = మన్మథబాణములు,

వామేక్షణాసు = స్త్రీలపై, పతన్తి = పడుచున్నవి, ఇతి = ఇట్లు, అయథా లఘుత్వం = ఉండకూడని చోట లఘువు ఉండుటకు ("మదన"లోని 'మ' 'ద') ఉదాహరణము.

అవ. విసంధికమును నిరూపించుచున్నాడు :-

మూ. న సంహితాం వివక్షామీత్యసన్ధానం పదేషు యత్
తద్విసన్ధీతి నిర్దిష్టం న ప్రగృహ్యాదిహేతుకమ్. 159

వ్యా. సంహితాం = సహితను, న వివక్షామి = చేయ నిచ్చగింపను, ఇతి = అని, పదేషు = పదములయందు, యత్ = ఏ, అసంధానం = సంధి చేయక పోవుట ఉండునో, తత్ = అది, విసంధీతి = విసంధి అని, నిర్దిష్టం = చెప్పబడినది. ప్రగృహ్యాదిహేతుకం = ప్రగృహ్యసంజ్ఞాదులను బట్టి ఏర్పడిన అసంధానము, న = దోషముకాదు. సంధి చేయవలసిన చోట కూడ కావలె నని మానివేసినచో అది దోషము.

"ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్" ఇత్యాదిసూత్రములచే 'హరీ' 'శమ్భూ' ఇత్యాదు లైన ఈకారోకారాంతాదిద్వివచనములకు 'ప్రగృహ్యము' అను సంజ్ఞను చెప్పి, ప్రగృహ్యసంజ్ఞ కలవాటికి సంధి రాదు అని చెప్పబడినది. ఇట్టి స్థలములలో సంధి చేయకపోయినను అది దోషము కాదు.

మూ. మన్దానిలేన చలతా అఙ్గనాగణ్డమణ్డలే
లుప్తముద్భేది ఘర్మామ్భో నభస్యస్మద్వపుష్యపి. 160

వ్యా. నభసి = ఆకాశమునందు, చలతా = సంచరించుచున్న, మన్దానిలేన = మందవాయువుచేత, అఙ్గనాగణ్డమణ్డలే = స్త్రీల గండస్థలము నందును, అస్మద్వపుష్యపి = మా శరీరమునందును, ఉద్భేది = బయలువెడలు చున్న, ఘర్మామ్భః = స్వేదము, లుప్తం = తొలగిపోయినది.

ఇచట "చలతా అఙ్గనాపాఙ్గే" అను నపుడు సవర్ణదీర్ఘసంధి చేయవలసి యున్నది చేయలేదు. అందుచే విసంధిదోషము.

అవ. ప్రగృహ్యసంజ్ఞాదు లుండుటచే చేసిన సంధ్యభావము దోషము కాదని చూపుటకై ఉదాహరించుచున్నాడు.

**మూ. మానేర్ష్యే ఇహ శీర్యేతే స్త్రీణాం హిమఋతౌ ప్రియే**
**ఆసు రాత్రిష్వితి ప్రాజ్ఞైరామ్నాతం వ్యస్తమీదృశమ్. 161**

వ్యా. హే ప్రియే = ఓ ప్రియురాలా, ఇహ హిమఋతౌ = ఈ హేమంతఋతువునందు, ఆసు రాత్రిషు = ఈ రాత్రులందు, మానేర్ష్యే = కోపాసూయలు, శీర్యేతే = నశించిపోవును. ఇతి = ఇట్లు, ప్రాజ్ఞైః = బుద్ధిమంతుల చేత, ఈదృశం = ఇట్టిది, వ్యస్తం = విసంధికము, ఆమ్నాతం = అంగీక రింపబడినది.

"మానేర్ష్యే" అనునది ఏకారాంతద్వివచనరూపము గాన దీనికి "ఈదూదే ద్ద్వివచనం ప్రగృహ్యమ్" అను సూత్రముచే ప్రగృహ్యసంజ్ఞ యున్నది "ప్లుతప్రగృహ్యా అచి నిత్యమ్" అను సూత్రముచే ప్రకృతివద్భావముచే (సంధ్యభావముచే) ఏకార-ఇకారములకు సంధి రాలేదు. 'హిమ + ఋతౌ' అనునపుడు "ఋత్యకః" అను సూత్రముచే వైకల్పికప్రకృతిభావము (సంధ్య భావము) ఇట్టి స్థలములలో సంధ్యభావము శాస్త్రీయమే గాన విసంధిదోషము లేదు.

అవ. "దేశకాలకలాలోకన్యాయాగమవిరోధి చ" (3-126) అని చెప్పిన దేశాదులను వివరించుచున్నాడు :-

**మూ. దేశోఽద్రివనరాష్ట్రాదిః కాలో రాత్రిందివర్తవః**
**నృత్యగీతప్రభృతయః కలాః కామార్థసంశ్రయాః. 162**

వ్యా॥ అద్రివనరాష్ట్రాదిః = పర్వతములు, అరణ్యములు, రాష్ట్రము మొదలగునది, దేశః = దేశము. రాత్రిందివర్తవః = రాత్రులు, పగళ్లు, ఋతువులు, కాలః = కాలము. కామార్థసంశ్రయాః = కామము, అర్థము అను పురుషార్థములకు సంబంధించిన, నృత్యగీతప్రభృతయః = నృత్యము గీతము మొదలైనవి, కలాః = కళలు

మూ॥ చరాచరాణాం భూతానాం ప్రవృత్తిర్లోకసంజ్ఞితా
హేతువిద్యాత్మకో న్యాయః సస్మృతిః శ్రుతిరాగమః 163

వ్యా॥ చరాచరాణాం = స్థావరజంగమాత్మకములైన, భూతానాం = ప్రాణులయొక్క, ప్రవృత్తిః = వ్యవహారము, లోకసజ్ఞితా = లోక మను పేరు గలది. హేతువిద్యాత్మకః = తర్కశాస్త్రరూప మైనది (తర్కశాస్త్రాదికము) న్యాయః = న్యాయము, సస్మృతిః = స్మృతులతో కూడిన, శ్రుతిః = వేదము, ఆగమః = ఆగమము.

మూ. తేషుతేష్వయథారూఢం యది కిఞ్చిత్ ప్రవర్తతే
కవేః ప్రమాదాద్దేశాదివిరోధీత్యేతదుచ్యతే. 164

వ్యా. కవేః = కవియొక్క, ప్రమాదాత్ = పొరబాటువలన, తేషుతేషు = ఆ దేశాదులయందు. కిఞ్చిత్ = ఏదైన, అయథారూఢం = ప్రసిద్ధికి విరుద్ధమై, ప్రవర్తతేయది = ప్రవర్తించినచో, ఏతత్ = ఇది, దేశాదివిరోధీతి = దేశాదివిరోధి అని, ఉచ్యతే = చెప్పబడును.

అవ. దేశవిరుద్ధమునకు ఉదాహరణము :-

మూ. కర్పూరపాదపామర్శసురభిర్మలయానిలః
కలిఙ్గవనసమ్భూతా మృగప్రాయా మతఙ్గజాః. 165

వ్యా. మలయానిలః = మలయవాయువు, కర్పూరపాదపామర్శసురభిః

= కర్పూరవృక్షముల స్పర్శచే పరిమళించుచున్నది. కలిఙ్గవనసమ్భూతాః = కలింగదేశారణ్యములందు పుట్టిన, మతఙ్గజాః = ఏనుగులు, మృగప్రాయాః = మృగములవంటివి, మృగములవలె అత్యధికసంఖ్యలో నున్నవి.

మలయప్రాంతమునందు కర్పూరవృక్షములు ఉండవు. కలింగవనములందు ఏనుగలు ఉండవు. అందుచే ఇది దేశవిరుద్ధము.

**మూ. చోలాః కాలాగురుశ్యామకావేరీతీరభూమయః**
**ఇతి దేశవిరోధిన్యా వాచః ప్రస్థానమీదృశమ్. 166**

వ్యా. చోలాః = చోలదేశము, కాలాగురు...భూమయః = కాలాగురువృక్షములచే నల్లనైన కావేరీతీరభూములు కలవి. ఇతి = ఇట్లు, దేశవిరోధిన్యాః = దేశవిరోధి యగు, వాచః = వాక్కుయొక్క, ప్రస్థానం = మార్గము, ఈదృశమ్ = ఇట్టిది. చోలదేశములో కావేరీతీరమున కాలాగురువృక్షములుండవు.

అవ. కాలవిరోధమునకు ఉదాహరణము :-

**మూ. పద్మినీ నక్తమున్నిద్రా స్ఫుటత్యహ్ని కుముద్వతీ**
**మధురుత్ఫుల్లనిచులో నిదాఘో మేఘదుర్దినః. 167**

వ్యా. పద్మినీ = పద్మలత, నక్తం = రాత్రియందు, ఉన్నిద్రా = వికసించినది. (ఇది పగలే వికసించును). కుముద్వతీ = కలువలతీగ, అహ్ని = పగటియందు, స్ఫుటతి = వికసించుచున్నది. (ఇది రాత్రి వికసించును) మధుః = వసంతము ఉత్ఫుల్లనిచులః = వికసించిన నిచులములు కలది. (ఈ వృక్షములు వర్షాకాలమునందే వికసించును). నిదాఘః = గ్రీష్మము, మేఘదుర్దినః = మేఘములచే దుర్దినముగ నున్నది. "మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దినమ్" అని అమరుడు. ఇది కాలవిరోధమునకు ఉదాహరణము.

అవ. కాలవిరుద్ధమునకు మరి యొక యుదాహరణము :-

మూ. శ్రవ్యహంసగిరో వర్షాః శరదో మత్తబర్హిణః
హేమన్తో నిర్మలాదిత్యః శిశిరః శ్లాఘ్యచన్దనః. 168

వ్యా. వర్షాః = వర్షాకాలము, శ్రవ్యహంసగిరః = వినుటకు ఇంపైన హంసధ్వనులు కలది. (వర్షాకాలమున హంసలు ఈ దేశమును విడిచిపోవు నని ప్రసిద్ధి). శరదః = శరదృతువు, మత్తబర్హిణః = మదించిన నెమళ్లు గలది. (నెమళ్లు వర్షాకాలమునందె మదించి ఉండును). హేమన్తః = హేమంతఋతువు, నిర్మలాదిత్యః = నిర్మల మైన సూర్యుడు కలది. శిశిరః = శిశిరఋతువు, శ్లాఘ్యచన్దనః = సుఖకర మగుటచే శ్లాఘించదగిన చందనము కలది.

ఇతి కాలవిరోధస్య దర్శితా గతిరీదృశీ
మార్గః కలావిరోధస్య మనాగుద్దిశ్యతే యథా. 169

వ్యా. ఇతి = ఈ విధముగా, కాలవిరోధస్య = కాలవిరోధమునకు, ఈదృశీ = ఇట్టి, గతిః = రీతి, దర్శితా = చూపబడినది. కలావిరోధస్య = కలావిరోధమునకు, మార్గః = పద్ధతి, మనాక్ = కొంచెముగా, ఉద్దిశ్యతే = చెప్పబడుచున్నది. యథా = ఎట్లనగా-

వీరశృఙ్గారయోర్భావౌ స్థాయినౌ క్రోధవిస్మయౌ
పూర్ణసప్తస్వరః సోఽయం భిన్నమార్గః ప్రవర్తతే. 170

వ్యా. వీరశృంఙ్గారయోః = వీరశృంగారరసములకు, క్రోధవిస్మయౌ = క్రోధవిస్మయములు, స్థాయినౌ భావౌ = స్థాయిభావములు. వీటి స్థాయి భావములు ఉత్సాహ-రతులుగాన ఇది నాట్యశాస్త్రవిరుద్ధము. పూర్ణసప్తస్వరః = పూర్ణమైన సప్తస్వరములు గల, సః అయం = ఇది, భిన్నమార్గః = భిన్న మైన మార్గము. ప్రవర్తతే = ప్రవర్తించును. సప్తస్వరములును పూర్ణములుగ

సంకీర్ణములుగ సున్నచో అది భిన్నమార్గము కాజాలదు కావున ఇది సంగీతకలా విరుద్ధము. ఇది సంగీతశాస్త్రజ్ఞుల నుండి తెలియదగిన విషయము.

ఇత్థం కలాచతుఃషష్టౌ విరోధః సాధు నీయతామ్
తస్యాః కలాపరిచ్ఛేదే రూపమావిర్భవిష్యతి. 171

వ్యా ఇత్థం = ఈవిధముగా, కలాచతుఃషష్టౌ = చతుష్షష్టికళల యందు, విరోధః = విరోధము, సాధు = బాగుగా, నీయతాం = ఊహింపబడు గాక; తస్యాః = కలాచతుఃషష్టియొక్క, రూపం = స్వరూపము, కలాపరిచ్ఛేదే = కలాపరిచ్ఛేద మనే గ్రంథమునందు, (ఇదికూడ దండివిరచితమా ?) ఆవిర్భవిష్యతి = స్పష్టము కాగలదు.

అవ. లోకవిరుద్ధమునకు ఉదాహరణము :-

ఆధూతకేసరో హస్తీ తీక్ష్ణశృఙ్గస్తురఙ్గమః
గురుసారోఽయమేరణ్డో నిఃసారః ఖదిరద్రుమః. 172

వ్యా. హస్తీ = ఏనుగ, ఆధూతకేసరః = కదులుచున్న జూలు కలది. తురఙ్గమః = అశ్వము, తీక్ష్ణశృఙ్గః = తీక్ష్ణమైన కొమ్ములు కలది. అయం ఏరణ్డః = ఈ ఆముదపు చెట్టు, గురుసారః = మంచి బలము గలది. ఖదిరః = ఖదిరవృక్షము, నిఃసారః = సారము లేనిది.

ఇతి లౌకిక ఏవాయం విరోధః సర్వగర్హితః
విరోధో హేతువిద్యాసు న్యాయాఖ్యాసు నిదర్శ్యతే. 173

వ్యా. ఇతి = ఈ విధముగా, అయం = ఈ, లౌకికఃఏవవిరోధః = లోకమునకే సంబంధించిన విరోధము, సర్వగర్హితః అందరిచేతను నిందింప

బడినది. న్యాయాఖ్యాసు = న్యాయ మను పేరు గల, హేతువిద్యాసు = హేతు విద్యలయందు, (తర్కశాస్త్రాదులందు) విరోధః = విరోధము, నిదర్శ్యతే = ఉదాహరింపబడుచున్నది.

అవ. బౌద్ధదర్శనరూపన్యాయవిరోధమునకు ఉదాహరణము :-

**సత్యమేవాహ సుగతః సంస్కారానవినశ్వరాన్**
**తథాహి సా చకోరాక్షీ స్థితైవాద్యాపి మే హృది 174**

వ్యా. సుగతః = బుద్ధుడు, సంస్కారాన్ = సంస్కారములను, అవినశ్వరాన్ = స్థిర మైన వాటినిగా, సత్యమేవ = నిజముగనే, ఆహ = చెప్పినాడు. తథాహి = అది యుక్త మే కదా. సా = ఆ, చకోరాక్షీ = చకోర నేత్రముల వంటి నేత్రములు గల యువతి, అద్యాపి = నేటికి కూడ, మే హృది నా హృదయమునంగు, స్థితైవ = ఉండనే ఉన్నది బౌద్ధులు సర్వము క్షణిక మని అంగీకరింతురు. వారు సంస్కారములు స్థిరము లని అంగీకరింతు రనుట బౌద్ధదర్శనవిరుద్ధము.

అవ. సాంఖ్యదర్శనరూపన్యాయవిరోధమునకు ఉదాహరణము :-

**కాపిలైరసదుద్భూతిః స్థాన ఏవోపవర్ణ్యతే**
**అసతామేవ దృశ్యన్తే యస్మాదస్మాభిరుద్భవాః. 175**

వ్యా. కాపిలైః = సాంఖ్యులచేత, అసదుద్భూతిః = "అసతః ఉత్పత్తిః" = లేని కార్యముయొక్క ఉత్పత్తి. "అసతాం ఉత్పత్తిః" అను విగ్రహముచే చెడ్డవారి ఉత్పత్తి అని కూడ అర్థము. ఉపవర్ణ్యతే = వర్ణింపబడు చున్నది. స్థానే ఏవ=అది యుక్తమే. యస్మాత్ = ఏ కారణమువలన, అస్మాభిః = మనచేత, అసతామేవ = చెడ్డవారియొక్కయే, ఉద్భవాః = ఉత్పత్తులు, దృశ్యన్తే = చూడబడుచున్నవి.

సత్కార్యవాదము, అసత్కార్యవాదము అను రెండు వాదము లున్నవి. ఘటాదికార్యములు ఉత్పన్న మగుటకు పూర్వము కూడ తమ కారణ మైన మృదాదులందు అవ్యక్తరూపమున నున్నవి. అవే ఉత్పన్న మగుచున్నవి అను వాదము సత్కార్యవాదము. ఇది సాంఖ్యాదులు అంగీకరించిన వాదము. కార్యము సర్వథా లేనిదే పుట్టుచున్నది అను వాదము అసత్కార్యవాదము. ఇది నైయాయికాదు లంగీకరించినది. కాని ఇచట సాంఖ్యులు అసత్కార్యవాదు లని చెప్పుటచే ఇది న్యాయవిరుద్ధము.

గతిర్న్యాయవిరోధస్య సైషా సర్వత్ర దృశ్యతే
అథాగమవిరోధస్య ప్రస్థానముపదిశ్యతే. 176

వ్యా. న్యాయవిరోధస్య = న్యాయవిరోధమునకు, సర్వత్ర = అన్ని శాస్త్రములందును, సైషా = ఈ, గతిః = రీతి, దృశ్యతే = కనబడుచున్నది. 'దృశ్యతామ్' అని పాఠ మున్నచో యుక్తము, 'చూచుకొనబడుగాక' అని యర్థము. అథ = ఇంక, ఆగమవిరోధస్య = ఆగమవిరోధమునకు, ప్రస్థానం = మార్గము, ఉపదిశ్యతే = చెప్పబడుచున్నది.

అనాహితాగ్నయోఽప్యేతేఽజాతపుత్రా వితన్వతే
విప్రా వైశ్వానరీమిష్టిమక్లిష్టాచారభూషణాః. 177

వ్యా. అనాహితాగ్నయః = అగ్న్యాధానము చేయనివారును, అజాతపుత్రా అపి = పుత్రులు లేనివారును అగు, ఏతే = ఈ, అక్లిష్టాచారభూషణాః = అదూషిత మైన ఆచారమే భూషణముగా గల, విప్రాః = బ్రాహ్మణులు, వైశ్వానరీంఇష్టిం = వైశ్వానరేష్టిని, వితన్వతే = చేయుచున్నారు.

"జాతపుత్రః కృష్ణకేశః అగ్నీనాదధీత" (కుమారుడు పుట్టినవాడు, నల్లని కేశములు కలవాడు అగ్న్యాధానము చేయవలెను) అను వాక్యము ననుసరించి పుత్రుడు కలిగిన పిమ్మట ముందుగ అగ్న్యాధానము చేసి పిమ్మట ఇతర

క్రతువులు చేయవలెను. ఇచట తద్విరుద్ధముగ వర్ణింపబడినది గాన శ్రుతి విరోధరూపమగు ఆగమవిరోధము.

అసావనుపనీతోఽపి వేదానధిజగే గురోః
స్వభావశుద్ధః స్ఫటికో న సంస్కారమపేక్షతే. 178

వ్యా. అసౌ = ఈతడు, అనుపనీతోఽపి = ఉపనయనసంస్కారమును పొందనివాడైనను, గురోః = గురువునుండి, వేదాన్ = వేదములను, అధిజగే = అధ్యయనము చేసెను. స్వభావశుద్ధః = స్వభావముచేతనే పరిశుద్ధమైన, స్ఫటికః = స్ఫటికము, సంస్కారం = సంస్కారమును, న అపేక్షతే = అపేక్షింపదు.

ఇది ఉపనయనానంతరమే వేదాధ్యయనము చేయవలెను అను స్మృత్యుక్త నియమమునకు విరుద్ధము గాన స్మృతివిరోధరూప మగు ఆగమవిరోధము.

విరోధః సకలోఽప్యేష కదాచిత్ కవికౌశలాత్
ఉత్క్రమ్య దోషగణనాం గుణవీథీం విగాహతే. 179

వ్యా. సకలోఽపి = సమస్తమైన, ఏషః = ఈ, విరోధః = విరోధము, కదాచిత్ = ఒక్కొకప్పుడు, కవికౌశలాత్ = కవియొక్క నేర్పువలన, దోషగణనాం = దోషముగా గణనమును, ఉత్క్రమ్య = అతిక్రమించి, గుణవీథీం = గుణత్వమార్గమును, విగాహతే = ప్రవేశించును. దోషములు కూడ గుణము లగును.

అవ. దేశవిరుద్ధత్వము గుణ మగుటకు ఉదాహరణము :-

తస్య రాజ్ఞః ప్రభావేణ తదుద్యానాని జజ్ఞిరే
ఆర్ద్రాంశుకప్రవాలానామాస్పదం సురశాఖినామ్. 180

వ్యా. తస్య రాజ్ఞః = ఆరాజుయొక్క, ప్రభావేణ = ప్రభావముచే, తదుద్యానాని = ఆతని ఉద్యానములు, ఆర్ద్రాంశుకప్రవాలానాం = తడిసిన వస్త్రరూప మైన చిగుళ్లు గల, సురశాఖినాం = కల్పవృక్షములకు, ఆస్పదం = స్థానముగా, జజ్ఞిరే = అయినవి.

కల్పవృక్షము భూలోకములో ఉంటుట దేశవిరుద్ధ మైనను, ఈ వర్ణనము రాజు ప్రభావమును చెప్పుటకై చేయబడినది గాన గుణమే.

అవ. కాలవిరోధము గుణ మగుటకు ఉదాహరణము :-

**రాజ్ఞాం వినాశపిశునశ్చచార ఖరమారుతః**
**ధున్వన్ కదమ్బరజసా సహ సప్తచ్ఛదోద్గమాన్.** 181

వ్యా. ఖరమారుతః = తీవ్ర మైన వాయువు, కదమ్బరజసా సహ = కదంబపుష్పముల పరాగముతో కూడ, సప్తచ్ఛదోద్గమాన్ = ఏడాకుల అరటిచెట్ల పుష్పములను, ధున్వన్ = కదల్చుచు, రాజ్ఞాం = రాజుల, వినాశపిశునః = నాశమును సూచించుచు, చచార = వీచెను.

కదంబ-సప్తచ్ఛదపుష్పములు ఒకే కాలమునం దుండుట కాలవిరుద్ధ మైనను "అకాలే ఫలపుష్పాణి దేశవిద్రవకారణమ్" (అకాలమునందు పుష్ప ఫలము లావిర్భవించుట దేశోపద్రవసూచకము) అని చెప్పినవిధమున రాజవినాశ సూచకము గాన ఇచట గుణమే.

అవ. కలావిరోధము గుణ మగుటకు ఉదాహరణము :-

**దోలాభిప్రేరణత్రస్తవధూజనముఖోద్గతమ్**
**కామినాం లయవైషమ్యాద్గేయం రాగమవర్ధయత్.** 182

వ్యా. దోలాభిప్రేరణత్రస్తవధూజనముఖోద్గతం = ఉయ్యాల ఇటు నటు ఊగుటచే భయపడిన స్త్రీల ముఖమునుండి బయలువెడలిన, గేయమ్ =

గేయము, లయవైషమ్యాత్ = లయమునందు వైషమ్య ముండుటవలన, కామినాం = కాముకుల, రాగం = అనురాగమును, అవర్ధయత్ = వృద్ధి పొందించెను. ఇచట ప్రకరణమును బట్టి లయభంగరూప మగు కలాదోషము గూడ గుణమే అయినది.

అవ. లోకవిరుద్ధత్వము గుణ మగుటకు ఉదాహరణము :-

ఐన్దవాదర్చిషః కామీ శిశిరం హవ్యవాహనమ్
అబలావిరహక్లేశవిహ్వలో గణయత్యయమ్. 183

వ్యా. అబలావిరహక్లేశవిహ్వలః = ప్రియురాలి విరహదుఃఖముచే వ్యాకులు డైన, అయం = ఈ, కామీ = కాముకుడు, ఐన్దవాత్ = చంద్రుని సంబంధమైన, అర్చిషః = జ్వాలకంటె, హవ్యవాహనం = అగ్నిని, శిశిరం = చల్లగా నున్నదానినిగా, గణయతి = పరిగణించుచున్నాడు,

ఇచట లోకవిరుద్ధము లగు చంద్రోష్ణత్వ - వహ్నిశీతత్వములు గుణ మగుటకు కారణము ప్రియావియోగము.

అవ. న్యాయవిరోధము గుణ మగుటకు ఉదాహరణము :-

ప్రమేయోఽప్యప్రమేయోఽసి సకలోఽప్యసి నిష్కలః
ఏకస్త్వమప్యనేకోఽసి నమస్తే విశ్వమూర్తయే. 184

వ్యా. ప్రమేయోఽపి = వేదరూప మగు ప్రమాణముచే తెలియదగిన వాడ వైనను, అప్రమేయః = (పూర్తిగ) తెలుసుకొనుటకు శక్యము కాని వాడవుగా, అసి = అయి ఉన్నావు. సకలోఽపి = వేరువేరుగ కనబడు (భిన్న) రూపములు కలవాడ వైనను, నిష్కలః = భేదరహితుడవుగా, అసి = అయి ఉన్నావు. త్వం = నీవు, ఏకః అపి = అద్వితీయుడ వైనను, అనేకః = అనేకరూపములు కలవాడవుగ, అసి = అయి ఉన్నావు. విశ్వమూర్తయే = సర్వస్వరూపుడ వైన, తే = నీకు, నమః = నమస్కారము. ఒకే వ్యక్తియందు విరుద్ధము లైన ప్రమేయత్వాప్రమేయత్వాదు లుండుట న్యాయవిరుద్ధమైనను

పరమేశ్వరుని లోకాతీతశక్తిని వర్ణించున దగుటచే ఇచట గుణముగనే పరిగణింపబడును.

అవ ఆగమవిరోధము గుణ మగుటకు ఉదాహరణము :-

పఞ్చానాం పాణ్డుపుత్త్రాణాం పత్నీ పాఞ్చాలపుత్త్రికా
సతీనామగ్రణీశ్చాసీద్దైవో హి విధిరీదృశః. 185

పఞ్చానాంపాణ్డుపుత్త్రాణాం = ఐదుగురు పాండవుల, పత్నీ = భార్యయైన, పాఞ్చాలపుత్త్రికా = ద్రౌపది, సతీనాం = పతివ్రతలలో, అగ్రణీశ్చ = శ్రేష్ఠురాలుగ కూడ, ఆసీత్ = ఆయెను. దైవః = దేవతాంశ సముద్భూతు లగువారికి సంబంధించిన, విధిః = పద్ధతి, ఈదృశఃహి = ఇట్టిదికదా ?

ఒక స్త్రీకి చాలమంది భర్త లుండుట స్మృతిరూపాగమవిరుద్ధ మైనను, దేవతాంశసంభూతుల విషయముగాన గుణమే యగును.

అవ. గ్రంథమును ఉపసంహరించుచున్నాడు :-

శబ్దార్థాలఙ్క్రియాశ్చిత్రమార్గాః సుకరదుష్కరాః
గుణా దోషాశ్చ కావ్యానామిహ సంక్షిప్య దర్శితాః. 186

వ్యా. ఇహ = ఈ గ్రంథమునందు, కావ్యానాం = కావ్యములయొక్క, శబ్దార్థాలఙ్క్రియాః = శబ్దాలంకార-అర్థాలంకారములు, సుకరదుష్కరాః = సుకరములు, దుష్కరములు అగు, చిత్రమార్గాః = చిత్రకావ్యమార్గములు, గుణాః = గుణములు, దోషాశ్చ = దోషములును, సంక్షిప్య = సంక్షేపించి, దర్శితాః = చూపబడినవి.

వ్యుత్పన్నబుద్ధిరమునా విధిదర్శితేన
మార్గేణ దోషగుణయోర్వశవర్తినీభిః.

వాగ్భిః కృతాభిసరణో మదిరేక్షణాభి-
ర్ధన్యో యువేవ రమతే లభతే చ కీర్తిమ్. 187

వ్యా. విధిదర్శితేన = యథాశాస్త్రముగా చూపబడిన, అమునా = ఈ, దోషగుణయోఃమార్గేణ = దోషగుణముల మార్గముచేత, వ్యుత్పన్నబుద్ధిః = వ్యుత్పత్తిని సంపాదించిన బుద్ధి గల, ధన్యః = ధన్యుడైన కవి, వశవర్తినీభిః = స్వాధీనము లైన, వాగ్భిః = వాక్కులచేత, కృతాభిసరణః = చేయబడిన అభిసరణము కలవాడై, అట్టివానిని కవిత స్వయముగనే వరించి చేరు నని అర్థము. వశవర్తినీభిఃమదిరేక్షణాభిః = స్వాధీన లైన యువతులచేత, కృతాభిసరణః = చేయబడిన అభిసరణము గల, యువేవ = యువకుడు వలె, రమతే = ఆనందించును, కీర్తిం చ లభతే = కీర్తిని కూడ పొందును.

ఇత్యాచార్యదణ్డినః కృతౌ కావ్యాదర్శే శబ్దాలఙ్కారదోషవిభాగో నామ తృతీయః పరిచ్ఛేదః.

సమాప్తశ్చాయం గ్రన్థః

పుల్లెల శ్రీ రామచంద్రుడు రచించిన కావ్యాదర్శ వ్యాఖ్యానము బాలానందిని సమాప్తము.

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా
తమేవ జానకీజానిం ప్రణతోఽస్మి ముహుర్ముహుః.

దేవతానుగ్రహః పిత్రోస్తు పశ్చాచ్చార్యసత్కృపా
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

# శ్లోకానుక్రమణికా

శ్రీః శ్రీః శ్రీః